# కమ్యూనిస్టుల

# ఐక్యసంఘటన

## అన్వేషణ

సంపుటి - 5 ఎ

# సైద్ధాంతిక సంక్షోభ పర్వం

(1967-78లలో "మితవాద" "అతివాద" "సాహసిక అతివాద" సంస్కరణవాదాల సిద్ధాంతాల సంఘర్షణ)

డి.వి. సుబ్బారావు

కాంతిరేఖ ప్రచురణలు

చిలువూరు-522 332, గుంటూరు జిల్లా. ఫోన్: 08644-85109.

COMMUNISTULA IKYA SANGHATANA ANVESHANA

**SAIDHANTIKA SAMKSHOBHA PARVAM**

ప్రచురణ నెం : 7
ప్రచురణ : ఏప్రిల్ 2002.



వెల : రు. 60 - 00

డి.టి.పి. : స్పందన పబ్లికేషన్స్, విజయవాడ-2, ఫోన్ : 434266.
ముద్రణ : విశాలాంధ్ర, విజయవాడ-2.

ప్రతులకు :

విశాలాంధ్రబుక్ హౌస్ అన్నిబ్రాంచిలలోను.
ప్రజాశక్తి బుక్ హౌస్ అన్ని బ్రాంచిలలోను.
నవోదయ బుక్ హౌస్, విజయవాడ.
మైత్రి బుక్ హౌస్, విజయవాడ.
నవయుగ బుక్ హౌస్, హైదరాబాద్.
డి.వి.సుబ్బారావు, చిలువూరు - 522 332. ఫోన్: 85109.

# తొలిపలుకులు

"వర్తమాన చరిత్రను వ్రాయబూనటం అత్యంతప్రమాదకరము, దట్టించిన ప్రేలుడు మందుగల తుపాకీ వంటిది. ఇప్పుడు అనేక సంవత్సరాల తరువాత అత్యంత ముఖ్య సమాచారం బహిరంగం చేయబడుతోంది. జ్ఞాపకాలు, డాక్యుమెంట్లు ప్రకటించబడుతున్నాయి. ఆవేశాలు, పార్టీ తత్వం వాస్తవికతా నిర్ధారణలను మసక బరుస్తాయి. వర్తమాన వార్తాపత్రికకంటే పదికాలాలు ఉండే వర్తమాన చరిత్రను వ్రాయసాహసించుట, వ్రేలాడుతున్న ఉరిత్రాడును మెడకు తగిలించుకొనుటయే అగుతుందని" రజనీపామీదత్తు మాస్కో విశ్వవిద్యాలయంలో ఉపన్యసించుతూ అన్నారు. చారిత్రిక ఉన్నత విద్య, కమ్యూనిస్టు సైద్ధాంతిక ఆచరణానుభవం లేకుండానే, చారిత్రిక కమ్యూనిస్టు పార్టీ ముఖ్యఘటనలకు అక్షరరూపమిచ్చుట సాహసమే అగుతుంది. ప్రధమ సంపుటిలోనే ఈ రచన "ప్రచార పత్రమూ, చరిత్ర, శాస్త్రీయ సమగ్ర పరిశోధనా పత్రమూ కాదని, ఆత్మవివేచనా చిత్రణ"అని పేర్కొన్నాను. ఈ అంశాన్నే సవినయంగా పునరుద్ఘాటించుట అవసరం అనుకుంటున్నాను.

పామీదత్తు "మార్క్సిజం-లెనినిజాన్ని అనుసరించే సిద్ధాంత వేత్తలు, తాముతప్పులకు అతీతులుగా చెప్పరు. సరియైన శాస్త్రీయ సిద్ధాంతం కూడా, స్పష్టమైన అవగాహన లేని అనుచరులు తప్పుడుగా ఆచరణలో పెట్టవచ్చును. ఏసైద్ధాంతిక విశ్లేషణ సరిమైనదా అనేది ఆచరణలో తేలుతుంది." అని వక్కానించారు. ఇంకా "వర్తమాన చారిత్రికాధ్యయనంలో మార్క్సిస్టుల చారిత్రికాధ్యయన విధానం, అత్యంత శక్తివంతమైనదిగా ప్రదర్శించబడింది. పరిణామాల నిర్దాక్షిణ్య చారిత్రికశోధన నాళిక ప్రయోగాల పరిశీలనలో అత్యంత వేగంగా నిర్ధారణ అగుతవి. పారిస్ విప్లవ పతనానంతరం కొద్దిరోజులలోనే మార్క్సు వ్రాసిన "పారిస్ కమ్యూన్" అనే రచన నేటివరకు కమ్యూన్ అన్ని అంశాల అత్యంత వాస్తవిక మార్గదర్శక రచనగా, (తరువాత ఎంతో సమాచారం, పరిశోధనా రచనలు వెలువడినా) నిలచింది"అన్నారు.

పెట్టుబడిదారీ ప్రపంచ తలమానికమైన "న్యూయార్క్ టైమ్స్" సర్వే "సహస్రాబ్ది మహనీయుడు"గా మార్క్సును కొనియాడుట విచిత్రమైనదే అయినా వాస్తవం. బహుశా, ప్రపంచ పెట్టుబడిదారీ వర్గ నాయకత్వం వహించే అమెరికా సామ్రాజ్యవాదం, మార్క్సిజం నుండి నేర్చుకొన్న గుణపాఠాలతో, పెట్టుబడిదారీ విధాన జీవన కాలాన్ని పెంచుకొనగలిగినందులకు కృతజ్ఞతాభివందనములు "నూయార్క్ టైమ్స్" అర్పించింది. అదే కాలంలో, యు.ఎస్.ఎస్.ఆర్., తూర్పుయూరపు దేశాలలో సోషలిజం కుప్పగా కూలిపోవుట, మార్క్సిజం నుండి

గుణపాఠాలు నేర్చుకొనుటలోని వైఫల్యాన్ని పరోక్షంగా కూడా చూచిందని అర్థంచేసుకోవచ్చు.

అత్యంత చారిత్రిక ప్రాముఖ్యతగల వివిధ పార్టీల ముఖ్యంగా కమ్యూనిస్టు పార్టీల అధికార పత్రాలెన్నో వెలుగుచూడక పార్టీల రహస్య "ఆర్చైవు" లలో భద్రపరచబడి ఉంటాయి. ఆ పత్రాలలోనే పార్టీల రాజకీయ, సైద్ధాంతిక, నిర్మాణ చర్చలు, ధోరణులు, వైఖరులు, అవగాహనలు నిక్షిప్తమై వుంటాయి, తరాలు గడిచినా అవి వెలుగును చూడకపోవచ్చును. చరిత్రపుటలకెక్కని వివిధ ధోరణులు, సిద్ధాంతాలు అప్రకటిత సాహిత్యంలోనే ఉంటాయి. అవి ఏనాటికీ వెలుగుచూడనిచో చరిత్ర కసితీర్చుకొంటుంది.

ఈ అధ్యయనం, ప్రకటిత భారత కమ్యూనిస్టు ఉద్యమ వివిధ స్రవంతుల నివేదికలు, తీర్మానాలు, చిరుపుస్తకాలు, వార్తాపత్రికలపై ఆధారపడి కొనసాగింది. వివిధ కాలాలలో మార్పుచెందే భారత ఆర్థిక, రాజకీయ, సామాజిక పరిస్థితుల పరిణామాలపై వివిధ కమ్యూనిస్టు శ్రేణులు స్పందించిన తీరులు, వారి ఆచరణల ఫలితాలు అధ్యయనం చేయుప్రయత్నమిది. భారతీయ కమ్యూనిస్టు విప్లవ పంథా, వాస్తవానికి వివిధ కమ్యూనిస్టు శ్రేణులలో మార్క్సిజం-లెనినిస్టు మార్గంలో భారతదేశ ఆర్థిక, రాజకీయ, సామాజిక వాస్తవ పరిస్థితులు అధ్యయనం చేయుట, కార్యక్రమాలు రూపొందించి, ఆచరించుటలో లభించిన విజయాల, అపజయాల ఫలితాల అధ్యయనాల నుండే, మన పంథా రూపొందించబడి, ఆచరణలో పొందిన అనుభవాలు మార్క్సిస్టు-లెనినిస్టు దృక్పథంలో అధ్యయనం నుండే మనదైన విప్లవ పంథా రూపొందుతుంది కాని, విదేశ అధ్యయనాల దిగుమతి నుండి కాదు, శాస్త్రీయ వివేచనతో మన శ్రేణుల అధ్యయనాలలోనే, ఆ పంథాకు దారులు ఏర్పడుతవి.

ఈ లక్ష్యంతోనే మన దేశంలోని వివిధ కమ్యూనిస్టు స్రవంతులవారు వారు రాజకీయ విధానాలను రూపొందించుకొనుటకు చేసిన అంతర్గత, బహిరంగ సైద్ధాంతిక పోరాటాలను అధ్యయనం చేయు ప్రయత్నం చేశాను. అంతేగాక, ప్రధానంగా వివిధ కమ్యూనిస్టు శ్రేణులు తమ అనుభవాలద్వారా, తమతమ రాజకీయ విధానాలను ఎలా తాజాపర్చుకొంటూ, అదే క్రమంలో వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతా నిర్మాణాన్ని, కమ్యూనిస్టు ఐక్యతా పునాదిపై నిర్మించుతారని ఆశించుదాము. ఈ క్రమంలోనే కమ్యూనిస్టుల ఐక్యసంఘటన అన్వేషణలో ఐదవ సంపుటి ప్రథమ భాగమును మీ ముందుంచుతున్నాను.

– డి.వి. సుబ్బారావు

## విషయసూచిక

# 14

# సైద్ధాంతిక సంక్షోభ పర్వం

## 1

## నాంది ప్రస్తావన

భారత కమ్యూనిస్టు ఉద్యమంలో మొట్టమొదటి సారిగా తీవ్రమైన సైద్ధాంతిక చర్చలు 1951 లో కేంద్ర కమిటి ముసాయిదా కార్యాక్రమం. రాజకీయ విధాన ప్రకటన అనే ఎత్తుగడల పంథా అనే రెండు పత్రాలను కమ్యూనిస్టు శ్రేణులలో చర్చలు, సలహాలు విమర్శనల నిమిత్తం విడుదల చేయుటతో ప్రారంభమయ్యాయి అర్ధశతాబ్దంపైగా ఆసమస్యలపై విమర్శ ప్రతి విమర్శన, వాదన ప్రతివాదన నిరవధికంగా సాగుతున్నా భరత వాక్యం వినబడక పోవుట దురదృష్టకరము. ఇది మనదేశ పరిస్థితుల స్వతంత్ర పరిశీలన అధ్యయనం లేకపోవుట, అవాస్తవిక ప్రాతిపధికలపై స్వీయ మానసిక ధోరణులలో ఆశాస్త్రీయంగా చర్చలు జరుగుటను తెలియజేస్తుంది. ఆనాటి ఐక్యకమ్యూనిస్టుపార్టీ 1951 అక్టోబరులో జరిగిన అఖిలభారత కమ్యూనిస్టు కాన్ఫరెన్సు చర్చల అనంతరం ఆ పత్రాలను మార్పులు, చేర్పులతో ఆమోదించింది.

ప్రశ్నింపజాలని కార్యక్రమం రాజకీయ విధానం అనుకొన్న వాటిలో కొన్ని అంశాలు వాస్తవ పరిస్థితుల పరిణామాలు కార్యక్రమ రాజకీయ విధానం, ఎత్తుగడల అవగాహనలు ఆచరణలక్రమంలో ఆశాస్త్రీయాలని స్పష్టమైనవి. అంచేతనే సహజంగానే మధురై పార్టీ కాంగ్రెసులో తిరిగి అవే అభిప్రాయభేదాలు యినుమడించిన తీవ్రతతో పునరావృతమయ్యాయి. నూతన శాస్త్రీయ అవగాహనలను చేబట్టుటకు తీవ్రవ్యతిరేకత అడ్డుగావుంది. మధురై పార్టీ కాంగ్రెసులో అంతరతచర్చల్లో పిడివాదం, సంస్కరణవాదం అని నిందప్రతినిందలు వినవచ్చాయి. "అతివాద సెక్టేరియన్ ధృక్పదాన్ని ఏకపక్షంగా పోరాడుటయే గాని ఏక కాలంలో సంస్కరణవాదాన్ని, పిడివాదాన్ని రెండింటిని పోరాడి ఓడించుట" జరుగలేదని నంబూద్రిపాద్ అన్నారు. "నూతన రాజకీయ విధానాన్ని రూపొదించునపుడు" అభిప్రాయ భేదాలు వచ్చుట సహజమే"అని" "మధురై పార్టీ కాంగ్రెసులో పిడివాదమని, మితవాదమని నిందా, ప్రతినిందలు వినిపించాయని" డా॥ అధికారి పేర్కొన్నారు. మధురైలో జరిగిన మూడవ పార్టీ కాంగ్రెసు 1953లో కార్యక్రమము, రాజకీయ విధానం అనేరెండు సిద్ధాంతపత్రాలను ఆమోదించింది.

ఆంధ్ర మధ్యంతర ఎన్నికలలో కమ్యూనిస్టు పార్టీ ఘోరపరాజయం తరువాత, 1951 కార్యక్రమంలోని కొన్ని పొరపాట్లను ఆసరాగా "మితవాద అవకాశవాద గుణపాఠాలను " కొన్నిటిని తీసికొని, 1955 జూన్‌లో "శాంతి, ప్రజాస్వామ్యం, జాతీయపురోగమనం కోసం కమ్యూనిస్టు పార్టీ పోరాటం" అనే తీర్మానాన్ని కమ్యూనిస్టు

పార్టీ రూపొందించింది. దీనితో పార్టీలో అంతర్గత విభేదాలు మరింత తీవ్రమయ్యాయి. ఈ విభేదాలు1955-64 మధ్యకాలంలో అభిప్రాయ భేధాలకు ఎంతటి అనైక్యత ప్రమాదకర పరిస్థితులకు దారి తీసిందో ఆ కాలపు కేంద్ర కమిటీ సమావేశాలలో, పాల్ఘాట్ 4వ, విజయవాడ 6వ, పార్టీ కాంగ్రెసులలో జరిగిన ఉద్రిక్త చర్చలసరళితో పార్టీ చీలే అవకాశం స్పష్టమైంది. ఫలితంగా చెలరేగిన చీలికల దుమారానికి రెండు అతి పెద్ద అంతర్జాతీయ పార్టీల ప్రోత్సాహకాలు తోడై తుఫానుగా మారి 1963-64లో సగం సగం సమానాంత రంగా చీలి సి.పి.ఐ, సి.పి.ఐ (యం)లుగా ఏర్పడినవి. ఈ క్రమాన్నంతటిని రచయిత ఆయాపర్వాలలో వివరంగానే అధ్యయనం చేశారు. ఒక విషయం స్పష్టం. సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)లు 1964-65లలో రూపొందించు కొన్న భిన్నకార్యక్రమాలు మార్క్సిస్టు - లెనినిస్టు పంథాలని చెప్పుకొన్నా వొకటి "మితవాద సంస్కరణలవాద ఛాయలను" మరొకటి " అతివాద అవకాశవాద ఛాయలను" కలిగియుండుటను, తదనంతర కాలంలో రెండు పార్టీలు యేదోఒక రూపంలో ఆమోదించుట చరిత్రకు తెలియని విషయంకాదు.

ఐక్యపార్టీ 1951లో ఆమోదించిన కార్యక్రమం రాజకీయ విధాన ప్రకటనలకు "తుచ" తప్పకుండా కట్టుబడి వుండాలంటూ మారిన పరిస్థితుల కారణంగా మార్పులు అవసరమన్నకమ్యూనిస్టు శ్రేణులను " "మితవాదులని సంస్కరణల వాదులని" ముద్రలు వేస్తు పార్టీ చీలిక అనంతరం సి.పి.ఐ(యం)గా 1964-65లో యేర్పడి ఆకార్యక్రమాన్ని రాజకీయ విధాన ప్రకటనను తిరిగి తిరిగి పునరుద్ఘాటించుతున్నా, 1968వరకు ఎన్నడూలోతుగా చర్చించుటగాని ఆ అవగహనను సి.పి.ఐ (యం) వర్గ సంఘాలలో ప్రజాసంఘాలలో అమలు చేయు ప్రయత్నంగాని జరుగలేదు. మరోవైపున సి.పి.ఐ సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ 20 వ పార్టీ కాంగ్రెసులో ప్రతిపాదించిన " సోషలిజంలోనికి శాంతియుత పరివర్తన " అన్న సిద్ధాంత ప్రభావంలో "కేరళ మార్గం" శాంతి యుత పంథా", "పెట్టుబడిదారేతర పంథా"లను చేబట్టి ఐక్య పార్టీలోనే చర్చనీయాంశాలుగ చేసి, మెజారిటి అభిప్రాయాన్ని సమీకరించకలిగింది. పార్టీలోని మైనారిటి 1951 రాజకీయ విధాన ప్రకటన అనే ఎత్తుగడల పంథాకు కట్టుబడి వున్నామంటూ ప్రకటించుతూ వచ్చిందే కాని నూర్ మహల్‌లో జరిగిన కేంద్ర కమిటి సమావేశంలో మాత్రమే సి.పి.ఐ (యం) కార్యక్రమం రాజకీయ విధాన ప్రకటననుసరించి " రైతు రంగంలో" "కార్మికరంగంలో" "పార్టీ నిర్మాణం"లో కర్తవ్యాలను రూపొందించే పనిని చేబట్టి 1966-67 మధ్యకాలంలో "రైతు రంగంలో కర్తవ్యాలు" కార్మిక రంగంలో కర్తవ్యాలు" పార్టీనిర్మాణంలో కర్తవ్యాలు" అనే పత్రాలను విడుదల చేసింది.(రాజకీయ) విధాన ప్రకటన మార్గదర్శిక సూత్రలను వివిధ రంగాలలో కర్తవ్యాలకు అన్వయించుటకు పార్టీ గర్వపడింది

అదే సమయంలో సి.పి.ఐ (యం)లోని అతివాద వర్గాలు పార్టి 1951 కార్యక్రమం మార్గదర్శిక సూత్రలు ఎత్తుగడల పంథాను విడనాడి "నియో సంస్కరణ వాదాన్ని చేబట్టిందని తీవ్రవిమర్శకు గురిచేస్తు వివిధ ప్రాంతాలలో పార్టీలోని అతివాద శక్తులను సమీకరిస్తూ పార్టీలో అంతర్గత సైద్ధాంతిక పోరాటాన్ని తీవ్రతరం చేసారు. దీని ఫలితంగానే 1968 మే - జూన్ నెలలలో వివిధరాష్ట్రాలోని మార్క్సిస్టు పార్టీలోని అతివాద శ్రేణులు చీలి " అఖిల భారత విప్లకారుల కేంద్ర సమన్వయ కమిటీ యేర్పాటు

చేసారు. వారే నక్సలైట్లుగా భారత కమ్యూనిస్టు ఉద్యమపు మూడవ స్రవంతిగా పేరొందారు. వీరు సి.పి.ఐ (యం) కార్యక్రమాన్ని విధాన ప్రకటనను రాజకీయ దృక్పథం, అతివాద, లేక సాహసికవాద దృక్పథాన్నుండి సవాలు చేసారు. వాస్తవానికి అ సమయంలో సి.పి.ఐ (యం) పార్టి పని విధానాన్ని మొత్తంగా మార్పు చేసుకొనాలనే మంచి ప్రయత్నంలో వుండగా తన కార్యక్రమాన్ని ఎత్తుగడల పంథాని రాజకీయ విధానాన్ని సంరక్షించుకునే తీవ్ర సైద్ధాంతిక. నిర్మాణ సమస్యల. అంతర్గత పోరాటంలో " మునిగి వుండగా. బయటనుండి నక్సలైట్లు గా వున్న తీవ్రవాద వర్గాలు చేసేసూత్రీకరణలు దాడులకు తట్టుకొనవలసిన పరిస్థితులు యేర్పడినవి. సి.పి.ఐ (యం) అగ్రనాయకత్వంలోని మెజారిటి వర్గం సెద్ధాంతిక పోరాటాన్ని తన దృక్పథంలో, విశ్వసించిన మార్గంలో కొనసాగించింది. అంతేగాక "అతివాద అవకాశవాద పోకడలకు వ్యతిరేకంగా మనం నిర్మాణాత్మకంగా. మనవిధాన ప్రకటనపై నిలబడి పోరాడుట అంటేనే, మనం ఎత్తుగడల పంథా విషయంలో సమగ్ర, సమిష్టి అవగాహన, దాని విభిన్న అంశాలపై సంపూర్ణ భావసారూప్యత మనకు వున్నాయని అర్థం చేసుకొనుట సరికాదు." అని స్పష్టం చేసింది.

ఈ విషయంలో నక్సలైట్ల వైపునుండి కార్యక్రమం, ఎత్తుగడల పంథాలను సి.పి.ఐ(యం) 1951 పత్రాలను ధృవీకరించుతు, వాటిని ఆచరణలో పెట్టుటలేదనే తీవ్ర విమర్శలను, మరోవైపు సి.పి.ఐ నుండి సి.పి.ఐ(యం) సెక్టేరియన్ అతివాద వక్రీకరణ నుండి బయటపడలేకపోతున్నదని వచ్చే విమర్శన, సి.పి.ఐ(యం) లోనే వున్న అతివాద వర్గాలు పార్టీలోని మెజారిటి నాయకత్వం మాటలలో 1951 కార్యక్రమం, ఎత్తుగడలకు కట్టుబడివున్నామని చెబుతున్నా, ఆచరణలోవాటిని పాటించుట లేదని వచ్చే విమర్శన అన్నిటిని దృష్టిలో పెట్టుకొని "మన ఎత్తుగడల పంథా విషయంలోగల సామాన్య అవగాహన, మామూలు ఆమోదమూ, వీటితోనే మన ఎత్తుగడల పంథాలోని విప్లవ అవగాహన ననుసరించి మన పార్టీ పనిని, పద్ధతిని, సవరించుకొని, పార్టీని ఐక్యపరచుటకు సరిపోదని, ఆ తరువాత పరిణామాలు తేటతెల్లం చేసాయి"[1]. అని బసవపున్నయ్య వివరించారు.

ఇంకా "గత 25 సంవత్సరాల్లో మనదేశంలో వచ్చిన ఆర్థిక, సాంఘిక, మార్పులను గూర్చి సమగ్రమైన అంచెనా మనం వేయలేదు. ఈ మార్పులు మన ఎత్తుగడల పంథాపై కలిగిస్తున్న ప్రభావము, మనదైనందిన కార్యక్రమాల నిర్వహణలోను, విప్లవోద్యమ నిర్వహణపైన ప్రభావం ఎలావుంది అన్న విషయం నిశితంగా పరిశీలన చేసుకొనలేదు. ఈ పరిస్థితులలో ఎత్తుగడల పంథాయిస్తున్న మార్గదర్శికత్వంలో వివిధ వర్గ ప్రజాసంఘాలకు మన పార్టీ దైననందిన కార్యకలాపాలను రూపొందించుకొనేందుకు మనం చేసిన ప్రయత్నాలన్నిటిలోను యీ అవగాహన లోపమూ, పొరపాటు తప్పదన్నమాట. ఇదంతా కలసి చివరకు పార్టీ నాయకత్వంలో, ఎత్తుగడల పంథావిషయంలో దానిలోని వివిధ సూత్రాలకు గల ఖచ్చితమైన అర్థాల విషయంలో అభిప్రాయభేదాలు, అనంగీకారాల వరకు దారి తీసింది. వాస్తవమిది. అందువలన అత్యవసర పరిస్థితులలో మన లీగలు అవకాశాలు చాలా కుదించబడిన స్థితిలో ఎత్తుగడల పంథావంటి అతి సున్నితమైన ముఖ్యమైన సమస్యల

1. *బసవపున్నయ్య మాకినేని (1976) ఎత్తుగడల పంథాపై వివరణ. ప్రజాశక్తి బుక్‌హౌస్. విజయవాడ పేజీ 6*

గూర్చి చర్చించక తప్పలేదు[1]" అని బసవపున్నయ్య వొక విధమైన ఆత్మవిమర్శనా ధోరణిలో వివరించారు.

అఖిల భారత కమ్యూనిస్టు విప్లవకారుల సమన్వయ కమిటి యేర్పాటు, తదనంతర సైద్ధాంతిక పోరాటంపై, "భారతవిప్లవోధ్యమం, కొన్ని గుణపాఠాలు. అనుభవాలు" అన్న యు.సి.సి.అర్.ఐ (యం.యల్) రాజకీయ నిర్మాణ నివేదిక ఉద్యమ సమీక్ష "ఈ పరిణామాలన్నీ ఆనాడు అభివృద్ధి చెందుతున్న మంచి విప్లవ పరిస్థితి వుందని సూచించాయి. ఈనేపధ్యంలోనే సి.పి.ఐ(యం)లో వున్న కమ్యూనిస్టు విప్లవకారులందరూ, నియోరివిజనిజానికి వ్యతిరేకంగా తమ సిద్ధాంత, రాజకీయ పోరాటాన్ని తీవ్రతరం చేసారు. సి.పి.ఐ(యం)లో నుండి విడిపోయారు. ఒక నిర్మాణంలో ఎ.ఐ.సి.సి.అర్ తో ఐక్యమగుటకు, కొన్ని ప్రాంతాల్లో రైతాంగ ప్రజలను మరింత ఉన్నత పోరాట రూపాలలోనికి నడిపిచుటకు ప్రయత్నించారు. శ్రీకాకుళం, ముషాహిరి, దేబ్రా, గోపీ వల్లభపూర్ రైతాంగ వుద్యమాలు పురోగమించాయి[2]" అని పేర్కొన్నది. ఈ వుద్యమంతదనంతరం ఆటు పోటులకు అంతర్గత సైద్ధాంతిక పోరాటాలకు గురై, అనేక చీలికలైంది.

భారత కమ్యూనిస్టు వివిధ శ్రేణులలో చెలరేగిన సైద్ధాంతిక బహిరంగ పోరాటాలను, అధ్యయన సౌలభ్యం కొరకు యీ క్రింది విధంగా విభజించు కొందాము. కమ్యూనిస్టు వుద్యమం భారతదేశంలో ప్రధానంగా మూడుస్రవంతులు అయింది. అవి భారత కమ్యూనిస్టుపార్టీ, భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు), భారత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు-లెనినిస్టు) లుగ గుర్తించాలి. ఈ మూడు ప్రధాన స్రవంతులలో కూడ రాజకీయ సైద్ధాంతిక భిన్నాభిప్రాయాలుకారణంగా అంతర్గత సైద్ధాంతిక,రాజకీయ పోరాటాలు కొనసాగుతూనేవున్నవి. ఈ అంతర్గత పోరాటాలేగాక, యీ మూడు స్రవంతులు వొకదానికొకటి బహిరంగ సైద్ధాంతిక పోరాటాలు నిరంతరం కొనసాగిస్తూనే వున్నవి. ఈ అధ్యయనాన్ని యీ స్రవంతులు బహిరంగంగా ప్రకటించిన సాహిత్య పరిమితులలోనే చేయబూనుట వాస్తవానికి కొంతవరకు సాహసమే అగుతుంది. కారణం వారు బహిరంగంగా ప్రకటించిన సాహిత్యంలో కంటె ప్రకటించని పత్రాలలోనే అమూల్యమైన సమాచారం, సాహిత్యం వుంటుంది. అంచేత, యీ సైద్ధాంతిక వివేచనా పరిధి చాలా పరిమితులకు లోనైవుంటుంది.

## సి.పి.ఐ బలహీనతల బహిరంగ ఆత్మవిమర్శన

సి.పి.ఐ పాట్నా 9వ, పార్టీ కాంగ్రెసు రాజకీయ నివేదికలో పార్టీ బలహీనతలను, వైఫల్యాలను బహిరంగ ఆత్మవిమర్శనా రీతిలో పేర్కొనుట జరిగింది. ఆ ఆత్మవివేచన ఎంతలోతుగా, పరిమితంగా జరిగినా సత్యశోధన జరిగినంతవరకు సంతోషిద్దాము. పార్టీ అంతర్గత అవగాహనల నిమిత్తం పంపిణి చేయబడే ఆత్మవిమర్శనా పత్రంలో మరింతలోతైన, నిజాయితితో కూడిన వివేచనవుంటుందని ఆశిద్దాము.

---

1. *బసవపున్నయ్య మాకినేని (1976) ఎత్తుగడల పంథాపై వివరణ. ప్రజాశక్తి బుక్‌హౌస్. విజయవాడ. పే.6.*

2. *భారత విప్లవోద్యమం. కొన్ని గుణపాఠాలు-అనుభవాలు. జనశక్తి ప్రచురణ. పే. 22-23.*

సి.పి.ఐ గత 7వ పార్టీ కాంగ్రెసు అనంతర విజయాలకు గర్వపడుతున్నామంటూ, ఆత్మవిమర్శనా ధోరణిలోపార్టీ బలహీనతలను, వైఫల్యాలను, వివేచనాధోరణులలోని పెడధోరణులను యిలా పేర్కొన్నది. "అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో విశ్వాసం కలిగిన కమ్యూనిస్టు శ్రేణులు ధృడంగా నిలబడి పిడివాదాన్ని, సెక్టేరియనిజాన్ని, వేర్పాటువాదాన్ని అన్ని స్థాయిలలో సైద్ధాంతిక పోరాటాన్ని ధృడంగా సాగించుట వలననే పార్టీలో, తదనంతరం ప్రజాసంఘాలలో వచ్చిన చీలికలుఅంతప్రగాఢ నష్టాన్ని కలుగచేయ జాలకపోయాయి." అని సి.పి.ఐ తన విశ్వాసాన్ని ప్రకటించింది. అంతేగాక 7వ. పార్టీ కాంగ్రెసు రాజకీయవిధానం, తదనంతరకాలంలోని రాజకీయపరిణామాలు, సరియైనవని రుజువైందని గాఢంగా విశ్వశిస్తున్నది. అదేకాలంలో, తన శ్రేణులలో రాజకీయ విధానాన్ని, మితవాద సంస్కరణవాదం వైపు మళ్ళించ ప్రయత్నించే శక్తులున్నవని, వాటిని వుపేక్షించరాదని నివేదిక హెచ్చరించింది. ముఖ్యంగా కాంగ్రెసు యెడల ఆశక్తులు అట్టి వైఖరిని అవలంభించే అవకాశాలు యెక్కువగా వున్నవని పేర్కొన్నది.

ప్రజాస్వామ్య ప్రతిపక్షాలను అనుసరించే ప్రజాసామాన్యం, కాంగ్రెసును అనుసరించే ప్రజాసామాన్యం, యీ శక్తుల మధ్యగల అఘాతాన్ని పూడ్చి అఖండయేకైక ప్రజాశక్తిని రూపొందించే పార్టీ విధానాన్ని, కాంగ్రెసు యెడల మితవాద అవకాశవాద దృక్పథంతో సంకుచిత, తప్పుడు మార్గంలో వ్యాఖ్యానించుట జరిగిందని సి.పి.ఐ విశ్వాసం, అంచేతనే ప్రజాసామ్య శక్తులపై విశ్వాసముంచి, నొక్కి చెప్పుట జరిగింది. తదనంతరం వాటినిగురించి కొంత అతిశయోక్తిగా అంచనావేయుట జరిగిందని ఆమోదించింది. ఉదాహరణకు, ఇందిరాగాంధీ, మొరార్జీదేశాయ్‌ల మధ్య ప్రధాన మంత్రి పదవి విషయమై జరిగిన పోటీ, వివాదాంశాలలో సి.పి.ఐ కేంద్రపార్టీ పత్రిక, మితవాద అవకాశవాదనైజాన్ని ప్రదర్శించుటనుఎత్తిచూపింది. అదేవిధంగా కామరాజ్‌నాడార్‌యెడల కూడ సి.పి.ఐ కేంద్రపత్రిక వర్గ దృక్పధాన్ని విడనాడి, కొన్ని భ్రమలకు లోనగుటను పార్టీ కాంగ్రెసు రాజకీయ నివేదిక ఆమోదించింది.

పెట్టుబడిదారి విధానాభివృద్ధి ప్రణాళికను తీవ్రంగా విమర్శించుతూ, తృతీయ పంచవర్షప్రణాళికపై భ్రమలను సి.పి.ఐ కలిగివుంది. మరో తీవ్రలోపం, పి.యల్.480 అమెరికాప్రణాళికా ప్రమాదాన్ని గురించి ఎంతో ప్రచారం చేసినా, ఆచరణలో నిర్మాణాత్మక ప్రతిఘటనను రూపొందించుటలో వైఫల్యాన్ని ఎదుర్కొన్నామని, పార్టీ నివేదిక స్పష్టం చేసింది[1].

కాంగ్రెసు నాయకత్వం ప్రకటిత రాజకీయ విధానాల నుండి ఆచరణలో దిగుజారుడు విధానాన్ని అవలంభించుట, కాంగ్రెసేతరముఖ్యరాజకీయ పార్టీలైన ప్రజాసోషలిస్టు పార్టీ, సంయుక్త సోషలిస్టు పార్టీ మరీఅధ్వాన్న స్థితిలో ఉన్నాయి. విదేశాంగ విధానానికి సంబంధించినంత వరకు సి.పి.ఐ. కాంగ్రెసు విధానంతో చాలా వరకు ఏకీభవించుతూ వుందని తలచుటయేగాక, వామపక్షాలుగ చెప్పబడే యస్.యస్.పి., పి.యస్.పి.ల విధానాలు అంగీకారం కాదని నివేదిక వివరించింది.

---

*1. పొలిటికల్ రిపోర్టు (1965) సి.పి.ఐ. పాట్నా 8వ కాంగ్రెసు పి.పి.హెచ్. పే.99 (ఆంగ్లంలో)*

జాతీయబూర్జువా వర్గప్పు, దాని రాజకీయ పార్టీ కాంగ్రెసు పాలకపార్టీల సంక్షోభపు తీవ్రతను తక్కువగా అంచెనా వేయుటతోపాటు, కాంగ్రెసు యెడల ప్రజలకు గల అయిష్టతను తక్కువగానే అంచెనా వేయుట జరిగింది. సి.పి.ఐ. జనవరి 1966 కౌన్సిలు సమావేశం బహిరంగంగా అభ్యుదయ కాంగ్రెసు వాదులను కొందరిని ఎన్నికలలో బలపరచ నిర్ణయించింది. ఎన్నికల సన్నాహాలకై జాతీయ సమితి. రాష్ట్ర శాఖలకు యిచ్చే సూచనలలో, తీర్మానంలో మద్దతును పేర్కొంటూ తీర్మానించింది, ఆ విధంగానే మితవాద అభ్యుదయ నిరోధకశక్తులను నిరోధించగలమన్నది "తప్పుడు అవగాహన, మనబలం సామర్థ్యాలను అతిగా అంచెనా వేయుటతో అటు కాంగ్రెసు యిటు మితవాద అభివృద్ధి నిరోధకులకు వ్యతిరేకంగా అదే ప్రాతిపధికపై పోరాడుట జరిగింది. పార్టీని, ప్రజలను విజయపథంలోనడుపుటలో విఫలమయ్యామని." పార్టీకాంగ్రెసు నివేదివివరించింది.

ఎన్నికల అనంతరం కూడ జనసంఘం, స్వతంత్ర పార్టీల అభివృద్ధి నిరోధకశక్తుల ప్రమాదాన్ని తక్కువగా అంచెనా వేయుట కొనసాగింది. ఆ విధంగా, సైద్ధాంతికంగా, రాజకీయంగా, నిర్మాణరంగాలలో తీవ్రవైఫల్యాలను ఎదుర్కొనవలసి వచ్చిందని నివేదిక పేర్కొన్నది.[1] మితవాద అభివృద్ధి నిరోధకశక్తుల వ్యతిరేకపోరాటం అనేపేరుతో కాంగ్రెసువ్యతిరేక పోరాటాన్ని తక్కువగా అంచెనా వేసి, నీరుగార్చుట జరిగింది. పార్టీ యీ వైఖరి కాంగ్రెసు వ్యతిరేకపోరాట ప్రజాశక్తులలో సి.పి.ఐ. బలాన్ని కోల్పోవుటయేగాక, పరోక్షంగా మితవాద అభివృద్ధి నిరోధకశక్తులు బలపడుటకు. విస్తరణకు తోడ్పడింది. వాస్తవంగా జరిగిన ఫలితమిది. ఇది సి.పి.ఐ.లో మితవాద అవకాశవాద వర్గాలు బలపడుటను తెలుపుతుంది. అదే కాలంలో సి.పి.ఐ. జనసంఘం, స్వతంత్ర పార్టీల వ్యతిరేకపోరాట వైఖరి బలంగా ప్రజలలో వ్యాపించుటలో వైఫల్యాన్ని చూడవలసి వచ్చింది. అదేకాలంలో యీ రాజకీయ ఎత్తుగడల వైఖరే వామపక్ష, ప్రజాస్వామ్య ఐక్యతా నిర్మాణానికి, జాతీయ ప్రజాస్వామ్య ఐక్యసంఘటనా నిర్మాణావకాశాలను మృగ్యం చేసింది. ఆచరణ సి.పి.ఐ. ఎత్తుగడల ఫలితాలే, ఆ ఎత్తుగడల విఫలతను స్పష్టం చేసాయి. పోరాటంలో లక్ష్యం చేరుకొనుటకు అనుసరించిన ఎత్తుగడలు సరియైనవా ? కావా ? అనేదానికి గీటురాయి. ప్రధానంగా ఆచరణ ఫలితాలే నిర్ధారణ చేస్తాయి. అంతేగాక ఎత్తుగడలు కొన్నికుడి, ఎడమల రెండువైపుల పదునుగలిగి ఉంటవి. అంచేత. సుముఖ, అసుముఖ ఫలితాలు వివిధ మోతాదులలో వుంటవి.

### సి.పి.ఐ.(యం) సైద్ధాంతికపోరాటం, విప్లవకారుల తిరుగుబాటు

సి.పి.ఐ.(యం) ఎన్నికల అనంతర రాజకీయ పరిస్థితిని అధ్యయనం చేసి కర్తవ్యాలను నిర్ణయించుటకై, ఏప్రిల్ 1967లో కేంద్ర కమిటి సమావేశం జరుగునపుడే పార్టీకార్యక్రమంపై సైద్ధాంతిక దాడిని ప్రారంభించుటతోపాటు, బెంగాలులో నక్సల్బరీ సాయుధరైతాంగ విప్లవ పోరాటాలను ప్రారంభించారు. చైనా కమ్యూనిస్టు పార్టీ, వార్తాపత్రికలు, నక్సల్బరీ పోరాటాన్ని "వసంతమేఘగర్జన"గా ప్రస్తుతించి, ప్రచారం గావించారు, బలపరచారు. కొద్దికాలంలోనే యీ "సాహసిక అతివాద బాల్యారిష్టం"

---

1. *పొలిటికల్ రిపోర్టు (1965)* సి.పి.ఐ. పాట్నా 8వ కాంగ్రెసు పి.పి. హెచ్. పే. *101 (ఆంగ్లంలో)*

దేశంలోని మరికొన్ని ప్రాంతాలకు వ్యాపించి" నక్సలైట్ల రైతాంగసాయుధ పోరాటంగా పేరొంది. సి.పి.ఐ.(యం) రాజకీయ ప్రజకార్యాచరణకు పోటీగా సాహసిక అతివాద విప్లవ కమ్యూనిస్టులుగా. పార్టీ శ్రేణులలో విస్తరించసాగారు.

సి.పి.ఐ.(యం) కేంద్రకమిటి ఏప్రిల్ 1968 బర్ద్వాన్ సమావేశంలో "అతివాదుల" రాజకీయ, సైద్ధాంతిక, ఆలోచనా ధోరణులను పరిశీలించి చర్చించింది. ఈ చర్చలనే పొలిట్‌బ్యూరో సమీక్షించి, నిర్థారణలుచేసి, వాటిని "ఆంధ్ర కామ్రేడ్స్‌కు లేఖ", "ఆంధ్రలో అతివాద వేర్పాటువాదుల చీలికలు" అనే రెండు పత్రాలను సి.పి.ఐ.(యం) అధికారికంగా విడుదల చేసింది. అంతేగాక, సి.పి.ఐ.(యం) పార్టీ 8వ కాంగ్రెసు ఆమోదించిన నివేదికలో ఆ ముఖ్యాంశాలనే పునరుద్ఘాటించింది. ఈ ప్రమాదకర పరిణామాలను అడ్డుకొని పోరాడుటకు, పార్టీని సైద్ధాంతికంగా సాయుధం చేయుటకు అవసరంగా నెంచింది. "సాహసిక అతివాద వాదం" పూర్తిగా వోడించబడిందని తలచుట పొరపాటు అగుతుందని స్పష్టం చేసింది.

"సాహసిక అతివాద పెడవాదాన్ని" బట్టబయలు చేస్తూ సాగించిన సైద్ధాంతిక పోరాటంలో మూడు ప్రధానాంశాలను ఇలా వివరించింది.

ప్రధమాంశం. "పార్టీలో అతివాద అవకాశవాదం మే-జూన్ 1967లో బహిరంగంగా వెల్లడైనా, దాని అన్నిరంగులు ప్రదర్శించబడలేదు. పార్టీ కార్యక్రమం, రాజకీయ పంధాల యెడల మౌలిక అంగీకారమున్నట్లు నటించుతు, కార్యక్రమం, ఎత్తుగడలలో కొన్ని అంశాల ప్రతిపాదనలలో మాత్రమే భిన్నాభిప్రాయాలున్నట్లు చెప్పింది. కార్యక్రమం, ఎత్తుగడలపై విశ్వాసం ప్రటించుతు, పార్టీ అనుసరించే ఎత్తుగడల ఆచరణస్థాయి, లోతుపాతులలోనే భేదాభిప్రాయాలు ఉన్నట్లు పార్టీచెప్పింది. పశ్చిమబెంగాలులో యీ భేదాభిప్రాయాలు ప్రప్రధమంగా వెల్లడై, వేగంగా దేశమంతటా వ్యాపించాయి పార్టీ 7వ కాంగ్రెసు తదనంతర పరిణామాలను 30 మాసాల తరువాత ఏప్రిల్ 1967 కేంద్ర కమిటి సమావేశం సమీక్షించి, పార్టీకర్తవ్యాలను రూపొందించునపుడు, ఎవ్వరూ ఎట్టి అనంగీకారం తెలుపలేదు. కేంద్రకమిటిలోగాని, రాష్ట్ర కమిటీలోగాని ఎట్టి అనంగీకారాన్ని తెలుపకపోగా, స్వాగతం పలికారు, అన్నిశాఖలు బలపరచాయి. మే-జూన్‌లలో పశ్చిమ బెంగాల్‌లో "నక్సలైట్ల బాల్యారిష్ట తిరుగుబాటులు ప్రారంభమై వేగోద్ధృతిని పొంది. ఫిబ్రవరి 1968కి బద్దలయ్యే పరిస్థితి యేర్పడింది. పార్టీపంథాని నేరుగా వ్యతిరేకించే ప్రోత్సాహాన్ని, ధైర్యాన్ని, సాహసాన్ని, చైనాకమ్యూనిస్టు వార్తా పత్రికలు, రేడియోలు, పార్టీపై తీవ్రదాడులు సాగించుటతో కలిగింది. పార్టీకి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయండని బహిరంగా యిచ్చినపిలువులే ఆధైర్యాన్నియిచ్చాయి. ఈ ఘటనలను తీవ్రంగా ఆలోచించి, పాఠాలను తీసుకొనాలనే ఆలోచనలో సి.పి.ఐ.(యం) వుంది.

ద్వితీయాంశం. ఈ 'అతివాద అవకాశవాద వక్రీకరణ జాతీయ పరిణామాంశం మాత్రమే కాదు. అంతర్జాతీయ పరిణామాంశంగా గుర్తించాలి. లేనిచో పార్టీ భవిష్యత్తుకే తీవ్రవిఘాతమేర్పడుతుంది. సరైన రాజకీయపంథా, పార్టీ "మితవాద" "అతివాద" అవకాశవాద వక్రీకరణల వ్యతిరేక పోరాటం కుంటుపడుతుంది. నేటి యీ "అతివాద"

అవకాశవాదం అన్ని మౌలికాంశాలలో లెనిన్ తన రచన "అతివాద కమ్యూనిజం - బాల్యారిష్టం"లో పేర్కొన్న అన్ని లక్షణాలను కలిగివుంది. నవీన సంస్కరణవాదం, కార్మిక వర్గనియంతృత్వం కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం, ప్రజాస్వామ్య కేంద్రీకరణ సూత్రం అంతర్జాతీయ కార్మికవర్గ ఐక్యత వర్గపోరాట సూత్రాలను త్రోసిబుచ్చి, వర్గసామరస్యం, శాంతి, నెలకొల్ప ప్రయత్నిస్తున్నది. నూతన అతివాద అవకాశవాదం అన్ని స్నేహ, మిత్ర సంబంధాలను, వొప్పందాలను, యితర పార్టీలతో చేసుకొనుటను, సూత్ర బద్ధంకాని రాజీవొప్పందాలను, బూర్జువాపార్లమెంటులో పాల్గొనుటను, సంస్కరణవాద ట్రేడుయూనియనులలో పని చేయుటను, పార్టీ నిర్మాణాన్ని తిరస్కరించి, విప్లవ వర్గాలు, ప్రజలకు బదులుగా పురోగామి విప్లవ అగ్రగామిదళంతో అపరిపక్వ తిరుగుబాటులు తలపెట్టింది. అంతేగాక "రైతుల ప్రజాయుద్ధం", "ప్రపంచగ్రామాలు ప్రపంచనగరాలను చుట్టుముట్టివిముక్తి చేయుట" జాతీయ విముక్తివిప్లవాలు ప్రపంచసామ్రాజ్యవాదాన్ని వోడించి, "ప్రపంచ సోషలిస్టు విప్లవంలో నిర్ణయాత్మకపాత్ర" అనే అత్యుగ్రవాద విప్లవనినాదాలముసుగులో ప్రపంచకార్మిక విప్లవంలో కార్మిక వర్గపాత్రను పూర్తిగా త్రోసిబుచ్చుటలో అతివాద అవకాశవాదం తన ప్రత్యేక తను చూపెడుతున్నది. ప్రపంచవర్గ శక్తుల బలాబలాలను, కూటములను, సోషలిస్టు వ్యవస్థలో పెద్దభాగం సోవియట్ యూనియన్‌తో సహా ఇప్పటికే అంతమైందని విశ్లేషించి, నిర్ధారణకువచ్చింది. సోవియట్ యూనియన్ సోషలిస్టు దేశాలు ప్రపంచ సామ్రాజ్యవాదపు మిత్రులై, ప్రపంచ ఆధిక్యతకై అర్రులు చాస్తున్నారు. ఒకటి, రెండు కమ్యూనిస్టు పార్టీలు, కొన్ని దేశాలలోని గ్రూపులు మినహా సంస్కరణవాదాన్ని చేబట్టుటతో ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమమనేది లేకుండా పోయిందనే నిర్ధారణ అతివాద అవకాశవాదం చేసింది. దీనిలో "నూతన అతివాద" అవగాహనలు స్పష్టం, యీ మార్గం అతివాద అరాచక సిద్ధాంతానికి దారి తీసినా ఆశ్చర్యంలేదు.

తృతీయాంశం అతివాద ఏర్పాటువాదులు, సి.పి.ఐ.(యం)తో బహిరంగవాద ప్రతివాదనలకు వివాదాంశాలపై దిగినపుడు ముఖ్యంగా బర్ద్వాన్‌ప్లీనం ముందూ, తర్వాత వారి నిజమైన రాజకీయ అభిప్రాయాలను విశ్వాసాలపై ముసుగు వేస్తున్నారు. సోవియట్ యూనియన్‌ను సామ్రాజ్యవాదశక్తిగా, ప్రపంచ వర్గశక్తుల కూటములను, బలాబలాను అంచెనా వేయుటను, సోషలిస్టు వ్యవస్థ కూలిపోవుటను సాయుధపోరాటాన్ని కార్యాచరణ నినాదంగాయిచ్చుట, పార్టీయందు విశ్వాసం లేకపోవుట, అనే ఆరోపణులు స్పష్టమయ్యాయని సి.పి.ఐ.(యం) తలచుచున్నది.

"అతివాద సాహసిక వాదం ప్రధానంగా పెటీబూర్జువా చురుకైన విద్యార్థులను, యువకులను, నిజంగా పోరాడే నిజాయితీ గల గ్రూపులను, వ్యక్తులను బాగా ఆకర్షించుతున్నది. కమ్యూనిస్టుపార్టీ సుస్థిర నిర్మాణానికి దేశంలో విప్లవోద్యమానికి, అది కలుగజేసే ప్రమాదాన్ని తక్కువగా అంచెనా వేయరాదని సి.పి.ఐ.(యం) విశ్వాసం. 'మితవాద అవకాశవాదాన్ని, సంస్కరణవాదాన్ని బూర్జువావర్గం ఒకవైపున కమ్యూనిస్టు వుద్యమానికి తీరని నష్టాన్ని కలుగచేసి, విచ్ఛిన్నం చేయుటకు వినియోగించుతు, మరొవైపున "సాహసిక అతివాద అవకాశావాదాన్ని అదే లక్ష్యానికై మరోవిధంగా వినియోగించుటకు వెనుకాడదు."

ప్రపంచపెట్టుబడిదారి వర్గం వందలకొలది సంవత్సరాల అనుభవాన్ని వర్గ దోపిడిలో పాలనలో ఎంతో అనుభవాన్ని సంపాదించి, సిద్ధాంతీకరించిన నేడు విప్లవ ప్రతీఘాతక వ్యూహాలు, ఎత్తుగడలలో మోసాలు కుట్రలలో విశేషానుభవం కలిగి విప్లవ కార్మిక వర్గాన్ని, కమ్యూనిస్టు పార్టీలను ఒక ఆట ఆడించగలస్థితిలో వుంది. రాజకీయంగా సైద్ధాంతికంగా మితవాద అవకాశవాద శక్తుల తప్పిదాలను, పొరపాట్లను వినియోగించుకొని దెబ్బతీయగలనని, ఆ విధంగా విప్లజ్యోతిని ఆర్పగల తలచి, అతివాద సాహసిక అవకాశవాద కమ్యూనిస్టు ఉద్యమంలోని వక్రకీరణలను, పెడమార్గాలను వినియోగించి కమ్యూనిస్టు పార్టీని విచ్ఛిన్నం చేసి నాశనం చేయుటకు వెనుకాడదు. అంతేగాదు, విప్లవోద్యమాన్ని, నిర్మాణాన్ని భౌతికంగా నాశనం చేయుటకు పాలకవర్గాలు వెనుకాడవు. ఇదే చరిత్రమనకు చర్వితచరణంగా నేర్పేపాఠము. ఈ సత్యాన్నే నేటి అనుభవం పూర్తిగా రుజువు చేస్తున్న వాస్తవం.

"అతివాద ప్రమాదాన్ని" యిప్పటి వరకు జరిగిన వేర్పాటు వాద చీలికల దృక్పథంలోనే అంచెనాలు వేయరాదు. ఇప్పటికే గణనీయనష్టం జరిగింది. అది పార్టీకి చేయగలిగిన నష్టాన్ని, దాని శక్తిని బట్టి అంచెనా వేయవలసి వుంటుంది. మన విప్లవోద్యమంలోని "అతివాద" వికృత రూపాన్ని మననం చేసుకొనగలిగితే పెటీబూర్జువావర్గం అత్యధికంగా వున్నమన దేశంలో అదికలిగించగలిగిన "తుఫాన్‌దుమారాన్ని", "మితవాద విద్రోహం" నిరుత్సాహాన్ని, వోటమితత్వాన్ని శతృదాడిలో బహిరంగమగుట సహజం. అత్యంత విశాలభారత ఉపఖండంలో, ప్రపంచంలో రెండవ పెద్ద జనాభా కలిగిన దేశంలో, వేళ్ళూని వున్న సాహసిక అతివాద అవకాశవాదం కలిగించగల 'ప్రమాదాన్ని ఊహించిన భయ, ద్వేషంతో, జుగుప్స కలిగించుట ఆశ్చర్యం కలుగదు. కాని, తక్కువగా అంచెనా వేయుట పెద్దపొరపాటేగాక, అత్యంత ప్రమాదకర ఫలితాలు కలిగే అవకాశాలున్నవి.

అంతర్జాతీయ సమస్యలపై అతివాద సాహసిక అవకాశవాదము "సామ్రాజ్యవాదాన్ని-సోషలిజాన్ని వోకేగాటను కట్టి" వొకవంక "సోషలిజం సంస్కరణ వాదుల నాయకత్వంలో ఉందని, తప్పుదారి పట్టించబడినవారు మనకర్తవ్యాలను పెడమార్గాల పట్టించిన వారిని బహిర్గతంచేసి వేరుచేయుట తేలికైన విషయమని స్పష్టమైంది.

నవీన సంస్కరణవాదం ప్రధానప్రమాదకారియని మరువక ధృఢంగా వ్యతిరేకించే శక్తులే సి.పి.ఐ.ని రాజకీయ, సైద్ధాంతిక రంగాలలో తీవ్రంగా ప్రతిఘటించుచున్నవి. అంచేతనే, సి.పి.ఐ.(యం) మితవాద సంస్కరణ వాదాన్ని, సాహసిక అతివాద అవకాశవాదాన్ని అంటే రెండురకాల అవకాశవాదాలను పోరాడుట లక్ష్యంగా పెట్టుకొన్నది[1].

## భారత విప్లవకారుల అతివాద ధోరణిపై ఆంధ్రప్రదేశ్ విప్లవకారుల విమర్శన

ఆంధ్రప్రదేశ్ విప్లవకారుల సదస్సు 13 జనవరి 1968న పాలకొల్లులో జరిగింది.

1. *సి.పి.ఐ.(యం) 8వ పార్టీ కాంగ్రెసుకు కేంద్ర కమిటీ సమర్పించిన "రాజకీయ నివేదిక" (1964 నుండి 1969) ఆంగ్లంలో పే. 152-3.*

దీనికి పూర్వమే విప్లవకారులలో కొన్ని సమస్యలపై అభిప్రాయభేదాలున్నవి. అవి క్లుప్తంగా యిలావున్నవి[1].

అఖిల భారత కమ్యూనిస్టు విప్లవకారుల సమన్వయ కమిటి నాయకత్వం, తాము భారత కమ్యూనిస్టు పార్టీ (మర్కిస్టు-లెనినిస్టు)గా రూపొందినట్లు 1969 మే 1న ప్రకటించింది. ఆంధ్ర విప్లవకారుల 1968లో అఖిల భారతకమిటీలో విలీనం కావటం, ఆకమిటి నాయకత్వం 1969లో ఆంధ్రకమిటీని, అఖిలభారత నిర్మాణం నుండి "తొలగించడం" యీ రెండు పనులు యీలోగానే అయినవి. విప్లవ కారులంతా మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనా విధానం ఆమోదించినప్పటికి, ఆనాటికి ఒకేధోరణి కలవారందరూ ఒకే పార్టీలో చేరిపోయినారని, విభిన్న ధోరణులు గల విప్లవవాదులందరికి యీ పార్టీలో ప్రాతినిధ్యం వహించుటలో విఫలమైందని, అందరికి స్పష్టమైంది.

విప్లవపార్టీ మనుగడకు, అభివృద్ధికి తనలోవున్నవిభిన్న ధోరణులు, అభిప్రాయాలుపై సూత్రబద్ధ చర్చలు సాగించడం, విప్లవకార్యాచరణలో వచ్చే అనుభవాలను మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనావిధానం వెలుగులో పరిశీలించి సరైన గుణపాఠాలను తీసుకొని, భవిష్యత్కార్య క్రమాన్ని రూపొందించుకోవడం, అపరిష్కృతంగా వున్న సమస్యలను పరిష్కరించు కొనడం అవసరము. దీనికై వొకకార్యక్రమం ఎత్తుగడల పంథా ప్రాతిపథికగా వుండుట కూడా అవసరము. ఒకే ధోరణిగల మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీ నాయకత్వం ఒక కార్యక్రమమాన్ని ప్రకటించినప్పటికి, యీమౌలిక కర్తవ్యాన్ని నిర్వహించుట విఫలమైంది.

ఆంధ్ర విప్లవకారులకు, చంద్రపుల్లారెడ్డికి మధ్యగల భేదాభిప్రాయాలు "రెండు విభిన్నధోరణులుగ ప్రారంభమై, రెండు విభిన్న పంథాలుగ అభివృద్ధి చెందినవి. అభిప్రాయ బేధాలు నేను, నాగిరెడ్డిగారు జైలులో వున్నపుడు ప్రారంభమైనట్లుగా ఆయన వ్రాతలలో సర్వసాధారణంగా కనిపిస్తున్నది. వాస్తవమేవుంటే 1968 ఏప్రిల్‌లో జరిగిన రాష్ట్ర సదస్సు పూర్తి అయిన వారం రోజులలోనే అభిప్రాయ భేదాలు బయటకు వచ్చినవి. వీటి స్వరూప, స్వభావాలను చూస్తే అవి సాయుధ పోరాటానికి మాత్రమే పరిమితమై లేవు[2]" అని డి.వి. అన్నారు. అంతేగాక "అవి సాయుధ పోరాటానికి మాత్రమే సంబంధంచినవి మాత్రమే గాక, సిద్ధాంత, రాజకీయ నిర్మాణ విషయాలలో భిన్నాభిప్రాయాలుండుటయే గాక, కార్యాచరణలో కూడ ప్రస్ఫుటమైనవి. వీటికొక సమగ్రస్వరూప మిచ్చి, మొదటి సారిగా "ఖమ్మం యేరియావిప్లవ ప్రజావుద్యమం ఎదుర్కొంటున్న కొన్ని సమస్యలు" అనే చిన్న పుస్తకములో వివరించాను. తదనంతర పరిణామాల ఆధారంతో "పార్టీలో అతివాద పెదధోరణులు" అనే పేరుతో మరోపుస్తకం వ్రాసాను. దీనినే "ఆంధ్ర కమ్యూనిస్టు విప్లవకారులలో అతివాద అవకాశవాద ధోరణి "అన్నపేరుతో ప్రచురించిన పుస్తకానికి ముందుమాటలో డి.వి. వ్రాసారు. "మౌలిక పంథా ఐక్యతాసమస్య", "పార్టీలో మితవాద అవకాశవాద ధోరణి" అనే రెండు పుస్తకాలు. ఆంధ్రకమ్యూనిస్టు విప్లవకారులు

1 & 2. వెంకటేశ్వరరావు, దేవులపల్లి (1982) ఆంధ్ర కమ్యూనిస్టు విప్లవకారులలో "అతివాద అవకాశవాద ధోరణి ప్రొలిటేరియన్ లైన్ ప్రచురణ. పే. 9.

ప్రచురించారు. వీటిలో చంద్రపుల్లారెడ్డి గ్రూపు విమర్శలకు డి.వి. సమాధానాలు యిచ్చుట యేగాక, వారి అభిప్రాయాలను తీవ్ర విమర్శకు గురిచేసాయి. ఈ సందర్భంలోనే ఆంధ్ర విప్లవ కారుల నుండి పుల్లారెడ్డి గ్రూపు చీలిపోవుట కూడ జరిగింది[1].

i) ఖమ్మం జిల్లా పగిడేరు ప్రాంతంలో ఆహారసమస్య, ఫారెస్టు కూలీల సమస్యలు ఏప్రిల్–మే నెలలో తీవ్రరూపంలో ప్రత్యక్షమయ్యాయి. ఈ సమస్యలపై ప్రజలను సమీకరించి, తొలకరిలో భూమిపంపక కార్యక్రమాన్ని అడవిప్రాంతాలలో చేబట్టాలని, జిల్లాపార్టీ నాయకత్వం, రాష్ట్ర పార్టీనాయకత్వం సహాయంతో అమలు జరుపుటకు నిర్ణయించారు. కాని, తీరా అమలు చేయవలసి వచ్చినపుడు దానిని దాటవేసారు. ప్రజావుద్యమానికి సంబంధంలేని అఫెన్సివ్ చర్యలకు పూనుకొన్నారు. మనదేశంలో "మనం తల పెట్టినది దీర్ఘకాల ప్రజల సాయుధపోరాటం, అదే ప్రజాయుద్ధం. ప్రజల విప్లవోద్యమాల నుండి సాయుధ ప్రజాపోరాటం వృద్ధవిస్తుందని మేము యిదివరకే వివరించాము. సాయుధపోరటానికి నాయకత్వం వహించగల్గిన విప్లవకమ్యూనిస్టు పార్టీని నిర్మిస్తూ సాయుధ ప్రజాపోరాటానికి సిద్ధమౌతాము. తగిన పరిస్థితులు యేర్పడగానే సాయుధపోరాటాన్ని ప్రారంభిస్తామని దేవులపల్లి స్పష్టంచేసారు.

"ఈనాటికీ ప్రజలు సాయుధపోరాటానికి సిద్ధంగా లేరని ఖమ్మం యేరియా కమిటి అంగీకరిస్తున్నది. రాష్ట్ర కమిటికి వుద్యమం యెడల అతిగా అంచెనా వుండుటకు గలకారణాలను ఖమ్మం యేరియా కమిటి యిలా చెప్పుతున్నది. విప్లవోద్యమానికి ప్రాధాన్యతను యిచ్చుటలో విఫమగుటతోపాటు లోతుగా పరిశీలించుపోవుట జరిగింది. అంతేగాక ఆచరణ కార్యకలాపాలు యీలావున్నవి.

"1) ప్రజాచైతన్యం సాయుధపోరాటస్థాయికి చేరకముందే సాయుధచర్యలు ప్రారంభమైనందున, ప్రజలపాత్రలేకుండా పోయింది. 2) జరిగిన పాక్షిక పోరాటాలు ఆర్థికవాద దృక్పధంతోనే జరిగాయి. తమ విముక్తి తామే సాధించుకొనాలనే రాజకీయ చైతన్య స్థాయికి ప్రజావుద్యమాలు ఎదగలేదు. 3) భూస్వామ్యవ్యతిరేకపోరాటాలు ప్రజావుద్యమాలుగా ఎదుగుటకు బదులు, సాయుధదళ చర్యల కారణంగా ప్రజల పాత్ర లేకుండా పోయింది, ప్రజాచైతన్యం, పోరాటశక్తి పెరగలేదు. 4. ప్రజలలో తమపనిని దళాలు నెరవేర్చగలవనే భ్రమలు పెరుగుటతో పాటు, ప్రజాపోరాటాలే విప్లవమౌలిక పోరాటాలనే అవగాహన లేకుండా పోయింది. ఇది విప్లవోద్యమ పురోగమనానకి ఎంతోహాని చేసింది. 5. ప్రజలలో కేంద్రీకరించి పని చేయకుండా, సంచారదళాల కార్యక్రమమైంది. ప్రజలలో కలసిపోయి బలంగా, విస్తరించజాలక పోయారు. ఫలితంగా వుద్యమం విస్తృతమైందిగాని, వ్యవసాయ విప్లవోద్యమం అభివృద్ధిచెంది, భూమి పంపకం దశకు చేరుకొనుటలో విఫలమైంది. కారణం ప్రజల పాత్రలేకుండా పోవుట. పగిడేరు ప్రాంతంలో సాయుధపోరాటం ప్రారంభించుటకు, విప్లవోద్యమ నిర్మాణంపై ఆధారపడలేదు. ఆత్మరక్షణ పేరుతో సాయుధ పోరాటాన్ని విప్లవోద్యమానికి ప్రత్యామ్నాయం చేయుట జరిగింది. అంచేతనే, ప్రజలు సాయుధ పోరాటానికి సంసిద్ధులుగ అభివృద్ధి చెందలేదు.

---

*1. వెంకటేశ్వరరావు, దేవులపల్లి (1982) ఆంధ్ర కమ్యూనిస్టు విప్లవ కారులలో అతివాద అవకాశవాద ధోరణి. ప్రొలిటేరియన్ పబ్లికేషన్. పే. 9–10.*

రాష్ట్రపార్టీ సదస్సులో వ్యవసాయ విప్లవకార్యక్రమాన్ని అమలు చేస్తూ, ప్రజలను సాయుధపోరాటాలకు సంసిద్ధులుగా చేయాలని, ఆ విధంగా ప్రజలు సంసిద్ధులైనపుడే సాయుధ పోరాటం ప్రారంభించాలని, తక్షణ కార్యక్రమం స్పష్టంగా చెప్పుతున్నది. దీనికి విరుద్ధమైన కార్యక్రమం అమలు జరిగింది. ఎత్తుగడలవైఫల్యం స్పష్టం.

2) రెండవ ముఖ్యాంశం, వ్యవసాయ విప్లవం, సాయుధపోరాటంపై కూడా ఆంధ్ర విప్లవకారులు, అఖిల భారత విప్లవకారుల సమన్వయ కమిటి. వారిని అనుసరించే సి. పుల్లారెడ్డి, శ్రీకాకుళంజిల్లా నాయకత్వం, తదితర గ్రూపుల మధ్య యేకాభిప్రాయం లేక పోవుటయేగాక, తీవ్ర అభిప్రాయబేధాలు వున్నవి.

ఆంధ్ర విప్లవకారులు సాయుధ పోరాటాన్ని భూమి పంపకంతో ముడిపెట్టి భూమి పంపకంతో మాత్రమే సాయుధ పోరాటం ప్రారంభం కావాలనే అవగాహన, దృక్పథంలో ఉన్నారని, ఖమ్మం ఏరియాకమిటి కామ్రేడ్స్ తదితరులు తీవ్రంగా విమర్శించుతున్నారని, తమను తాము యిలా సమర్థించుకొన్నారు.

"తక్షణ కార్యక్రమంలో వ్యవసాయ విప్లవకార్యక్రమాన్ని, సాయుధపోరాటాన్ని సమన్వయం చేయాలని, దీనిలో భూమి పంపకం స్పష్టం చేయబడిందని, స్పష్టం చేసాము. ఇది సిద్ధాంతరాత్యా సరైనదేకాక, మనవిప్లవ పోరాటాల అనుభవాలు కూడా యిది సరైనదని ధృవీకరిస్తున్నవి. వ్యవసాయ విప్లవానికి సాయుధ పోరాటానికి అవినాభావ సంబంధముంది. అది, కార్మికవర్గ నాయకత్వం క్రింద జరిగే. రైతాంగ సాయుధ వ్యవసాయ విప్లవం". అని మావో ఉదహరింపులతో తమవాదనలను బలపరచుకొన్నారు. వ్యవసాయ విప్లవోద్యమ నిర్మాణ క్రమంలోను, సాయుధరైతాంగ గెరిల్లా పోరాటాల ద్వారాను, భూమి పంపక విధానాన్ని అమలు చేయుట ద్వారాను, విప్లవ విజయాలను సంరక్షించుకొంటూ, విస్తరింప చేయుదానిని, విముక్తి స్థావర్గాలను యేర్పరచుటకు, కాపాడుటకు అవసరమైన సాయుధసైన్య నిర్మాణం, అదే క్రమంలో జరుగుతుందని, చైనాలోవలె ప్రారంభంనుండి చీలి వచ్చిన 40 వేలసైన్యం లేదని గుర్తుపెట్టకొనాలని ఆంధ్ర కమ్యూనిస్టు విప్లవకారులన్నారు. మన రైతాంగ పోరాట అనుభవాలు కూడ వ్యవసాయ విప్లవానికి, సాయుధ పోరాటానికి గల అవినాభావ సంబంధాన్నేరుజువు చేస్తున్నది. శ్రీకాకుళం కమ్యూనిస్టు విప్లవకారులు భూమి పంపక కార్యక్రమాన్ని తీవ్రవపరచి సాధించిన విజయాల రక్షణకు సాయుధ పోరాటాన్ని అవలంభించకపోవుట వలననే అది దీర్ఘకాల సాయుధ పోరాటంగా మనజాలక పోయింది.

ఆంధ్ర కమ్యూనిస్టు విప్లవకారులు, తూర్పుగోదావరి జిల్లా కొండమొదలు ప్రాంతంలోని విప్లవోద్యమాల అనుభవాలు కూడ భూమి పంపకానికి, సాయుధ పోరాటానికి గల అవినాభావసంబంధాన్నే రుజువు చేస్తున్నవని నిర్ధారించారు. స్థానిక విప్లవకారులు ముందు "ప్రజావుద్యమానికి పోరాట పునాదులు వేయండి" అన్నరాష్ట్ర కమ్యూనిస్టు విప్లవకారుల సర్క్యులరు ననుసరించి జనవరి 1969 నుండి ప్రజలలో పని ప్రారంభించి, అచిరకాలంలోనే గణనీయమైన విజయాలను సాధించి, పోలీసులకు, భూస్వాములకు వ్యతిరేకంగా మిలిటెంటు ప్రతిఘటనకు ప్రజలను సమీకరించారు. తక్షణ కార్యక్రమాన్ని అనుసరించి పనిచేసి, 1969 జూన్‌లో భూమి పంపక పోరాటాన్ని రూపొందించి, సాయుధ పోలీసులను

ప్రతిఘటించుటకు రెగ్యులర్ గెరిల్లాదళాన్ని నిర్మించి. ముందుకు తీసుకొని వెళ్ళుటకు కృషిచేస్తున్న సమయంలో నాయకత్వంలో వొక భాగం దిగజారిపోయి, మిగిలినవారు చేసినపొరపాట్లు వలన నాయకత్వం అరెస్టు అగుటతో వుద్యమం తాత్కాలికంగా దెబ్బతిన్నదనే తప్పుడు అవగాహనకు వచ్చారు. కాని సమగ్రసమీక్ష, పరిశీలన, వాస్తవపరిస్థితులను అధ్యయనం చేసిన తమను అంటి పెట్టుకొనయున్న "అతివాద అవకాశవాదాన్ని" కొంత వరకైనా వదలించు కొనగలిగేవారు. సరైన మార్గంలోనికి వచ్చుట దశాబ్దాల కాలం పట్టేది కాదు. అప్పటివారి అతివాద అవగాహనలను దృక్పధాలు, అనుభవాలను ఎలా ప్రక్కదారులు పట్టించారో క్రింది విషయాలు స్పష్టం చేస్తవి. వారు. ఆంధ్ర విప్లవకారుల నుండి చీలిపోయిన అతివాద సాహసిక వాదులను, అఖిల భారత విప్లవకారుల సమన్వయ కమిటీ, అతివాద దుందుడుకు చర్యలను, వ్యక్తిగత హింసావాదాన్ని తీవ్రంగా విమర్శించుతున్నా, కొద్ది మార్పులతో తామూ "అతివాద అవకాశవాదాన్నుండి బయటపడలేక పోవుటయేగాక", వాటికి మెరుగులుదిద్దుటకు" అన్నివిధాల ప్రయత్నించారని, యీ క్రింది వారి అవగాహనలు తెల్పుతున్నవి.

"రైతాంగ ఉద్యమం భూమి పంపకదశకు కొండమెదలు ప్రాంతంలో అతిస్వల్పకాలంలో చేరుకొనడమేగాక, ఈలోగా అన్ని సందర్భాలలో, రైతాంగపోరాటాలలోను, ప్రతిఘటనలోను పాల్గొన్నారు. దీనితో వుద్యమం భూమిపంపకదశకు పోగలిగింది. ప్రతిఘటన పాల్గొనగలిగిన విప్లవవెల్లువ వుందని స్పష్టమౌతుంది. ఖమ్మం, వరంగల్లు పోరాట ప్రాంతాలలో యిలాంటి వెల్లువలేని కారణం అక్కడి వుద్యమాలను రాష్ట్రకమిటి నిర్ణయించిన పంధాననుసరించి నిర్మాణం చేయకపోవుటయని, పగిడేరు ఘటనలతో ప్రారంభమైన ప్రత్యామ్నాయ పంధాను అనుసరించి పనిచేయడం వలననేనని ములుగు ఏరియా కమిటి కూడ చివరకు ప్రత్యామ్నాయ పంధానే అనుసరించారు[1].

ఇంకా "ఖమ్మం ఏరియా కమిటి, పగిడేరు ఘటనలు తప్పు అంటున్నారు కాని, వారి అవగాహన లోపాన్ని ఎత్తిచూపలేక పోతున్నారు. చారుమజుందార్ పంధాలలో కొట్టుకు పోతున్నారు. వీరు భూమిపంపకానికి సాయుధ పోరాటానికిగల అవినాభావ సంబంధాన్ని చూడలేకపోటయే గాక, కేదరు ఆత్మరక్షణకు, ప్రజలరక్షణకు వున్నమౌలిక విభేదాన్ని కూడ చూడలేక పోతున్నారు. వీరి సిద్ధాంతమే సరైనదైతే పగిడేరు లాంటి చర్యజరిపి, ఏ ప్రాంతంలోనైనా చివరకువ్మైదాన ప్రాంతంలోనైనా సాయుధ పోరాటం ప్రారంభించవచ్చునుగదా ? అప్పుడు పగిడేరు ఘటనలు ఎలాతప్పు అగుతాయి?"

ఈ విధంగా ఆంధ్ర కమ్యూనిస్టు విప్లవకారులు పగిడేరు ఘటనల అతివాద పోకడలను గుర్తించి, విమర్శించినా ప్రతిఘటనలో పాల్గొనుట, విప్లవ వెల్లువ వుందనే తమ "అతివాద" అవగాహనను గుర్తించలేకుండా వున్నారు. ఈ రెండు వైఖరులలో మౌలిక, వ్యూహాత్మక అవగాహనలలో భేదం, అఘాతంలేదు ప్రధానంగా ఎత్తుగడలలోను, పోరాటక్రమంలో మాత్రమే భేదం వున్నట్లు కన్పడుతున్నది.

1. వెంకటేశ్వరరావు. దేవులపల్లి (1982) ఆంధ్ర కమ్యూనిస్టు విప్లకారులలో "అతివాద అవకాశవాద ధోరణి. ప్రొలిటేరియన్. ప్రచురణలు, హైదరబాద్ పే. 89-90.

3) ఆంధ్ర కమ్యూనిస్టు విప్లవకారుల 1969 ఏప్రిల్ రాష్ట్ర సదస్సు "శ్రీకాకుళం గిరిజన ఉద్యమ సమస్యలు" అన్న నివేదికను రాష్ట్ర నాయకత్వానికి శ్రీకాకుళం జిల్లాలోని వొకభాగానికి మధ్యవ్యక్తమైన విబేధాలను, సమస్యలను చర్చించింది. రాజకీయ విభేదాల ముఖ్యాంశాలు యిలా వున్నవి.

i) సాయుధ పోరాటం విముక్తి కోసం సాగించే పోరాటం కాబట్టి, భూమి సమస్యతో ఎలాంటి సబంధం లేదు అనేది శ్రీకాకుళం జిల్లా కమిటి మెజారిటి దృక్పధంగా ఉంది. రాష్ట్ర నాయకత్వం రైతుల విముక్తి అంటే ఫ్యూడలిజం, సామ్రాజ్యవాదాల నుండి విముక్తి, కాన రైతాంగ పోరాటాలను, అధికారాన్ని హస్తగతం చేసుకొనే పోరాటాలుగ అభివృద్ధి చేసే దృక్పధంతో నడపాలి. వ్యవసాయ విప్లవం కార్యక్రమ ప్రాతిపధికగా యీ పోరాటాలు ప్రారంభించి, అభివృద్ధి చేయాలనేది రాష్ట్ర నాయకత్వపు దృక్పధం. రాజకీయాధికారాన్ని హస్తగతం చేసుకొనే సమస్య, ప్రధాన సమస్య. అదే సమయంలో వ్యవసాయ విప్లవ కార్యక్రమమాన్ని తిరస్కరిస్తే, ప్రజల పాత్రబలహీనపడి, సాయుధ పోరాటం అపజయం పొందుతుంది. భూమి సమస్యకు సంబంధంలేని ఏ విముక్తి పోరాటమైనా, ఆచరణలో ప్రజలలో పోరాట శక్తిని పెంపొందించజాలదు.

ii) శ్రీకాకుళం జిల్లా కమిటి ప్రజలలో కదలిక వుండనవసరంలేదనీ సాయుధ పోరాటంలో ప్రజలు పాల్గొన నవసరంలేదని. మనం సాయుధ పోరాటం ప్రారంభిస్తే ప్రజలు వారంతట వారే కార్యరంగంలోనికి దిగుతారని వాదించింది. రాష్ట్ర నాయకత్వం యీ వాదనను తిరస్కరించింది. ప్రజలు కదలికలో వుండాలని, ప్రజా పంధాదృక్పధంతో వారిని కదలించుట సాధ్యమని, ప్రజలు చైతన్యంతో నిర్మాణయుతంగా సాయుధ పోరాటంలో పాత్రవహించకుండా విజయం అసాధ్యమని తెలిపింది.

iii) శ్రీకాకుళం జిల్లా కమిటి పోరాటంలోనే యుద్ధతంత్రాలన్నిటిని నేర్చుకొనవచ్చని, గెరిల్లా పోరాటానికి శిక్షణ యేతూత్రం అవసరం లేదని వాదించింది. అనవసరనష్టాలను నివారించుటకు, శతృవుతో శక్తివంతంగా పోరాడుటకు, గెరిల్లా పోరాటాలకు సంబంధించిన కనీస జ్ఞానం, శిక్షణ అవసరంగా వుపయోగకరమని రాష్ట్ర కమిటి చెప్పింది.

4) శతృవుని వోడించుటకు సాయుధ పోరాటం సాగిస్తే సరిపోతుందని జిల్లా నాయకత్వం వాదించింది. ఐక్యసంఘటన విప్లవ విజయానికి అవసరమైన మూడు ముఖ్య ఆయుధాలలో ఒకటని, దాని అవసరాన్ని తిరస్కరించిన, విప్లవం బలహీన పడి, వోటమికి దారితీస్తుందని రాష్ట్ర నాయకత్వపు అవగాహనగా వుంది.

కా. నాగిరెడ్డి 1970 సెప్టెంబరు 20న ఒక ఇంటర్వ్యూలో సి.పి.ఐ.(యం.యల్) లోగల మూడు ప్రధాన విభేదాలను యిలా పేర్కొన్నారు. ఒకటి, సాయుధ పోరాటం భూస్వాముల గూండాలను, ప్రభుత్వ నిర్బంధ విధానాన్ని ప్రతిఘటించు రూపంలో మాత్రమే ప్రారంభమగుతుంది. దాని రూపం ప్రజాప్రతిఘటన, దాని నుండే ప్రజాప్రతిఘటన దళాలు యేర్పడుతవి. ఈ అంశాన్ని సి.పి.ఐ. (యం.యల్) చూడ నిరాకరించుతున్నది. ప్రజావుద్యమం యేమాత్రం లేని చోట్లకూడ దళాలను యేర్పాటు చేస్తున్నది, అది దళాలను ప్రజలనుండి వేరు చేస్తుందని గుర్తించుటలేదు. రెండవ అంశం, ప్రజాయుద్ధం ప్రతిఘటనా

రూపంలో మాత్రమే ప్రారంభమగుతుంది. ఎదురుదాడి రూపంలో మాత్రం కాదు. సి.పి.ఐ.(యం.యల్) దృక్పథంలో ప్రజలకోర్కెలకు, పోరాటాలకు ఎటువంటి సంబంధంలేదు. ఏ వుద్యమం లేకుండా వారుదాడి చర్యలు చేబట్టారు. మూడవ అంశం, సాయుధ పోరాటం మౌలిక అత్యున్నత ప్రధాన పోరాట రూపమైనప్పటికి, అన్నిచోట్లా, అన్నికాలాలలో యిదొక్కటే పోరాట రూపం మాత్రంకాదు. ఉన్న పరిస్థితులకు అనుగుణంగా వేర్వేరు పోరాట రూపాలను చేబట్టాలి. వీటన్నిటికి గీటురాయి ప్రజలచైతన్యం పెరిగే విధంగా, వారు సంఘటిత మయ్యేవిధంగా పోరాట రూపాన్ని యెంచుకోవాలి. మార్క్సిజం కొన్నిప్రత్యేక పరిస్థితులలో శాంతి పోరాటరూపాన్ని కూడ పోరాటరూపాలలో వొకటిగా గుర్తించిందని మరువరాదు.

## అఖిలభారత కమ్యూనిస్టు విప్లకారుల సమన్వయ కమిటి (ఎ.ఐ.సి.సి.సి.ఆర్) ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు విప్లవకారుల సమన్వయ కమిటి (ఎ.పి.సి.సి.సి.ఆర్)ల మధ్య సైద్ధాంతిక పోరాటం.

ఎ.ఐ.సి.సి.సి.ఆర్. నాయకత్వం తాము భారత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు-లెనినిస్టు)గా యేర్పడినట్లు మే 1వ తేదీ 1969న ప్రకటించింది. ఆంధ్ర కమ్యూనిస్టు విప్లవకారులు 1968లో అఖిలభారత కమిటీలో విలీనమగుట., 1969లో తొలగించబడుట అచిరకాలంలోనే జరిగింది. అదేకాలంలో వివిధ రాష్ట్రాలలో ఈ నిర్మాణంలో లేని విప్లవకారులు గ్రూపులు, కమిటీలుగా ఏర్పడి పనిచేసారు. విప్లవకారులలో గణనీయమైన వారిని తమలో యిముడ్చుకోకూడానే భారతకమ్యూనిస్టు పార్టీ (యం.యల్) యేర్పడింది. మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనా విధానం అంగీకరించిన, వొకే ధోరణికలభిన్నవర్గాల వారినందరినీ వొకే పార్టీలో ప్రాతినిధ్యంకల వారిగ యిముడ్చుకొనజాలక పోయింది.

ఆంధ్రవిప్లవ కమ్యూనిస్టుల సమన్వయ రాష్ట్ర కమిటి ఆమోదించిన తక్షణ కార్యక్రమాన్ని అఖిల భారత కమ్యూనిస్టు విప్లవ కారుల సమన్వయ కమిటి ఆర్థికవాదమని, రివిజనిజమని విమర్శించుటతో, ప్రతిగా ఆంధ్ర విప్లవకారులు అఖిల భారత విప్లవ కారులు వ్యవసాయ విప్లవమనే పదాన్ని మాత్రమే వల్లిస్తున్నారని, వారికి వొక వ్యవసాయ విప్లవ కార్యక్రమం యేదీలేదనీ వారి సాయుధపోరాట అవగాహన అంతా వ్యవసాయ విప్లవ కార్యక్రమాన్ని, వ్యవసాయ విప్లవోద్యమాన్ని మినహాయించిన అవగాహనగా వుందని తమకు స్పష్టమైందని, ఆంధ్ర కమ్యూనిస్టు విప్లవకారులు తీవ్రంగా విమర్శించారు. అంతేగాక ప్రధాన సమస్యలన్నిటిలో వ్యక్తమైన యీ అవగాహన "అతివాద" ధోరణి అనీ దీనికి వ్యతిరేకంగా సాగించవలసిన సిద్ధాంత పోరాటంలో వొక భాగంగా విమర్శను తీవ్రతరం చేసారు. ఈ "అతివాద" ధోరణి ఖమ్మం, వరంగల్లు జిల్లాలలో వ్యవసాయ విప్లవోద్యమాన్ని సాయుధ పోరాట స్థాయికి తీసుకొని వెళ్ళుటకు ప్రయత్నించకుండానే, ప్రజలను సిద్ధం చేయకూడానే సాయుధ చర్యలు జరిగినవి. దీనితో సి.పి.ఐ. (మా.లె) పార్టీలోనే గాక, ఆంధ్రప్రదేశ్ విప్లవకారులలో కూడ యీ ధోరణి వ్యక్తమైంది. మార్క్సిస్టు-లెనినిస్టులు అనుసరించిన విధానాలను తదనంతర కాలంలో విమర్శించిన వారు అనేకులు ఉన్నారు. వారిలో "సంస్కరణ వాదులు" "నయా సంస్కరణవాదులు" మా.లె. పార్టీ నుండి చీలిపోయిన గ్రూపులు, వారి నాయకత్వాలువున్నవి. నాయకత్వం అనుసరించిన తప్పుడు పంథాలు, విధానాలే గాక

శత్రువుల బలాధిక్యత, భౌతిక పరిస్థితులలో వచ్చిన మార్పులువలన కూడ ప్రజాపోరాటాలు, సాయుధ పోరాటాలు, దెబ్బతినటం వెనుకడుగు వేయడం జరుగుతూ వుంటాయి. ఈ వైఫల్యాలే వారివిమర్శనలు సరియైనవని చెప్పుటకు కారణం కాజాలదు. విమర్శనలు మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనా విధానముల సూత్రాలకు అనుగుణంగాను, విప్లవాత్మకంగాను, విప్లవోద్యమ పురోగమనానికి తోడ్పడాలి. అప్పుడే విమర్శన సరైనదగుతుంది. అనేక విమర్శనలు యీ మౌలిక అంశాలకు విరుద్ధంగా వుంటున్నవి. ప్రస్తుత చర్చనీయాంశాలలో ప్రధానమైనదిగా ఉన్న వ్యక్తిగత హింసావాద పరిశీలన, అధ్యయనం ప్రారంభించుదాము.

ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు విప్లవ కారుల సంస్కరణ వాదులు (సి.పి.ఐ.), నయాసంస్కరణ వాదులు (సి.పి.యం.) రాజకీయ, సైద్ధాంతిక విధానాలపై తీవ్రవిమర్శనా వైఖరి అవలంభించారు. సి.పి.ఐ. "మార్క్సిజం-లెనినిజం మూలసూత్రాలను తిరుగదోడి అవకాశవాద సిద్ధాంతాలను" రూపొందిచుకొని సంస్కరణవాదాన్ని చేబట్టి, భారత ప్రభుత్వాన్ని రక్షించుచున్నదనే దృక్పధాన్నుండి విమర్శన చేబట్టింది. అంతేగాక, సోవియట్ యూనియను భారతదేశం యెడల అనుసరించుతున్న వైఖరికి, విధానాలకు అనుగుణంగానే సి.పి.ఐ. విధానాలున్నవి. ఈ దృక్పధాలకు అనుగుణంగానే పార్లమెంటరీ విధానం, రాజకీయ విధాన ప్రధాన పంధాగా సి.పి.ఐ. చేబట్టిందని తీవ్రవిమర్శనావిధానాన్ని కమ్యూనిస్టు విప్లవకారులు సి.పి.ఐ.(యం) యిరువురూ అవలంభించారు. ప్రజలు సాయుధపోరాటం కొనసాగించుచున్నపుడు, కమ్యూనిస్టు విప్లవకారులు "వర్గశతృవు నిర్మూలనా" కార్యక్రమం అనే పేరుతో "వ్యక్తిగత హింసావాదాన్ని" అనుసరించుతున్నారని, సంస్కరణవాదులు, నియోసంస్కరణ వాదులు తమను తీవ్రవిమ్మలకు గురి చేసారని, తమ విధానాలను సమర్థించుకొన్నారు.

సి.పి.ఐ.(యం) "తాము 1951 ఎత్తుగడల పంధా లకు కట్టుబడి ఉన్నామని, దానిలో వ్యక్తిగత హింసావాదాన్ని ఖండించే ఒక అంశం ఉన్నదని, దానికేకట్టు బద్ధి వున్నామని "చెప్పుతున్నారు. ప్రజల చైతన్యానికి అనుగుణమైన పోరాటరూపాలనే అంశాన్ని వివరించే లెనిన్, మావోరచనల నుండి కొన్ని భాగాలను ఉల్లేఖించి, "ఉగ్రవాదులను" గూర్చియిలా తీర్పు చెప్పారు.

"ఉగ్రవాదులు (కమ్యూనిస్టు విప్లవకారులు) చేబట్టిన పోరాట పద్ధతులు, ప్రజాపోరాటాల అవసరాలరీత్యా ప్రజల నుండి అవివృద్ధవించాలన్న లెనిన్ సూక్తులకు విరుద్ధమైనవి. ఆ పోరాటపంధా అనివార్యం అని చెప్పే వాదనకు వీలులేదు. మావోచెప్పినట్లు సన్నద్ధత, సంసిద్ధతలను బట్టి సాయుధ పోరాటం చేబట్టిందని చెప్పేందుకు ఆస్కారంలేదు. ఏ మూలసూత్రానికి, మౌలిక గీటురాయికి అందని విధంగా ఉగ్రవాదులు పోరాటరూపాలను చేబట్టారు. కనుకనే వారు వ్యక్తిగత దౌర్జన్యానికి, దోపిడీలకు దిగజారారు. ఈ దుందుడుకు ఎత్తుగడలకు పార్టీ ఆమోదంలేదు. కనుకనే మనపార్టీపై వారు అనేక అపనిందలు, అపోహలు ప్రచారంలో పెట్టారు. మన పార్టీకి సాయుధ పోరాట అవగాహన లేదని అపోహకలిగించారు[1]. సి.పి.ఐ.(యం) చేసిన యీ విమర్శకు సమాధానంగా" నక్సల్బరీలోను, శ్రీకాకుళంలోను రైతాంగం లీగలు పోరాట రూపాలన్నిటిని ఉపయోగించిన

తరువాతనే సాయుధ పోరాటరూపాన్ని తీసుకొన్నారు. అవి ప్రజల సాయుధ పోరాట రూపాలు. ఎలాంటి ప్రచారం అవసరం లేకుండానే తమ సాయుధ పోరాట వ్యతిరేకతను బయట పెట్టు కొన్నారని. కమ్యూనిస్టు. విప్లవకారుల అవగాహనగా వుంది. అంతేగాక "వ్యక్తిగత హింసా వాదానికి వ్యతిరేకంగా పోరాడుతు, ప్రజల సాయుధపోరాట అవసరాన్ని ప్రచారం చేయుటతోపాటు ప్రజలను సాయుధపోరాటానికి సిద్ధంచేయాలి. ప్రజలు సాయుధ పోరాట రూపం చేబట్టినపుడు సరైన కార్యక్రమం, ఎత్తుగడలతో రాజకీయ, ఆర్థిక, మిలిటరీ సాయుధ పోరాటాన్ని నడిపించాలి. ఇదేగీటురాయి.[2]"

కమ్యూనిస్టు విప్లవకారులు, సి.పి.ఐ.(యం) వ్యక్తిగత హింసావాదంపై చేసిన విమర్శన సరైనదిగా రుజులైందని భావించడానికి ప్రాతిపధిక యేమిలేదని, సాయుధ పోరాట వ్యతిరేకులు చేసే విమర్శ, వీరి విమర్శమౌలికంగా వొకటేనని, యిది మార్క్సిజం, లెనినిజానికి విరుద్ధమైనదని, దీనివలన స్పష్టముగుతున్నది. వారినయా రివిజనిజం మౌలికాంశాలలో ఇది ఒకటన్ని[3]" కమ్యూనిస్టు విప్లవకారుల ధృఢవిశ్వాసం, అవగాహనగా వుంది.

అతివాద అవకాశవాద ధోరణి 1969-71 కాలంలో సైద్ధాంతిక పంధాగా పరిపూర్ణంగా అభివృద్ధి చెంది, ఆచరణలో పెట్టబడి, భారత విప్లవోద్యమానికి తీరని వినాశనాన్ని తీసుకొచ్చింది. సి.పి.ఐ.(యం.యల్) యేర్పాటైన ఈ కాలంలోనే తీవ్రమైన అంతర్గత సైద్ధాంతిక పోరాటాలకు, సమస్యలకు, చీలికలకు గురైంది. సి.సి.ఐ. (యం.యల్)లోని ఒకవర్గం విప్లవ ప్రజా పంధావైపు మొగ్గుచూపింది. కాని అది కమ్యూనిస్టు విప్లవకారులకు వ్యతిరేకంగా అతివాద అవకాశవాద నాయకత్వం చేబట్టిన దాడులకు సహకరించింది. అదేకాలంలో యీ వర్గం అతివాద అవకాశావాద నాయకత్వం, పంథా, నిర్మాణ పద్ధతులలో విచ్ఛిన్నకరపాత్రను చూడగలిగింది.

కా॥ చారు మజుందార్ "వర్గశత్రు నిర్మూలనాయుద్ధం" అని పిలువబడే అత్యంత వినాంశకర, ఆత్మహత్యా సదృశ్యమైన మార్క్సిస్టు-లెనినిస్టు వ్యతిరేక విధానాన్ని ఆచరణలో పెట్టారు. ఆయన "వర్గశత్రువు నిర్మూలన వర్గ పోరాట యొక్క ఉన్నతరూపం. కాగా, గెరిల్లా చర్యల ద్వారా వర్గశత్రువులను నిర్మూలించే చర్యగెరిల్లా పోరాటం యొక్క ప్రాథమిక దశ "అని జనవరి 1970లో చెప్పారు. ఈ విధంగా వర్గపోరాటం గెరిల్లా పోరాటాల అవగాహన వక్రీకరించబడింది. గెరిల్లా పోరాటాలలో అవసరమైన చైతన్యస్థాయి, సన్నద్ధత శూన్యంకాగా యితర పోరాటరూపాలు, ప్రజాసంఘాల నిర్మాణం నిషేధించబడి అతివాద అవకాశవాదం పరాకాష్ట అయింది. వర్గపోరాటాలకు సంబంధంలేని "వర్గశత్రువు నిర్మూలనా పంధా, వర్గపోరాటపు ఉన్నత రూపంగా" ప్రతిపాదించబడింది. ఆచరణలో ఉత్సాహం, ధైర్యంకల కొంత మంది యువకులు కుట్రపూరిత, దుస్సాహసిక చర్యలు చేబటిట్టట తప్పమరొకటి కాదు. దీనికి పోరాట రూపాలతో, ప్రజల పాత్ర, విప్లవోద్యమాల ప్రయోజనాలతో ఎటువంటి సంబంధంలేదు. చారుమజుందార్ డిసెంబరు 1969లో

---

*1. హనుమంతురావు యం. (19) ఉగ్రవాదుల దివాళాకోరు రాజకీయాలు పే. 34.*

*2. భారత విప్లవ కారులలో అతివాద ధోరణి (1972) ఆ.ప్ర.క.వి.క పే. 8.*

*3.భారత విప్లవ కారులలో అతివాద ధోరణి (1972) ఆ.ప్ర.క.వి.క పే.11.*

"గ్రామీణ ప్రాంతాలలో భూస్వాముల వర్గాలను అంతంచేయడం ద్వారా గెరిల్లా యుద్ధాన్ని ప్రారంభించవచ్చు, ఒకసారి గెరిల్లా యోధులు వర్గశత్రువును నిర్మూలించే చర్యల నుండి ప్రక్కకు మళ్ళితే వారిలో రాజకీయ ప్రాముఖ్యత తగ్గిపోయి, గెరిల్లా దళాలు నైతికంగా పతనం చెందటానికి దారి తీస్తుంది" అని ప్రకటించారు. పార్టీ మహాసభ, సి.పి.ఐ(యం.యల్) మే 1970లో ఆమోదించిన నిర్మాణ నివేదిక "ఈ నిర్మూలనా యుద్ధం మనకెదురయ్యే సమస్యలన్నిటిని పరిష్కరిస్తుంది. పోరాటాన్ని ఉన్నత దశకు చేరుస్తుంది. నూతన మానవుని ఆవిర్భావానికి పరిస్థితులను సృష్టిస్తుంది" అని నిర్ధారించింది.

మహాసభలో నివేదికను ప్రవేశపెట్టుతు చారుమజుందార్ "వర్గశత్రువు నిర్మూలనా యుద్ధాన్ని వ్యతిరేకించు వారితో ఐక్యతను మేము తిరస్కరిస్తున్నాము" అని ప్రకటించారు. అంతేగాక "నిర్మూలనా యుద్ధాన్ని వ్యతిరేకించే వారెవరైనా మనతో వుండజాలరు. మన పార్టీలో అతను వుండటానికి అనుమతించము". అని హెచ్చరించారు ఈ పంథాను "వ్యతిరేకించే వారందరూ ప్రజలశత్రువులేనని" మహాసభలో ప్రకటించారు ఆవిధంగా, విప్లవకారుడా రివిజనిస్టాయని నిర్ణయించుటకు అతడు "నిర్మూలనా పంథాను అంగీకరిస్తున్నాడా, తిరస్కరిస్తున్నాడా అన్నిది ప్రధానమైన "గీటురాయి"గా చేయబడింది. క్రమశిక్షణగల సైనికుల వలె సి.పి.ఐ.(యం.యల్) కార్యకర్తలు చాలాకాలం యీ పంథాను అమలు పరచుటకు అనేకత్యాగాలు చేసారు.

"ఆచరణలో నిర్మూలనా పంథాకష్టాలకు, ప్రజలనుండి దూరమగుటకు దారితీసి, వినాశకర ఫలితాల నిచ్చింది. ప్రతిగా చారుమజుందార్ మరింతకుట్ర పూరిత పద్ధతులు టెక్నిక్స్‌ను, "గెరిల్లా దాడిపైకొన్ని సూచనలు" రూపొందించి, 1970లో ప్రజాకంతకులను, వ్యతిరేకులను నిర్మూలించడం కలకత్తాలో ప్రధాన పోరాట రూపంగా చేసారు. బెంగాల్‌లో 1971 ఎన్నికలలో కొన్ని ప్రాంతాలలో ఓట్లు వేసేవారూ, ఓట్లు కోరేఆవరు నిర్మూలించబడతారు" అన్న నినాదం యివ్వబడింది[1].

"మేము యింతకు ముందు చెప్పినట్లుగానే అతివాద అవకాశవాద నాయకత్వం ప్రారంభం నుండీ ఒంటెత్తు, చీలికవాద నిర్మాణపద్ధతులను చేబట్టింది. ఎ.ఐ.సి.సి.సి.ఆర్.లోపల బయటా విభేదిస్తున్న శక్తులకు యీ పద్ధతుల చేదుఫలాలను రుచిచూపించారు. ఈ నాయకత్వం వివిధ విప్లవ గ్రూపులమధ్యగల సంబంధాలను అకారణంగా శత్రుసంబంధాలుగ మార్చి వేసింది[2].

సి.పి.ఐ.(యం.యల్) స్థాపన 1969 ఏప్రిల్ సమావేశంలో పార్టీ నిర్మాణంపై ఆమోదించబడిన తీర్మానంలో కేంద్రీకృత ప్రజాస్వామ్యం, విమర్శన, ఆత్మవిమర్శలపై అవగాహనను స్పష్టం చేయుటయేగాక "పార్టీలో ఉక్కు క్రమశిక్షణకు మొదటి షరతు

---

*1. భారతవిప్లవోద్యమం కొన్ని గుణపాఠాలు. అనుభవాలు. యు.సి.సి.ఆర్.ఐ.(యం.యల్) మొదటి రెగ్యులర్ కాన్ఫరెన్స్ 1989లో ఆమోదించిన రాజకీయ, నిర్మాణ. ఉద్యమ సమీక్ష (1967-88) పే. 113-15*

*2. భారతవిప్లవోద్యమం కొన్ని గుణపాఠాలు. అనుభవాలు. యు.సి.సి.ఆర్.ఐ.(యం.యల్) మొదటి రెగ్యులర్ కాన్ఫరెన్స్ 1989లో ఆమోదించిన రాజకీయ. నిర్మాణ, ఉద్యమ సమీక్ష (1967-88) పే. 116*

ప్రజాస్వామ్య వాతావరణాన్ని సృష్టించి, కేంద్రమార్గదర్శికత్వంలో మాత్రమే, నిరంతరం క్రింది స్థాయి నిర్మాణంలోనూ, ప్రజల జీవితాలతోనూ సన్నిహిత సంబంధ కలిగి వుండుట ద్వారా మాత్రమే, బాగా ఆలోచించిన మీదట ధృఢమైన నిర్ణయం తీసుకొనుట ద్వారా మాత్రమే కేంద్రమారదర్శికత్వం క్రింద, ఆనిర్ణయాలను క్రిందియూనిట్లకు వెంటవెంటనే అమలు పరచే పద్ధతులను కనుగొనుటకు క్షుణ్ణంగా చర్చించుట, క్రింది యూనిట్లకు తోడ్పట ద్వారా మాత్రమే కేంద్ర మార్గదర్శికత్వం క్రింద ప్రజాస్వామ్యం అభివృద్ధి చేయగలం, నాయకత్వం యొక్క ఆధిపత్యాన్ని స్థాపించగలం" ఇంకా పార్టీని నిర్మించటమంటే అర్థం, మనలో ప్రబలంగా వున్న నిరంకుశ నాయకత్వ పద్ధతులను నాశనం చేయుట, గ్రూపులు ప్రబోధించే అన్యవర్గ భావవాద, అరాచకవాద, స్వతంత్రవాద భావనలను బహిర్గతం చేసి నిర్మూలించటం" చేయాలని స్పష్టం చేయబడింది.

ప్రజలతో పార్టీశ్రేణులలో సమగ్రచర్చలద్వారా నిర్ణయాలు తీసుకొనాలనీ, నిరంకుశ నాయకత్వ పద్ధతులకు వ్యతిరేకంగా యుద్ధం ప్రకటించాలని, వివిధ గ్రూపుల మధ్య సమన్వయం, భావసిద్ధాంత సమైక్యత చర్చలద్వారా పెంపొందించజాలక పోవుట యేగాక, మొత్తం పార్టీని పెడత్రోవ పట్టించి, నిరంకుశ నాయకత్వపద్ధతులనే అవలంభించిన, చీలికలకు, మరికొన్ని గ్రూపుల ఆవిర్భావానికి కారకులై, విచ్చిన్న కారులుగుతారు. మాతృపార్టీ నుండి వారసత్వంగా పొందిన అన్ని అవాంఛనీయ ధోరణులు కొనసాగించారు. ఇదే అత్యంతసోచనీయ చారిత్రికాంశంగా మిగిలింది.

"లిబరేషన్" పత్రిక 1970 ఫిబ్రవరీలో "విప్లవ పార్టీయొక్క అన్ని స్థాయిలోనూ కా॥ చారుమజూందార్ నాయకత్వ ఆధిపత్యాన్ని ధృఢంగా నెలకొల్పుటయే నేటి కర్తవ్యం" అని వ్రాసింది. అప్పటికి, విప్లవకారులు భారతదేశ నిర్దిష్ట పరిస్థితులకు మార్క్సిజం–లెనినిజం. మావో ఆలోచనా విధానం ప్రజాయుద్ధపంథాలను అన్వయించుటలో ప్రాథమిక దశలోనే వున్నారనుట వాస్తవం. విప్లవకారులు ఇంకా వివిధ నిర్మాణాలలో 'చీలిపోయి' ఉన్నారు. సి.పి.ఐ.(యం.యల్) ఒక పార్టీగా నిలబడుతున్నప్పతున్నప్పటికి, విప్లవకారులలో అదివొక భాగానికి మాత్రమే ప్రాతినిధ్యం వహించుతుంది. అనేక యితర విప్లవ గ్రూపులు చారుమజుందార్ ఆధిపత్యాన్ని అంగీకరించే పరిస్థితులు లేవు. సి.పి.ఐ. (యం–యల్)గూడ చారమంజుదార్ ఆధిపత్యాన్ని రుద్దాలనుకొన్న విధానాలకు వ్యతిరేకత గణనీయంగా ఉన్నదనుట వాస్తవం. ఆధిపత్య నినాదాన్ని యిచ్చేటప్పటికి, చారుమజుందార్ అతివాద అవకాశవాద ధోరణికి, ఒంటెత్తు చీలికవాద నిర్మాణ ఆచరణకు ప్రధాన ప్రతిపాదకుడుగా రంగం మీదకు వచ్చాడు. ఈ ధోరణి చేబట్టిన విప్లవశ్రేణులు, అతివాద దుస్సాహసికవాద పట్టాల పైకి ఎక్కారు. తక్షణ ఆవశ్యకత సరైన పంథా ప్రాతిపధికగా విప్లవకారులను ఐక్యంచేసే వ్యూహం, కార్యక్రమాలు, ఆచరణలు చేబట్టాలి. రైతాంగ వుద్యమాలను నిర్మించుటకు సమిష్టికృషి, సరైన నిర్మాణ సూత్రాలు, నాయకత్వపద్ధతులు, ఆచరణలోపెట్టుట ద్వారా సమర్థవంతమైన సమిష్టి, కేంద్రీకృత ప్రజాస్వామ్య ప్రాతిపదికపై పని చేయగల నాయకత్వం, నిరంకుశత్వాన్ని, ఆధిపత్యధోరణని విడనాడితే సాధ్యమౌతుంది[1].

---

*1. భారత విప్లవోద్యమము. కొన్నిగుణపాఠాలు, అనుభవాలు, యు.సి.సి. ఆర్.ఐ.(యం.యల్) మొదటి రెగ్యులర్ కాన్ఫరెన్స్, నివేదిక. జనశక్తి ప్రచురణల పే. 111–18.*

## సి.పి.ఐ.(యం.యల్)లో అంతర్గత సైద్ధాంతిక పోరాటం

ఆంధ్ర కమ్యూనిస్టు విప్లవకారులలో విప్లవ ప్రజాపంథా చేబట్టిన వారిని, అఖిల భారత సి.పి.ఐ.(యం.యల్) అతివాద అవకాశవాద నాయకత్వం "మధ్యేమార్గవాదం" అని పేరుపెట్టి, సి.పి.ఐ. (యం.యల్) 1970 మే లో జరిగిన మహాసభలో చారుమజుందార్, నాగిరెడ్డి తదితరులను మన ఆర్గనైజేషన్ నుండి గెంటివేసాము అన్నారు. "ఇప్పుడు మధ్యే మాదవాద దాడి పార్టీలోవల నుండే వస్తున్నది." అని ప్రకటించారు. అయినప్పటికి ఎ.ఐ.సి.సి.సి.ఆర్.సి.పి.ఐ.(యం-యల్)లో భిన్నాభిప్రాయాలు గలశక్తులున్నాయి. అతివాద అవకాశవాదపు నాయకత్వం వినియోగించిన ప్రక్కదారి పట్టించే, తప్పుదోవ పట్టించే ఎత్తుగడలకు, పద్ధతులకు వారు తాత్కాలికంగా ఎరయ్యారు. ఆచరణక్రమం అతివాద అవకాశవాద ధోరణి యొక్కవొంటెత్తువాద, నిరంకుశ, నిర్మాణ, ఆచరణలయొక్క వినాశకర స్వభావాన్ని క్రమేణా అర్థం చేసుకోవడంలో వారికి తోడ్పడింది.

హౌరాకు చెందిన సి.పి.ఐ.(యం.యల్)లోని కొంతమది కామ్రేడ్స్ జూన్ 1969లో సి.పి.ఐ.(యం.యల్) మహాసభ ఏప్రిల్ 1969లో ఆమోదించిన రాజకీయ తీర్మానంపై తమ విమర్శనను పంపించారు. ప్రజల చైతన్యానికి చెందిన అవాస్తవిక అతిశయోక్తులతో కూడిన అంచెనాను వారు ప్రశ్నించారు. ప్రధానవైరుధ్యం ప్యూడలిజానికి, భారత ప్రజలకు మధ్యన ఉందని పేర్కొన్నారు. "తిరుగు బోతుగెరిల్లాముఠాలు" పుట్టుకొచ్చే ప్రమాదం ఉందని వారు హెచ్చరించారు. ప్రజాసంఘాలకు ప్రజావుద్యమాలకు వ్యతిరేకమైన అభిప్రాయాలను వ్యతిరేకించారు. వీరు సి.పి.ఐ.(యం.యల్) నుండి తరువాత బహిష్కరించబడ్డారు.

సి.పి.ఐ.(యం.యల్) పార్టీ మహాసభ జరిగిన ఆరుమాసాలకే నవంబరు 1970లో కా.సుశితల్‌రాయ్ చౌదరి ఒక డాక్యుమెంటును "మన పార్టీలో తలెత్తిన పచ్చిదుస్సాహసిక ధోరణిని ప్రతిఘటించండి" అనే పేరుతో పార్టీ శ్రేణులలో సర్క్యులేషన్‌లో పెట్టారు. దాని పేరు "భారత విప్లవం యొక్క సమస్యలు సంక్షోభాలు". ఈ డాక్యుమెంటు సి.పి.ఐ.(యం-యల్)లో ఒక అతివాద అవకాశవాదానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో ప్రముఖస్థానమాక్రమిస్తుంది. ఈ విమర్శనలోని ముఖ్యాంశాలు యిలావున్నవి.

1. ప్రజల చైతన్యయుత పాత్రలేకుండా వర్గశత్రువులను భౌతికంగా, రహస్యకుట్ర పద్ధతులలో, గెరిల్లాదళ చర్యలలో నిర్మూలించుట సైద్ధాంతికంగా తప్పుడు విధానము. మార్క్సిజం, లెనినిజం ఆమోదించదు. రైతాంగ సాయుధ పోరాటానికి, స్థావరప్రాంతాలనిర్మాణానికి, వాటి అభివృద్ధి హానికరము.

2. ఆర్థిక, రాజకీయ పోరాటాలు వదలివేయుట పొరపాటు. ఆ పోరాటాల సర్వోన్నతరూపమే వర్గపోరాటం. గెరిల్లాపోరాటం. మౌలికంగావర్గ పోరాటాల అత్యున్నతరూపం. రైతాంగాన్ని సమీకరించకుండా, వారిని చైతన్యవంతులుగ చేయకుండా రైతులు రాజ్యాంగాన్ని కార్మికులతో కలిసి హస్తగతం చేసుకొనుట జరుగదు.

3. పట్టణ ప్రాంతాలలో ఆర్థిక, రాజకీయ పోరాటాలలో ప్రజలను సమీకరించక

పోవుట పొరపాటు. సాంస్కృతిక విప్లవం పేరిట విద్యాలయాలు, లైబ్రరీలు, ప్రయోగశాలలు ధ్వంసం చేయుటకు పిలుపునిచ్చుట పొరపాటు.

4. భారత విప్లవం సత్వరం విజయం సాధిస్తుందనే సిద్ధాంతం తప్పు.

5. ప్రజలకు విజయంపై అవసరమైనవిశ్వాసం కలిగించాలి. ఆ మార్గంలో గలమలుపులు, మెలికలు గూర్చికూడ చెప్పాలి. వాస్తవంకంటె, హెచ్చుగా, అతిశయోక్తులతో కూడిన నివేదికలు పంపిణీ చేయుట పెద్ద పొరపాటు అగుతుంది.

6. నగరాలలో "ఎర్రభయోత్పాతాన్ని సృష్టించ ప్రయత్నించుట, అత్యంత దుస్సాహసికవాదం తప్పమరొకటికాదు. "ఆత్మత్యాగాలయుగం"గా చెప్పుట శుష్కనినాదం.

7. "పార్టీని దాడుల పార్టీ"గా చెప్పుట, "పార్టీని టెర్రరిస్టు పార్టీదిగజార్చుట" తప్పమరొకటికాదు.

8. రాజకీయాలలో వలెనె నిర్మాణ విషయాలలో, పార్టీని, "చారుమజుందార్ పార్టీగా, ఒకేఒక యేకైక నాయకుడుగా, మావో ఆలోచనా విధానానికియేకైక వ్యాఖ్యాతగా పార్టీ శ్రేణులపైరుద్దటానికి ప్రయత్నించారు. కొందరు "ఇది చారుమజుందార్ పార్టీ, బేషరతుగా ఆయనను అనుసరించేవారు మాత్రమే పార్టీలోపల ఉండగలరు" అని ప్రకటించారు. ఇది పార్టీ "అతివాదపెడధోరణితో కూడిన నిరంకుశపెత్తనందారీ విధానం తప్పమరొకటి కాదు. పార్టీ విధానంపై ఎట్టి అసంతృప్తి, విమర్శనవ్యక్తం చేసినా "రివిజనిజం" లేదా "మధ్యేమార్గవాదం"గా ముద్రవేసి పార్టీనుండి తొలగించుట సాధారణమైంది. బీహారు రాష్ట్ర కమిటి విమర్శలను "నీచమైన పని"గా కొట్టిపారవేసారు. ఇది "అతివాదపెడ ధోరణిలో అంతర్లీనంగా అసహనానికి వొకగుర్తుగా వుంది.

సెప్టెంబరు 1970లో సి.పి.ఐ.(యం.యల్) బీహారు రాష్ట్రకమిటి "భారత విప్లవం యొక్క సమస్యలు–నయాట్రాట్స్కీవాద పెడధోరణులు" అన్న విమర్శనద్వారా తన విమర్శనను ప్రకటించింది. ఈ పత్రంలో చారుమజుందార్ యితర విషయాలతో పాటు, ధనికరైతులందరు, పెట్టుబడిదారులు, వర్తకులు శతృవులని వారిని నిర్మూలించాలనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించగా వ్యతిరేకించారు. అతి 1970–71 నాటికి పశ్చిమ బెంగాల్ అంతటా ప్రజావిముక్తి సైన్యం కదం త్రొక్కుతుందని, మూడవ ప్రపంచయుద్ధం ప్రారంభమైందని, అందరూ ఆత్మరక్షణా ఆలోచనలు వదలివేసి, శతృవులను నాశనం చేయాలని, కలకత్తాలో విశ్వవిద్యాలయాలు విధ్వంసన కార్యక్రమాన్ని సాంస్కృతిక విప్లవ మనుటను, అది సత్వర విజయానికి మార్గమనే దానిని వ్యతిరేకించింది. పంజాబ్, యు.పి.,పశ్చిమ బెంగాలులలో ఒక వర్గం, యీ విమర్శకులతో చేరారు. ప్రారంభంలో చారుమజుందార్ విధానాలను అనుసరించిన బీహారు, బెంగాల్ సరిహద్దు ప్రాంత కామ్రేడ్స్, ఆత్మవిమర్శనా అంతరంగిక పత్రంలో పార్టీకలాపాలను సమీక్షించి తమ వైఫల్యాలను అంగీకరించారు. ఈ ఘటనలు అతివాద అవకాశవాదులు బయట నుండి మాత్రమే గాక తమస్వంత శ్రేణుల నుండి, నాయకత్వంలోని కొన్ని శాఖలనుండి కూడ వ్యతిరేకతను

ఎదుర్కొన్నారనేది వాస్తవం, సరైన పంథాకోసం, నాయకత్వం కోసం సాగిన మొత్తం పోరాటంలో ఒక భాగమనేది స్పష్టమగుతుంది.

"భారత విప్లవ కమ్యూనిస్టులలో అతివాద అవకాశవాద ధోరణి" అనే సమస్యపై సమగ్రవిమర్శన 1970 సెప్టెంబరు అంతానికి ఆంధ్రకమ్యూనిస్టు విప్లవకారుల చేసి, ప్రకటించారు. అదిగత, వర్తమాన కమ్యూనిస్టు విప్లవోద్యమాల అనుభవాల వెలుగులో చేసిన ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు విప్లవకారుల తమ దృక్పథంలో చేసిన సమగ్ర సిద్ధాంతవిమర్శ సి.పి.ఐ (యం.యల్) గ్రూపులలో అత్యధికులు 1990 దశకం వచ్చునప్పటికి చాలా వరకు అదే విధమైన అవగాహన వచ్చాయి. ప్రధానాంశాలపై అవగాహనలు యిలా వున్నవి.

1) నేటి విప్లవదశలో ప్రధానవైరుధ్యం భూస్వామ్యానికి, వివిధ వర్గాల ప్రజాబాహుళ్యానికి మధ్యనున్నది. సి.పి.ఐ.(యం.యల్) చేసిన రాజకీయ తీర్మానం, ముసాయిదా కార్యక్రమం యే విధంగా తప్పో, వార్గివైఖరి, దృక్పథం వ్యవసాయ విప్లవాన్ని యెలా నీరు గార్చుతుందో విమర్శనాత్మకంగా విశ్లేషించింది. ప్రజల విప్లవ ప్రయోజనాలకనుగుణంగా యీ వైరుధ్యాన్ని పరిష్కరించుటకు వ్యవసాయ విప్లవం సాధనమని, దాని ఆవశ్యకత, ప్రాముఖ్యత సుస్పష్టం చేసారు. తదనంతర కాలంలో యు.సి.సి.ఆర్.ఐ.(యం.యల్) జనశక్తివర్గం, పై విమర్శనా పత్రంలో అక్కడక్కడ, ప్రధానవైరుధ్యం విశాల ప్రధాన బాహుళ్యానికి భూస్వామ్య బడాబూర్జువా వర్గాలకు మధ్యగలదనుటలో కొంత "అస్పష్టత" చోటు చేసుకొన్నదని ఎత్తిచూపుట జరిగింది.

2) దేశంలో విప్లవపరిస్థితి వుందని స్పష్టంగా చెప్పినప్పటికి ఆర్థిక, రాజకీయ పరిస్థితులలోను, విప్లవోద్యమ పరిస్థితి, అభివృద్ధిలోను అసమానతలున్నాయని, పేర్కొంది. ఆంధ్రప్రదేశ్ విప్లవకమ్యూనిస్టులలోని ఒకవర్గమైన జనశక్తివర్గం 1990 దశకంలో, విప్లవ పరిస్థితిని విప్లవోద్యమంతో గందరగోళపరచి, భారతదేశంలో అర్ధసైజు చెయ్యాల్సిన అవసరంలేదని అతివాద అవకాశవాదులు చేసిన వాదనను అది విమర్శించింది.

3) ఆర్థిక వాదాన్ని, ఆర్థిక పోరాటాలతో సమానంచేసి గందరగోళపరచిన అఖిల భారత అతివాద అవకాశవాదుల వైఖరిని, ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు విప్లకారులు సమగ్ర విమర్శన త్రోసిపుచ్చింది. ఆచరణకు మార్గదర్శకత్వం యిస్తున్నదృక్పథం ముఖ్యం. ప్రజలను ఆర్థిక, రాజకీయ పోరాటాలద్వారా నిర్మాణంలో సమీకరించాలి. విప్లవరాజకీయాల ప్రచారంతోను, పోరాటాలను ఉన్నతస్థాయికి అభివృద్ధి చేసే దృక్పథంతోను మిళితంచేసి నడిపించాలి. భూమి సమస్యను కేవలం ఆర్థిక సమస్యగా పరిగణించు వైఖరిని సాయుధ పోరాటానికి పోటీపెట్టి, వాటి మధ్య వైరుధ్యాన్ని చూపేవైఖరిని అది తిరస్కరించింది. వ్యవసాయ విప్లవ కార్యక్రమంలో భూమి పంపకం కేంద్రస్థానం ఆక్రమిస్తుందని స్పష్టం చేసింది. ఈ వ్యవసాయ విప్లవాన్ని పూర్తిచేయుటకు సాయుధ పోరాటమే ప్రధానపోరాట రూపం. అంచేతనే, వ్యవసాయ విప్లవం సాయుధ పోరాటం పరస్పరం సంబంధం కలిపి, సి.పి.ఐ. (యం.యల్) వాదనలన్నీ ప్రజలను విప్లవోద్యమాలలో సమీకరించుటలో ఆసక్తిలేక పోవుటను, వారిని చైతన్యవంతులను చేయుటలోని అనాసక్తితను స్పష్టం చేస్తుందని విమర్శించింది.

4) భారతదేశ నిర్ధిష్టలక్షణాలను విముక్తికి పూర్వపు చైనాతో పోల్చుతూ సానుకూల, అననుకూల పరిస్థితులు, తత్ఫలితంగా చేబట్టవలసిన ప్రత్యేకతలను స్పష్టం చేసింది. అననుకూలతను అధిగమించి భారతవిప్లవాన్ని విజయవంతంగా నడపాలంటె, విప్లవోద్యమపు, సాయుధ పోరాటాభివృద్ధి క్రమంపై స్పష్టమైన, నిర్ధిష్టమైన అవగాహన అవసరాన్ని నొక్కి చెప్పింది.

విప్లవోద్యమాలకు విప్లవరైతాంగ ఉద్యమం కేంద్రకావాలని, ఆ ప్రాతిపదికపైనే అన్ని ఉద్యమాలు వ్యవసాయ విప్లవాద్యమాన్ని సహాయ, దోహదకార్యులవ్వాలి. రైతాంగ విప్లవానికి ఒకే ఒక ఎత్తుగడ "గెరిల్లాయుద్ధం" అనిచెప్పుట, పోరాట రూపాలు ఎత్తుగడటమై ప్రాథమిక అవగాహన కూడ లేకపోవటాన్ని తెలుపుతుంది.

చైనా అనుభవాలు, మావోయిజం, తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటం యిటీవల రైతాంగ పోరాటాల అనుభవాలు, పోరాట రూపాలను చర్చించి, సాయుధ పోరాటం వర్గపోరాటపు అత్యున్నత రూపమని, ప్రజలచైన్యం, ప్రజోధ్యమాల అసమానాభివృద్ధి దృష్ట్యా, యితర పోరాటరూపాలను కూడ అనుసరించి, వాటిని ఉన్నత పోరాటరూపంతో సమన్వయం పరచాలని స్పష్టం చేసింది.

"నిర్మూలనా పంధా"ను సమర్ధించే వివిధ సూత్రీకరణలను విమర్శించి, విశ్లేషించి, అది మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనా విధానాలకు వ్యతిరేకమైన పంధా, చైనా, తెలంగాణా, ఇటీవల విప్లవానుభవాలను నిరాకరించే పంధాగా త్రోసి బుచ్చింది. సాయుధ పోరాటపు ఏదశలో కూడ, మొత్తం వర్గశతృవులను భౌతికంగా నిర్మూలించడం సాయుధ పోరాట కార్యక్రమంకాదు.

"సాయుధ పోరాటపు స్వభావంలోనే "అఫెన్సివ్" లేక "దాడి" చొరవలక్షణం వుందని, అయినా ప్రజావిప్లవశక్తులు బలహీనంగా వుండి, దీర్ఘకాలం పోరాటంతోపాటు రక్షణస్వభావం కలిగి వుండటవాస్తవం. ప్రజలు ఆత్మరక్షణ, విప్లవ ఫలితాల రక్షణకు గెరిల్లాప్రాంతాల, స్థావరాల దక్షణకు దీర్ఘకాల సాయుధ పోరాటాన్ని సాగించవలసి ఉంటుంది. పోరాటానికి జాతీయ ప్రజాతంత్రశక్తులన్నిటి విస్తృత మద్దతు, సంఘీభావాన్ని కూడగట్టుకొనేందుకు రక్షణనినాదాన్ని చేబట్టవలసి వుంది. ఈ అంశాన్ని అతివాద, అవకాశవాద నాయకత్వం మరచిపోయింది.

5) భారతదేశంలో మావో ఆలోచనా విధానం నక్సల్బరీలోగాక మొట్టమొదట ప్రజాయుద్ధ పందాగా తెలంగాణా సాయుధరైతాంగ పోరాటంలో అన్వయించబడిందని, ఆంధ్రా కమిటి 1949 నాటికే ప్రజాయుద్ధ అవగాహనను భారత విప్లవ పంధాతో సమ్మేళనం చేసి ప్రతిపాదించింది.

6) జాతుల పోరాట సమస్యపై అతివాద అవకాశవాద వైఖరిని తిరస్కరించుటయేగాక, కమ్యూనిస్టులు జాతుల పోరాటాలను నడుపరాదని, కాని వాటిలో ఐక్యం కావచ్చు అని స్పష్టం చేయబడింది. "జాతులస్వయం నిర్ణయాధికారాన్ని హక్కుగా గుర్తించాలని, లేనిచో అది వర్గ పోరాటాలనే విచ్ఛిన్నం చేస్తుందని" చారుజుందార్ 1968 సెప్టెంబరులో వ్రాసారు. మావోచెప్పనట్లు ప్రతిజాతీయ పోరాటమూ దాని అంత్యదశలో వర్గపోరాటంగా

మారుతుంది. ప్రత్యేక తెలంగాణా ఆందోళన (1968) పట్ల అతివాద అవకాశవాదుల వైఖరిని అది విమర్శించింది. పాలక వర్గాలలోని ఒక భాగం తమ అధికార పోరాట జూదంగా, నడిపిన ఆందోళన అది. అతివాద అవకాశవాదులు, సాయుధ తెలంగాణ పోరాట రాజకీయ నినాదమైన "విశాలాంధ్ర లో ప్రజారాజ్యం" అన్నప్రజానినాదాన్ని వక్రీకరించి "తెలంగాణాలో ప్రజారాజ్యం" అన్న అతివాద అవకాశవాద నినాదాన్ని లేవనెత్తి, పాలకవర్గాలలోని ఒకభాగపుతోకపట్టు కొనినడచారు. తెలంగాణా సాయుధరైతాంగ పోరాటంతో ప్రత్యేక తెలంగాణా పోరాటాన్ని ముడిపెడుతూ, దానికి విప్లవస్వభావాన్ని ఆపాదించుతు, దాని అభివృద్ధి నిరోధక వ్యూదలు స్వభావంపై "పరదా" వేసి ప్రజలతప్పు త్రోవపట్టించి, తెలుగు జాతిని మరోసారి చీల్చేప్రయత్నం చేసారు. ఆంగ్ల సామ్రాజ్యవాదానికి అడుగులు మడుగులు ఒత్తుతూ, నాడు నిరంకుశ నిజాం ప్రభువులు తెలుగు జాతిని చీల్చిన విధంగానే చేయప్రయత్నించారు. ప్రజాశక్తి చొరవతో త్రిప్పికొట్టగలిగింది.

7) "చైనాచైర్మెన్ మన చైర్మెన్" అన్ననినాదానికి "కార్మికవర్గ అంతర్జాతీయ ఐక్యత-లేక-ప్రపంచకార్మికులారా యేకంకండి" అన్ననినాద భావనకు, ఆచరణలో ఎట్టి సంభంధం లేదని, అది అతివాద అవకాశవాద వక్రీకరణలకు పరాకాష్టయని తీవ్రంగా విమర్శించారు.

8) విప్లవ ప్రజోధ్యమాలను ఐక్యపరచి, నాయకత్వం వహించడం అన్న ప్రధాన కర్తవ్యనిర్వహణలో అతివాద అవకాశవాదం విఫలమై, విచ్ఛిన్నత వైపు పయనించింది.[1]

## సాహసిక అతివాదంపై సి.పి.ఐ.(యం) సైద్ధాంతిక పోరాటం

సి.పి.ఐ.(యం) కేంద్రకమిటి ఏప్రిల్ 1967 సమావేశంలో పార్టీ పంథాను వివరించే తీర్మానం చేసింది. ఈ కాలంలోనే "అతివాద సాహసికవాదులు" రాజకీయ పంథా కార్యక్రమముపై తమదాడి ప్రారంభించారు. ఇది పశ్చిమబెంగాలులో చైనామద్దతుతో శక్తివంతమైనదై, త్వరితంగా "అతావాద బాల్యారిష్టంగా" వ్యాపించింది. సి.పి.ఐ.(యం)ను ప్రక్కదారి పట్టించే, ప్రమాదంగా పరిణమించింది.

ఈ "అతివాద సాహసికవాదుల" సైద్ధాంతిక, రాజకీయ అవగాహనలను సి.పి.ఐ.(యం) కేంద్రకమిటి ఏప్రిల్ 1968లో పరిశీలించింది. దీనితోపాటు పొలిట్‌బ్యురో సైద్ధాంతిక చర్చావేదికను సమీక్షించి "ఆంధ్ర కామ్రేడ్స్‌కు బహిరంగ లేఖ"ను రూపొందించి, "ఆంధ్రలో అతివాదుల చీలిక" అన్నపత్రంతో పాటు విడుగల చేసింది.

సాహసిక అతివాద పార్టీకి, విప్లవోద్యమానికి తీవ్రప్రమాదకర శక్తిగానే వుంది. సి.పి.ఐ.(యం) దృష్టిలో, దాని సైద్ధాంతిక అవగాహనల ఆశాస్త్రీయతను మార్క్సిస్టు, లెనినిస్టు, మావో ఆలోచనా విధానవ్యతిరేకతను బట్టబయలు చేయబడినా, అదివోడింపబడినదనుకొనుట పొరపాటు అగుతుంది. ఈ ప్రమాదాన్ని వ్యతిరేకించి ధృఢంగా పోరాడుటకు సి.పి.ఐ.(యం) తన ఆయుధాలకు పదను పెట్టుట అవసరంగా నెంచింది.

మొదటగా, "సాహసిక అతివాద అవకాశవాద వైఖరి సి.పి.ఐ.(యం)లో మే-జూన్

*1. భారత విప్లవోద్యమం కొన్ని గుణపాఠాలు. అనుభవాలు (1990) యు.సి.సి.ఆర్.ఐ. (యం.యల్) కాన్ఫరెన్స్. ఏప్రిల్ 1969. రాజకీయ, నిర్మాణ, ఉద్యమసమీక్ష (1967-88) పే. 130.*

1967లలో బయటపడింది. పార్టీకార్యక్రమానికి మౌనంగా అంగీకారం తెలుపుతూ, రాజకీయ పంధాలోని కొన్ని ప్రత్యేకాంశాలలో భేధాభిప్రాయాలను వెలిబుచ్చింది. ఎత్తుగడల పంధాలోని కొన్ని అంశాలతో పూర్తి అంగీకారాన్ని తెలుపజాలనన్నది. ఈ భేదాభిప్రాయాలు మొదట బెంగాలులో వెలుగులోనికి వచ్చి, క్రమేణాదేశమంతటా వ్యాపించాయి. కేంద్రకమిటి ఏప్రిల్ 1967 సమావేశానంతరం, పార్టీ 7వ, కాంగ్రెసు సమీక్షానివేదిక నూతన పరిస్థితి, కర్తవ్యాలను రూపొందించినపుడు, కేంద్ర, రాష్ట్ర కమిటీలలో యేవొక్కరూ అభిప్రాయ భేదాలను, అనంగీకారాన్ని తెలుపలేదు, పైగా స్వాగతం పలికారు. మే-జూన్ 1968లో పశ్చిమ బెంగాల్‌లో బహిర్గతమైన "అతివాద బాల్యారిష్టం" జనవరి-ఫిబ్రవరి 1969లకు బ్రద్దలయ్యే దశకు చేరింది. చైనా కమ్యూనిస్టుపార్టీ పత్రికలు, రేడియో సి.పి.ఐ.(యం) పార్టీపంధా, నిర్మాణంపై నేరుగా, బహిరంగ దాడి చేయుటతో "అతివాద సాహసిక అవకాశవాదాలకు ప్రధానప్రోత్సాహం, రాజకీయధైర్యం, పార్టీ విధానాలను, పంధాను ప్రశ్నించే ధైర్యంవచ్చింది. ఈ విషయాన్ని సి.పి.ఐ.(యం) తీవ్రంగా పరగణించి, పాఠాలు తీసుకొని, తగిన చర్యలు చేపట్టింది.

ద్వితీయాంశంగా, ప్రస్తుత "అతివాద సాహసిక అవకాశాద వక్రీకరణ లేక పెడమార్గం, వొక్క జాతీయ లక్షణమేగాక అంతర్జాతీయ లక్షణంగా, నూతన అతివాదం, మార్క్సిస్, డిబ్రేల అతివాద సాహసికవాదాల భారతీయ రూపమే నక్సలిజంగా నెంచాలి. ఈ విషయం "నక్సల్బరీ పర్వం"లో అధ్యయనం చేసినందున, వివరంగా ప్రస్తావించుటలేదు.

తృతీయాంశంగా, అతివాదసాహసిక అవకాశవాదులు సి.పి.ఐ.(యం)తో విప్లవపంధాపై వాద ప్రతివాదనలకు బర్ద్వాన్ ప్లీనంకు ముందూ తరువాత మరింత తీవ్రంగా దూషణలకు దిగారు. వారిపై మోపబడిన ప్రతి ఆరోపణ, సోవియట్ యూనియన్‌ను సోషలు సామ్రాజ్యవాద శక్తిగా చెప్పుటు, ప్రపంచ శక్తుల బలాబలాలు, స్నేహసహకార కూటముల అంచెనాలు, ప్రపంచసోషలిస్టు వ్యవస్థ అప్పటికే అంతమైందనుట, సాయుధ పోరాటం ఒక్కటే ఆచరణీయ నినాదంగాయిచ్చుట అన్నీ నిరూపితమయ్యాయి[1].

ఈ అతివాద సాహసిక దృక్పధం, ప్రధానంగా పెటీబూర్జువా యువజన, విద్యార్థులను, నిరుద్యోగులను ఆకర్షించుటయేగాక, అప్పటికే సాయుధ పోరాటాలు సాగించుచున్న దేశాలలో స్పందన ప్రతిస్పందనలు తీవ్రరూపంలోనే కనపడనవి. మితవాద అవకాశవాదాన్ని కమ్యూనిస్టు వుద్యమ విచ్ఛిన్నానికి వినియోగించుకొనే బూర్జువా పాలకవర్గాలు సాహసికవాదాన్ని సమర్థవంతంగా వినియోగించు కొనుటలో సందేహంలేదు. అదే చరిత్ర మనకు నేర్పేవాస్తవం, చారిత్రిక అనుభవాల విశ్లేషణ యీ సత్యాన్నేరుజువు చేస్తుంది.

అతివాదసాహసికవాదాన్ని విచ్ఛిన్నకర చీలికల దృక్పధాన్నుండే అంచెనా వేయక, పార్టీకి అదికలిగించగల ప్రమాధాన్ని సమగ్రంగా అధ్యయనం చేయాలి. మన విప్లవోద్యమంలో కలుగజేసే సంక్షోభం, దానికి పెటీబూర్జువా యువజనులు ఎరకాకుండా చూడాలి.

ప్రపంచ సోషలిజాన్ని, సామ్రాజ్యవాదాన్ని అతివాద సాహసిక అవకాశవాదం 'ఒకేగాటను' గట్టుటను సి.పి.ఐ.(యం) తీవ్రంగా విమర్శించి ఎండగట్టింది.

---

1. *పొలిటికల్ ఆర్గనైజేషనల్ రిపోర్టు సి.సి. 8వ, సి.పి.ఐ.(యం) కాంగ్రెసు, సి.పి.ఐ.(యం) ప్రచురణ. పే. 153-4.*

అదేకాలంలో దేశీయ, అంతర్జాతీయ మితవాద సంస్కరణవాదంపై కూడ ద్విముఖ సైద్ధాంతిక పోరాటం నిరవధికంగా సాగించింది. వీటి ఫలితంగానే భారత విప్లవపంథా రూపొందుతుందని విశ్వశిన్నున్నది. ఈ ద్విముఖపోరాటం యేమేరకు విజయవంతమగుతుందో ఆమేరకు భారత కమ్యూనిస్టు ఉద్యమం విజయవంతమౌతుంది.

**సి.పి.ఐ.సంస్కరణ వాదంపై సి.పి.ఐ.(యం), సి.పి.ఐ. (యం.యల్) ల సైద్ధాంతిక పోరాటము.**

ఐక్య సి.పి.ఐ.లోని "మితవాద సంస్కరణ వాదా"నికి వ్యతిరేకంగా 1964 చీలికవరకు సైద్ధాంతిక పోరాటం సాగించి, చీలిపోయి సి.పి.ఐ.(యం)గా యేర్పడిన అతివాద వర్గాలు సమిష్టిగా 1969 వరకు మితవాద సంస్కరణ వాదంపై జరిపిన సైద్ధాంతిక పోరాటాన్ని ఆయా సందర్భాలలో అధ్యయనం చేసాము. ఇప్పుడు విడిపోయిన సి.పి.ఐ.(యం), సి.పి.ఐ.(యం.యల్)లు రెండూ మాతృసంస్థయైన సి.పి.ఐ.పై జరిపిన సైద్ధాంతిక బహిరంగ పోరాటాని చూద్దాము.

**ప్రభుత్వ వర్గ పొందిక**

సి.పి.ఐ. 1964 మధ్యలో చిత్తుకార్యక్రమాన్ని ప్రచురించింది. "జాతీయ బూర్జువా వర్గం మొత్తపు పాలక వర్గపు పాలనా యంత్రాంగంగా ప్రభుత్వ వర్గ పొందికను నిర్వచించింది. ప్రభుత్వం ఆర్థిక, ద్రవ్య మారక ఉత్పత్తి, పంపక విధానాలలో పెట్టుబడి దారి విధాన సంబంధాలను పెంపొందించుచున్నది. ప్రభుత్వనిర్మాణం, అధికారనిర్వహణలో బడాబూర్జువావర్గం గణనీయమైన, పాత్రను కలిగియున్నది." "జాతీయబూర్జువా వర్గం ప్రభుత్వ నిర్మాణంలో ముఖ్యంగా రాష్ట్రాలస్థాయిలో భూస్వాములతో రాజీపడుతు, రైతాంగానికి నష్టదాయకమైన రాయితీలను యిస్తున్నది." అంతర్గత చర్చల అనంతరం సి.పి.ఐ. నిర్వచనంలోని మొదటిరెండు భాగాలను అలాగేవుంచి, మూడువ భాగంలో చిన్నసవరణను ఆమోదించింది.

అది : "జాతీయ బూర్జువావర్గం భూస్వాములతో రాజీపడి, మంత్రివర్గాలలోనికి, పాలనా యంత్రాంగంలోనికి ముఖ్యంగా రాష్ట్ర ప్రభుత్వస్థాయిలో తీసుకొంటున్నది. అది భూసంస్కరణల చట్టాల ఆమోదానికి, అమలుచేయుటకు పెద్ద ఆటంకంగా తయారైనది. రైతాంగానికి వ్యతిరేకంగా మరికొన్ని రాయితీలను పొందుటకు అవకాశాలను కలుగజేస్తుంది. మూడు సంవత్సరాల అనుభవంతో తమమార్క్సిస్టు శాస్త్ర విజ్ఞానాన్ని మరింత పెంచుకొని. చివరి రెండు మూడు ముఖ్యవ్యాఖ్యలను సవరించి, నిర్వచనానికి యీ క్రింది నూతన రూపంయిచ్చారు.

"భారతదేశంలో ప్రభుత్వం, జాతీయ బూర్జువావర్గపు మొత్తపు వర్గపాలనా యంత్రాంగము. దానిలో బడాబూర్జువావర్గం శక్తివంతమైన ప్రభావాన్ని కలిగివుంది. ఈ అంశాలు రాజ్యాంగయంత్రంపై అభివృద్ధి నిరోధక ప్రభావాన్ని కలుగజేస్తున్నవి."

"గతంలో జాతీయ బూర్జువావర్గంతో రాజీపడిందని, మంత్రి వర్గాలలోనికి ప్రభుత్వ యంత్రాంగంలోనికి ముఖ్యంగా రాష్ట్ర ప్రభుత్వస్థాయిలో తీసుకొంటుందని" చెప్పి, నేడు "వర్గపాలనలో భూస్వామ్య వర్గాలు శక్తివంతమైన సంబంధాలను కలిగి ఉందనే నూతనాంశాన్ని చేర్చారు.

ఈ విధంగా రెండుసారులు సవరించబడిన ప్రభుత్వ నిర్వచనం, కార్యక్రమాలపై, ప్రభుత్వ నిర్వహణలో నూతనత్వాన్ని యీ క్రింది ఉదహరింపులు వెలుగుకుతెస్తాయి. "జులై 1964 నుండి మూడున్నరసంవత్సరాలలో బడాబూర్జువా వర్గం గణనీయమైన ప్రభావాన్ని కలిగి ఉందన్నారు. నేడుభారత ప్రభుత్వంలో బడాబూర్జువా వర్గం శక్తివంతమైన ప్రభావాన్ని కలిగి ఉందని సవరణ ఆమోదించారు.

ఈ అంశాల మొత్తపు సమగ్రస్వరూపమేమిటి ? "రాజ్యాంగయంత్రంపై యీ అంశాలన్నీ అభివృద్ధి నిరోధక ప్రభావాలను కలుగజేస్తున్నవి. ఈ "సంస్కరణవాద విప్లవకారులు" జాతీయ ప్రజాస్వామ్యవిప్లవాన్ని పరిపూర్తి చేయుటకు యేమిచేయతలపెట్టారు ? ఈ అంశాలుపైకి వచ్చుటకు కారణభూతమైన, రాజ్యాంగయంత్రంపై అభివృద్ధి నిరోధప్రభావాన్ని కలిగియుండుటను రూపుమాపాలి. అభివృద్ధి నిరోధక ప్రభావాన్నుండి రాజ్యాంగ యంత్రాన్ని విముక్తిచేసి, మరోసారి "విప్లవ పురోగమ పంథాలో" పెట్టాలి.

"సి.పి.ఐ.(యం), ఏవర్గం లేక ఏయే వర్గాలు రాజ్యాధికారం కలిగివున్నవో, యేవర్గం నాయకత్వం వహించుచున్నదనే ప్రశ్నకు నేరుగా సమాధానం యివ్వగలదా ? భారత బూర్జువావర్గం మొత్తంగా రాజ్యాధికారాన్ని కలిగివుంది. ఏ వర్గం నాయకత్వం వహించుచున్నదనే ప్రశ్నకు సి.పి.ఐ. బూర్జువా వర్గం మొత్తంగా నాయకత్వం వహించుతున్నదని అంటుంది.

"సి.పి.ఐ. చెప్పే" జాతీయ ప్రజాస్వామ్య విప్లవం అంటే అర్థం యేమిటి ? రాజాధికారంగల యేవర్గం లేక వర్గాలకు వ్యతిరేకంగా విప్లవ పోరాటాల కేంద్రీకరించబడాలి? రాజ్యాధికారం బూర్జువావర్గం మొత్తంగా కలిగియున్నట్లయితే విప్లవ లక్ష్యం దాడికేంద్రీకరణ మొత్తం బూర్జువావర్గంపై వుంటుంది. అంటే గుత్త, గుత్తేతర పెట్టుబడిదారి బూర్జువా వర్గాలు, వ్యవసాయ ధనిక భూస్వామివర్గం, ప్యూడలు భూస్వామి వర్గాలు శతృవర్గాలు, వీరిపైనే కార్మిక, కర్షక, నగర, గ్రామీణ బడుగువర్గాలు పోరాడవలసి వుంటుంది. అలా అయితే అది నూటికి నూరు పాళ్ళు కార్మిక వర్గ సోషలిస్టు విప్లవ మగుతుంది, అత్యున్నత అంత్యపోరాట రూపము. ఇది వారి అవగాహనలకు దూరంగా వుంది. రాజ్యాధికారం బడాబూర్జువార్గం, బడాభూస్వామ్యవర్గం నాయకత్వం వహించుటను అంగీకరించలేకుండా వుండారు. ఇచ్ఛాపూర్వకంగా చేబట్టిన వర్గసామరస్య అవగాహనల నిర్ధిష్ట, నిర్ధారణల వలన యేర్పడింది. రాజ్యాధికారాన్ని బలపరచే విధానాల నుండి రూపొందినది. అంచేతవారు బడాబూర్జువావర్గం, బడాభూస్వామ్యవర్గాల చేతులలో గాక ప్రజల ప్రజాస్వామ్యం చేతులలో రాజ్యాధికారం వుందంటారు, బడాబూర్జువా ప్రభావంలో ఉందని వివరించుతారు[1].

సి.పి.ఐ. ప్రభుత్వ వర్గపొందికను నిర్వచించునపుడు ఎక్కడా సామ్రాజ్యవాదంతో పొత్తునెరపుతున్నారని వుదహరించలేదు. సి.పి.ఐ.(యం) తన నిర్వచనంలో సామ్రాజ్యవాదంతో పొత్తుసంబంధాలను మరింతగా పెంపొందించుకొంటున్న బడాబూర్జువావర్గం నాయకత్వంలో ప్రభుత్వం ఉందని స్పష్టం చేసింది. "సంస్కరణవాదులు" యీ విషయమై పెదవివిప్పరు. బూర్జువా, భూస్వామ్యప్రభుత్వంతో సహకారాన్ని

1. *పొలిటికల్ ఆర్గనైజేషనల్ రిపోర్టు, సెంట్రల్ కమిటి టు 8వ, కాంగ్రెసు ఆఫ్ సి.పి.ఐ.(మార్క్సిస్టు) పే. 137-38.*

పెంపొందించుకొనుటకు ప్రయత్నిస్తున్నారు. అంతేగాక, ప్రభుత్వవిదేశాంగ విధానాన్ని ప్రణాళికా విధానాలను అవకాశవాదం చేబట్టి ప్రస్తుతించుచున్నారు.

ఫ్యూడలిజం, సామ్రాజ్యవాద శక్తులు, భారతగుత్తపెట్టుబడి దారి వర్గాలుగాని రాజ్యాధికారంలో లేనపుడు, జాతీయ ప్రజాస్వామ్య విప్లవం సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడలువ్యతిరేక, గుత్తపెట్టుబడి వర్గాల వ్యతిరేకం అని చెప్పుట హాస్యాస్పదం అగుతుంది. అదే విధంగా, సంస్కరణ వాదులు విప్లవ ప్రతీఘాతక ప్రభుత్వం అంటూ చేసే వర్గవిశ్లేషణ, విప్లవలక్ష్యం వరకు విస్తరించుతుంది. అధికార నాయకత్వం ఎవరి చేతులలో ఉన్నదనే విషయంలో వలెనే విప్లవ ప్రతీఘాతక శక్తుల వర్గపొందికను నిర్వహించుటను, వాయిదా వేయుటగాని, అస్పష్టంగా చేయుటగాని చేస్తున్నారు. అదే విధంగా విప్లవంలో ఎవరు, ఏ వర్గంవారు నాయకత్వం వహించాలన్నిది దాటవేస్తున్నారు. నేటి పరిస్థితులలో కార్మికవర్గ యేకైక నాయకత్వంలో జరగాలని, అప్పుడే విప్లవాలు వాటిలక్ష్యాన్ని చేరగలవని, మరేయితరవర్గం లేక వర్గాలు నాయకత్వం వహించినా విప్లవం విజయాన్ని సాధించదని స్పష్టం చేయరని, సి.పి.ఐ.(యం) తీవ్రంగా సి.పి.ఐ. అవగాహనలను, అస్పష్టతను విమర్శించింది.

జాతీయ ప్రజాస్వామ్య విప్లవంలో వర్గసహకార పొందికను సంస్కరణవాద సి.పి.ఐ. కార్యక్రమం "వర్గసహకార పొందిక"లో నాయకత్వం కార్మికవర్గయేకైక నాయకత్వం క్రింద యింకా ఏర్పడదు, బూర్జువావర్గయేకైక నాయకత్వం ఇంకా యేమాత్రం ఉండదు, అని పేర్కొన్నది. మూడు సంవత్సరాల అనుభవంతో యీ క్రింది సవరణకు చేర్చి, వివరించామంటున్నారు.

"ఈ ఐక్యసంఘటనలోని నాయకత్వం, సామ్రాజ్యవాద, గుత్తపెట్టుబడిదారి, ఫ్యూడలు వ్యతిరేక ధృడతర శక్తులకు చెంది ఉంటుంది," అని గందరగోళాన్ని మరింతగా పెంచారు. కార్మికవర్గ నాయకత్వమనే మార్క్సిస్టు లెనినిస్టు అవగాహనను యీ క్రింది మాటలలో త్రోసిబుచ్చారు.

"ప్రభుత్వాధికారానికి నాయకత్వం వహించే దెవరు? "బూర్జువావర్గం మొత్తంగా" అని మన "సంస్కరణవాదులు సమాధానం చెబుతారు. బడాబూర్జువా వర్గం దానిలో నాయకత్వం వహించుతుందని విమర్శించే సి.పి.ఐ.(యం)తో మేము ఏకీభవించం అని అంటున్నారు."

"భారత విప్లవానికి నాయకత్వం వహించే దెవరు ? విప్లవ ఐక్యసంఘటనలో మొత్తంగా, ధృఢంగా నిలబడే అన్నివర్గాలు అందులో వుంటావి. కార్మికవర్గ నాయకత్వం మాత్రమే ఉండాలనే సి.పి.ఐ(యం)తో మేము అంగీకరించమని "మితవాద" కమ్యూనిస్టులు సమాధానమిస్తున్నారు." అని సి.పి.ఐ.(యం) తీవ్రంగా విమర్శించి మార్క్సిజాన్ని లెనినిజాన్ని యిది విడనాడుటయే అగుతుందని పేర్కొన్నది.

## సి.పి.ఐ. రాజకీయ ఎత్తుగడల పంధావైఫల్యం

వర్గవిశ్లేషణ ఫలితంగా రూపొందే రాజకీయ ఎత్తుగడల పంధా, ప్రభుత్వ వర్గ విశ్లేషణతో

అనుసరించే అవకాశవాద సైద్ధాంతిక అవగాహనల తీరు అర్థం చేసుకొనుట కష్టం కాదు. సి.పి.ఐ. తన బాంబే కార్యక్రమానికి ఆమోదించిన రెండు, మూడు సవరణలు పరిశీలించిన, 7వ పార్టీ కాంగ్రెసులోవారు ఆమోదించిన రాజకీయ ఎత్తుగడలు, విధానాలు, పంథావైఫల్యం స్పష్టం అగుతుంది.

సి.పి.ఐ. బాంబే కార్యక్రమంలో "జాతీయబూర్జువా వర్గానికి ప్రాతినిధ్యం వహించే నేటి ప్రభుత్వం పెట్టుబడిదారి అభివృద్ధి పంథాలో స్వతంత్ర జాతీయర్థికాభివృద్ధి చేయసాగింది. కాని పెట్టుబడిదారేతర పంథాలో యీ కార్యక్రమాన్ని అమలు చేయగల సామర్థ్యం దానికి లేదు". అని పేర్కొన్నది.

దీనిని "బూర్జువావర్గపాలన పెట్టుబడిదారి పంథాకు స్వస్తి చెప్పి, జాతీయ ప్రజాస్వామ్యం స్థాపించబడనిదే, యీ కార్యక్రమం అమలు చేయుట సాధ్యంకాదు" అనే సవరణను సి.పి.ఐ. కార్యక్రమానికి పాట్నాపార్టీ కాంగ్రెసు ఆమోదించింది. దీనిలోని అంతర్గత అర్థాలను సి.పి.ఐ. (యం) యిలా వివరించింది.

ఈ సవరణల ప్రభావం ఆచరణలో రాజకీయ, సైద్ధాంతిక అవగాణహనలపై యేమిటి? సవరణల లక్ష్యం స్పష్టంగానే వెల్లడౌతున్నది.

మొదటి అంశం. "బూర్జువావర్గం స్వతంత్ర పెట్టుబడిదారి విధానపంథాలో జాతీయ ఆర్థికాభివృద్ధిని చేస్తున్న" దనే వాఖ్యభాగాన్ని వదలి వేయుట జరిగింది. సంవత్సరాలకొలది సి.పి.ఐ. యీ విషయమై సి.పి.ఐ.(యం)తో వాగ్వివాదం చేస్తున్నది. ఈ పంథావిశ్లేషించి సామ్రాజ్యవాదుల పెట్టుబడులపై ఆధారపడవలసి వస్తుందనే సి.పి.ఐ.(యం) వాదనను తిరస్కరించి, మన ప్రభుత్వస్వతంత్ర ఆర్థికవిధానం, కార్యాచరణ బలపడుతుందనే వాదనతో సమర్థించింది. ఇప్పుడు ఆవ్యాఖ్యభాగాన్ని యేందుకు తొలగించారో ప్రజలకు వివరించవలసిన బాధ్యతవారిపై ఉంది.

ద్వితీయాంశం "సవరణలలో విప్లవాత్మకత యేమీ లేదు. జాతీయ ప్రజాస్వామ్య విప్లవ కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టుటకు "బూర్జువావర్గపు మొత్తపు పాలనాధికారాన్ని కూలద్రోయనిదే, జాతీయబూర్జువావర్గ పాలనన తొలగించనిదే, కార్యక్రమాన్ని అంతా అమలు చేయగలరా ?

"ప్రభుత్వాధికారాన్ని దాని వర్గనైజాన్ని నిర్వచించునపుడు వారుదృఢంగా ఎడతెగకుండా, బూర్జువా భూస్వామ్య ప్రభుత్వాధికారాన్నిగాని, బడాబూర్జునా, బడాభూస్వామ్యవర్గాల ప్రభుత్వంకాని, బడాబూర్జువా వర్గం నాయకత్వంలోని ప్రభుత్వంకాని కాదని అంటున్నారు. అదే కాలంలో వారు విప్లవాన్ని గురించి మాట్లాడుట అంటే, వారు చెప్పే జాతీయ బూర్జువావర్గ పాలనను అంతంచేయుటయే అగుతుంది. ఈ విధంగా నేటి ప్రభుత్వాధికారం, అభివృద్ధినిరోధక, విప్లవప్రతీఘాతక వర్గాల చేతులలో లేదు. అయినా జాతీయ ప్రజాస్వామ్యశక్తులు దానిని కూలద్రోయాలి. అదే సవరణల సారాంశం. స్పష్టత చేకూర్చాలనే పేరుతో మరింత అస్పష్టత చేకూర్చుట వాస్తవంగా జరిగింది.

సి.పి.ఐ. పాట్నాకాంగ్రెసు ఆవిధమైన "అతివాద విప్లవ" సవరణలను పార్టీకార్యక్రమంలో

ప్రవేశపెట్టింది. పార్టీ క్రమంలో ఎక్కడా సత్వరమే కాంగ్రెసు పాలనను కూలద్రోయాలని, దాని స్థానంలో సామ్రాజ్యవాద, గుత్తపెట్టుబడిదారి, భూస్వామ్య వ్యతిరేకప్రభుత్వాన్ని యేర్పరచాలని, సవరణల రూపకర్తలు వివరించలేదు. "అధికారం నుండి కాంగ్రెసును కూలద్రోయాలనే" మూలంలోని దానికి సవరణలు చేయటలోని అర్థం స్పష్టం. మూడు సంవత్సరాల తరువాత, బాంబే పార్టీ కాంగ్రెసులో ఆమోదించిన కార్యక్రమానికి యీ సవరణలు ఆమోదించవలసి వచ్చింది. విప్లవానికై రూపొందించిన కార్యక్రమంలోని, ప్రభుత్వాధికారంలో ఉన్న కాంగ్రెసు పాలనను కూలద్రోయుట అనేదానిని సవరణలతో తీసివేయుట, రాజకీయ నిజాయితీని ప్రశ్నించునట్లు చేస్తున్నది.

"వాస్తవమేమంటే, కాంగ్రెసు పార్టీతో ఐక్యసంఘటన అనే ఎత్తుగడల పంథాను, అపఖ్యాతి పాలైన దానిని యింతకాలం ప్రచారం చేసారు. అంత్యంత తీవ్రమితవాద శక్తుల ప్రమాదం ఉందని, కాంగ్రెసుతో ఐక్యసంఘటన యేర్పరచాలని, యిది సాధారణ ఐక్యసంఘటనకాదని, ప్రభుత్వాధికారంతో సహకారం, పొత్తునెరపుట ముఖ్యంగా "బూర్జువావర్గంకాని", "కార్మికవర్గంకాని" పూర్తిగా "ఏవొక్క వర్గం మాత్రం కాని" అధికారం కలిగి వుండని ప్రభుత్వంతో సహకరించుటయని వివరించుతు సమర్థించుకొన్నారు సి.పి.ఐ. నాయకులు.

"ఈ ఎత్తుగడల పాత్రి పథజకపైనే దేశంలోని రాజకీయ పార్టీలను తూకమువేయుటకు కార్యక్రమంలో వొక ప్రకరణను వినియోగించారు.

"జీవితం వర్గసామరస్య ఎత్తుగడల పంథాను త్రోసిబుచ్చుటతో పాట్నా పార్టీకాంగ్రెసులో ఆ ప్రకరణను మొత్తంగా తీసివేసి సి.పి.ఐ. కుంటిసాకులు చెప్పసాగింది.

"నేడు ప్రజాస్వామ్య శక్తులలో ముఖ్యమైన చీలిక కాంగ్రెసు అనుసరించే ప్రజాసామాన్యం ప్రజాస్వామ్యప్రతిపక్షాల శక్తులననుసరించే ప్రజాసామాన్యం మధ్యకలదనే అవకాశవాద సిద్ధాంతాన్ని "సందువా పెట్టెలలో భద్రపరచుట" తోపాటు "కాంగ్రెసుతో ఐక్యసంఘటనను" త్రోసివేసారు.

"కాంగ్రెసులోని అభ్యుదయకర శక్తులతో ఐక్యతకైనిరవధిక ప్రయత్నాలు సాగించాలనే" తప్పుడు సిద్ధాంతంతో పాటు, "అభ్యుదయకర పార్టీలు కాంగ్రెసుతో కలవాలని" లేనిచో "నామమాత్రంగా పొత్తునెరపాలనే" వివరణలు వైఫల్యాన్ని చవిచూచాయి. వీటికి బదులుగా "కాంగ్రెసు వ్యతిరేక ప్రజాస్వామ్య సంఘటన, వామపక్ష సంఘటనలు ప్రాచుర్యంలోనికి వచ్చాయి[1].

స్వతంత్రపార్టీని సి.పి.ఐ. "భూస్వాములు, గుత్తపెట్టుబడి వర్గాల బహిరంగ స్వతంత్ర పార్టీ "యని నిర్వచించింది. అయినా ఉత్తరప్రదేశ్, భావనగర్ మునిసిపాలిటీలలో వారితో చేతులు కలిపి, సహకారాన్ని, పొత్తునునెరపుటకు వెనుకాడలేదు.

తృతీయాంశం, సి.పి.ఐ.బాంబే కార్యక్రమము జనసంఘం, రాష్ట్రీయ స్వయం సేవక సంఘాల విధానాలపైయిలా వ్యాఖ్యానించింది.

1. పొలిటికల్ ఆర్గనైజేషనల్ రిపోర్టు సి.సి.; 8వ పార్టీ కాంగ్రెసు, సి.పి.ఐ. (యం), సి.పి.ఐ. (యం) పబ్లికేషన్స్. పే. 145-7.

జనసంఘం, రాష్ట్రీయ స్వయం సేవకసంఘాలు మతసంస్థలేగాక జాతీయ దురహంకార, హింసా, దౌర్జన్యసంస్థలని, హిందూ పునర్జీవన కృషి అంటూ పరమతద్వేషాన్ని, మతకలహాలను రెచ్చగొట్టి, ప్రోత్సహించుతున్నవి. రాష్ట్రీయ స్వయం సేవకసంఘం (ఆర్.యస్.యస్) పాశిస్టు రాజకీయ సిద్ధాంతాలు అనుసరించుతు, సైనికపద్ధతులలో నిర్మించబడిన యువకుల సంస్థకాగా జనసంఘం దాని రాజుకీయ సంస్థగా వ్యవహరిస్తుంది. ఈ విధమైన అవగాహనలను పాట్నా పార్టీకాంగ్రెసులో సి.పి.ఐ. వదలి వేసింది. "సంస్కరణవాద" సి.పి.ఐ. ఎన్నికల తరువాత యు.పి., బీహార్, పంజాబ్‌లలో జనసంఘం, తదితర బూర్జువా పార్టీలతో కలసి, కాంగ్రెసేతర ప్రభుత్వాలను ఏర్పాటు చేయుటకు సహకారం, పొత్తు నెరపారు. ఇది వారి బాంబే కాంగ్రెసు విధానాలకు వ్యతిరేకంగా ఉంది. జనసంఘంతో ఒక సంవత్సరం సహకారం, సయోధ్యత నెరపి మంత్రి వర్గాలలో చేరుటకు అనుకూలంగా వుందని బాంబే కార్యక్రమాన్ని సవరణలతో బుట్ట దాఖలా చేసారు. ఒక సంవత్సరం జనసంఘంతో "హనీమూన్" అయిన తరువాత వారి రాజకీయ విధానం కూలి పోయింది. ఈ సంస్కరణవాద పరిణామాలన్నిటికి సైద్ధాంతిక పునాది ప్రోత్సాహం అన్నీ అంతర్జాతీయ సంస్కరణవాదాల మాతృదేశమైన సోవియట్‌యూనియన్ నుండి లభించింది. సంస్కరణవాద పార్టీ'' శెక్రటరీ జనసంఘంతో తప్పనిసరిగా సహకరించుటకు, సంయుక్తసోషలిస్టు పార్టీచే అత్యధిక వొత్తిడి చేయబడిందని బహిరంగంగా ప్రకటించుట సంస్కరణవాదంలో ఎంత లోతుగా కూరుకు పోయిదో తెలియజేస్తుంది. అసలువాస్తవం, ప్రభుత్వవర్గ పొందిక విశ్లేషణను కార్యక్రమం నుండి తీసివేయుట ఎక్కడకు దారి తీస్తుందో స్పష్టం. అంటే వారు తమ ప్రభుత్వాన్ని, అధికారాన్ని వర్గవిశ్లేషణను పునర్విచారించుకొని సరిచేసుకొనవలసి ఉంటుంది.

చివరిఅంశం., సి.పి.ఐ. వర్గాలు, ముస్లింలీగు, అకాలీపార్టీ, ద్రవిడమున్నేట్రకజగంపై చేసిన వర్గ విశ్లేషణలను, నిర్ధారణలను, వాటియెడల తమవైఖరులను మార్చుకొనవలసి వుంటుంది. అదేకాలంలో సి.పి.ఐ.(యం) యీ మూడు పార్టీల ఏర్పటు వాదాన్ని తీవ్రంగా ఖండించింది. కాని వారి కొర్కెలలో ప్రజాస్వామిక సారాంశాన్ని మాత్రం బలపరచకుండా ఉండరాదన్నది, వాటిలోని అభివృద్ధి నిరోధక అంశాలను రాజీలేకుండా తీవ్రంగా పోరాడాలన్నది. సి.పి.ఐ.వీటిని విమర్శనాత్మకంగా బలపరచుట విడనాడి, పరిమితులు లేని, షరతులు లేని మద్దతునిచ్చింది. నాలుగవ జనరల్ ఎన్నికలలో పశ్చిమ బెంగాల్, ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, ఉత్తరరాష్ట్రాలన్నిటిలో సి.పి.ఐ. ఎన్నికల ఎత్తుగడల విధానం, కార్యక్రమము, అనుసరించిన రాజకీయ విధానం, వామపక్షబలాలను పెంపొందించే విధంగా లేదనుట స్పష్టము.

కార్మిక వర్గ అంతర్జాతీయత కూలిపోవుట, సి.పి.ఐ.లో జాతీయ దురహంకారం పెరిగి పోవుటకు చైనా, పాకిస్తాన్ వ్యతిరేకత పెరుగుటకు ఆరెండు సంఘర్షణలు పరోక్షంగా కారణాలయ్యాయి. అంతీర్జాతీయ సంస్కరణ వాదమంతా సంక్షోభంలోపడి పోవుటతో దాని ప్రభావం ఇండియాలో సి.పి.ఐ.పై తీవ్రంగా పడింది. అదే విధంగా అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో అతివాద సంస్కరణవాదం చైనా ప్రభావంతో పెరిగిపోవుట, ఈ అతివాద సంస్కరణ వాదం నుండే చైనా పోత్సాహంతో సాహసిక అతివాద సంస్కరణవాదం

పుట్టి, పెరిగి, భారతకమ్యూనిస్టు ఉద్యమంలో తన ఉనికిని స్థిరపరచుకొనుట జరుగుట, నేటి వాస్తవిక వర్తమాన చరిత్రలో ఒక అంశంగా ఉంది.

భారతవాస్తవిక ఆర్థిక, రాజకీయ, సామాజిక పరిణామ క్రమ ఇంద్రధనుస్సు ఒక్కొక్క వర్ణాన్ని పార్శ్వాన్ని వివిధ దృక్పధాలతో ముఖ్యంగా స్వీయమానసిక దృష్టితోనే పరిశీలించుట జరిగినంత కాలం, అదీ వివిధ కోణాల నుండి, సమగ్ర స్వతంత్ర అధ్యయనం, పరిశీలన, ప్రతిపాదనలు రూపొందించుకొని, ఒక నిర్ణీతకాలంలోని ఆచరణానుభవాలతో నిర్ధారణలు చేసుకొని, విస్తృత ప్రాంతంలో ప్రజోద్యమాలుగ సాగించుట శాస్త్రీయ మార్క్సిస్టు-లెనినిస్టు ఆచరణ అగుతుంది. ఈ క్రమాన్ని అనుసరించక మేధావుల మనో సంజనిత ఆలోచన అవగాహనలు, రాజకీయ విధానాలు వ్యూహాజనిత సోషలిజం-కమ్యూనిజం అగుతుందికాని, శాస్త్రీయ మార్క్సిజం-సోషలిజం కాజాలదు.

# 2

# వామపక్ష రాష్ట్రప్రభుత్వాలు కేంద్రాలుగ కమ్యూనిస్టుల అంతర్గత సైద్ధాంతిక పోరాటం

## 1. పశ్చిమ బెంగాలు, కేరళలలో

నాలుగవ సార్వత్రిక ఎన్నికల అనంతరం ఎనిమిది రాష్ట్రాలలో సంకీర్ణ ప్రభుత్వాలు ఏర్పడుట, వాటి నిర్మాణంలో వివిధ పార్టీల, వర్గాలకూర్పుల ఫలితంగా ఆచరణలలో వాటి మధ్యఏర్పడిన సంబంధాలు, అంతర్గత సంఘర్షణలు, తత్ఫలితంగా రూపొందిన రాజకీయ పరిణామాలు, కాంగ్రెసేతర రాష్ట్ర సంకీర్ణమంత్రి వర్గాలు వివిధ ప్రాంతీయ బూర్జువాపార్టీల విధానాల ప్రతిబింబాలుగ నిలచాయి. వీటిలో మతతత్వపార్టీలైన అకాలీదళం, జనసంఘాలు, ప్రజాస్వామ్య సోషలిజం ఆశయమంటున్న రివల్యూషనరీ సోషలిస్టుపార్టీ, సంయుక్త సోషలిస్టు పార్టీలు తమతమ రాజకీయ విధానాల ఆచరణకు సంకీర్ణమంత్రి వర్గాలను కార్యరంగంచేసాయి. కార్మిక వర్గపార్టీలమంటున్న సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)లు తమతమ వ్యూహాత్మక జాతీయ ప్రజాస్వామ్యం, జనతా ప్రజాస్వామ్య సిద్ధాంతాల ప్రయోగాల రంగంగా చేయు ప్రయత్నాలలో ప్రారంభదశకు శ్రీకారం చుట్టబడింది.

వర్తమాన చారిత్రాత్మక రాజకీయ పరిణామాల క్రమంలో వివిధ పార్టీలు తమ రాజకీయ విధానాలను అమలు చేయుప్రయత్నాలలో వివిధ పార్టీల మధ్య, ఆయా పార్టీలలో బహిరంగ, ఆంతరంగిక పోరాటాలలో సైద్ధాంతిక సమస్యల సంఘర్షణల అధ్యయనం, మితవాద, మతవాద పక్షాలు, వామపక్షాల ఐక్యత-సంఘర్షణలను, ఫలితంగా వాటి బలాబలాలలో వచ్చిన మార్పులకు అద్ధం పట్టుతుంది. ఈ రాజకీయ, సైద్ధాంతిక ఆచరణ బహిరంగ పోరాటం, వామపక్షరాష్ట్ర ప్రభుత్వాలు కేంద్ర చర్చనీయాంశాలుగ పరిణామ మొందుట విశేషాంశంగా నెంచాలి. వివిధ ఐక్యసంఘటనలలలో, రాష్ట్ర ప్రభుత్వాలలో సి.పి.ఐ., సి.పి.ఐ.(యం) భాగస్వాములగుటతో, లేక నైతిక భాగస్వాములగుటతో వారు వహించిన పాత్ర, వర్తమాన వామపక్ష దేశరాజకీయాలలో అత్యంత కీలక పాత్ర వహించుతుంది.

కాంగ్రెసేతర సంకీర్ణ రాష్ట్ర ప్రభుత్వాలను తాత్కాలిక ప్రాథమిక దశపు ప్రభుత్వాలుగ, జాతీయ ప్రజాస్వామ్య ప్రభుత్వాలుగ పరిణామం చెందుటకు సోపానాలుగ సి.పి.ఐ. వివరించుటను సి.పి.ఐ.(యం) తీవ్రంగా విమర్శించింది. రాష్ట్రాలలో సంకీర్ణ ప్రభుత్వాల బలంతో ప్రజాసమీకరణ గావించి, కేంద్ర కాంగ్రెసు ప్రభుత్వాన్ని, పార్లమెంటరీ తిరుగుబాటు ద్వారా కూలద్రోయుటను సి.పి.ఐ. తక్షణ నినాదంగా చేయుట సంస్కరణ వాదపు అవకాశవాదంగా, కాలక్షేప నిరుపయోగ చర్చలని, మితవాద భ్రమలప్రతిబింబాలని, వారి సంస్కరణ వాదం కాలక్రమంలో రుజువైందని సి.పి.ఐ.(యం) తీవ్రంగా విమర్శించి త్రోసి బుచ్చింది.

పశ్చిమ బెంగాల్, కేరళలో కాంగ్రెసేతర ప్రజాస్వామ్య ప్రభుత్వాలు ఏర్పడిన వొకటిరెండుమాసాలలోనే "అతివాద సాహసికవాద వైఖరి సి.పి.ఐ.(యం)లో వుద్భవించి, "నిజమైన విప్లవకారులు" పార్టీలో రాజీవాదం ప్రబలిందని, నియోసంస్కరణవాదం నాయకత్వం చేబట్టిందని పార్టీపంథాపై దాడిచేయ ప్రారంభించారు. వివిధ పార్లమెంటరీ కార్యక్రమాలలో, ఐక్యసంఘటనలలో, వాటి ప్రభుత్వాలలో భాగస్వాములు లేకనైతిక భాగస్వాములగుట అన్నీ " పార్లమెంటరీ పెడమార్గంగా" పార్టీ పంథాని విమర్శించి "ఎన్నికలను, అసెంబ్లీలను బహిష్కరించాలనే" నినాదాలను ప్రకటించారు. అంతేగాక "సాయుధరైతాంగ పోరాటం", "ప్రజాయుద్ధం", సత్వరఆచరణ నినాదంగా నిచ్చారు. గత 18 మాసాల అనుభవం యీ పంథా "అవాస్తవమూ, ఊహాజనతమూ, అతివాద బాల్యారిష్టంగా, సాహసికవాద దృక్పధంతో రూపొందించబడినదని, పరిస్థితి, విశ్లేషణచేసి, ఆచరణను సి.పి.ఐ.(యం) తీవ్రంగా వ్యతిరేకించింది.

సి.పి.ఐ.(యం) 8వ పార్టీ కాంగ్రెసు నివేదికలో అతివాద, మితవాద అవకాశవాదాలను లోతుగా పరిశీలించి, అతివాదులు పార్టీపై దాడిచేయుట, రెండు రాష్ట్రాల ఐక్యసంఘటనల ప్రభుత్వాల కార్యాచరణలను సమీక్షించి, వాటిలో కమ్యూనిస్టు పార్టీలు అనుసరించుతున్న విధానాలు నివేదికలో చెప్పదలచలేదని స్పష్టం చేయబడింది. సి.పి.ఐ.(యం) "వారు భాగస్వాములుగ ఉన్న ఐక్యసంఘటనా ప్రభుత్వాలను ప్రజలచేతులలోని పోరాటసాధనాలుగ గుర్తించాలని, మామూలు అధికారాలుగల ప్రభుత్వాలుగకాక ప్రజలకు గణనీయమైన సౌకర్యాలను, రాయితీలను కలుగజేయుటకు ప్రయత్నించే వాస్తవ ప్రభుత్వాలుగ నెంచాలని ప్రతిపాదించింది. రెండవ అంశం, "వర్గపరిభాషలో అటువంటి ప్రభుత్వాలలో పార్టీ బాధ్యతలను చేబట్టుట లేక భాగస్వాములగుట ఒక ప్రత్యేక పోరాట రూపముగుతుంది. కార్మిక వర్గ సహచర మిత్రులుగ ఎక్కువ ప్రజాసామాన్యాన్ని సమీకరించుట, జనతంత్ర ప్రజస్వామ్యాన్ని పురోగమన మార్గంలో సోషలిస్టు దశకు కొని పోవుట[1]" అగుతుంది. ఇదే సి.పి.ఐ.(యం) అవగాహనగా వుంది.

ఐక్యసంఘటనల ప్రభుత్వాలలో పార్టీరాష్ట్రశాఖలు యీ దృక్పధంలో ఎంతవరకు పనిచేస్తున్నవో పరిశీలించ వలసివున్నది. పశ్చిమ బెంగాల్, కేరళ రాష్ట్ర ప్రభుత్వాలు ప్రజల చేతులలో పోరాట సాధనాలుగ ఏ విధంగా రూపొందుచున్నవో, జనతంత్ర ప్రజాస్వామ్యాన్ని ఎట్లు రూపొదించి, పురోగమన మార్గంలో తదుపరి సోషలిస్టు దశ ఎట్లు చేర తలచుచున్నవో తెలుసుకొన ప్రయత్నించుదాము. ఈ రాష్ట్ర ప్రభుత్వాల అధికారాల నైజముపై వివిధ రాజకీయ పార్టీలు వివిధ భ్రమలను కలిగివున్నవి. అధికారాల అమలుపై విభిన్న అవగాహనలను కలిగి ఉన్నవి. అధికారాలన్నిటిని కేంద్రంలో నిక్షిప్తం చేసుకొన్న కేంద్ర ప్రభుత్వం పేరుకుమాత్రమే స్వపరిపాలన రాష్ట్రాలుగ ఆచరణలో చేసింది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రాష్ట్రాల స్వపరిపాలనపై భిన్న అభిప్రాయాలను కలిగియుండుట సహజమే అయినా తరచు తీవ్ర సంఘర్షణలకు గురియగుచున్నవి. సి.పి.ఐ.(యం) అగ్రగామిదళ పార్టీగ రాష్ట్ర ప్రభుత్వాలనైజాన్ని, అధికారాల పరిమితులను, బోగసు అధికారాలను స్పష్టంగా

1. నూతన పరిస్థితి పార్టీ కర్తవ్యాలు *(1968)* ఆంగ్లంలో పే. *70.*

అవగాహనకలిగి వుండే, "ప్రజల చేతులలో పోరాటసాధనాలుగ చేయుటకు ప్రయత్నించుచున్నామని నివేదికలో స్పష్టం చేసింది. అంతేగాక సంస్కరణవాద భ్రమలకు లోనై" తగినన్ని అధికారాలు ఉన్నవని" గాని "చాలవరకు ప్రజలకు రాయితీలను కలుగ" చేయగలమనే భ్రమలు, కొందరి వలె తమకు లేవని కూడ స్పష్టం చేసింది. అదేకాలంలో "పోరాటసాధనాలుగ" ప్రకటించుటలోను, వాటిని "పోరాట సాధనాలుగ" వినియోగించుటలోను గల హస్తిమసికాంతర భేదాన్ని గుర్తించు కొనాలని నివేదికవిశదం చేసింది[1].

ఒకవైపున అధికారాన్ని "పోరాట సాధనాలుగ" వినియోగించు ప్రయత్నాన్ని పశ్చిమ బెంగాల్‌లో తీవ్రతరం చేయునపుడు, మరోవైపున కేంద్ర కాంగ్రెసు ప్రయత్నం, ఐక్యసంఘటనలోని "బలహీన తలను, వూగినలాడే శక్తులను, గ్రూపులను ఉపయోగించుకొంటూ" ఐక్యసంఘటనా రాష్ట్ర ప్రభుత్వాలను తన చెప్పు చేతులలో ఉండే "నమ్మిన బంటుసాధనాలుగ" తన ఆజ్ఞలను పరిపాలించు వారిగ చేయపరోక్షంగా అన్నివిధాల చేయుచున్నది; కేంద్రం కలిగించు కొనగలందులకు "లా అండే ఆర్డరు" కాపాడవలయునని కేకలు పెట్టుచున్నది. కేంద్ర, రాష్ట్ర వ్యవహారాలలో కలుగజేసుకొనకుండా, వామపక్షసంఘటనలు, పార్టీలు, గ్రూపులు ప్రజాసమీకరణతో ప్రతిఘటన సాగించ ప్రారంభించారు. "విముక్తి సాయుధ పోరాటం" నినాదాలనిస్తూ నక్సలైట్లు పరిస్థితులను మరింత గందరగోళం చేస్తున్నపుడు, మరోవైపున కేంద్ర హోంశాఖమంత్రి వర్గం, రైతాంగ ఉద్యమాన్ని రక్తం పారించి అయినా అణచివేయప్రయత్నిస్తున్నది. ఈ పరిస్థితులలో ఐక్యసంఘటనా ప్రభుత్వ భాగస్వాములు. ప్రారంభంలో కొన్ని పొరపాట్లు చేయుటయేగాక, వూగిసలాడినా, ధృఢవైఖరి చేబట్టి, ప్రజాసంఘాల పొరపాటులను పోలీసులకు వ్యతిరేకంగా బలపరస్తూ, పోలీసులను ప్రజాపోరాటాలలో వినియోగించకుండా, చిరకాలంగా పరిష్కరించని సమస్యలను, "గెరావొ" కార్మికవర్గ పోరాటాల ద్వారా, పరిష్కారమార్గాలు సి.పి.ఐ.(యం) అన్వేషించ సాగింది. అనేక జిల్లాలలో రైతులను భూములనుండి బేదఖళ్ళు చేయు ప్రయత్నాలను ప్రతిఘటించుటతో పాటు, మిగులు భూములను బంజరులను, అటవీబంజరులను పేదరైతులు, కూలీలకు పట్టాలు యివ్వాలనే ప్రజా ఆందోళనలను సాగించారు. ఈ పోరాటాల అనుభవాలే ప్రజలు ఐక్యసంఘటనల కార్యాచరణలను బలపరచునట్లు, పశ్చిమ బెంగాలులో ఐక్యసంఘటనా ప్రభుత్వాన్ని కేంద్ర ప్రభుత్వం రద్దు చేసి శ్రీ పి.సి.ఘోష్ కీలుబొమ్మ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజా ప్రతిఘటనా ఉద్యమాన్ని రూపొందించుటకు తోడ్పడింది, చివరకు మితవాదుల కేంద్ర కాంగ్రెసు ప్రభుత్వ కుటిల రాజకీయాలను ఏదో విధంగాభగ్నం చేయగలిగింది.

రాష్ట్ర ప్రభుత్యోద్యోగులు దుర్భర పరిస్థితులలో మునిగిపోయినపుడు వారికి తగు సహాయ, సానుభూతులను, గతంలో కాంగ్రెసు ప్రభుత్వాలు యెప్పుడూ చేయని విధంగా సహాయాన్ని అందించుట జరిగింది. రాష్ట్ర ప్రభుత్వ పరిమితులలో చేయగలిగిన సహాయాన్ని

---

*1. పొలిటికల్ ఆర్గనైజేషనల్, సి.పి.ఐ.(యం) 8వ, పార్టీ కాంగ్రెసు రిపోర్టు పే. 171.*

అందించుట జరిగింది. అదే కాలంలో ప్రజలదైనందిన రవాణా సౌకర్యాలను పెంపొందించుటకు ట్రాంవేస్‌ను జాతీయం చేసింది. ధాన్యసేకరణ నుండి పేద, మధ్యతరగతి రైతాంగాన్ని మినహాయించింది. రాష్ట్ర ప్రభుత్వాల యెడల సవతితల్లి ప్రేమచూపుతు అధికారాలను, వనరులను రాజ్యాంగచట్టాన్ని తమ అవసరాలకు తగిన విధంగా వ్యాఖ్యానాలను పొందుట యేగాక, పాలనాయంత్రాంగాన్నంతా తమవర్గ ప్రయోజనాలను కాపాడుటకు వినియోగించుకొన్నది. ఆర్థిక సంక్షోభభారాన్నంతా కార్మిక, కర్షక, మధ్యతరగతి వర్గాలపై మోపింది. సామాజిక మార్పు పూర్తిగ రానిచోయిదే కొనసాగుతుంది. పెరిగిపోతున్న ప్రజాజాగృతియే ఐక్యసంఘటనా రాష్ట్ర ప్రభుత్వాలను పోరాట ఆయుధాలుగ, విప్లవకరమార్పులకు జరిగే ప్రజాపోరాటాలను పెంపొందించుతుంది. అందుకు ప్రజాచైతన్యంగీటురాయి అగుతుంది. ఈ దృక్పధమే పాలనా విధానాలు, కాంగ్రెసేతర శక్తుల సమావేశాలలో పార్టీ పాత్ర స్పష్టం చేయబడింది. ప్రమాణస్వీకరంనాడు చేసిన వాగ్దానాలను నెరవేర్చాలనే రాజకీయ వొత్తిడి నిరవధికంగానే సాగింది. ఐక్యసంఘటన ప్రభుత్వాలలోని భాగస్వామ్యపార్టీలు చేసిన వాగ్దానాలను నెరవేర్చుటకై చేసిన ప్రయత్నాలు ఆయా పార్టీల బలాన్ని రాష్ట్రాలలో పెంచగలిగింది, ప్రజామన్ననలను పెంపొందించగలిగింది.

కేరళ అసెంబ్లీలో సి.పి.ఐ.(యం) బలమైన ప్రధానశక్తిగా ఉండుట వలన, బెంగాలులోవలెగాక ముఖ్యమంత్రి, హోంమంత్రి పదవులు రెండూ ఆపార్టీకే లభించాయి. బెంగాలలో యీ ముఖ్యపదవులు రెండూ బంగ్లాకాంగ్రెసుకు లభించాయి. రెండో అంశం బెంగాలలో ఏర్పడిన ఐక్యసంఘటనా ప్రభుత్వానికి యిది ప్రథమ అనుభవము. కేరళకు 1957 అనుభవం, ప్రజల సుహృద్భావం ఉంది. కేరళలో నాడు చేయబడిన విద్యావిధాన, వ్యవసాయ సంస్కరణ బిల్లులు అసెంబ్లీ ఆమోదంపొందాయి. మూడో ముఖ్య అంశం, కేరళ ఆహారధాన్యాల కొరత రాష్ట్రం. బయట రాష్ట్రాలనుండి 50 శాతం ఆహార ధాన్యాలను దిగుమతి చేసుకొనవలసి ఉంటుంది. పశ్చిమబెంగాల్‌లో ఆహార ధాన్యాల కొరత ఉన్నా చాలా తక్కువ శాతం మాత్రమే ఉంటుంది. సాధారణ ఆర్థిక సంక్షోభ సంవత్సరాలలో కేరళలో చాలా తక్కువగా ఉంటుంది. నాలుగవ అంశం, కేరళ బెంగాల్ వలె పారిశ్రామిక రాష్ట్రంకాదు. అంచేత కొన్ని సౌలభ్యాలతోపాటు అనుకూల అంశాలున్నాయి. సంక్షోభంలో ఆభారాన్ని ప్రజలపైనెట్ట ప్రయత్నించునపుడు నిర్మాణాత్మక, కార్మిక వర్గ ప్రతిఘటన బెంగాల్‌లో అత్యంత విస్తృతిలో ఉంటుంది. మధ్యతరగతి వర్గాల ప్రతిఘటన తీవ్రమౌతుంది. ఈ ముఖ్యఅంశాలు ఐక్యసంఘటనల ప్రభుత్వాల కర్తవ్యనిర్వహణలను పరిశీలించునపుడు త్రోసివేయజాలము.

ముఖ్యాంశం. బెంగాలుతో పోల్చితే కేరళలో ప్రభుత్వపు ప్రజా అవసరాల కేటాయింపులు బడ్జెట్టులో ఆహారపదార్థాలకు యిచ్చేసబ్సిడీ, వేతనాలు, కరువు బత్తెపుతదితర సహాయకేటాయింపులు యేమాత్రమూ తక్కువగాదు. ప్రజావసరాలకు పూర్తిగ సరిపడునంతవిగా లేకపోయినా, ప్రజలు ఆశించినంత సంతృప్తికరంగా లేకపోయినా రాష్ట్ర బడ్జెట్టుతో పోల్చినపుడు తలకుమించిన భారంగానే ఉంటుంది.

ఆహారపదార్థాల సప్లయిలను కొరతరాష్ట్రమైన కేరళకు కేంద్ర ప్రభుత్వం తగ్గించుటతో ప్రజలలో కరువు పరిస్థితులు యేర్పడుతున్నది. ఫలితంగా ఆహారపదార్థాలధరలు పెరిగిపోవుటతో, ప్రజలకు రాష్ట్ర ప్రభుత్వం యిచ్చిన రాయితీలువమ్ము అగుతున్నవి. కేంద్రసప్లయిలు తగ్గుటతో రేషనులో కోత 1967 మే-జూన్‌ల నుండి సంవత్సరం కొనసాగింది. సాధారణ ఎన్నికలలో అభిమానంతో ఐక్యసంఘటన అభ్యర్థులను గెలిపించిన ప్రజాసామాన్యం యెడల కేంద్రప్రభుత్వం "రాజకీయకక్ష" వహించినట్లు కన్పడుటయేగాక, "కేరళ ప్రజల ఆహారకొరత రేషను కోత"లపై రాజకీయ, పాక్షిక ప్రయోజనాలకై ప్రజలను శిక్షించే హీనమార్గాలు అవలంభించుట స్పష్టమగుతున్నది. ఐక్యసంఘటనలోని భాగస్వామ్య పార్టీలన్నీ ఈ సమస్యపై ప్రజావుద్యమాన్ని నిర్మించుటకు సుముఖంగా లేవని, ముఖ్యంగా సి.పి.ఐ.పై తీవ్రవిమర్శన కూడ సి.పి.ఐ.(యం) చేసింది.

ఆహారసమస్యను "రాజకీయం చేసి - పాక్షిక ప్రయోజనాలకు" కేంద్ర ప్రభుత్వం ఎలాగ ఉపయోగిస్తున్నదో, ఐక్యసంఘటనలోని ప్రధాన పక్షమైన సి.పి.ఐ.(యం) కూడ ప్రత్యర్థి సి.పి.ఐ.పై దాడికి ఉపయోగించుట "ప్రపంచంలో ఏ దేశంలోను రెండు కమ్యూనిస్టు పార్టీ లుండరాదనే సిద్ధాంతంపై" పూర్తి విశ్వాసంతో ఆచరణ ఎత్తుడలను రూపొందించు కొన్న ఫలితమే కమ్యూనిస్టు పార్టీల "జ్ఞాతవైరం". ఏ పరిస్థితులలోను, ఏ కార్యక్రమంలోనైనా, చివరకు ఐక్యసంఘటనలోని సమిష్టికార్యాచరణలలో సైతం కమ్యూనిస్టు పార్టీలు వొండొరులను ప్రజలనుండి వేరుచేసి బలహీన పరచుకొంటూ, స్వపక్షం మాత్రమే బలపడే "నీచ ఎత్తుగడల" ఫలితమే సి.పి.ఐ.(యం); సి.పి.ఐ.లు వొండురులపై సైద్ధాంతిక పోరాటం ముసుగులో బూర్జువా పార్టీలవలె దాడులు చేసుకొంటూ, ప్రజలలో తాము బలహీనపడి, అభివృద్ధి నిరోధక మతమౌఢ్యశక్తులకు పరోక్షంగా బలాన్ని చేకూర్చారు. ఐక్యసంఘటనలో ప్రధానశక్తియైన సి.పి.ఐ. (యం) వైఫల్యాలకు కారణం, "ఐక్యసంఘటనలోని పార్టీలను, గ్రూపులను ప్రజల నుండి దూరం చేయుటకు బహిరంగ విమర్శకు వొడిగట్టుట వలననే అంశాన్ని గుర్తించాలి. ఐక్యసంఘటన ప్రజా ఉద్యమంగా, అభివృద్ధి చేయుటలోని సి.పి.ఐ.(యం) వైఫల్యాలకు కారణంగా, వారి 8వ పార్టీ కాంగ్రెసు యీ విషయాన్ని పేర్కొనుట జరిగింది[1].

ఐక్యసంఘటనలో వెల్లడైన యీ అభిప్రాయభేదాలు సంఘటన లక్ష్యాలు, పరువు ప్రతిష్టలపై దెబ్బతీసి, కాంగ్రెసు, కేరళ కాంగ్రెసులకు, నైతిక బలాన్ని పెంపొందించిన ఫలితంగానే మునిసిపలు ఎన్నికలలో సంఘటనకు అధికస్థానాలు వచ్చుటకు, సంఘటన భాగస్వామ్య పార్టీలు తమ బలాన్ని కొంత కోల్పోవుట జరిగింది. ఈ అపజయాల అనంతరమే సి.పి.ఐ.(యం) కేంద్ర ప్రభుత్వ ఆహార విధానానికి వ్యతిరేకంగా ప్రజాసమీకరణ ప్రారంభించింది.

ఐక్య సంఘటనలోని భాగస్వామి పార్టీలు, గ్రూపులు, యితర గ్రూపుల యెడల ఎటువంటి సంబంధాలు పెంపొందించాలనే విషయంలో సరియైన అవగాహన

---

*1. పొలిటికల్ ఆర్గనైజేషనల్ రిపోర్టు (1969) సి.పి.ఐ.(యం) 8వ, పార్టీ కాంగ్రెసుకు సి.సి.సమర్పించగా ఆమోదించబడిన నివేదిక (ఆంగ్లంలో) పే. 175).*

వామపక్షాలకు, ముఖ్యంగా రెండు కమ్యూనిస్టు పార్టీలకు లేనందుననే పై అపజయాలు సంభవించాయి. కాని, భాగస్వామ్య పార్టీల "ద్రోహచింతన" కాదని తెలుసుకొనుట అవసరము. అంతేగాక కమ్యూనిస్టు పార్టీలు సకాలంలో స్వతంత్ర ప్రజాసమీకరణ చేయలేక సంస్కరణవాద ధోరణిలో ఉండుట కూడ కొంత కారణమైవుండ వచ్చును. అంతేగాక కేరళలో కాంగ్రెసు, కేరళ కాంగ్రెసులు అసెంబ్లీలో చిన్న మైనారిటీలుగా ఉండి యేమీ చేయలేని స్థితిలో ఉన్నవనే మితవాద ధోరణి కమ్యూనిస్టు శ్రేణులలో ప్రబలి కేంద్ర ప్రభుత్వ కుట్రలు ఫలించవని, ఐక్యసంఘటనా ప్రభుత్వ స్థిరత్వానికి బలమైన పునాదులున్నవని అతిగా అంచెనాలు వేయుట జరిగింది. ఈ విధమైన అంచెనాలు పెరిగిపోతున్న ఆర్థిక సంక్షోభ తీవ్రతను, కేంద్ర ప్రభుత్వవైఖరిని తక్కువగా అంచెనా వేయుటకు దారి తీసింది. ఐక్యసంఘటనలోని "వూగిసలాడే శక్తులు, సి.పి.ఐ., యెడల సి.పి.ఐ.(యం) వహించే పెద్దన్నయ్య వైఖరుల దుష్ఫలితాలను తక్కువగా అంచెనా వేయుట యేగాక, కాంగ్రెసు, కేరళ కాంగ్రెసులు, కుట్రలు చేసి మరో "కాంగ్రెసేతర ప్రభుత్వాన్ని" ప్రస్తుత ఐక్యసంఘటనా ప్రభుత్వాన్ని కూలద్రోసి, యేర్పాటు చేసి పరోక్షంగా తమ పెత్తనాన్ని యేదోవిధంగా కొంత వరకైనా సాగించాలనే ఎత్తుగడలను తక్కువగా అంచెనా వేయుట జరిగింది. కమ్యూనిస్టు శ్రేణులలో జాతీయ ప్రజాస్వామ్యం లేక జనతా ప్రజాస్వామ్యమా అనే సైద్ధాంతిక వివాదం సమసిపోలేదు. ఈ వైఫల్యాలతోపాటు కొన్ని మంత్రిత్వశాఖలు గందరగోళం, పొరపాట్లు చేయుటతో ప్రభుత్వం చేసిన సత్కార్యాల గౌరవం, ప్రతిష్టకూడ దెబ్బతినటమే గాక అఖిలభారత స్థాయిలో కూడ అపకీర్తి నెదుర్కొన వలసి వస్తున్నది.

పశ్చిమ బెంగాల్, కేరళలలోని ఐక్యసంఘటనా ప్రభుత్వాలు, పంజాబ్, ఉత్తరప్రదేశ్, బీహారులోని కాంగ్రెస్సేతర బూర్జువా, వామపక్ష పార్టీల సంకీర్ణ ప్రభుత్వాలు, వాటి అనుభవాలు, వివిధ పార్టీలతో వుండ వలసిన సంబంధాలు, ఆచరణల సమస్యలు ముందుకొచ్చాయి.

**౨. యు.పి.,బీహారు, పంజాబ్‌లలో కాంగ్రెసు వ్యతిరేక సంఘటనలు, కాంగ్రెసేతర ప్రభుత్వాలు :**

బీహారు, యు.పి., పంజాబ్‌లలో కాంగ్రెసేతర ప్రభుత్వాలను, కాంగ్రెసు కుతంత్రాలతో కూలద్రోయుటకు చేయు ప్రయత్నాలను, ఆయాపార్టీలు, ప్రజలు ప్రతిఘటించారు.

కాంగ్రెసు కుట్రలు, వెన్నుపోట్లతో కాంగ్రెసేతర రాష్ట్ర ప్రభుత్వాలు చిన్నాభిన్నమై కూలిపోయాయని అందరకు తెలిసిన విషయమే. ఒకటి తరువాత ఒకటి రాష్ట్ర ప్రభుత్వాలు కూలగొట్ట బడినా చెప్పుకొనతగిన ప్రతిఘటన లేకుండా పోయింది. అవియేర్పడిన తీరు, వాటి పొందిక, బలాబలాల తూకము, కేరళ, పశ్చిమ బెంగాల్‌ల ఐక్యసంఘటనా ప్రభుత్వాలు కంటే భిన్నమైనవి. పశ్చిమ బెంగాలులో ఏర్పడిన ప్రభుత్వం ప్రజాపోరాటాల ఫలితంగా, వామపక్షాల ఐక్యత పునాదిగా, వాటి మద్దతుతో ఎన్నికలలో గెలచిన ఐక్యసంఘటనలు ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసినవి. కేరళలలోని ప్రభుత్వం ఒక్క కమ్యూనిస్టు శ్రేణుల శక్తి, మద్దతులపైనే ఆధారపడి ఎన్నికలలో గెలచి ఏర్పడినది. ఇతర వామపక్షాలు అందులో భాగస్వాములుగ చేరిబలాన్ని చేకూర్చాయి. ఇతర రాష్ట్రాలలో కమ్యూనిస్టు శ్రేణులు కేంద్రాలుగ కాంగ్రెస్సేతరరాష్ట్ర ప్రభుత్వాలు ఏర్పడలేదు. బూర్జువా పార్టీలలో యేదోఒక

దాని నాయకత్వంలో ఏర్పడిన ప్రభుత్వాలు. అందులో కొన్ని స్వార్థపరవర్గాల ప్రయోజనాల కొరకు జనసంఘం నాయకత్వంలోని మంత్రి వర్గాలలో కూడ కొందరుచేరారు.

జనసంఘం, స్వతంత్ర పార్టీలు సైద్ధాంతికంగా, రాజకీయంగా పూర్తి భిన్నదృక్పధాన్ని కలిగి ఉన్నవి, బూర్జువా, భూస్వామ్య కాంగ్రెసు ఆధిక్యతగల ప్రభుత్వాలకు సైద్ధాంతికంగా, రాజకీయంగా మద్దతునిస్తూ ఉన్నవి. కాంగ్రెసు వ్యతిరేక ప్రభుత్వాల అసంతృప్తిని అంతం చేయుటకు ప్రయత్నిస్తున్నామంటూ, తామే రోజురోజుకూ పతన మార్గంలో పయనిస్తున్నవి. ఈ రాష్ట్రాలలో కాంగ్రెసుకు ప్రత్యామ్నాయంగా ఉన్నామంటూ చెప్పుకొంటున్నా, కేంద్ర అధికార కాంగ్రెసుకు భిన్నమైన విధానాలేమీ చేబట్టకపోగా, ప్రజా సామాన్యపు ఆశలు, కోరికల యెడల విశ్వాసంతో ప్రజాస్వామ్యవిధానాలను అనుసరించుటలేదు.

ఈ సంకీర్ణ ప్రభుత్వాల అనుభవాలు, ప్రజాసామాన్యాన్ని రాజకీయకార్యాచరణ లోనికి తీసుకొని వచ్చుటలోని వైఫల్యాన్ని, ప్రజాస్వామ్య పురోగమనానికి అభివృద్ధి చెందుతున్న కాంగ్రెసు వ్యతిరేకతను మలచుటలోని వైఫల్యాన్ని, ఏలక్ష్యం లేకుండా సంకీర్ణ ప్రభుత్వపక్షాలు కొన్ని చీలి ప్రతిపక్షంలో చేరుటవంటి చర్యలు ప్రజలలో నిస్పృహ, అసంతృప్తిని కలుగజేస్తున్నవి. పశ్చిమ బెంగాలులో ఐక్యసంఘటనలోని రాజకీయపక్షాలు ప్రజలను విశ్వాసంలోనికి తీసుకొని, ప్రతివిద్రోహాన్ని బహిరంగంగా విమర్శించుటతో బలపడుట జరిగింది. ఈ విధానం కాంగ్రెసేతర సంకీర్ణ ప్రభుత్వాలలో జరుగక పోవుటయే, రెండు నమూనా సంకీర్ణ ప్రభుత్వాలలోగల ముఖ్యబేదము[1].

పి.సి.ఘోష్ సంకీర్ణ ప్రభుత్వాన్ని సుస్థిరం చేయుటకు కాంగ్రెసు చేసిన కుట్రలను ఎప్పటికప్పుడు వామపక్షాలు భగ్నంచేసాయి. ప్రధానంగా ప్రజలను సమీకరించి, పోరాటాలు సాగించుటవలననే కొన్ని విజయాలు లభించాయి. అభివృద్ధినిరోధ శక్తులకు వ్యతిరేకంగా యిట్టి ప్రతిఘటన, వామపక్షపార్టీలు ప్రధాన పాత్రవహించే రాష్ట్రాలలోనే కానవస్తుంది. కాంగ్రెసేతర బూర్జువా లేక ప్రాంతీయ బూర్జువావర్గాల పార్టీలు ప్రధాన పాత్రవహించే రాష్ట్రాలలో అవి పేరుకు ఐక్యసంఘటన ప్రభుత్వాలు అయినా వాటి కూర్పు, నిర్మాణం, నైజాలలో ఉన్న తేడాలే అందుకు కారణాలు. పంజాబులో ప్రధాన రాజకీయ పార్టీల ఐక్యసంఘటనలోని అన్ని శక్తులను సమీకరించి ప్రతిఘటన సాగించలేని వైఫల్యాల కారణంగానే గిల్ ప్రభుత్వం ఏర్పరచగలిగారు. బీహారులో పాశ్వాన్ ఐక్యసంఘటనా ప్రభుత్వమద్దతుతో ప్రజాసమీకరణ జరుగని కారణంగానే తేలికగా కాంగ్రెసు వాదులు ఆ ప్రభుత్వాన్ని కూలద్రోయగలిగారు. బీహారులో యీ ఐక్య సంఘటనా ప్రభుత్వాన్ని కూలద్రోయుట ప్రజలను చీకటిలో వుంచి, తెరవెనుక, పార్టీల నాయకులే పాత్రదారులై నాటకీయంగా జరిపారు. ప్రజల చొరవ, పాత్ర శూన్యం. ఎన్నికల తదనంతరంప్రజలు పార్టీలు తమఎన్నికల వాగ్దానాలను నెరవేర్చమని కోరుట, ప్రదర్శనలు, ఉద్యమాలు సాగించుట, బూర్జువా పార్టీలకు రుచించుటలేదు.

ఇట్టి ఐక్యసంఘటనల సంకీర్ణప్రభుత్వాలను యేర్పరచిన జనసంఘం, భారతీయక్రాంతిదళ్, ప్రధానంగా కాంగ్రెసు నుండి చీలివచ్చిన కొన్ని గ్రూపులను

1. *నివేదిక. సి.పి.ఐ.(యం) 8వ. పార్టీ కాంగ్రెసు (ఆంగ్లంలో) పే. 159-60.*

ప్రజాస్వామ్యవాదులని చెప్పజాలము. వారి కాంగ్రెసు వ్యతిరేకత కూడ సైద్ధాంతిక భేదాభిప్రాయాల వలనకాక, అధికార పంపకం, గ్రూపుల ప్రయోజనాల ప్రాతిపధికలపై ఏర్పడినది. భాగస్వాములలో కొన్ని పార్టీలు లేక గ్రూపులు కరుడుగట్టిన అభివృద్ధి నిరోదకులు, లేక జాతీయ దురహంకారులు, కొన్ని మతమౌఢ్యతత్వశక్తులు, మరికొన్ని పచ్చి కమ్యూనిస్టు వ్యతిరేకులు ఉన్నారు. వారు పాకిస్తాన్, చైనావ్యతిరేకతలను బహిరంగంగా, విదేశాంగ విధానంగా చేబట్టిన పెక్కువర్గాలను కలిగివున్నారు.

బీహారు, యు.పి.లలో యీ వామపక్షేతర ఐక్యసంఘటనలు, ప్రభుత్వాలకు వెన్నెముకగావున్న సంయుక్త సోషలిస్టు, ప్రజాసోషలిస్టు పార్టీలు కాంగ్రెసు వ్యతిరేకపోరాటంలో ప్రధానంగా జనసంఘం, దానికవాతు దళమైన రాష్ట్రీయ స్వయం సేవకసంఘం ఎక్కువ ఆశలు పెట్టుకొన్నవి. ఐక్యసంఘటనలు, వాటి ప్రభుత్వాలు భాగస్వాములైన కొన్నికరుడుగట్టిన అభివృద్ధి నిరోధక, జాతి, మతమైఢ్యపార్టీలకు లేని రాజకీయ గౌరవ, మర్యాదలను, ప్రజాస్వామ్యవాదులనే భ్రమలను కలుగజేస్తున్నవి. ఈ రాష్ట్రాలలో ఏర్పడిన ఐక్యసంఘటనల ప్రభుత్వాలు జనసంఘం బలపడుటకు తోడ్పడినవి, కాని సోషలిస్టులు యేమాత్రం బలపడక పోగా బలహీనపడుట, ఉన్నకొద్దిపాటి రాజకీయ ఐక్యత కోల్పోవుట జరిగింది. ఆచరణలో లౌకికశక్తులు, మతమౌఢ్యశక్తులు కలసి ఐక్యసంఘటనలు, ప్రభుత్వాలను ఏర్పరచిన రాష్ట్రాలలో కరుడుగట్టిన మిత, మత అభివృద్ధి నిరోధక శక్తులు, వారిదుశ్చర్యలను కప్పిపెట్టుటకు పరోక్షంగా తోడ్పడి, ఆ శక్తులు బలపడుట జరిగింది. రాంచి, అలహాబాదులలో మతతత్వశక్తులు మతకలహాలను రెచ్చగొట్టుట జరిగింది. అయినా ప్రజాస్వామ్యపార్టీలు అని చెప్పబడేవి, బలమైన జనసంఘంతో కలసి కాంగ్రెసేతర ప్రభుత్వాలను ఏర్పాటు చేయుటకు సహకరించినవి. వామపక్షాలు ముఖ్యంగా సి.పి.ఐ., సి.పి.ఐ.(యం) సమిష్టి అవగాహణ. లేని కారణంగా సంయుక్త సోషలిస్టుపార్టీ, ప్రజాసోషలిస్టు పార్టీలు చొరవతో జనసంఘంతో ఏర్పాటు చేసిన ప్రభుత్వంతో "సి.పి.ఐ.వొక అవగాహనకు వచ్చుట" దురదృష్టకరము, శోచనీయము. వామపక్ష కనీస ఐక్యత లేకపోవుట, ముఖ్యంగా కమ్యూనిస్టు పార్టీలు అందుకు ఏ మాత్రం హృదయపూర్వకంగా పనిచేయక పోగా, వొండొరులను ఏకాకులను చేసి బలహీనపరచే ఎత్తుగడలనే, చీలిక అనంతరం అనుసరించుట, ప్రధానంగా మతమౌఢ్య, మితవాద శక్తులు బలపడుటకు కారణంగా చెప్పవచ్చును.

సోషలిస్టు వర్గాలలో కూడ సమిష్టి అవగాహన కొరవైంది. ప్రజాసోషలిస్టు పార్టీ వర్గాలు కాంగ్రెసు వైపుకు, సంయుక్త సోషలిస్టు పార్టీ తన గుడ్డి కాంగ్రెసు వ్యతిరేకతతో జనసంఘం వైపుకు పయనించాయి. ఫలితంగా, సంయుక్త సోషలిస్టు పార్టీని అనుసరించేశక్తులు ప్రజాసామాన్యం కాంగ్రెసు వ్యతిరేక కూటమివైపుకు ముఖ్యంగా వామపక్షాలున్న సంఘటనవైపుకు ఆకర్షితులగుచున్నారు. కాని ఆ పార్టీలోని కమ్యూనిస్టు వ్యతిరేకశక్తులు ముఖ్యంగా నాయకత్వంవర్గాలు గుడ్డిద్వేషంతో జనసంఘం గల కూటమి వైపు పయనించుట జరిగింది.

బీహారు, యు.పి.లలో సి.పి.ఐ.(యం) కంటే సి.పి.ఐ.కి ఎంతో కొంత అధికబలం కలిగియున్నది. ఈ వాస్తవాన్ని సి.పి.ఐ.(యం) ఆమోదించి, గుర్తించక "పెద్ద అన్నవైఖరి" అవలంభించిన కారణంగానే, రెండుకమ్యూనిస్టు పార్టీల మధ్య ఎట్టి ఎన్నికల అవగాహన ఏర్పడలేదు. వామపక్షాల ఐక్యతను పెంపొందించే ప్రయత్నాలు చెప్పకొనతగినంతగా జరుగలేదు. కమ్యూనిస్టు పార్టీలు రెండూ, చీలికలు అనంతరం, ప్రధానంగా ఒకరినొకరు ప్రజల నుండి వేరుచేసి బలహీన పరచుకొనే ఎత్తుగడలనే అనుసరించారు కాని వామపక్ష ఐక్యతకై మాటలు చెప్పుట తప్ప, ఎట్టికృషి, కార్యాచరణ చేపట్టలేదు.

అట్టి పరిస్థితులలో సి.పి.ఐ., ఎన్నికలలో అవగాహనకు ప్రజాసోషలిస్టులు సంయుక్త సోషలిస్టులతో సంప్రదింపులు జరుపుట, ఒప్పందానికి వచ్చి ఎన్నికలలో పాల్గొని కొన్ని సీట్లలలో గెలుపొందుట జరిగింది. సోషలిస్టు పార్టీలు రెండూ ఎన్నికలకు ముందే జనసంఘంతో కలసి ఐక్యసంఘటనగా ఏర్పడినవి. ఎన్నికల తదనంతరం అవిరాష్ట్ర ప్రభుత్వాలను ఏర్పాటు చేసినవి. సి.పి.ఐ. ఎన్నికల సీట్లు సర్దుబాటు అవగాహనను ఎన్నికల అనంతరం రాజకీయ అవగాహనగా రూపొందించి, సంఘటనలో, అధికారంలో భాగస్వామిగా చేరుట, తత్ఫలితంగా జనసంఘం బలపడుట, తదనంతరం కాలంలో స్పష్టమగుట, సి.పి.ఐ. ఎత్తుగడల వైఫల్యాన్ని స్పష్టం చేసింది. సి.పి.ఐ. తన బలాన్ని పెంపొందించు కొనలేక పోయింది, మొత్తంగా వామపక్షశక్తులు బలపడలేదు. అత్యంత మితవాద, మతమౌఢ్యశక్తులు మాత్రమే బలపడినందున సి.పి.ఐ. ఎత్తుగడలలోని వైఫల్యం స్పష్టము.

కాంగ్రెసు వ్యతిరేక ప్రజావెల్లువను ప్రజాస్వామ్య పక్షాల, పంథాల వైపుకు మళ్ళించుటకు వామపక్షాలు వైఫ్యలానే ఎదుర్కొన వలసి వచ్చింది. కాంగ్రెసు వ్యతిరేకసంఘటనలు బీహారు, యు.పి. పంజాబ్‌లలో బలమైననవిగా రూపొందజాలకపోయాయి. కాంగ్రెసు ప్రజలలో బలమైనశక్తి అగుట వలన కాదు. బెంగాల్, కేరళలలోవలే ప్రజాస్వామ్యశక్తులు బలమైనవి కావు. నాల్గవ జనరలు ఎన్నికలు కేరళలో కాంగ్రెసు, కేరళ కాంగ్రెసు రెండూ కలసి 43 శాతం వోట్లను మాత్రమే పొందగలిగాయి. బెంగాల్‌లో కాంగ్రెసు 40 శాతం పొందింది. కాని యు.పి.లో 32, బీహారులో 33, పంజాబ్‌లో 37.5 శాతం మాత్రమే కాంగ్రెసు పొందగలిగింది.

కాంగ్రెసు వ్యతిరేకతత్వంలో రెండు నిర్ధిష్టపోకడలు ఫలితాలు, రాజకీయపరిణామాలను 1967-69 సంవత్సరాల అనుభవాలు స్పష్టం చేస్తున్నవి. ఒకపోకడ యు.పి., బీహారు, పంజాబులలోను, మరోరకపు పోకడ పశ్చిమ బెంగాల్, కేరళలలో స్పష్టంగా కన్పడుతున్నవి. మొదటి పోకడ వామపక్షాలు బలహీనంగా ఉన్నరాష్ట్రాలలో ఐక్యసంఘటనలకు వ్యతిరేకంగా కాంగ్రెసు కొంతవరకు విజయాలను పొందగలిగింది. రెండువ పోకడ వామపక్షాలు బలంగా ఉన్న పశ్చిమ బెంగాల్, కేరళ ఐక్యసంఘటనలలో కాంగ్రెసు తనకుట్రల ప్రయత్నాలకు బలమైన ప్రజాప్రతిఘటనోద్యమాన్ని, కాంగ్రెసు వ్యతిరేక ప్రజాసమీకరణను, ప్రజాస్వామ్య ఐక్యసంఘటనా శక్తులను ఎదుర్కొనవలసి వచ్చింది. కేంద్రపాలక పార్టీయైన కాంగ్రెసు నాయకత్వం అంచేతనే, కమ్యూనిస్టులు లేని ఏవిధమైన ఐక్యసంఘటనల ప్రభుత్వాలనైనా తాము సహించగలమని, తమ మద్దతువుంటుందని కుటిల రాజకీయ ఎత్తుగడల నవలంభించుతు, తమరాజకీయ వ్యూహాన్ని సిద్ధాంతాన్ని, ఐక్యసంఘటనల ప్రభుత్వాలను

విచ్ఛిన్నం చేయు ఆచరణ విధానాలను అభివృద్ధి చేసింది. అంటే బూర్జువా వర్గం వామపక్షాల నెదుర్కొనుటకు శాస్త్రీయ వ్యూహాన్ని అమలు చేసింది.

వివిధ రాజకీయ పార్టీలు, గ్రూపులతో తక్షణ సమస్యలపై ఐక్యకార్యాచరణ, తాత్కాలిక పోరాట ఐక్యకూటములను, ఐక్యసంఘటనలను సూత్రబద్ధంగా ఏర్పాటు చేయుటను సి.పి.ఐ.(యం) కోరుతున్నది. ఈ ఐక్యకూటములను ఏర్పాటు చేయునపుడు అవకాశవాదాన్ని, పసలేని కాంగ్రెసు వ్యతిరేకతయే ఐక్యసంఘటనల ప్రధాన లక్ష్యంగా పెట్టుకొనలేదు. ఎన్నికల 1967-68 పోరాటాలలో సి.పి.ఐ.(యం) శాఖ లేవీ జనసంఘం, స్వతంత్రపార్టీలతో ఎన్నికల ఒప్పందాలు, పరస్పర అవగాహనలు, బహిరంగ "సహకారాల"ను నిషేధించాయి. సి.పి.ఐ.(యం) నిర్ణయాత్మక పాత్ర వహించ లేని రాష్ట్రాలలో ఐక్యసంఘటనల ఏర్పాటును నిషేధించి, ఎన్నికలలో సీట్లసర్దుబాట్లను మాత్రమే ఆమోదించింది. కనీస కార్యక్రమాల ప్రాతిపదికపై కూడ ఐక్యసంఘటనలను ఏర్పాటు చేయువిధానాన్ని కూడవ్యతిరేకించింది. ఎన్నికలైన తరువాత వివిధ పార్టీల ప్రభుత్వాల వర్గనైజాన్ని విశ్లేషణ చేసి, కేరళ, పశ్చిమ బెంగాలులలో తప్ప బీహారు, యు.పి., పంజాబ్‌లలోని కాంగ్రెసేతర రాష్ట్ర ప్రభుత్వాలలో చేరరాదని నిర్ణయించుటయే గాక, అంతకు ముందు చేరిన అసెంబ్లీ ప్రతిపక్ష ఐక్యసంఘటనల నుండి కూడ నిష్క్రమించింది. అసెంబ్లీలలో కాంగ్రెసేతర మంత్రి వర్గాలకు విమర్శనాత్మక మద్దతునిస్తూ, వామపక్ష విప్లవ ప్రతిపక్షస్వతంత్ర గ్రూపుగా పనిచేస్తుందని, బహిరంగ ప్రకటన చేసింది. అదేకాలంలో మద్దతు ప్రకటించినపుడు అది తప్పనిసరిగా షరతులతో కూడినది, సమస్యలను బట్టి ఉంటుందని స్పష్టం కూడ చేసింది.

ప్రజా సోషలిస్టు పార్టీ, సంయుక్తసోషలిస్టు పార్టీలు ముఖ్యంగా బీహారు, సంయుక్తరాష్ట్రాలు, పంజాబులలో కాంగ్రెసేతర ప్రజాస్వామ్య ప్రజావెల్లువను అభివృద్ధి చేస్తూముందుకు పురోగమన మార్గంలో పయనించునట్లు చేయుటకు బదులు, ఎన్నికలు అయిన వెంటనే కాంగ్రెసుకు పరోక్షంగా మద్దతును చేకూర్చుతు ప్రజావెల్లువను భగ్నం చేసి, కూలిపోతున్న కాంగ్రెసు పునాదులకు కొంతబలాన్ని, స్థిరత్వాన్ని చేకూర్చారు. రెండు సంవత్సరాల తరువాత ఎనిమిది రాష్ట్రాలలోని కాంగ్రెసేతర ప్రభుత్వాలలో చాలా కాంగ్రెసు కుట్రలతో కూలి పోయిన తదనంతరం కూడ, కాంగ్రెసు పాలన యెడల అసంతృప్తి, రాజకీయ వ్యతిరేకత విస్తరించుతూ, పెరుగుతూనే వుంది.

దేశంలోని రాజకీయ పరిస్థితి, ప్రజల ముందు రెండు ప్రత్యామ్నాయాలను ఉంచుతున్నది. కాంగ్రెసు బూర్జువా, భూస్వామ్య ప్రభుత్వం సృష్టించిన ఆర్థిక రాజకీయ సంక్షోభాన్ని ప్రజాస్వామ్య అభ్యుదయకరశక్తులు వినియోగించుకొని మౌలిక రాజకీయమార్పులనైనా ప్రవేశపెట్టాలి, లేదా అభివృద్ధి నిరోధక విప్లవ ప్రతీఘాతక శక్తుల ప్రభుత్వ చీకటి పాలన మరింత దౌర్జన్య, హింసా, దమనకాండలను చేబట్టి, దేశాన్ని చీకటిలో ముంచివేయాలి.

అనగా, మరోమాటలలో కాంగ్రెసేతరైక్యసంఘటనల బీహారు యు.పి., పంజాబ్,

మధ్యప్రదేశ్‌లలో అవాంఛనీయ ప్రమాదకర పరిస్థితులు యేర్పడి ఐక్యసంఘటన అధ్వర్యంలో పశ్చిమ బెంగాల్, కేరళలలో ఐక్యకార్యక్రమాల అభివృద్ధి, బహుళంగా విస్తరించుటతో ఐక్యసంఘటనల అనుభవాలు, యితర రాష్ట్రాలలో వ్యాపించాలి, లేదా స్థానికశక్తులు అనుభవాలను వినియోగించలేని స్థితిలోవున్నపుడు ప్రజావుద్యమాలస్థాయి పెరుగదు, పరిణామాలపై వాటి ప్రభావం ఉండదు.

జాతీయ అంతర్జాతీయ విప్లవోద్యమాలపై వాటి ప్రభావం, యీ పదునెనిమిది మాసాల ఐక్య సంఘటనల అనుభవం, ప్రభావం, అటు కాంగ్రెసేతర ప్రభుత్వాల అనుభవాలు రెండూ, ఐక్యసంఘటనల అవగాహనల అభివృద్ధికి చిహ్నమైంది. నిర్ధారించబడిన కొన్ని సూత్రాలనే హృదయ పూర్వకంగా అమలు చేయుట ప్రధానాంశమైంది.

ప్రధమాంశం, కార్మిక వర్గ పార్టీయైన కమ్యూనిస్టు పార్టి, దాని వర్గబలాన్ని, ప్రజబలాన్ని స్థిరీకరించుట, వొకస్వతంత్ర రాజకీయశక్తిగా తయారై బలపడుట అవసరము. నిజమైన విప్లవ ఐక్యసంఘటనా దృక్పధము, దాని ప్రత్యేకతలేనిచో అర్ధాన్నే కోల్పోతుంది. అటువంటి ఐక్యసంఘటనను నిర్మించి, స్వతంత్ర శక్తిగా అభివృద్ధి చేయనిచో ప్రజల విశ్వాసాన్నిపొంది, వారిని ఉత్సాహపరచజాలదు.

కమ్యూనిస్టు పార్టీలు మిత్రపార్టీలను, గ్రూపులను సంఘటనలో భాగస్వాములుగ, వారికార్యక్రమాలు, విధానాలు వాటి ఆచరణల ప్రాతి పదికలుగా మౌలిక వర్గవైఖరి దృక్పధంలో అంగీకృత కనిష్ట కార్యక్రమం అమలు చేయుటలోని వైఫల్యాలను, నిజాయితీని ప్రశ్నించుతు విమర్శించే హక్కును ఎన్నటికీ వదలుకొనజాలరు. ఇతర పార్టీలకుగల అట్టిహక్కును గౌరవించుతారు. ఐక్య సంఘటన కొనసాగినంతవరకు, ఆ పార్టీల వర్గపాత్రినిధ్యం, వారి విధానాలలో ప్రతిబింబించుతుందని విశ్వశిస్తారు.

కార్యక్రమము, తత్సంబంధసమస్యలపై ఐక్యసంఘటలోని భాగస్వాములైన పార్టీలలో భేధాభిప్రాయాలు వచ్చి, వాటిని అంగీకృత సాధారణకార్యక్రమాల పరిధిలో పరస్పర సంప్రదింపులలో పరిష్కారంకానిచో సమస్యలు, అభిప్రాయబేధాలు స్పష్టంగా ప్రజల ముందు స్వేచ్ఛగా తమతమ అభిప్రాయాలను అన్నిస్థాయిలలోని వారు వెలిబుచ్చి, చర్చించికొని, సమన్వయం చేసుకొని, సమిష్టిగా నిర్ణయాలు తీసుకొనే అవకాశం అందరకు కలిగించాలి. అగ్రనాయకుల మధ్య చర్చలతో అంత్యనిర్ణయాలు చేయారాదు[1].

### 3. పశ్చిమ బెంగాల్‌లో సి.పి.ఐ.(యం) సైద్ధాంతిక అవగాహనలు, ఆచరణల్లపై సి.పి.ఐ. విమర్శన, తనవైఖరి వివరణ.

నాల్గవ సార్వత్రిక ఎన్నికల తరువాత సి.పి.ఐ. కాంగ్రెసేతర రాష్ట్ర ప్రభుత్వాల నిర్మాణ సమస్యలను వెంటనే చేపట్టవలసి వచ్చింది. అందులో భాగస్వామ్యం వహించే సమస్యగూడా ప్రధాన సమస్యకు అనుబంధ సమస్యగా ముందుకొచ్చింది. కేరళ, పశ్చిమ బెంగాలలోని పరిస్థితి, సమస్యసాధారణ సమస్యకాగా, బీహారు, పంజాబు, యు.పి.లలోని సంక్లిష్ట

1. *పొలిటికల్ ఆర్గనైజేషనల్ రిపోర్టు (1968) సి.పి.ఐ.(యం) 8వ, పార్టీ కాంగ్రెసు (ఆంగ్లంలో)* పే. *167–8.*

సమస్యలు ప్రత్యేక సమస్యలైనవి. మొదటి రెండు రాష్ట్రాలలో కనీస సమిష్టికార్యక్రమం, తదనంతరం దానిని ఆమోదించిన వారితో సంకీర్ణమంత్రి వర్గాల నిర్మాణం ప్రధాన సమస్యలైనవి. కమ్యూనిస్టులు యీ కర్తవ్యాలను గణనీయమైన చొరవ, నేర్పుతో, ఓర్పుతో చక్కగా నిర్వహించారు. బీహారు, యు.పి, పంజాబులలో పరిస్థితుల ప్రభావం కారణంగా యీ కర్తవ్యవ నిర్వహణ అనేక "ఆటు పోటులు"కు గురై కొంత అవకాశవాదానికి చోటునిచ్చింది.

కేరళ, పశ్చిమ బెంగాలులలో ఐక్యసంఘటనలు కమ్యూనిస్టుల నాయకత్వంలో వుండుటతో రాష్ట్ర ప్రభుత్వాలను ఏర్పాటు చేయాలా లేదా అనే సమస్యయే గాని, అందులో చేరాలాలేదా అనే సమస్య ఉదయించలేదు. బీహారు, యు.పి., పంజాబ్ రాష్ట్రాలలో మత, మితవాద బూర్జువా పార్టీల నాయకత్వంలో ముఖ్యంగా జనసంఘం నాయకత్వంలో ఏర్పడు సంకీర్ణ ప్రభుత్వాలలో కమ్యూనిస్టులు చేరాలా లేదా అనే ప్రశ్నవుదయించింది. బీహారులో సి.పి.ఐ. కేంద్ర శెక్రటేరి యట్ అనుమతితో సంకీర్ణ ప్రభుత్వంలో చేరాలనే సాహసవంతమైన నిర్ణయాన్ని చొరవతో చేశారు. కమ్యూనిస్టులను మంత్రివర్గంలో చేర్చుకొనుటను జనసంఘం వ్యతిరేకించిన వెంటనే, పార్టీ అగ్రనాయకత్వంపై తీవ్ర అసంతృప్తి, వ్యతిరేకత వెల్లుగా పొంగింది. పార్టీకి మద్దతునిచ్చేవారిలో కూడ వ్యతిరేకత వచ్చింది. బీహరు కమ్యూనిస్టులు వోటర్లు కాంగ్రెస్సేతర ప్రభుత్వమేర్పాటు చేయాలనే ప్రజలతీర్పును మన్నించుతామని బహిరంగ ప్రకటన చేసారు. అదే ప్రకటనలో మంత్రివర్గంలో చేరకుండా, బయటనుండి మద్దతు నిస్తామని బహిరంగంగా ప్రకటించారు. ఈ ప్రకటన వొక్కటే పార్టీ ప్రతిష్టను పునరుద్ధరించింది. అదేకాలంలో జనసంఘం ప్రతిష్టను చాలా కోల్పోయింది.

బీహారులో కమ్యూనిస్టులు చొరవతో సమిష్టికనీస కార్యక్రమాన్ని రూపొందించుటలో వచ్చిన అనేక క్లిష్ట సమస్యలకు, నాయకత్వ సమస్యకు,తత్సంబంధ, మంత్రి వర్గనాయకత్వ సమస్యలకు పరిష్కారం మార్గం కనుగొనుటలో సహాయపడ్డారు, లేనిచో రాజకీయాలు పూర్తిగా మరోదిశకు మళ్ళించబడేది.

పంజాబులో మొదట సి.పి.ఐ.సంయుక్త సంఘటన ప్రభుత్వంలో చేరకుండా మద్దతు నిర్వనిర్ణయించింది. ఇది పరిస్థితులు కోరే నిర్ణయానికి ప్రజలు ఆశించేదానికి దూరంగా వున్నట్లు స్పష్టమైంది. పంజాబు కమ్యూనిస్టులు ఆ విధానాన్నుండి వైదొలగి మంత్రి వర్గంలో చేరారు, అదే సరియైన విధానంగా నెంచారు. అంతేగాక, సి.పి.ఐ. "మంత్రివర్గంలో మనం భాగస్వాములగుట ఎంతో విలువైనదని, రుజువైందని" ఆత్మసంతృప్తి చెందింది.

జనసంఘం యు.పి.లో సంయుక్త విధాయకదళ్‌లో 97 స్థానాలను కలిగి ఉంది, సంయుక్త సోషలిస్టు పార్టీ, సి.పి.ఐ. రిపబ్లికనులు అందరు కలసినా అసెంబ్లీలో అంతబలంలేదు. జనసంఘం నాయకత్వంలోని సంయుక్త సంఘటనా ప్రభుత్వంలో సి.పి.ఐ. ప్రతినిధులు మంత్రివర్గంలో చేరుటకు, పార్టీనాయకత్వం ఆమోదించక వ్యతిరేకంగా ఉంది. కాని రాష్ట్ర పార్టీ నాయకత్వంలోని అత్యధికులు సుముఖంగా వుండుటతో, చివరకు కేంద్ర

సి.పి.ఐ. నాయకత్వం అదే నిర్ణయానికి రావలసి వచ్చింది. "ఆ సమయంలో ప్రభుత్వంలో చేరుట సరియైనది, లేనిచో మా వైఖరిని ప్రజలు తప్పుగా అర్థం చేసుకొనేవారు[1]." అని సి.పి.ఐ. 8వ, పాట్నాపార్టీ కాంగ్రెసునివేదిక తమ్ముతాము సమర్థించుకొని ఆత్మసంతృప్తి చెందింది. దేశంలో ఒక అతిపెద్ద రాష్ట్రంలో ఏర్పడిన సంకీర్ణ ప్రభుత్వంలో పని చేయుట ఎంత కష్టమో ప్రజల అనుభవంలోనికి వచ్చుటకు అవసరమైన యీ పరిణామాలు తోడ్పడినవి.

సి.పి.ఐ. కేంద్ర కార్యవర్గ సమితి, కాంగ్రెసేతర రాష్ట్ర ప్రభుత్వాలలోని పార్టీ నాయకులకు పార్టీ దృక్పధాన్ని వివరించుటకు వివిధ రాష్ట్రాలలోని ఐక్యసంఘటనల మంత్రి వర్గాలలోగల పార్టీప్రతినిధుల సమావేశాన్ని ఏర్పాటు చేసి, ఆసంయుకత్త సమావేశంలో సంకీర్ణ ప్రభుత్వాలలో పనిచేయుటకు మార్గదర్శిక సూత్రాలను చర్చించింది. ఆసంకీర్ణ ప్రభుత్వాలలోని కమ్యూనిస్టు ప్రతినిధులు సమిష్టికనీస కార్యక్రమాన్ని అమలు పరచుటలో చొరవను, ధృఢత్వాన్ని రెండింటిని అనుసరించాలని నిర్ణయించారు. జులైలో తిరిగి జరిగిన సమావేశంలో మధ్యకాలంలోని అనుభవాల వెలుగులో కాంగ్రెసేతర ప్రభుత్వాలు ఎదుర్కొనే సమస్యలకు సమాధానాలను. అన్వేషించ ప్రారంభించి, వర్గపొందిక, రాజకీయ దృక్పధాల క్రమంలో వర్గీకరణ గావించి, ఆచరణకు సౌలభ్యతను చేకూర్చుతుంది. కాంగ్రెసేతర ప్రభుత్వాలు నిర్దిష్ట ప్రతి పాదనలతో ప్రజలకు సహాయ, సహకార్గాలను అందివ్వాలని తలచుచున్నది. సెప్టెంబరులో జరిగిన సమావేశంలో కేంద్ర కార్యవర్గం అదే సమస్యపై ఒక తీర్మానం చేసింది. ప్రజల జీవన పరిస్థితులను మెరుగు పరచుటకు మరింత పెద్దగా చొరవతీసుకొనాలని నొక్కిచెప్పింది. భూమిశిస్తు తగ్గించుట, డిటెయిన్ చేయబడిన నాన్‌గెజిటెడ్ ఉద్యోగులను విడుదల చేయనిచో యు.పి. మంత్రివర్గం నుండి నిష్క్రమించాలని కేంద్ర కార్యవర్గం నిర్ణయించింది. ఈ సందర్భంలో ప్రత్యేకంగా సంయుక్త సోషలిస్టు పార్టీతో కలసి సంయుక్తంగా యీ చర్య చేబట్టుటలో సి.పి.ఐ. జాగ్రత్త వహించింది. సమస్య తీవ్రత ప్రజలందరకు బహిరంగంగా వివరించుట జరిగింది. సి.పి.ఐ., సంయుక్త సోషలిస్టు పార్టీల సంయుక్త కార్యాచరణతో జనసంఘం, చరణ సింగులు తడబడి పోయారు. ఉద్యోగులు తదనంతరం విడుదల చేయుటకు ఒప్పందం జరిగింది. అయినా చరణసింగ్ చేసిన వాగ్దానాన్ని నిలబెట్టు కొనజాలక పోయారు. ఫలితంగా, సి.పి.ఐ. మంత్రులు రాజీనామా చేసారు. ఇది పార్టీ ప్రతిష్టను పెంచింది. సంయుక్త సోషలిస్టు పార్టీ తదపరి అదేపని చేసింది.

పంజాబులో మితవాద అభివృద్ధి నిరోధక శక్తులు సంయుక్త సంఘటనలోని సి.పి.ఐ.పై ప్రభుత్వంలో దాని పాత్రపై తీవ్రదాడిని సాగించారు. మంత్రి వర్గంలోని కమ్యూనిస్టులను ముఖ్యంగా సత్యపాల్ డాంగ్‌ను తొలగించాలని "సూపరు ఛీఫ్‌మినిష్టరుగా" ప్రవర్తిస్తున్నాడని చేసిన దాడి విఫలమవ్వగా, కొంతమంది చీలికదారులను ప్రోత్సహించారు. సంయుక్త సంఘటన పడిపోగా సి.పి.ఐ. "మధ్యంతర ఎన్నికలు జరగాలనే" నినాదాన్నిచ్చి, ప్రజాకార్యచరణ చేబట్టారు.

1. *సి.పి.ఐ., 8వ పాట్నా పార్టీ కాంగ్రెసు (1968) రాజకీయ నిర్మాణ నివేదిక (ఆంగ్లంలో)* సి.పి.ఐ. పబ్లికేషన్. పే. *81.*

బీహారులో జనసంఘపు చర్యలు ఐక్యసంఘటన మంత్రివర్గంలో తీవ్ర సంఘర్షణకు కారణమయ్యాయి. దాని మతతత్వతీవ్రవాద చర్యలు అగ్నికి ఆజ్యం పోసాయి. సి.పి.ఐ. బహిరంగంగా జనసంఘపు మతద్వేషాన్ని రెచ్చగొట్టే చర్యలపై ప్రభుత్వం చర్యతీసుకొనాలని ఆందోళన చేబట్టింది. ప్రభుత్వం చర్య తీసుకొనకుంటే కమ్యూనిస్టు మంత్రులు రాజీనామా చేస్తారని హెచ్చరించింది. ఐక్యసంఘటనా ప్రభుత్వాన్ని సోషిత్‌దళ్ విద్రోహులు, పదవీవ్యామోహపరులు, లంచగొండులు, దౌర్జన్య, బెదరింపులతో కూలద్రోసారు.

సి.పి.ఐ.(యం) 1967లోనే సంయుక్త సంఘటనలో వుండుటకు నిరాకరించింది. అందుకు సి.పి.ఐ.తో బంగ్లాకాంగ్రెసుతో, పార్వర్డుబ్లాకులతో ఐక్యసంఘటనను ఏర్పరచుటకు నిరాకరించింది. కారణం సి.పి.ఐ.తో ఐక్యసంఘటన ఏర్పాటుకు పూర్తిమద్దతునివ్వదు. ఒకవేళ ఐక్యసంఘటనకు ఆమోదించుట అంటే సి.పి.ఐ.(యం) నాయకత్వంలోనని స్పష్టము.

నాల్గవస్వారత్రిక ఎన్నికలు 1967లో జరుగునపుడు, సి.పి.ఐ.(యం) తనయేకైక నాయకత్వాన్ని ఆమోదించని ఐక్యసంఘటనలో, తదనంతర ప్రభుత్వంలో చేరుటకు బంగ్లాకాంగ్రెసు నాయకత్వంలో ఏర్పాటు అయ్యేమంత్రి వర్గంలో చేరుటకు ఆమోదించి, ఎన్నికలు ఐక్యంగాపోరాడుటలో చేరింది. వాస్తవానికి యిదివారి సైద్ధాంతిక అవగాహనలకు వ్యతిరేకంగా వ్యవహరించింది. ప్రజల తీర్పును ఆమోదించక, ఎన్నికల ముందు వాగ్దానాన్ని భగ్నం చేసారు. అంతేగాక 1969 మధ్యంతర ఎన్నికలలో గూడ ఐక్యసంఘటనలో వుండుటకు, యితర వామపక్షాలు సంఘటన పోటీచేసే స్థానాలలో అధికాస్థానాలను కేటాయించుటతో ఆమోదించారు. అందరూకలసి ఎన్నికలలో పోటీ చేయుటతో అధిక సీట్లను గెలచి కొనుటను ఆమోదించక, అంటే సమిష్టివిజయంగా ఆమోదించక, ప్రజలు తమని పెద్ద పార్టీగ ఎన్నుకొన్నారనే వాదనతో, ప్రభుత్వంలో ప్రధాన బాధ్యతలను వహించ వలసి ఉంటుందని, హోంశాఖతోపాటు, ముఖ్యమైన శాఖలన్నిటిని తమకే కావాలని కోరుతూ, సంఘటన చీలిపోయే వరకు లాగుతూ, బంగ్లా కాంగ్రెసుకు ముఖ్యమంత్రి పదవినిచ్చుటకు చివరకు ఆమోదించింది. ఆర్థిక శాఖను సి.పి.ఐ.కు నిరాకరించుటయేగాక, హోమ్‌శాఖ తమకే వుండాలని మొండిగా వాదించారు. ప్రజలు తమకే అధికారంలోనికి వోటు వేసారనే వాదన వామపక్ష శక్తులందరి విశ్వాసాన్ని పొంద లేకపోయింది. కారణం 1967లో సి.పి.ఐ., బంగ్లా కాంగ్రెసు, పార్వర్డు బ్లాకు, బోల్షివిక్ పార్టీలు కలసి ఐక్యవామపక్ష, ప్రజాసంఘటనతో బహిరంగంగా వ్యతిరేకంగా, సి.పి.ఐ.(యం) తదితరులు కలసిన ఫ్రంటు పోటీ చేసినపుడు 44 స్థానాలు మాత్రమే రాగా, 1969లో అన్నివామపక్షాలు, కాంగ్రెసేతర పార్టీలు కలసిన ఫ్రంటుకు 83 స్థానాలు వచ్చాయి. ఈ విజయం ప్రధానంగా వామ పక్షాలలో, కాంగ్రెసేతర ప్రతిపక్షాలలో చీలిక వలన అనేది స్పష్టం. ఇది పూర్తిగా సి.పి.ఐ.(యం) బలంగా నెంచుట ఎంతటి ఒంటెత్తు అవగాహనో స్పష్టం అగుతుంది.

"మంత్రి వర్గ శాఖల కేటాయింపు వివాదం, సి.పి.ఐ.(యం)కు అనుకూలంగా జరుగుటకు కారణం, సి.పి.ఐ.తో బంగ్లా కాంగ్రెసు, పార్వర్డుబ్లాకు, సంయుక్త సోషలిస్టు పార్టీ, సోషలిస్టు యూనిటీ సెంటరు, తదితర సంఘటనలోని భాగస్వాములందరూ. సంఘటనను భగ్నం చేయుటకు కుట్రలు పన్నుతున్నారనే వారందరూ, సి.పి.ఐ.(యం) కంటే ఐక్యసంఘటనా ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసి, కాంగ్రెసు కుటిల రాజకీయాలకు స్వస్తి

చెప్పుటకు ధ్వధ నిశ్చయంతోవుండి. ప్రజలకు ఐక్యసంఘటనా ప్రభుత్వాన్ని యివ్వనిశ్చయించుట వలన జరిగింది కాని[1]" సి.పి.ఐ.(యం) వాదనలు శాస్త్రీయమైనవని విశ్వసించుట వలన కాదు. వామపక్షాల, ప్రజాస్వామ్యవాదుల విజయాన్ని సి.పి.ఐ.(యం) విజయం మాత్రంగా అంగీకరించుటవలన కాదని విజ్ఞులందరికి స్పష్టమైంది. సి.పి.ఐ.(యం) వొంటెత్తు పోకడలు వామపక్షాలకు, ప్రజాస్వామ్యవాదులందరికి తేట తెల్లమయ్యాయి. వామపక్షాలు "వర్గపోరాటం తీవ్రతరమగుటకు భయపడి పోయారని" సి.పి.ఐ.(యం) "అందుకే వారు సంఘటన ప్రభుత్వమేర్పాటుకు ఆతురత చూపారనీ" వికృతనిందా ప్రచారం కూడ సాగించింది. ఈ సందర్భంలో సి.పి.ఐ.(యం) రెండ ప్రధానాంశాలు మరచిపోయింది.

ప్రధమాంశం; ఐక్యసంఘటనా ప్రభుత్వం ఏర్పడిన తరువాత మాత్రమేగాక, అంతకు ముందే 1966-67లలోనే వర్గ పోరాటాలు వెల్లువగా అభివృద్ధి చెందిన ఫలితంగానే ఐక్యసంఘటనలోని పార్టీలన్నీ బలపడినందుననే, చివరకు ఐక్యసంఘటన ఏర్పడుట సాధ్యమైంది. అధ్యక్షపాలన విధించుటతో వర్గపోరాటం అత్యున్నిత దశకు చేరుకొంది, ఐక్యసంఘటన అంతకుముందు కంటే అనేక రెట్లు బలపడింది. ఆదినాలలో జరిగిన బ్రహ్మాండమైన పోరాటాలకు యేపార్టీనైనా ప్రత్యేకంగా చెప్పజాలం, కాని సి.పి.ఐ., బంగ్లాకాంగ్రెసు, ఫార్వర్డు బ్లాకులను పేర్కొనాలి, వారినే సి.పి.ఐ.(యం) పోరాట వ్యతిరేకులు, ఐక్యసంఘటనా వ్యతిరేకులని అపనిందలతో ముంచెత్తుతుంది. ఆ పోరాటాలలో పోలీసు నిషేధాజ్ఞలకు వ్యతిరేకంగా పోరాడి లాఠీ చార్జీలకు గురై ఆసుపత్రులలో మ్రగ్గినవారిలో ముఖ్యంగా బ్రిగేడు గ్రౌండులో క్షతగాత్రుల పట్టికలలో సి.పి.ఐ.(యం) కార్యకర్తల నాయకుల పేర్లు కానరావు, అరెస్టు అయినవారిలో క్షతగాత్రులలో అత్యధికులు సి.పి.ఐ.వారేనని అందరకు తెలుసు. సి.పి.ఐ.(యం) యీ వాస్తవాలను యేమాత్రం ఒప్పు కొనదు, స్థానిక ప్రజలకు యీ వాస్తవం తెలుసు.

ఈ వాస్తవాలను పరిగణించక ఐక్యసంఘటనలో సి.పి.ఐ.(యం)ను వొకే వొక పెద్దపార్టీగ గుర్తించి, సంఘటన పోటీ చేసే స్థానాలలో అత్యధిక స్థానాలలను తనకే కేటాయించాలని, మధ్యంతర ఎన్నికలలో మొండిపట్టుపట్టింది. అన్ని విజయాలను సి.పి.ఐ.(యం)కు జమవేయనిబో ఐక్యసంఘటన ఏర్పరచే అవకాశాన్ని చేజార్చే ప్రమాదం ఉందని, వామపక్షాలు గుర్తించి సి.పి.ఐ.(యం) కోర్కెలన్నిటిని ఆమోదించాయి. ఈ వాస్తవం తెలిసిన యితర వామపక్షాలకు సి.పి.ఐ., కొన్ని వామపక్షాలపై సి.పి.ఐ.(యం) మోపిననిందా, ఆరోపణలు నిరాధారాలని ముఖ్యంగా వర్గపోరాటాలకు వ్యతిరేకులని చేసిననిందా, ఆరోపణలు నిరాధారాలని స్పష్టమైంది.

మరో అంశం; రాష్ట్రంలోని మూడు ప్రధాన పరిశ్రమలలో జరిగిన సార్వత్రిక సమ్మెలలో వర్గపోరాట విస్తృతి, తీవ్రత 1968-69లలో స్పష్టమైంది. జూట్, టీ, కాటన్ పరిశ్రమలలో యీ పోరాటాలు జరిగాయి. వీటిని సి.పి.ఐ.(యం) యొక్క అతిపెద్ద పోరాటాలుగ పేర్కొనుట, వొంటెత్తు పోకడ ఎంతటి శిఖరాగ్రానికి చేరిందో తెలియజేస్తుంది. ఈ బ్రహ్మాండమైన

---

*1. భవానిసేన్ (1969) "సి.పి.ఐ.(యం) ఫైట్స్ ఎగనెస్ట్ యునైటెడ్ ఫ్రంటు ఇన్ వెస్టు బెంగాల్"* సి.పి.ఐ. పబ్లికేషన్. *పే. 2.*

పోరాటాల వెనుక ఐక్యసంఘటనలోని సి.పి.ఐ. తదితర వామపక్షాలు అగ్రభాగాన నిలబడినవి. ఈ వాస్తవాన్ని గ్రుడ్డిద్వేషంతో చూడనిరాకరించుతు, సి.పి.ఐ.తదితర వామపక్షాలు వర్గపోరాటమంటె భయపడి పోతున్నారనుట, వాస్తవఘటనలను కప్పిపెట్టుట. వక్రీకరించుట తప్పమరొకటికాదు. ఈ బ్రహ్మాండమైన జనరలు సమ్మెలు రెండు ప్రధాన అంశాల కారణంగా సాధ్యమైనవి.

1) ఐక్యసంఘటనా ప్రభుత్వం పారిశ్రామిక వివాదాలలో పోలీసు తటస్థతను గ్యారంటీ చేసింది. ఇది అత్యంత ముఖ్యఅంశం. ఈ విజయం ఐక్యసంఘన మొత్తంగా సంపాదించిన విజయం. ముఖ్యమంత్రి, ముఖ్యశాఖలను మొండి పట్టుపట్టి పొందగలిగినా, ఇది ఐక్యసంఘటన మొత్తం విజయమే కాని, వొక్క సి.పి.ఐ.(యం) విజయం కాదు. ఈ యజ్ఞానికి పౌరోహిత్యం సి.పి.ఐ.(యం) వహించినా వరుసగా జరిగిన సార్వత్రిక సమ్మె పోరాటాలు చరిత్రలో నూతన దశకాన్ని, కాంగ్రెసు వ్యతిరేక ఐక్యసంఘటనా, కార్మిక వర్గ ఐక్యపోరాటాలను ఆవిష్కరించాయి.

సి.పి.ఐ.(యం) ఇటీవలే ఎన్నికలద్వారా ఏర్పడే రాష్ట్ర ప్రభుత్వాల అధికారాలు పరిమితులు, వాటినైజాన్ని ప్రశ్నించుతు బహిరంగంగా వెలిబుచ్చింది. నాల్గవ సార్వత్రిక ఎన్నికలు పూర్తి అయిన వెంటనే 1967లో రాష్ట్ర ప్రభుత్వాలకు వాస్తవాధికారాలు యేమాత్రంలేవని, ఐక్యసంఘటనా ప్రభుత్వాల పరిస్థితి అంతేనని ప్రకటించింది. నేడు 1968లో రాష్ట్ర ప్రభుత్వాలకు అధికారాలున్నవని అంగీకారానికి వచ్చారు. కాని, ఆ అధికారాలన్నీ వొక్క సి.పి.ఐ.(యం)కు మాత్రమే, భాగస్వామ్య ప్రతినిధులైన మంత్రులకు కాదని వారి అవగాహన కారణం ఐక్యసంఘటనలో వారిది అదిపెద్దపార్టిగా ఉంది.

ఒకప్పుడు సి.పి.ఐ.(యం) అగ్రనాయకత్వం రాజ్యాంగాన్ని బ్రద్దలు చేయనంత వరకు ఎన్నికలలో రాష్ట్రాలలో అధికారాన్ని చేబట్టగలిగినా చేయగలిగినదేమీలేదని ప్రకటించారు. నేడ ఏ వివరణలు యివ్వకుండా, రాజ్యాంగాన్ని మార్చకుండా కొంత మంచిని చేయవచ్చని, తమ అభిప్రాయాలను మార్చుకొనుటయేగాక, విశ్వసిస్తున్నారు. అంతేగాక, వర్గపోరాటానికి కొంతపదును కూడ పెట్టవచ్చని అంటున్నారు. అయితేయిది ఒక్క సి.పి.ఐ.(యం)కే సాధ్యమంటున్నారు. తస్మాత్ జాగ్రత్త. 'విస్సన్న చెప్పిందే వేదం', అదే ఆచరణీయం. ఒంటెత్తు వైఖరుల, పోకడల పరాకాష్ట విచారించతగినది.

2) జూట్, టీ, గుడ్డల మిల్లుల కార్మిక సంఘాల ఐక్యకార్యాచరణ పరిశ్రమలలోని కార్మికులలో ఐక్యత, ప్రజాస్వామ్యం తలెత్తి, చురుకుగా పని చేస్తున్న పార్టీల, సంఘాల మధ్య ఐక్యతను పెంపొందించ గలిగింది. టీ, జూట్ పరిశ్రమలోని కార్మికులలో సి.పి.ఐ.(యం) ప్రధాన శక్తిగా, టెక్స్‌టైల్ పరిశ్రమలోని కార్మికులలో సి.పి.ఐ. ప్రధాన శక్తిగా వున్నాయి. ఎడతెగని సమ్మెలకు ఐ.యన్.టి.యు.సి. సైతం దూరంగా వుండజాలక పోయింది. కార్మికవర్గఐక్యత అంత్యంత విలువైన విజయం, సి.పి.ఐ.(యం) దానిని బ్రద్దలు చేయప్రయత్నిస్తున్నది.

"మార్క్సిస్టు" మిత్రులు గుత్తపెట్టుబడి దారులు - ప్రజస్వామ్య శక్తుల మధ్య తీవ్రతరమగుతున్న వైరుధ్యాలను చూడ నిరాకరించుతు కరుడు గట్టిన "స్టాలిన్

వక్రీకరణవాదుల" వలె "వర్గపోరాటం తీవ్రమైన అన్నివామ పక్ష ప్రజాస్వామ్య పార్టీలను కార్మిక వర్గవ్యతిరేకులుగ చేయజాలదని ఆలోచించలేరు. సి.పి.ఐ.ను, బంగ్లాకాంగ్రెసును, పార్వర్డుబ్లాకును, సోషలిస్టు యూనిటిసెంటర్‌ను, వర్గపోరాటం తీవ్రమగుటతో భయపడి పోతున్నారని నిందించుట, వారు 1964లో రూపొందించుకొన్న కార్యక్రమంలో చివరకు జనతా ప్రజాస్వామ్య విప్లవమార్గంలోనికి, బూర్జువావర్గంలో కొన్ని శెక్షనులు వచ్చి కలుస్తాయని పేర్కొనుటను మరచి పోవుటను తెలియజేస్తుంది. "బూర్జువావర్గంలోని యీ భాగం జాతీయబూర్జువా వర్గంలోని శెక్షనులు- రాజ్యాధికారానికి వ్యతిరేకమార్గం లోనికి త్రోసివేయబడతారని, వారికి జనతాప్రజాస్వామ్య సంఘటనలో స్థానం వుంటుందని," కార్యక్రమంలోని 106 శెక్షనులో స్పష్టంగా పేర్కొనబడింది. అయినా సి.పి.ఐ.ని, పార్వర్డుబ్లాకును, బంగ్లాకాంగ్రెసును నిందించుట కొరకు వారు కార్యక్రమాలు రూపొందించిన సూత్రాన్నే త్రోసిబుచ్చుతున్నారు. ఇది స్వీయమానసిక అశాస్త్రీయధోరణి తప్ప శాస్త్రీయసోషలిజం కాని మార్క్సిజం కాని కాజాలదు.

మార్క్సిజం-లెనినిజం ప్రకారం ఆచరణలో సిద్ధాంతం పరిశీలించ బడుతుంది. అనేక సారులు ఆచరణ పురోగమించిన తరువాతే సిద్ధాంతం రూపొందుతుంది. సి.పి.ఐ.(యం) ఆచరణ, నిర్ధారణలు కార్యక్రమంలోని 100 శెక్షనును అనుసరించే వుంటుంది. దాని ప్రకారము జనతా ప్రజాస్వామ్య సంఘటన నిర్మాణానికి, సి.పి.ఐ.(యం) నాయకత్వం ముందుగా ఆమోదించవలసిన షరతు; బూర్జువావర్గం కాని దానిలోని కొన్ని శెక్షనులు కాని సి.పి.ఐ.(యం) నాయకత్వాన్ని ఆమోదించునని వూహించజాలము. గుత్తపెట్టుబడి దారేతర బూర్జువావర్గం, జనతా ప్రజాస్వామ్య సంఘటనలో భాగస్వాములగుతారని కార్యక్రమంలోని శెక్షను 100 పేర్కొనలేదు.

సి.పి.ఐ.(యం) కార్యక్రమంలోని శెక్షను 100, శెక్షను 106ను త్రోసిబుచ్చుతున్నది. అందులోనే, బూర్జువావర్గంలోని ఒక భాగమైన జాతీయ బూర్జువావర్గం జనతా ప్రజాస్వామ్య సంఘటనలో భాగస్వాములుగ అగుతారని స్పష్టం చేయబడింది[1].

## 4. సి.పి.ఐ.(యం)పై ఆంధ్రప్రదేశ్ విప్లవకారుల సైద్ధాంతిక విమర్శన

"భారతకమ్యూనిస్టు పార్టీలో 1964లో వచ్చిన చీలికకు ముందే గ్రూపులు ఏర్పాటుకు దారితీసిన భేదాభిప్రాయాలు, విభేదాలు పార్టీలో ఉన్నాయి. సి.పి.ఐ.(యం)లో గూడ వివిధ స్థాయిలలో గ్రూపులు ఉండేవి. మార్క్సిస్టుపార్టీనుండి మేము విడిపోవుసందర్భంలో కొన్ని గ్రూపులు మాకు సంక్రమించాయి[2]" అని ఆంధ్ర ప్రదేశ్ విప్లవకారుల కమిటి, వారి "మామౌలిక పంథా- ఐక్యతాసమస్య" అనే పత్రంలో పేర్కొన్నారు. "నయారివిజనిస్టు సి.పి.ఐ.(యం) నుండి మేము చీలిపోయిన నాటినుండి అతివాద అవకాశవాదం మొదట అఖిల భారతస్థాయిలో అఖిల భారతవిప్లవకమ్యూనిస్టుల సమన్వయ కమిటి తరువాత సి.పి.ఐ.(యం.యల్)లో, రాష్ట్ర కమిటిలో చంద్ర పుల్లారెడ్డి గ్రూపు క్రమంగా రూపుదిద్దుకొన్నది.

1. *భవానిసేన్ (1969) సి.పి.ఐ.(యం) ఫైట్ ఎగనెస్ట్ యునైటెడ్ ఫ్రంట్ ఇన్ వెస్ట్ బెంగాల్, సి.పి.ఐ. పబ్లికేషన్ పే. 5-6.*
2. *మా మౌలికపంథా - ఐక్యతాసమస్య (1973) ఆ.ప్ర.క.క. (విప్లవకారుల) పే. 82.*

అతివాద పదజాలంతో చీలికలను విప్లవపంథా నెదుర్కొనుటకు వారి ప్రధాన ఆయుధాలుగవున్నవి.

విప్లవకారులు "నయారివిజనిస్టులు" (సి.పి.ఐ.(యం)) తాము 1951 విధాన ప్రకటన, ఎత్తుగడల పంథాకు కట్టుబడి వున్నామని, దానిలో వ్యక్తి గత హింసావాదాన్ని ఖండించే అంశమొకటివున్నదని, దానికే కట్టుబడి ఉన్నామని చెబుతారని", సి.పి.ఐ.(యం)ను విమర్శించుతు "ప్రజలచైతన్యానికి అనుగుణ్యమైన పోరాటరూపాలనే అంశాన్ని వివరించే, లెనిన్, మావోరచనల నుంచి ఉల్లేఖించి "ఉగ్రవాదులను" తీవ్రంగా విమర్శించుతూ ఆంధ్రవిప్లవకారులపై ద్విముఖ పోరాటాన్ని సాగించారు. మార్క్సిస్టులు తాముసవ్యక్తిగత హింసావాదంపై చేసిన విమర్శన సరియైనదిగా నెంచుటకు ఆధారాలు లేవని సాయుధపోరాట వ్యతిరేకులు, వీరు చేసే విమర్శన మౌలికంగా ఒకటేనని మార్క్సిజానికి విరుద్ధమైనదని స్పష్టము. వారి నయారివిజనిజం మౌలికాంశాలలోయిది ఒకటి[1]" అని విప్లవకారులు సి.పి.ఐ.(యం)ను విమర్శించుట సహేతుకంగాలేదు. వ్యక్తిగత హింసావాదాన్ని మార్క్సిజం-లెనినిజం నిర్ద్వందంగా ఖండించుటయేగాక, మన తెలంగాణా అనుభవందానినే బలపరుస్తున్నది. అంతర్జాతీయ కమ్యూనిస్టు అగ్రనాయకత్వం 1951లో తెలంగాణా సాయుధరైతాంగ పోరాటం వ్యక్తిగత హింసావాదంగా దిగజారుట, సాయుధరైతాంగ భూపోరాటాన్ని అధికారాన్ని హస్తగతం చేసుకొనుటకై జరిగే పోరాటంగా నెంచుట, రెండు ప్రధానతప్పులను ఎత్తిచూపెట్టింది. కమ్యూనిస్టు శ్రేణులన్నీ దాన్ని ఆమోదించాయి. విప్లవ కారులపై సి.పి.ఐ.(యం) చేసిన విమర్శన, అంతర్జాతీయ, దేశీయ అనుభవాలు ఒక్కటే అయినందున అత్యధిక కమ్యూనిస్టు గ్రూపుల ఆమోదం పొందింది.

సి.పి.ఐ.(యం) ఒకవైపు సి.పి.ఐ. కార్యక్రమాన్ని శాంతియుత, సహజీవ, పార్లమెంటరీ, మితవాద సోషల్‌డెమోక్రటిక్ సంస్కరణ వాద పంథాగా, పరుషపదజాలంతో విమర్శనాస్థాయినిదాటి, వ్యతిరేకిస్తూ, సి.పి.ఐ.(యం) తన కార్యక్రమంలో శాంతియుత పంథా ప్రధానం పేర్కొన్నది. ఇది "ఏదోయాదృచ్ఛికంగా" కాక "చైతన్యయుతంగానే పేర్కొనడం" జరిగింది. "ఈ విషయంలో సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)ల మధ్యమాటలతేడా తప్పితే తేడాయేమీలేదని గుర్తుంచుకోవాలి".

"శాంతి మార్గంలో జనతా ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని సాధించుటకు, సోషలిస్టు పరివర్తనను తెచ్చుటకు సి.పి.ఐ. కృషి చేస్తున్నది. శక్తివంతమైన ప్రజావుద్యమంతో పార్లమెంటరీ, పార్లమెంటేతర పోరాట రూపాలను సమ్మేళనం ద్వారా కార్మికవర్గం, దాని మిత్రులు అభివృద్ధి నిరోధకశక్తులు ప్రతిఘటనను అధిగమించి, యీ పరిణామాన్ని శాంతి మార్గాన సాధించుటకు తనశక్తి కొలది కృషి చేస్తుంది[2].

మార్క్సిజం, లెనినిజం సూత్రాలు వల్లిస్తూ సమాజ మార్పుకు విప్లవమే మార్గమంటూ "జనతా ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని, సోషలిస్టు పరివర్తనను శాంతి యుతంగా ఆవిష్కరించుటకు శక్తికొలది కృషిచేస్తానని" వొక వైపు ప్రకటిస్తూ, విప్లవ పంథాకు కట్టుబడి

1. భారత విప్లవకారుల అతివాద ధోరణి (1973) ఆ.ప్ర.క.క. (విప్లకారులు) పే. 6-7.
2. కార్యక్రమం (1964) సి.పి.ఐ.(యం) 7వ. పార్టీకాంగ్రెసు ఆమోదించినది. పే. 113

ఉన్నామని, తమదే శిసలైన కమ్యూనిస్టు పార్టీయని, చాటుకొంటూ, పార్టీ శ్రేణులను, సానుభూతిపరులను, ప్రజలను మోసగించుట కమ్యూనిస్టు నిజాయితీ లేమిని, బూర్జువాపార్టీల మోసపూరిత విధానములను తెలియజేస్తుంది. ప్రపంచంలో ఎక్కడా శాంతియుతంగా నిజమైన కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పడలేరు. సోషలిజంలోనికి శాంతియుత పరివర్తనకు ఉదాహరణ లేదు.

సి.పి.ఐ. లాగానే సి.పి.ఐ.(యం) కూడా లాంచనంగా ఎలాంటి మార్పులు అవాంతరాలు అయినా ఎదుర్కొనుటకు సిద్ధంగా ఉండాలని పేర్కొన్నది. మితవాద సంస్కరణ వాదం కూడా అతివాద సంస్కరణవాదం వలెనె చేస్తున్నది. వ్యవసాయ విప్లవం ఇరుసుగా, కార్మిక వర్గ నాయకత్వంలో అతివాద సంస్కరణవాదులు జనతా ప్రజాస్వామ్య విప్లవాన్ని ఆవిష్కరిస్తారు. మితవాదులమాటలకు, అతివాదుల నినాదాలకు, విప్లవకారుల ఆచరణకు తేడాయిదేగా చెప్పవచ్చును.

సి.పి.ఐ.(యం) దేశంలో అనుసరించవలసిన విప్లవ పంథాను రష్యా, చైనా పంథాలు కాక, నిర్దిష్ట భారత పరిస్థితులలోని "లెనినిస్టు భారతపంథా" అనుట నిర్వివాదాంశము. అంతర్జాతీయ కమ్యూనిస్టు అగ్రనాయకులతో చర్చల అనంతరం 1951లో సి.పి.ఐ. రూపొందించిన రాజకీయ విధాన ప్రకటన, ఎత్తుగడల పంథాలను సి.పి.ఐ.(యం) భారతీయపంథాగా చెప్పుతూవచ్చారు. గ్రామీణ సాయుధరైతాంగ గెరిల్లా భూపోరాటాలను నగరాలలో కార్మికవర్గ తిరుగుబాటులతో సమ్మేళనం చేయుటయే సి.పి.ఐ.(యం) పంథాగా యం. బసవపున్నయ్య వివరించారు. "రష్యాలోలాగ త్వరితంగా చప్పున దాడి చేయటం, లేదా చైనాలోగా 20 సంవత్సరాలకు మించి దీర్ఘకాలిక సాయుధపోరాటంగాని భారతదేశ ప్రత్యేక పరిస్థితులలో సాధ్యంకాదు, కనుక యీ రెండు సాధనాలను మేళవించుట సి.పి.ఐ.(యం) ఎత్తుగడల పంథా సమీక్షలో వివరించింది. "ప్రాముఖ్యతగల ప్రాంతాలు", "వ్యూహాత్మక ప్రాంతాలు" వంటి పదాలను పట్టుకొని ప్రేళ్ళాడవలసిన అవసరంలేదు.

దేశవ్యాపిత విస్తృత ప్రజాపునాదిని రూపొందించుకొని, కార్మిక వర్గాన్ని అన్నికీలక పరిశ్రమలలోని వారిని సమీకరించి, ఐక్యసంఘటన కీలక పరిశ్రమలలోని మెజారిటీ కార్మికవర్గాన్ని సమీకరించాలని ఎత్తుగడలపందా భోదిస్తున్నది. పురోగమించే ఉద్యమాలను అర్ధపాశిస్టుదమన కాండనుండి రక్షించుకొని పురోగమించాలన్నా దేశవ్యాపిత మద్ధతు లేకుండా సాధ్యంకాదని అనుభవం స్పష్టంచేసింది. ఇది సి.పి.ఐ.(యం) ఎత్తుగడల పంథా, భారత లెనినిస్టు పంథాగా చెప్పబడుతున్నది.

ఈ పంథాను సి.పి.ఐ.(యం.యల్) ప్రజాపంథా వాదులు "ఇది దేశవ్యాపిత తిరుగుబాటు పంథా తప్పమరొకటిగాదు. రెండవ ప్రపంచ యుద్ధానంతరంచైనా, వియత్నాం, తదితర విప్లవాలనుగుర్తించి, తగిన పాఠాలు తీసుకొనుటను నిరాకరించుట తప్పమరొకటిగాదు. కార్యక్రమంలో శాంతియుతపంథాను ప్రధానంగా పేర్కొని యిక్కడ విప్లవపంథాను గురించి మాట్లాడుట కేవలం కన్నీరుతుడుపు మాత్రమే. ప్రజలను, విప్లవశ్రేణులను వంచించుటకు

---

*1. సత్యం (1989) భారత నూతన ప్రజాతంత్ర విప్లవం. కొన్ని పెదధోరణులు ప్రజాపంథా ప్రచురణ, గుంటూరు పే. 32.*

మాత్రమే. ఇది భారతదేశనిర్ధిష్ట వాస్తవ పరిస్థితులకు, ప్రపంచ విప్లవానుభవాలకు, మార్క్సిస్టు మహోపాధ్యాయుల భోధనలకు ఏ మాత్రం తగినట్లుగా లేదని[1]" తీవ్రంగా విమర్శించి, త్రోసిబుచ్చారు.

సి.పి.ఐ.(యం) ఎత్తుగడల పంథా సమీక్షలో నగరాలలో కార్మికవర్గ నాయకత్వంలో కార్మికులు, నగర బడుగు వర్గాల తిరుగుబాటులను, గ్రామీణ ప్రాంతాలలోని భూమికై పోరాడే సాయుధరైతాంగ గెరిల్లా పోరాటాలతో ఒకేసారి జోడించుటయే ప్రధానాంశంగా యం. బసవ పున్నయ్య వివరించారు. ఇది మరోమాటలలో అక్టోబరు 1917 రష్యావిప్లవంలో బోల్షివిక్ పార్టీ అనుసరించిన ఎత్తుగడలకు దగ్గర సారూప్యత కలిగియున్నది. విస్తృత అచరణార్థంలో మరోమాటలలో 1947-50 నాటి రణదివె "రష్యను పంథా"లో కార్మిక, కర్షక విప్లవ పోరాటాల పంథా విజయ మార్గంగా చెప్పబడింది. అక్షరాల, రణదివె రష్యాపంథాలో నగరాలలో కార్మికవర్గ సాయుధ తిరుగుబాటులకు, గ్రామీణప్రాంతాలలోని సాయుధరైతాంగ గెరిల్లాల భూపోరాటాలను అనగా చైనాపంథాను జోడించుట లేక "అంటుగట్టుట" లేక నూతనాంశాలను చేర్చి, కూర్చిన నూతన నమూనా రష్యన్-చైనా విప్లవ పంథాగా, భౌతిక సమ్మేళనం అయితే జరిగింది. కాని, సిద్ధాంత సమ్మేలనంలో పరిపూర్ణతను చేకూర్చే ప్రయత్నం జరిగినట్లు కనుపించదు.

"సి.పి.ఐ.(యం) స్థాపన సందర్భంలో మనమొక విచిత్రమైన పరిస్థితిని ఎదుర్కొన్నాము. దాని చుట్టూ సమీకృతులైన పార్టీశ్రేణులలో అత్యధిక భాగంవిప్లవపంథాను అనుసరించుటకు అత్యంత అనుకూలమైన ప్రాతిపదికగావున్నరు. కాని, నాయకులలోని అత్యధిక భాగం రివిజనిస్టు లేక నయారివిజనిస్టు వైఖరితో ఉన్నారు. ఇది అత్యంత అనుకూల అంశం. ఈ అనుకూల అంశమే అప్పుడు సి.పి.ఐ.(యం) భవిష్యత్తును నిర్ణయించింది. రివిజనిస్టు వ్యతిరేకం పోరాటంలోనికి వారుచొప్పించిన పెడమార్గం పట్టించే పద్ధతులు కొత్తగాయేర్పాటైన నిర్మాణాన్ని తప్పు దోవ పట్టించేందుకు ఉద్దేశించబడ్డాయి. అంతేగాదు, యీ పద్ధతులు తమరివిజనిస్టు వ్యతిరేకతకు సూత్రబద్ధ ప్రాతిపదిక లేని వివిధరకాల కేరీరిస్టు, రివిజనిస్టు అవకాశవాదశక్తులు కూడ సి.పి.ఐ.(యం)లో చేరి అందులో నాయకత్వ స్థానాలను హస్తగతం చేసుకొనటానికి కూడా అనుకూల పరిస్థితులను కలిగించాయి.

"సి.పి.ఐ.(యం) నాయకులలో అత్యధిక భాగం, వారి అభిప్రాయాలలో స్పష్టంగానోలేక అస్పష్టంగానో నయారివిజనిస్టులు వారు నిజాయితీగానూ, నిర్మాణయుత పద్ధతిలోనూ తమ అభిప్రాయాలను బయటపెట్టలేదు. చర్చల ఆధారంగా సమస్యలయెడల తమస్వంతవైఖరిని స్వేచ్ఛగా నిర్ణయించుకొనేందుకు పార్టీ శ్రేణులకు అవకాశం యివ్వలేదు. వారుకుయుక్తులకు, పెడమార్గం పట్టించే ఎత్తుగడలకు తమ అభిప్రాయాలను దొడ్డిదోవన చొప్పించే పద్ధతులు అవలంభించారు. ఈ సందర్భంగా తమ రివిజనిస్టు అభిప్రాయాలను

---

1. *సత్యం (1989) భారత నూతన ప్రజాతంత్ర విప్లవం కొన్ని పెదధోరణులు. ప్రజా పంథా ప్రచురణ. గుంటూరు పే. 35-36.*

ప్రతిపాదించడంలో సి.పి.ఐ. నాయకత్వం హెచ్చు "నిజాయితీగా" వ్యవహరించారని చెప్తే అతిశయోక్తికాదు[1]."

సి.పి.ఐ.(యం) 1951 విధాన ప్రకటన, ఎత్తుగడల పంధాకు కట్టుబడి ఉన్నానని మాటలలో పునరుద్ఘాటించుతు, ఆచరణలో నియో రివిజనిజాన్ని అనుసరించుచున్నదనే తీవ్రవిమర్శన, విడిపోయిన విప్లవకమ్యూనిస్టు, సి.పి.ఐ.(యం.యల్) వర్గాలేకాక సి.పి.ఐ.(యం) అగ్ర నాయకత్వంలోని కొన్ని వర్గాలలోనే భిన్నాభిప్రాయాలున్నవి, ఆచరణలో, చేబట్టవలసిన నిర్మాణ చర్యలలో, ఆలోచనా విధానాలలో వాటిని పెడమార్గంపట్టించుచున్నదనే అభిప్రాయం ఉంది. విశాల భారతదేశంలో మౌలికంగా వలస ఆర్థిక విధానం, 80 శాతం ప్రజాసామాన్యం వ్యవసాయంపై ఆధారపడినందున రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటాలు విప్లవోద్యమ ప్రధాన సాధనాలని ఎత్తుగడలునొక్కి చెప్పుతున్నదని, చైనా కంటే మనదేశంలో రవాణాసౌకర్యాలు, కార్మికవర్గం గణనీయంగా ఉన్నప్పటికి, పాలకవర్గాలు తమబలాన్ని వేగంగా సమీకరించి అణచివేయగల అవకాశాలు యెక్కువగా ఉన్నంత మాత్రాన, రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటాల ప్రాముఖ్యతను, మౌలిక ప్రధానాంశాన్ని త్రోసిరాజని చెప్పజాలమని సుందరయ్య అభిప్రాయంగా ఉంది.

కేంద్ర సమితి సభ్యులకు పంపిన జులై 1975 నోటులో కొన్ని విషయాలలో భిన్నాభిప్రాయాలను చర్చించి, నిర్ణయాలు చేయవలసిన అవసరాన్ని కా॥ సుందరయ్య యిలా పేర్కొన్నారు. "భారతదేశపు విప్లవ దృక్పదాన్ని నిర్ధారణ చేయవలసియున్నది. పార్టీ కాంగ్రెసు, కేంద్రకమిటి తీర్మానాలు, విధాన ప్రకటన అనే ఎత్తుగడల పంధాను అనేక సార్లు పునరుద్ఘాటించుచున్నప్పటికి ఆచరణలో త్రోసిబుచ్చుతున్నారు. విధాన ప్రకటనయిచ్చే అవగాహన, పంధాను పార్టీ తప్పని సరిగా అనుసరించాలి.

'పారిశ్రామిక కార్మిక వర్గం కేంద్రీకరించబడిన ప్రాంతాలు, వాటిచుట్టూ ఉన్నవిస్తార, విశాల గ్రామీణ ప్రాంతాలలో రైతాంగ వుద్యమం వ్యాప్తి చేయాలి. అవి మొట్టమొదట రాజకీయ స్థావర ప్రాంతాలుగ ప్రజానీకంలోనికి వెళ్ళి అభివృద్ధి చేయాలి. వాటినే తరువాత రైతాంగ గెరిల్లా ప్రాంతాలుగ, విముక్తి ప్రాంతాలుగ అభివృద్ధి చేయాలి. ఈ విధంగా యీ ప్రాంతాలను అభివృద్ధి చేయుటలో ఆప్రాంతాల కార్మికవర్గం ప్రధాన పాత్రవహించాలి. సాహసిక చర్యలతో తనబలాన్ని శక్తిని బలహీన పరచరాదు. పాలకవర్గపై కూడ అపరిపక్వ, అసమబల పోరాటచర్యలకు దిగరాదు. నగరాలలో కూడా అదే విధానాన్ని అనుసరించాలి.

"కార్మికవర్గం తక్షణ ఆర్థిక సమస్యలపై పోరాటాలకే పరిమితం కాకుండా, రైతాంగ భూసమస్యతోను, నగర, గ్రామీణ బడుగు వర్గాల, మధ్యతరగతుల పోరాట సమస్యతో మేళవించి పోరాటాల తీవ్రత, వాడిని పెంచాలి. వెనుక బడిన వర్గ ప్రజాసామాన్యాన్ని, అసంఘటిత శ్రామిక వర్గాలను, నిరుద్యోగులను పోరాటాలలో సమీకరించాలి. దక్షిణ ప్రాంత కేంద్రకమిటి సభ్యుల సమావేశంలో ఎత్తుగడల పంధాను అన్ని ప్రజాసంఘాలు,

---

*1. భారత విప్లవోద్యమం, కొన్ని గుణపాఠాలు - అనుభవాలు యు.సి.సి.ఆర్.ఐ. (యం.యల్) కేంద్ర కాన్ఫరెన్స్ ఏప్రిల్ 1989లో ఆమోదించిన సమీక్ష జనశక్తి ప్రచురణ పే. 68-69.*

పార్టీశాఖలు ఆరుమాసాలలో అమలు చేయుటకు కార్యాచరణ విధానాలను రూపొందించాలని, కేంద్రకమిటీలోని భేదాభిప్రాయాలన్నిటిని చర్చించి, నిర్ణయాలు తీసుకొనాలని యేకగ్రీవంగా నిర్ణయించారు. కా.యం.బి.కూడ ఆమోదించారు.

"కాని, పొలిట్‌బ్యురో 2 సెప్టెంబరు 1975న సర్క్యులర్‌లో యిలా పేర్కొన్నది. "భేదాభిప్రాయాలున్న అనేక రాజకీయ, నిర్మాణ సమస్యలపై పార్టీలో అంతర్గత చర్చలు కొనసాగించ ప్రయత్నించుట, కేంద్రకమిటి చర్చించుట అవాంఛనీయము, పార్టీకి నష్టదాయకమని పొలిట్‌బ్యురో ఆలోచించి, చేసిన నిర్ణయము. అత్యంత ముఖ్యమైన తక్షణ సమస్యలను, పొలిట్‌బ్యురో చేబట్టవలసిన సమస్యలను, కేంద్రకమిటీ ఆమోదంతో ప్రధాన రాష్ట్ర సెక్రటేరియట్ సభ్యులతో, అన్ని రాష్ట్రకమిటీల సెక్రటేరియట్ సభ్యులతో కూడ కాదు – పరిమిత చర్చలు జరుపబడుతవి. ఎత్తుగడల పంథా (పరస్పెక్టివ్ ఎత్తుగడల పంథా) దృక్పధాన్ని, ఆచరణ వివరాలను వెంటనే చర్చించుట అవసరమూ, వాంఛనీయముకాదు. ఏమైనా కేంద్ర కమిటి మరో విధంగా తలచిన చర్చలు ప్రధాన రాష్ట్రాల శెక్రటేరియట్ సభ్యుల వరకే పరిమితం చేయబడాలి[1]". ఇది సి.పి.ఐ.(యం)లోనే 1970 దశకంలో 1951 ఎత్తుగడ పంథా ఆచరణలపై అన్ని స్థాయిలలో తీవ్రభేదాభిప్రాయాలు ఉండుట వాస్తవం. సి.పి.ఐ.(యం.యల్) వర్గాలు వాటినే ఎత్తిచూపుటలో ప్రత్యేకత యేమిాలేదు. అయితే సి.పి.ఐ.(యం)లోని కొన్ని వర్గాల అభిప్రాయాలు కమ్యూనిస్టు విప్లవకారుల అభిప్రాయాలకు చేరువగా ఉండుటను మాత్రం తెలియజేస్తుంది.

ఈ సందర్భంలో సి.పి.ఐ.(యం) కేంద్ర కమిటి 1967 ఆగస్టులో సిద్ధాంత సమస్యలపై అవగాహనలు, ఆచరణలు, వాటి పరిష్కరించుటకు చేసిన ప్రయత్నాలలోనే భేదాభిప్రాయాలు అనంతంగా అభివృద్ధి చెందుటకు, బీజాలను, మొలకెత్తుటను చూడగలము. ఆగస్టులో కేంద్రకమిటి 1) సిద్ధాంత సమస్యలపైముసాయిదా 2) పార్టీకార్యక్రమం 3) అతివాదపెడధోరణి అనే మూడు సిద్ధాంత పత్రాలను విడుదల చేసింది. "ఆంతరంగిక సైద్ధాంతిక చర్చలను లోతుగా వివరంగా చర్చించకుండా, నామమాత్రంగా కుదించి, సి.పి.ఐ.(యం) నాయకత్వం పరిమితులు, హద్దులు విధించిందని" విప్లవకారులు 1960 దశకంలోనే విమర్శించారు, అదే 1970 దశకంలోనూ జరిగింది. ఆంధ్రప్రదేశ్ విప్లవకారులు సిద్ధాంత పత్రాలు కార్యక్రమం, ఎత్తుగడలపై చర్చలు పూర్తిగా జరుగవలసిందే నని పట్టుబట్టారు. కేంద్ర కమిటి సిద్ధాంత పత్రాలను రాష్ట్ర కమిటి, ప్రతినిధుల సమావేశంలో మూడింట రెండువంతుల మెజారిటితో తిరస్కరించారు. సి.పి.ఐ.(యం) అఖిల భారత నాయకత్వం, సిద్ధాంత సమస్యను, పార్టీనిర్మాణ సమస్యచేసి, రాష్ట్ర కమిటీని రద్దుచేసి, ఆర్గనైజింగు కమిటీని వేసింది. భారతకమ్యూనిస్టు ఉద్యమంలో యిట్టి సంఘటనలు గతంలోనూ జరిగాయి, అవే చీలికలకు నాంది అయ్యాయి.

---

1. సుందరయ్య, పి. (1991) మైరెజగ్నేషన్, ఇండియా పబ్లిషర్స్ అండ్ డిస్ట్రిబ్యూటర్స్, న్యూఢిల్లీ. పే. 21-22.

అవలంబించ వలసిన ఎత్తుగడలలు, కర్తవ్యాలను అంచెనా వేయడంలో సి.పి.ఐ., సి.పి.ఐ.(యం), సి.పి.ఐ.(యం.యల్), విప్లవకారుల మధ్య మౌలిక అభిప్రాయభేదాలు యేర్పడుట సహజం. వాటినిన పరిష్కరించుట ఆయా కాలాలో అవలంబించిన విధానాల బట్టే ఫలితాలు, పార్టీలో ఐక్యత లేక చీలికలు ఏర్పడుట జరిగింది. కమ్యూనిస్టు ఉద్యమ నాయకత్వాల ఆచరణ నుండి పొందిన కఠోర అనుభవాలు కమ్యూనిస్టు శ్రేణులకు హెచ్చరికలుగా వుంటాయి. అనుభవం, కమ్యూనిస్టు ఉద్యమంలో అతివాద విప్లవవాగాడంబరత, మితవాద, అతివాద రివిజనిస్టు అవకాశవాదాలకు సురక్షితముసుకుగా ఎల్లప్పుడూ ఉపయోగపడింది. ఉద్యమాలను సంక్షోభంలోనికి దిగజార్చింది. ఇది చరిత్ర నేర్పిన గుణపాఠము.

# 3

# బెంగాలులో సైద్ధాంతిక పోరాటం సాయుధ సంఘర్షణలకు దిగజారుట.

దేశంలో 1960 దశకంలో ధరలు పెరిగి పోవుట, నిజవేతనాలు పడిపోవుటతో కార్మిక, కర్షక, మధ్యతరగతుల ప్రజాసామాన్య జీవితం దుర్భరమగుటతో సహజంగా వారి పోరాటాలు రోజురోజుకు తీవ్రతరం అగుటతో సి.పి.ఐ.(యం) "వర్గ పోరాటం తీవ్రతరమగుట" అనే సైద్ధాంతి అవగాహనకు వచ్చి, వివిధ వర్గాల మధ్య, ప్రభుత్వం మధ్య తరగతుల మధ్య పోరాటాలు పెరిగిపోయి, దానితోపాటు హింసా, దౌర్జన్యం పోలీసులతో కూడ ఘర్షణలు మొదలయ్యాయి. పారిశ్రామికయాజమాన్యాలపై కార్మిక వర్గం నమ్మెపోరాటాలు బదులు కార్మికుల మధ్య, విద్యార్థులు యువజనుల మధ్యసంఘర్షణలు, వివిధ పార్టీశ్రేణుల మధ్య సంఘర్షణలు తీవ్రమైనకొలది, ఒక విధమైన అంతర్యుద్ధ పరిస్థితులు ఏర్పడినది. ఈ పరిస్థితులలో సామాన్య ప్రజల ప్రజాస్వామ్య పోరాటాలలో ప్రజలకు వ్యతిరేకంగా యాజమాన్యాలతరపున పోలీసులు కలుగజేసుకొనరాదని కేరళ ఐక్యసంఘటనా ప్రభుత్వం సి.పి.ఐ.(యం) నాయకత్వంలో ప్రభుత్వ విధానాన్ని ప్రకటించింది.

ఐక్యసంఘటనలో ఆధిక్యతను తద్వారా యేకపక్షనాయకత్వాన్ని ఏర్పరచే అవకాశాలు పెంపొందించుకొని, తమస్థానాన్ని, బలాన్ని సుస్థిరం చేసుకొనులక్ష్యంతో పార్టీల మధ్యసాధారణ సంఘర్షణల పరిస్థితి ఏర్పడింది. ఏమి జరుగుచున్నది, వాస్తవఘటనలు, పరిణామాలు అర్థం చేసుకొనుటకు అత్యంత స్పష్టమైన కొన్ని ఘటనలను, పూర్తి వివరాలు తెలుసుకొనిన కొంతవరకు పూర్తివాస్తవ చిత్రం, మనకళ్ళముందు ప్రత్యక్షమౌతుంది. ఇది పాక్షికచిత్రమయ్యే అవకాశం లేకపోలేదు.

మే 15-16, 1969లలో ఆలీపూర్‌దోర్స్ (జుల్పగురి)లో సి.పి.ఐ.(యం) ఆర్.యస్.పి.ల మధ్య తీవ్రమైన సంఘర్షణ జరిగింది. అది టీ తోటల ప్రాంతం, ప్రత్యేకంగా సి.పి.ఐ.(యం)కు బలమైన కేంద్రం, ఆధిక్యత కలిగివుంది. అయినా ఆదివాసి టీ కార్మికులలో ఆర్.యస్.పి. బలమైన పునాది కలిగివుంది. సంఘర్షణ ఎలా ప్రారంభమైంది, ప్రారంభకులు ఎవరూ అనేది పక్షపాతం లేకుండా, విచారణ లేకుండా చెప్పజాలము. కాని ఘోరమైన విషయమేమంటే సాయుధులైన సి.పి.ఐ.(యం) వలంటీర్ల వూరేగింపు ఆర్.యస్.పి. పార్టీ ఆఫీసుపై దాడిచేసి, తగులపెట్టింది. పోలీసులు ప్రేక్షకులుగా వున్నారు. సంఘర్షణలు జరిగే పరిస్థితి తీవ్రంగా ఉన్నా, అందుకు సన్నాహాలు జరుగుతుండుట, పోలీసులుకు తెలిసివున్నా ఆర్.యస్.పి.పై ఘోరమైన దాడిని నివారించుటకు పోలీసులు యేమీచేయలేదు.

మే 18న సి.పి.ఐ.(యం) సమీకరించిన సాయుధమురా దానినాయకత్వంలో హరిన్ ఘటా, నాడియా జిల్లాలో సి.పి.ఐ. ఆఫీసులపై ఆకస్మాత్తుగా దాడి చేసారు. అది పార్టీ శెక్రటరీ ఆఫీసు, హాస్పిటలుగా కూడా ఉంది. సి.పి.ఐ. స్థానిక శాఖ, యిటువంటి సంఘర్షణ

జరుగుతుందని తలచనందున ఏ విధంగాను సంసిద్ధంగా లేదు. సంఘర్షణలో డాక్టరు తీవ్రంగా గాయపడ్డాడు, ఆసుప్రతిసామాను నాశనం చేయబడింది. ఆసుపత్రిలో పదిసైకిళ్ళు కూడాలూటీ చేసారు. ఈ ప్రాంతంలోని అనేక మంది సి.పి.ఐ.(యం) పార్టీ సభ్యులు ఆ పార్టీని విడిచి సి.పి.ఐ.లో చేరినందున యీదాడి జరిగినదని అనుకొనవచ్చు.

అదే రోజున మే 18న మల్లిక్‌గురి జిల్లా జాల్పగురిలోని దూపగురి ప్రాంతంలోని గ్రామంలో మార్క్సిస్టుకమ్యూనిస్టులు సంయుక్త సోషలిస్టు పార్టీని అనుసరించే 11 మంది రైతులు, ముగ్గురు కార్మికులను తీవ్రంగా గాయపరచారు. నాడియా జిల్లాలోని రాణాఘాట్‌లో కాందిశీలకుల కాంపులో సి.పి.ఐ. ఆధిక్యత కలిగివుంది. సి.పి.ఐ.(యం)కు అంతతక్కువ బలమేమీలేదు. మే 5న, సి.పి.ఐ.(యం) అనుచరులు కా. సమర్‌దేని సి.పి.ఐ.కి చెందిన కామ్రేడ్‌ని పొడిచిచంపారు. హింసాత్మకమైన తమదాడి విజయమగుటతో మరింత ధైర్యాన్ని పొందిన వారై మే 18న, మరోతూరి కూపర్సు క్యాంపుపైదాడి చేసారు. మే 22న, సి.పి.ఐ.కి చెందిన జాదవ్‌బారుయి, గోవింద్ ఘోష్‌లు సి.పి.ఐ.(యం) వాదులు దాడి చేయగా గాయపడ్డారు. ఫలితంగా మే 23న, రెండు పార్టీల మధ్యకూపర్సు క్యాంపు వద్ద ఘర్షణలు జరుగగా ఒక సి.పి.ఐ.(యం) సభ్యుడు మరణించాడు.

రైతుల కోర్కెలకై 24 పరగణాలలోని బంగర్‌లో సి.పి.ఐ. పెద్ద వూరేగింపు జరుపుతుండగా జూన్ 10న జరిగిన మీటింగుపై సి.పి.ఐ.(యం) వాదులైన సాయుధులు లారీలలోవచ్చిదాడి చేసారు. బల్లాలు, కత్తులు ఉపయోగించారు. పది మందికి గాయాలు అయ్యాయి.

కుల్టీలోని కమ్యూనిస్టుపార్టీ ఆఫీసును ఆగస్టు 13న, 150 మంది సి.పి.ఐ.(యం) అనుచరులు సాయుధలైదాడి చేసారు. సి.పి.ఐ. నాయకులకు గాయాలైనవి ఆఫీసు నాశనంచేసారు. ఈ దాడికి ముందు సి.పి.ఐ. నాయకత్వక్రింద జరిగే కూలీల సమ్మెనుభగ్నం చేయుటకు సి.పి.ఐ.(యం) చేయవలసిన ప్రయత్నాలన్నీ చేసింది. సి.పి.ఐ. సమ్మెకు నాయకత్వం వహించుచున్నది. సమ్మెను భగ్నం చేయలేక పోదా, నాయకత్వాన్ని దెబ్బ తీయసమకట్టింది.

గ్రామీణప్రాంతాలలో సి.పి.ఐ.(యం) కేంద్రంగా వచ్చిన సంఘర్షణలన్నీ భూములులేని పేదరైతాంగ ఆక్రమించిసాగు చేస్తున్న బంజర్లు కారణంగానే యీ సంఘర్షణలు జరుగుతున్నవి. అనేక ప్రాంతాలలో భూస్వాముల భూములను ఆక్రమించి పంటలు పండించుతున్న రైతాంగం సి.పి.ఐ.(యం) నాయకత్వంలోని రైతులుకారు. సి.పి.ఐ. నాయకత్వంలోని కిసాన్‌సభలో, పార్వర్డుబ్లాకు, సోషలిస్టు యూనిటి సెంటరులలో పనిచేస్తున్నారు. వారు ఆ విధంగా శాంతియుతంగా వ్యవసాయం చేసుకొనుట సి.పి.యం.కు యిష్టంలేదు. బలవంతంగా వారిని ఆ భూముల నుండి తొలగించి, తన నాయకత్వంలో సమీకరించిన రైతాంగానికి యివ్వతలపెట్టింది. సహజంగానే యిది సంఘర్షణలు యెక్కువగుటకు దారి తీసింది.

సి.పి.ఐ (యం), సి.పి.ఐల మధ్య 24 పరగణాల జిల్లాలో జరిగిన అనేక సంఘర్షణలు, సి.పి.ఐ (యం) – సోషలిస్టు యూనిటి సెంటరు మధ్య జరిగిన సంఘర్షణలు యీరకమైనవి. జులై 1969 నుండి సుందరబన్స్ ప్రాంతంలో జరిగిన సంఘర్షణలు కూడ యీ కోవకు చెందినవి.

బారనగర్ కా॥ జ్యోతిబసు నియోజకవర్గము. నక్సలైట్లు సి.పి.ఐ.(యం)తో తిరుగుబాటు చేసి వేరే నిర్మాణప్రయత్నంతోపాటు వారి కార్యక్రమం, ఎత్తుగడలు, ఆచరణలో పెట్టుట 1969 ఎన్నికల కాలంలో సి.పి.ఐ (యం) విజయావకాశాలను అనుమానాస్పదం చేసాయి. స్థానిక సి.పి.ఐ నాయకుడైన కా॥ శివపాదబట్టాచార్య నాయకత్వంలో సి.పి.ఐ తీవ్ర ప్రచారోధ్యమాన్ని సాగించుటతో విజయం సాధ్యమైందని జ్యోతిబసుకు బాగా తెలుసు. బట్టాచార్య స్థానిక నాయకుడే గాక 24 పరగణాల జిల్లా నాయకుడు కూడ అయివున్నాడు. బెంగాల్ అంతటా 1967 ఎన్నికలలో సి.పి.ఐ, సి.పి.ఐ(యం) లు రెండు పరస్పర వ్యతిరేక రెండు ఐక్యసంఘటనలు రూపొందించుకొని తమతమ ఆధిక్యతలను రాష్ట్రంలో నిరూపించుకొనే తప్పుడు ఎత్తుగడలతో పరస్పరం వోడించుకొంటున్నప్పుడు కూడ సి.పి.ఐ జ్యోతిబసుకు మద్దతు నిచ్చుటయేగాక ప్రచారం తీవ్రంగా చేసింది. అప్పుడు సి.పి.ఐ కి నాయత్వం వహించి, శివప్రసాద్ బట్టాచార్య ప్రచారోధ్యమాన్ని సాగించాదు. దీనికి ప్రతిఫలంగా సి.పి.ఐ (యం) ఆచరణకు క్రింది ఉదాహరణ విశదం చేస్తుంది.

కా॥ శివపాదబట్టాచార్య, కా॥ సుధీర్ బట్టాచార్య అలంబజార్ బ్రాంచి సి.పి.ఐ. సెక్రటరీతో కలసి 30 సెప్టెంబరు జోన్ హుగ్లీ గ్రామంలోని వొక గవర్నమెంటు క్వార్టరులోనికి, దానిలో అద్దెకు వుంటున్నవారి కోర్కెలు, సి.పి.ఐ (యం)తో వారికి గల వివాదాన్ని తెలసుకొనే నిమిత్తం వెళ్లారు. అంతకు ముందు సి.పి.ఐ (యం) స్థానిక నాయకుడు వివాదాన్ని శాంతి సంప్రదింపులలో పరిష్కరించు విషయమై మాట్లాడారు. సెప్టెంబరు 30 రాత్రి అద్దెకు వున్నవారు చెప్పే వాదనను వినగలందులకు మాత్రమే వెళ్ళారు.

కా॥ శివపాదబట్టాచార్య యీ విషయంలో కలుగజేసుకొనుట సి.పి.ఐ (యం) కు యిష్టంలేదు. కాన శివపాద్, సుధీర్‌లు ఆప్రభుత్వయింటినుండి బయటకు వచ్చునపుడు అకస్మాత్తుగా రోడ్డు ప్రక్కనవేచియున్న ముఠా ప్రమాదకర ఆయుధాలతో నిర్ధాక్షిణ్యంగా, అతిక్రూరంగా దాడి చేసారు. ఇద్దరికి అతి తీవ్రమైన గాయాలు తగిలాయి. శివపాదబట్టాచార్య చనిపోయారని నిర్థారించుకొని వెళ్ళిపోయారు. తల, చేతులు, కాళ్ళు నుజ్జునుజ్జుగా చేసారు. ఎలా బ్రతికారో ఆశ్చర్యకరముగా ఉంది. ఈఘటన అనంతరం అతనికాయాన్ని పోలీసులు స్వాధీనం చేసుకొన్నారు. అతని చావు ఖాయమనుకొని మెజిస్ట్రేటు మరణవాగ్మూలం తీసుకొన్నారు. క్షతగాత్రుడు శివప్రసాద్ దోషుల పేర్లను పేర్కొన్నారు. వారు అతనికి, పోలీసులకు బాగా తెలిసిన వారు. అయినా పోలీసులు కనీసం అరెస్టు అయినా చేయలేదు. అందుకువిరుద్ధంగా కొంతమంది సి.పి.ఐ సభ్యులను అరెస్టు చేసారు.

" కా॥ జ్యోతిబసు హోంశాఖామంత్రిగా పోలీసు చర్యను సమర్ధించారు. అనుమానితుడైన హంతకుని ఎందుకు అరెస్టు చేయలేదని ప్రశ్నించగా, అతనిపై మరణవాగ్మూలం తీసుకొనబడినదిగదా, అది మెజిస్ట్రేటుచే రికార్డు చేయబడినది కదాయని ప్రశ్నించగా,

అది మరణవాగ్మూలంగా పరిగణించుటకు,ఆవాగ్మూలం యిచ్చిన వ్యక్తియింకా బ్రతికివున్నాడని యిచ్చిన సమాధానం, ఐక్యసంఘటనా హోంమంత్రి నుండి వచ్చుట దురదృష్టకరము. నమ్మకం లేకుండా వున్నాం. కాని అది వాస్తవం[1]". జ్యోతిబసు మూడు దశాబ్దాలుపైగా బెంగాల్ ముఖ్యమంత్రి, దేశభక్తుడు, బార్‌ఎట్‌లా, భవానిసేన్ 25 సంవత్సరాలు అండమాన్ జైల్లో శిక్ష అనుభవించిన నిష్కళంక దేశభక్తుడు. ఇద్దరూ మార్క్సిజాన్ని విశ్వసించే కమ్యూనిస్టులు. భారతకమ్యూనిస్టు ఉద్యమంలోని అంతర్గత సైద్ధాంతిక అభిప్రాయభేదాలు, పోరాటాలు ఎంతగా దిగజారి పోయాయో, ఫలితాల బట్టి తేట తెల్లమగుతుంది.

మౌనంగా చాలాకాలం వరకు ఉన్న బంగ్లా కాంగ్రెసు నివేదిక ఐక్యసంఘటనా కాలంలో వివిధ పార్టీల మధ్య సంఘర్షణలలో 100కి పైగా గాయపడ్డారని,200మంది చనిపోయారని, సహేతుకంగా నిరూపించింది. అంతేగాక, సి.పి.ఐ(యం) యీ హత్యలు వర్గపోరాటం తీవ్రతరంచేయుటగా సిద్ధాంతీకరించుట విచారకరము. పశ్చిమబెంగాలులో ప్రతివొక్కరికి యీ కార్యక్రమాలన్నిటిలో ప్రధానపాత్రదారి సి.పి.ఐ(యం) ప్రధాన భాద్యత వహించవలసివుంటుందని తెలుసు, చెదురు మదురుగా యితర పార్టీలు కూడ ఆత్మరక్షణపేరుతో అట్టిచర్యలకే వొడిగట్టుట అందరకు తెలుసు. నక్సలైట్ల పాత్రకూడా యెక్కువగానే వుందని వేరే చెప్పనక్కరలేదు. కారణం "వర్గశతృనిర్మూలనా" కార్యక్రమాన్ని ప్రకటించారు. బురాక్రటిక్ పాలనా యంత్రాగం ముఖ్యంగా పోలీసులు, సి.ఐ.ఎ యేజంట్లు హత్యామారణ హోమంలో తమ పాత్ర నిర్వహించి, అతివాద పార్టీలపై త్రోసివేసారు.

భూస్వాములు, ఫ్యాక్టరీ యాజమాన్యాలపై వర్గపోరాటాలకు బదులు రైతులలో రైతులు, కార్మికులలో కార్మికులు, విద్యార్థులలో విద్యార్థుల వర్గపోరాటాల పేరుతో పరస్పరం హింసా, దౌర్జన్యచర్యలకు, చివరకు హత్యారాజకీయాలలో వొకరి నొకరు ఖతం చేసుకొను స్థితికి దిగజారిపోయారు. తరతమ భేదాలతో సి.పి.ఐ(యం), సి.పి.ఐ (యం-యల్), సి.పి.ఐ లలోని కమ్యూనిస్టు శ్రేణులు మార్క్సిస్టు లెనినిస్టు సూత్రాలకు వక్రభాష్యాలు చెప్పి, వక్రీకరణలకు, అశాస్త్రీయ అరాచక బూర్జువా విధానాలకు బానిసలయ్యారు. ఈ విషయంలో సి.పి.ఐ(యం) పరోక్షంగా, ప్రభుత్వ పాలనాయంత్రాంగాన్ని, ముఖ్యంగా పోలీసులలోని కొన్ని వర్గాల వినియోగించినట్లు తెలుస్తున్నది. అన్ని రాజకీయ పార్టీలు, వివిధ కమ్యూనిస్టు పార్టీలతో సహా అందరూ సమాజ వ్యతిరేకశక్తులను తమతమ స్థాయిలను బట్టి వినియోగించుట ప్రారంభించి చివరకు ఆశక్తుల ప్రభావాలకు గురియైనట్లు కనపడుతున్నది.

**విధ్యాలయాల ఆక్రమణ**

ప్రజాసంఘాలలో కార్మికవర్గ నాయకత్వాన్ని యేర్పరచాలనే వైఖరి చేబట్టి, కార్మికవర్గనాయకత్వం అంటే కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంగా ఆచరణగా సిద్ధాంతీకరించి వొంటెత్తు పెదమార్గంలో చీలి, సి.పి.ఐ(యం) దాని నుండి చీలి సి.పి.ఐ(యం.యల్) లుగా యేర్పడి, విద్యార్థులు యువజనులలో తమతమ నాయకత్వపాత్రలను కాపాడుకొనాలనే వైఖరిని మూడు కమ్యూనిస్టుపార్టీలు, అదేవిధంగా పార్వర్డుబ్లాకు, సంయుక్త సోషలిస్టుపార్టీలు

1. *భవానిసేన్ (1969) సి.పి.ఐ(యం) ఫైట్స్ ఎగనెస్ట్ యునైటెడ్ ఫ్రంట్ ఇన్‌వెస్ట్ బెంగాల్ సి.పి.ఐ పబ్లికేషన్*

కూడ ప్రయత్నించుటతో విద్యాలయాలన్నీ సంఘర్షణల, పోరాట రంగాలయ్యాయి.

విద్యాశాఖ మంత్రివర్గం, అఖిల బెంగాల్ టీచర్సు అసోషియేషనుల గౌరవ, ప్రతిష్టలను పాక్షిక, స్వార్ధ ప్రయోజనాలకై వినియోగించుకొని విద్యార్థులలో సి.పి.ఐ(యం) యేకైక గుత్తనాయకత్వాన్ని యేర్పరచుటకు, హింసా దౌర్జన్యా విధానాలన్నిటిని వినియోగించింది. ఫలితంగా విద్యాలయాలు సాయుధ సంఘర్షణల కేంద్రాలుగ అయ్యాయి. ఈ విధానాలు వామపక్ష, ప్రజాస్వామ్యశక్తుల ఐక్యతకు, ఐక్యకార్యాచరణకు దాటరాని ప్రతిబంధకాలుగ రూపొందాయి. కొన్ని ఘటనలు సంఘర్షణలు అధ్యయనం చేసిన సమస్య తీవ్రత స్పష్టమగుతున్నది.

బోడై హైస్కూలు, 24 పరగణాల జిల్లా, బారాసత్ సబ్ డివిజన్‌లోని ఘటనల కధనాన్ని తెలుసుకొనాలి. మే 2, 1969న, ఒక గ్రూపు విద్యార్థులు హెడ్‌మాస్టరును ఘొరావ్ చేసారు, కానియే కోర్కెలు కోరలేదు. హెడ్ మాస్టారు రాజీనామా సంతకం చేయువరకు భౌతికంగా అతనిపైబడి వొత్తిడి చేసారు. స్కూలు పాలకవర్గానికి, కమిటికి తనను ఘొరావ్ చేసి, చుట్టు ముట్టి నిర్బంధం చేసినందున రాజీనామా సంతకం చేయవలసి వచ్చిందని, వెంటనే తెలియజేస్తారు. కాన అది యిష్టాపూర్వకంగా యిచ్చిన రాజీనామా కాదని వివరించారు. మేనేజింగు కమిటి వెంటనే మే 12, 1969న రాజీనామా పరిశీలనా సమావేశాన్ని కూడ ఘొరావ్ చేసారు, రాజీనామా ఆమోదించునట్లు వొత్తిడి చేసారు.

అఖిల బెంగాల్ టీచర్సు అసోసియేషన్ అధ్యక్షురాలైన అనిల్‌దేవి, ఆమె సి.పి.ఐ(యం) సభ్యురాలు కూడ అయివుండి, "ఘొరావ్" చేసి హెడ్‌మాస్టారును కాంపస్‌నుండి తరిమి చేసినందుకు జులై 7న, స్థానిక సి.పి.ఐ(యం) నాయకుల అధ్వర్యంలో జరిగిన బహిరంగ సభలో ధన్యవాదాలు చెప్పింది.

కాంచనపరా బాలికల హైస్కూలు హెడ్‌మాష్టరును 1 ఆగస్టు 1969న "ఘొరావ్" చేసి, నిర్బంధంగా, ఆమెను ఉద్యోగం నుంచి, నివాసక్వార్టరు నుంచి తొలగించి వేసారు. శ్రీమతి మృణాల్‌బసురాయ్ 1947 నుండి ఆస్కూలు హెడ్‌మిస్ట్రెస్‌గా పనిచేస్తుంది. ఆమె తదుపరి హెడ్‌మాష్టరు స్కూలుకు వెళ్ళి పనిచేయుట అసాధ్యం చేసారు.

అనేక విధ్యానంస్థల యజమాన్యకమిటీలను విద్యాశాఖమంత్రి తొలగించి, పాలనాధికారులను వేసారు. కాంగ్రెసువాదుల యాజమాన్యంలో స్కూళ్ళకమిటీలను రద్దుచేయుయేగాక, ఐక్యసపంఘటన భాగస్వాముల పర్యవేక్షణలో వున్న కమిటీలను తొలగించి, అన్నిటిపై సి.పి.యం ఆధిపత్యంగల కమిటీలను, విధ్యాశాఖ పాలనాయంత్రాంగాన్ని వినియోగించి యేర్పరచారు.

మిద్నపూర్ కాలేజి యాజమాన్యకమిటీలో 4గురు సభ్యులను ప్రభుత్వం నామినేటు చేసింది. ఈ 4గురు సి.పి.ఐ(యం)కు చెందినవారు. ఆశ్చర్యంగా మిద్నపూర్ యం.యల్.ఎ. సి.పి.ఐ కు చెంది యుండుటచే అతనిని కమిటీలో సభ్యునిగా తీసుకొనకుండా వదలివేసారు. మిద్నపూర్ బస్తీలో సి.పి.ఐ(యం) నామరూపాలు లేకుండా వుందని అందరికి తెలుసు. దీనికి బలమైన వ్యతిరేకత ప్రతిఘటన రూపంలో రాగా కామాఖ్య చంద్రఘోష్, స్థానిక యం.యల్.ఏ.ని చేర్చుకొన్నారు.

కలకత్తాలోని బసంతదేవి కాలేజికి నామినేటు చేయబడిన 4గురులో 3గురు సి.పి.ఐ(యం)కు చెందిన వారు ఒకరు ఐ.సి.యస్. ఆఫీసరు. విద్యాశాఖ మంత్రికి ఐక్యసంఘటనలోని యితర రాష్ట్రాలలోని యేవొక్కరు కాలేజి యాజమాన్యపు కమిటి మెంబరుగా వుండుటకు తగినవారు కనుపించలేదు.

దండంలోని మోత్జిహిల్ కాలేజి యాజమాన్య కమిటీకి నామినేటు చేయబడిన 4గురు, సి.పి.ఐ(యం) పార్టీసభ్యులు.

ఈ అన్ని నామినేషనులలో సి.పి.ఐ(యం) సభ్యులలో ఎద్యుకేషనిస్టు దొరకనిచో, ఎద్యుకేషనిస్టులు కాని వారిని నామినేటు చేయుట, ఎవరూలేనిచో ఆపాలనా ప్రాంతం నుండి కాక బయటనుండి సి.పి.ఐ(యం) సభ్యులను దిగుమతి చేయుట జరిగింది. ఏవొక్క సి.పి.ఐ(యం) సభ్యుని కాని వానిని నామినేటు చేయుట జరుగలేదు. ఈ నామినేషనులన్నీ ఎ.బి.పి.టి.లు సభ్యులనుండి చేసారు. కాని పశ్చిమ బెంగాల్ కాలేజి అండ్ యూనివర్సటీ టీచర్సు అసోషియేషన్ నుండి యే వొక్కరిను నామినేటు చేయలేదు. కారణం యీ అసోషియేషన్ సి.పి.ఐ(యం) నాయకత్వంలో లేదు. కొన్ని జిల్లా స్కూల్ బోర్డులను రద్దుచేసి, జిల్లా ఇన్‌స్పెక్టరుల సహాయం కొరకు సలహాబోర్డుల నియమించుతు, పూర్తిగ సి.పి.ఐ(యం) సభ్యులతో నింపివేసారు. మరే యితర పార్టీనుండి వొక్క సభ్యుని కూడ నామినేటు చేయలేదు[1].

కార్మికవర్గ నాయకత్వం అంటే ఆచరణలో సి.పి.ఐ(యం) నాయకత్వాన్ని నిర్మించే ప్రయత్నాన్ని మార్క్సిజం లేనినిజంల నుండి పూర్తి మద్దతులభించదు. కార్మికవర్గం నామమాత్రంగాలేని, మరేయితర ప్రజాస్వామ్యంగాని లేని సెక్టేరియన్ నిర్మాణవిధానాలు ట్రాట్స్కీయిజానికి దారి తప్ప మరొకటికాదు. ఇది యెంత అశాస్త్రీయమో, ఘోరమైనదో యీక్రింది కధనం తెలియజేస్తుంది.

అఖిల బెంగాల్ ప్రయిమరీ టీచర్సు అసోషియేషన్ సాంవత్సరిక సమావేశం మే 1969లో అసన్‌సోల్‌లో జరిగినపుడు ప్రతినిధులు చేసిన విమర్శనంతా లాఠీలు ధరించిన వుపాధ్యేయేతర వలంటీర్లచే అణచివేసారు. మిద్నపూర్ జిల్లా ఎ.బి.టి.ఎ శాఖలో తమకు మెజారిటిలేదని, జిల్లానాయకత్వం తమ చేతుల నుండి జారిపోతుందని, అధికారంలో వున్న సి.పి.ఐ(యం) సంవత్సరాల కొలది సమావేశాన్ని జరుపలేదు.

ఈ విధంగా ప్రజాసంఘాలలో, ఐక్యసంఘటనా ప్రభుత్వాలలో తమ ఆదిక్యత, నాయకత్వాలు, పోతాయనే భయంతో, యితర పార్టీలను బలహీనపరచి, నామరూపాలు లేకుండా చేయుటకు ప్రజాస్వామ్య వ్యతిరేక విధానాలను,సామాజిక వ్యతిరేక, దౌర్జన్య,బెదరింపుల వినియోగించారు. ఈ విధంగా పశ్చిమబెంగాల్‌లో కమ్యూనిస్టు జ్ఞాత వైరపోరాటాలు, కొన్నిచోట్ల సాయుధ పోరాటాలుగ దిగజారి, ప్రాణనష్టాలు జరుగుట జరిగింది. ఇదంతా "వర్గపోరాటం తీవ్రతరం చేయుట" అన్న సిద్ధాంతీకరణ, అవగాహనతో సి.పి.ఐ(యం) చేబట్టిన కార్యాచరణ ఫలితం, నగ్నసెక్టేరియనిజం తప్ప మరొకటిగాదు.

---

1. *భవానిసేన్ (1969) సి.పి.ఐ(యం) ఫైట్స్ ఎగనెస్ట్ యునైటెడ్ ఫ్రంట్ ఇన్‌వెస్ట్ బెంగాల్ సి.పి.ఐ పబ్లికేషన్ . పేజ 11-12.*

వారిదృష్టిలో కార్మికవర్గ నాయకత్వాన్ని ప్రజాస్వామ్య శక్తుల, కార్మికవర్గ ఐక్యత భగ్నం చేయుట ద్వారా నిర్మించబడుతుంది. ప్రజాస్వామ్య విప్లవదశలో యీ ఎత్తుగడలు ఆచరణ మార్క్సిజం. లెనినిజంలు సమర్థించజాలవు. లెనిన్ తన ప్రసిద్ధ "లెఫ్టువింగ్ కమ్యూనిజం యాన్ ఇన్ ఫెంటైల్ డిజార్డర్" లో యీ విధమైన నాయకత్వాన్ని తీవ్రంగా ఖండించారు.

"అత్యుగ్ర అతివాదాన్ని అనుసరించుతున్న సి.పి.ఐ(యం) మితవాద సోషల్ డెమోక్రటిక్ ఎత్తుగడలను వాస్తవంగా కాపీ చేస్తున్నది. యిది పోరాడే ఐక్యప్రజాస్వామ్య సంఘటనను భగ్నం చేస్తుందని", భవాని సేన్ తీవ్రంగా విమర్శించారు.[1]

## కార్మిక వర్గంలో సి.పి.ఐ(యం) సెక్టేరియన్ పంథా

కార్మికవర్గంలో అంతంతమాత్రంగా వున్న ఐక్యతను, అనేక పోరాటాల ద్వారా నిర్మితమైన దానిని, బూర్జువా వర్గ విచ్ఛిన్నం చేయనెంచిన దానిని సి.పి.ఐ(యం) తన వొంటెత్తు పోకడలతో భగ్నంచేసి, పరోక్షంగా వర్గ శతృవుకు తోడ్పడింది. కార్మిక సంఘాలలో సి.పి.ఐ(యం) విచ్ఛిన్నకర చర్యల క్రమం, యీక్రింది ఘటనల కథనంలో స్పష్టమగుతుంది.

జూట్ కార్మికుల చట్కల్ మజ్దూర్ యూనియన్ ఎ.ఐ.టియు.సి శాఖ ఇటీవల పోరాటాలలో గణనీయమైన విజయాలు సాధించిన బలమైన నిర్మాణం గల చురుకైన సంస్థ, ఈ యూనియన్‌లో సి.పి.ఐ; సి.పి.ఐ(యం)లు రెండూ పనిచేస్తున్నవి,కాని సి.పి.ఐ(యం) బలమైన శక్తిగా వుంది. అయినా సంతృప్తి చెందక, యూనియన్ వ్యతిరేక చర్యలతో సి.పి.ఐకి వూపిరి సలుపకుండా చేసి, బయటకు త్రోసి వేయనెంచారు, అందుకు అన్ని పద్ధతులు అవలంభించారు.

ఉదాహరణకు బెంగాల్ చట్కల్ మజ్దూర్ యూనియన్ ఈస్టరన్ మాన్యుఫ్యాక్చరింగు కంపెనీ యూనియన్, టిటాగర్ బ్రాంచి, 20 జులై 1969న వార్షిక సమావేశం జరిగింది. ఈ సమావేశంలో జరిగిన యూనియన్ ఎన్నికలలో సి.పి.ఐ(యం) అభ్యర్థులు యిద్దరు వోడిపోయారు. అందులో వొకరు అసెంబ్లీ సభ్యులు కూడ అయి వున్నారు. వెంటనే వారు పోటీ యూనియన్‌ను పెట్టారు. ఆవిధంగా, కార్మికవర్గ ఐక్యతకు విఘాతం కలిగించుటయేగాక, ట్రేడు యూనియన్‌లలో ప్రజాస్వామ్యం అభివృద్ధి చెందకుండా, పార్టీ అనుబంధశాఖలుగా వొంటెత్తు పోకడలు అభివృద్ధికి తోడ్పడ్డారు. ఫలితంగా, కొన్ని శ్రేణులు హింసామార్గాన్ని చేపట్టి ఫ్యాక్టరీ గేటువద్ద సిపిఐ నాయకుడు, యూనియన్ ఆర్గనైజరు అయిన కాజల్ మజుందార్‌పై దౌర్జన్యంగా దాడిచేసి, తీవ్రంగా గాయపరచారు.

ఇదేవిధంగా 24పరగణా టిటాగర్‌లోని బ్రిటానియా ఇంజనీరింగు వర్క్సులో "ఐ.యన్.టి.యు.సి" అనుబంధ యూనియన్ నాయకత్వాన్ని చేజిక్కించుకొనే వారి ప్రయత్నాలన్నీవమ్ముకాగా, పోటీయూనియన్‌ను పెట్టారు. అదే పద్ధతులలో "కోల్స్‌క్రేన్‌కొ" బెర్రి అండ్ కో లలో బారక్‌పూర్ పారిశ్రామిక ప్రాంతాలలో పోటీ యూనియనులు పెట్టారు.

ఈ ఘటనల క్రమం సూచించే నిర్ధారణలను యిలా స్పష్టంగా చెప్పుకొనవచ్చును. "ఏ

---

*1. భవానిసేన్ (1969) సిపిఐ(యం) ఫైట్ ఎగైనెస్ట్ యునైటెడ్ ఫ్రంట్ ఇన్ వెస్ట్‌బెంగాల్, సిపిఐ ప్రచురణ. పే.13.*

యూనియన్‌లోని కార్మికవర్గంలో సి.పి.ఐ కార్యకర్తలు పనిచేయుట, భాగస్వాములుగ భాధ్యతలు నిర్వహించుట సి.పి.ఐ(యం) సహించజాలదు. కారణం యూనియన్ ఎన్నికలలో సి.పి.ఐ నాయకులు కూడ ఎన్నుకొనబడగలరనే భయం పీడిస్తున్నది. కార్మిక సంఘాల ప్రజాస్వామ్యంలో, కార్మికవర్గంలో విశ్వాసం లేకపోవుటే సి.పి.ఐ(యం) చేబట్టే కార్మికవర్గ విధానానికి పునాది. అందుకే సి.పి.ఐ(యం) నాయకుడు, పశ్చిమబెంగాల్ కార్మికమంత్రి, ఎ.ఐ.టి.యు.సి.ని తీవ్రంగా వ్యతిరేకించుతున్నా, ట్రేడు యూనియనుల బిల్లును ప్రతిపాదించుతూ, రిజస్ట్రారుకు సర్వాధికారాలను కట్టబెట్టాడు.

"సహజంగానే సి.పి.ఐ నాయకత్వం శక్తిగావున్న అన్ని శాఖలను రద్దు చేసి, వారి యూనియనులలో చేరమని, లేకుంటే వారి యజమానులు అణచివేయగలరని కార్మికులకు చెప్పుటయే తప్పమరొకటికాదు. ఆంగ్లపాలన కాలంలో ముస్లింలీగు యీ పంథానే అనుసరించింది. కాంగ్రెసు పాలనలో ఐ.యన్.టి.యు.సి" అనుసరించిన విధానంకూడయిదే. పూర్వపాలకులు కార్మికవర్గంలో ఐక్యత అభివృద్ధి చెందకుండుటకు అనుసరించిన విధానాన్నే సి.పి.ఐ(యం) అనుసరించింది[1].

ఇండియన్ ఆయిల్ కంపెనీ యూనియన్ జనరల్ బాడీమీటింగు, ఎన్నికలలో యూనియన్ ప్రధాన కమిటీల ఎన్నికలలో సి.పి.ఐ(యం) అభ్యర్థులు అపజయం పొందారు. యాజమాన్యం 10 మంది యూనియన్ నాయకులను తొలగించగా నిరాహారదీక్షను చేబట్టారు. యాజమాన్యం కొద్దిమంది కార్మికుల మద్దతుతో నిరాహారదీక్ష వహించివారిపై దాడి చేసింది, కార్మికుల భయభ్రాంతులనుచేసింది. కార్మికులలో చీలిక ఫలితంగా సమ్మె విఫలమైంది. ఫలితంగా సి.పి.ఐ కార్మికులలో బలహీన పడుతుందని ఆశించారు. అదే కాలంలో సి.పి.ఐ(యం) పోటీయూనియన్‌ను పెట్టి, యాజమాన్యంతో సహకరించింది. తమ యూనియన్‌కు ప్రాధమిక గుర్తింపు పొందింది.

పాత యూనియన్‌కు కార్మికవర్గం అత్యధిక మెజారిటి యిచ్చుటతో సి.పి.ఐ(యం) ప్రయత్నాలు విఫలమయ్యాయి, యాజమాన్యం యూనియనుల మధ్య వొప్పందం కుదిరింది. సి.పి.ఐ(యం) గుర్తించబడిన యూనియనుల ద్వారా తన విచ్ఛిన్నకర చర్యలు కొనసాగించింది. సి.పి.ఐ సంస్కరణవాదాన్ని చేబట్టిందని, పోరాటవ్యతిరేకియని, కార్మికవర్గవ్యతిరేకియనే ప్రచారం ముమ్మరం చేసింది. వాస్తవానికి సి.పి.ఐ(యం) యాజమాన్యంతో సహకరించుతూ, పోరాడే కార్మికవర్గ వెన్నెముకపై దాడి చేసి బలహీన పరచింది. వాస్తవానికి సి.పి.ఐ(యం) తనన విచ్ఛిన్నకర చర్యలను కొనసాగిస్తూనే వుంది, సి.పి.ఐని సంస్కరణవాదిగా నిందించుట కొనసాగించింది[2].

ఇదేవిధమైన విధానాన్ని ఇండియన్ ఆక్సిజన్ కాలరీస్, టెక్స్‌మాకొ, నేషనల్ టొబాకో వర్కర్స్ యూనియన్‌లను సి.పి.ఐ(యం) కొనసాగించింది. సి.పి.ఐ(యం) మెజారిటి గల యూనియనుల నుండి సి.పి.ఐ తదితర వామపక్ష శక్తులను బయటకు నెట్టివేసి,

---

1. *భవానిసేన్ (1969) సిపిఐ(యం) ఫైట్ ఎగైనెస్ట్ యునైటెడ్ ఫ్రంట్ ఇన్ వెస్ట్‌బెంగాల్, సిపిఐ ప్రచురణ, పే. 8.*

2. *-- అదే -- పే. 8-9.*

"వర్గపోరాటాన్ని తీవ్రతరం చేయుట" అన్నపేరుతో ప్రజాసంఘాలలో వామపక్ష పార్టీలతో ముఖ్యంగా సి.పి.ఐకు యూనియన్‌లో నాయకత్వంలో భాగస్వామ్యంలేకుండా చేసి, కార్మికవర్గ నాయకత్వం అనే పేరుతో సి.పి.ఐ(యం) యేకైక పార్టీ నాయకత్వాన్ని నిర్మించే ప్రయత్నం చేసింది. ఈ ప్రయత్నంలో అడ్డు అనుకొన్న వామపక్షపార్టీలను ముఖ్యంగా సి.పి.ఐ నాయకులను నయానా, భయానా, హింసాత్మక దాడులతో, పరోక్షంగా ప్రభుత్వయంత్రాంగాన్ని, పోలీసులను, సామాజిక విద్రోహక ముఠాలను వినియోగించింది. ఇది వొక సాధారణవిధానంగా కార్మికోద్యమంలో సి.పి.ఐ(యం) అనుసరించింది. ఫలితంగా కార్మికోద్యమంలో ఐక్యత నశించి, యాజమాన్యాలు కార్మికవర్గంపై దాడిని ప్రారంభించుటకు తోడ్పడింది.

"కార్మిక సంఘాల నాయకత్వ కమిటీలలో సి.పి.ఐ(యం) మైనారిటిగ వున్నపుడు హింసా దౌర్జన్య విధానాలను అవలంభించుట, ఆయూనియనుల నాయకత్వాన్ని బలప్రయోగం, హింసా, దౌర్జన్యకాండలతో ఆక్రమించుట, సాధారణ పంధాగ అనుసరించింది. కారణం సి.పి.ఐ నాయకత్వాన్ని చట్టబద్దంగా, ఎన్నికలద్వారా, ట్రేడు యూనియన్ ప్రజాస్వామ్య పద్ధతులలో తొలగించ జాలకపోవుట[1]"గా భవాని సేన్ తీవ్రంగా విమర్శించాడు.

చివరి విషయం, బెంగాలు చట్కల్ మజ్దూర్ యూనియన్, హుగ్లీశాఖ సెక్రటరీ, సి.పి.ఐ(యం) సభ్యుడు ఆపార్టీని విడిచి సి.పి.ఐలో చేరాడు. వెంటనే సి.పి.ఐ(యం) మరోపోటి యూనియన్‌ను ప్రారంభించింది. కలకత్తా పోర్టుఅండ్ డాక్ వర్కర్సు యూనియన్‌లో వివిధ పార్టీలతోపాటు సి.పి.ఐ(యం) కూడ దానిలో పని చేస్తున్నది, అది " ఎ.ఐ.టి.యు.సి" అనుబంధ సంస్థగా వుంది. అంచేత సి.పి.ఐ(యం) మరోపోటి సంఘాన్ని పెట్టింది. సి.పి.ఐ.తో పాటు సి.పి.ఐ(యం) తదితర పార్టీలు భాగస్వాములుగ వున్న అన్ని యూనియనులలో సంఘర్షణలు తీవ్రతరమయ్యాయి. పరస్పర నిందా ప్రచారాలతో, సి.పి.ఐ(యం) కార్మిక సంఘాలలో యేకైక పార్టీ నాయకత్వాన్ని నెలకొల్పే ప్రయత్నాలన్నీ కార్మికవర్గ ఐక్యతను చిన్నాభిన్నం చేసాయి. అయినా, ఇటీవల జరిగిన సార్వజనీన సమ్మెతో బెంగాల్ కార్మికవర్గంలో సమస్యలపై కనీసపోరాట ఐక్యత పూర్తిగా పోలేదని తెలుస్తున్నది.

దుర్గాపూర్, జంషెడ్‌పూర్, బరన్‌పూర్ ఉక్కు, ఇనుము పారిశ్రామిక కేంద్రాలలో జరిగిన కార్మిక పోరాటాలలో 1954లో 8మంది, 1958లో 6గురు పోలీసు కాల్పులలో మరణించారు మరెందరో క్షతగాత్రులయ్యారు. ఈరెండు పోరాటాలలో కార్మికుల అనేక కోర్కెలు విజయానంతరమే తిరిగి పనిలో ప్రవేశించారు. ఆగస్టు 1970లో దుర్గాపూర్ కార్మికులు 60వేల మంది సి.పి.ఐ(యం) పిలుపుతో సమ్మెలో చేరారు.సమ్మె నాలుగు రోజులకే నీరు కారిపోగా, ఎట్టిషరతులు లేకుండా 10వ రోజున విరమించబడింది. సమ్మెవిఫలమగుటకు పోలీసుల అమానుష, అణచివేతచర్యలు కారణంగా చెప్పబడింది. జంషెడ్‌పూర్, బరన్‌పూరులలో కంటె, దుర్గాపూర్‌లో సి.పి.ఐ(యం) నాయకత్వంలో "వర్గపోరాటం చేబట్టుటకై" బాగా ఆర్గనైజు చేయబడిన కార్మికుల సమ్మె ఎందుకు విఫలమైంది? ఇటీవలనె అనేక పోరాటాలలో విజయం పొందిన దుర్గాపూర్ కార్మికులు

---

*1. భవానిసేన్ (1969) సిపిఐ(యం) ఫైట్ ఎగైనెస్ట్ యునైటెడ్ ఫ్రంట్ ఇన్ వెస్ట్‌బెంగాల్, సిపిఐ ప్రచురణ. పే.9.*

యీ పోరాటంలో అపజయాన్ని ఎందుకు చవిజూడవలసివచ్చింది. ఇటీవల సి.పి.ఐ(యం) నాయకత్వంలోని యూనియనులు, కంపెనీల యాజమాన్యంలోని యూనియనులు ప్రవర్తించు విధంగా ప్రవర్తించాయి. కార్మికులను సి.పి.ఐ(యం) సెక్రేటేరియన్ విచ్ఛిన్నకర చర్యలలో మాత్రవే వినియోగించింది. అంచేతవారు, వారి యూనియనులకే దూరమయ్యాయి. వారి కోర్కెలపై మాత్రమే గాక, చివరకు రాజకీయ సమస్యలపై నిరవధిక సమ్మెకు సి.పి.ఐ(యం) పిలుపు నిచ్చింది. ఈ విధానం, కార్మికులలో గల ఐక్యతను విచ్ఛిన్నం చేయుట, వొంటెత్తు పోకడలను అనుసరించిన నందున, సమస్యలపై నిరవధిక సమ్మెకు పిలుపుగాక రాజకీయ సమస్యపై ఒకరోజు నిరసన సమ్మెగాక, నిరవదిక సమ్మెకు పిలుపు నిచ్చుటతో సమ్మెవిఫలమైంది.

"సి.పి.ఐ(యం) నాయకత్వంలోని యూనియనులలో సి.పి.ఐ, ఐక్యసంఘటనలోని తదితర వామపక్షపార్టీలు కార్మికుల హక్కుల పోరాటాలలో కలసి పనిచేస్తూ ఇటీవల కాలంలో సహకరిస్తూవచ్చాయి. సి.పి.ఐ(యం) నాయకత్వంలోని యూనియనులకు అధికార గుర్తింపులభించిన తరువాత యాజమన్యంతో "శాంతియుత సహజీవనం", ఐక్యసంఘటనలోని సోదర పార్టీలతో "వర్గపోరాటం" సాగించారు.[1]

"యాజమాన్యపు దాడులన్నిటిని గతంలో షాపు స్థాయిలో వెంటనే కార్మికులు ప్రతిఘటించేవారు. డిపార్టుమెంటు కార్మికుల కమిటీలు యూనియనులకు చెందినవి, సమ్మెకు, గెరావోలకు పిలుపునిచ్చినడిపినవి. అదేవిధంగా ప్రతీకార వాంఛతో యాజమాన్యం కార్మికులనువేదించుట ఆపివేయాలనే పోరాటాలు సాగించుట జరిగింది. యూనియనులకు గుర్తింపులేక పోయినా, కార్మికులు పోరాడి గుర్తింపు పొందారు. ప్రధాన సి.పి.ఐ(యం) యూనియను గుర్తింపువచ్చిన తరువాత పరిస్థితి మారింది. దుర్గాపూర్‌లో యూనియన్ షాపుకమిటీలు రద్దు చేయబడినవి. గతంలోవలె షాపు కమిటీలు పనిచేయుటను యూనియన్ శెక్రటేరియట్ నిషేధించింది. చొరవతో ఎట్టి పోరాటం సాగించరాదని ఆజ్ఞాపించింది. ఈవిధానానికి యాజమాన్యం సుముఖవైఖరి చేబట్టి, యూనియనులకు కంపెనీ బంగ్లాను కేటాయించుట, టెలిఫోను, కారులు, తదితర సౌకర్యాలను కలిగించి యూనియన్ నాయకులకు ఫ్యాక్టరీలలో ప్రత్యేక సౌకర్యాలను కలిగించారు. కార్మికులపై దాడులను ప్రతిఘటించుటకు వెనుకాడింది. కోల్ ఓవెన్‌ప్లాంటులో వొక సి.పి.ఐ(యం) నాయకుని పనినుండి తొలగించారు, కాని ప్రతిఘటన లేకుండా పోయింది. యాజమాన్యపు యిట్టిదాడులు పెరిగిపోతుండగా సి.పి.ఐ (యం) నాయకత్వం "దీర్ఘకాలసంప్రదింపులు" కొనసాగించింది. ఒక్క స్టీలు ప్లాంటులోనే 36 వొప్పందాలు సంతకాలు చేసారు. ఉదాహరణకు, అట్టి వొక వొడంబడిక 1500 కార్మికులు గల స్టీలు ప్లాంటు ట్రాన్సుపోర్టు డిపార్టుమెంటుకు సంబందించినది. వారికి వచ్చే మొత్తం జీతంలో "కోత"కు సంబంధించినది. ఫలితంగా కార్మికులు సి.పి.ఐ(యం) నాయకత్వంలోని యూనియన్ వదిలివేరే యూనియనును స్థాపించుకొన్నారు. అందులో ఆడిపార్టుమెంటులో సి.పి.ఐ(యం) మద్దతుదారులు చాలామంది చేరారు.

---

*1. గుప్తా భూపేష్, రనెన్ సేన్ గుప్తా, ప్రభాత్ దాస్ (1970) సి.పి.ఐ.(యం) టెర్రర్ ఇన్ వెస్ట్ బెంగాల్, సి.పి.ఐ. పబ్లికేషన్. పే-14.*

"స్టీలు స్మెల్టింగుప్లాంటు క్రేన్‌డ్రైవర్సు, కార్మికులు ఐ.యన్.టి.యు.సి. నాయకత్వంలో దీర్ఘకాలంగా పెండింగులో వున్న కోర్కెలసాధనకై సమ్మె చేసారు. సి.పి.ఐ(యం) నాయకత్వంలోని యూనియను ఆ సమ్మెను భగ్నం చేయుటకు తీవ్రంగా ప్రయత్నించింది. కోర్కెలు న్యాయ సమ్మతమైనవి. కార్మికులలో ధృఢ ఐక్యతవలన యాజమాన్యం ఐ.యన్.టి.యు.సి.తో సంప్రదింపులు జరిపి, వారి కోర్కెలు ఆమోదించింది[1].

స్టీలు ప్లాంటులోని డిపార్టుమెంటులలో పైవిధంగా అనేక ఘటనలు తరువాత సి.పి.ఐ.(యం) యూనియనులకు వ్యతిరేకంగా శెక్షనులలో స్వతంత్ర్యం పోరాటాలు జరిగాయి. వీటిలో సి.పి.ఐ(యం) మద్దతుదారులు కూడ పాల్గొనుటతో విజయవంతమయ్యాయి.

సి.పి.ఐ(యం) విమర్శకులందరిని "నక్సలైట్లు"గా, "విచ్ఛిన్నకులు"గా ముద్దరులువేసి, అనేక యూనియనులలోని వారిని సస్పెండు చేయుటగాని తొలగించుటగాని చేసారు. ఆవిధంగా అగ్రనాయకులు, స్టీలుప్లాంటు యూనియన్ సహాయకార్యదర్శి మృత్యుంజయదాస్ గుప్తాను ఎ.వి.పి. నుండి 18 మంది నాయకత్వవర్గాలను యూనియను నుండి తొలగించారు.

కార్మిక యూనియనుల వేదికలను సి.పి.ఐ(యం) నాయకులు రాజకీయ ప్రత్యర్థిపార్టీలపై ద్వేషపూరిత విషప్రచారానికి వినియోగించారు. కార్మికుల సమస్యలు, కోర్కెలపై ఒక్కమాట కూడ లేకపోవుట ఆశ్చర్యాని కలిగిస్తున్నది. యూనియన్ వేదికలను బహిరంగంగా, బిడియం లేకుండా పార్టీ సెక్రేరియన్ ప్రయోజనాలకు వినియోగించుటతో కార్మికులు దూరమయ్యారు. సి.పి.ఐ(యం) నాయకత్వంలోని యూనియనుల నుండి అనేక నాయకత్వవర్గాలు బయటవెళ్ళిపోయి. సి.పి.ఐలో గాని, నక్సలైట్లులో గాని చేరారు. అట్లుచేరిన వారిలో "ఎ.వి.బి." సహాయకార్యదర్శి, ట్రెజరర్‌లు ముఖ్యులు[2].

సి.పి.ఐ(యం) తనపునాదులు కదలిపోతున్నవని, భౌతికంగా భయోత్పాతాన్ని కలిగించే విధానాన్ని నక్సలైట్ల వలెనె అవలంభించింది. "ఎ.వి.బి" యూనియన్ నాయకుడు డి.యల్. గుహ యింటిని రెండు రోజులు చుట్టుముట్టి తీవ్రంగా గాయపరచారు. సి.పి.ఐ(యం)ను బలపరచే ప్రసాద్ యూనియన్ అకౌంట్సులోని కొన్నింటిని ప్రశ్నించిన కొద్ది రోజులకు కాల్చి చంపబడ్డాడు. తరువాత నక్సలైట్ల మద్దతుదారు వొకరిని, స్టీలు ప్లాంటు బొగ్గు డిపార్టుమెంటులోని గోసాల్‌లపై హత్యాదాడి జరిగింది. చనిపోయాడని వదిలివెళ్ళారు. "ఎ.వి.బి" లో పనిచేసే వర్కరు నిఖిల్‌దాస్ పట్టపగలు ఫ్యాక్టరీ హాస్పిటల్ నుండి బయటకు లాక్కొచ్చి చంపారు.

ఆగస్టు 8న సి.పి.ఐ (యం) నాయకత్వంలోని దుర్గాపూర్ కార్మిక సంఘాల సమన్వయ కమిటి 2 వోట్ల మెజారిటితో 12 ఆగస్టు నుండి దుర్గాపూర్‌లోని అన్ని ఫ్యాక్టరీలు నిరవధిక సమ్మె చేయాలని, షరతులు లేకుండా దిలీప్, తదితరులను విడుదల చేయాలని నిర్ణయించింది. ఈ నిర్ణయం ఏకపక్ష నిర్ణయం అన్ని యూనియనులు విడివిడిగా, కలసి చర్చించి ఆమోదించలేదు.

---

*1 & 2. ప్రభాత్‌దాస్ గుప్తా (1970) దుర్గాపూర్ స్ట్రైక్ అండ్ ది రియల్ ఫేస్ ఆఫ్ సి.పి.ఐ(యం) లీడర్స్, సి.పి.ఐ(యం) టెర్రర్ ఇన్ వెస్ట్‌బెంగాల్, భూపేష్ గుప్తా ఎట్ ఆల్, సి.పి.ఐ. పబ్లికేషన్, పే-15-16.*

స్థానిక, జిల్లా, సి.పి.ఐ(యం) నాయకులు అనేక మంది యీ నిర్ణయాన్ని వ్యతిరేకించారని చెప్పబడింది. రాష్ట్ర సెక్రటేరియట్, చివరకు సి.ఐ.టి.యు ప్రెసిడెంటు బి.టి.రణదివె వ్యతిరేకతను కూడ త్రోసి పుచ్చాడని చెప్పబడింది. సమ్మెకాలంలో యేమి జరిగింది. గత చరిత్ర అయింది. అయినా సమ్మెకాలంలోని కొన్ని అంశాలు స్పష్టం చేయవలసియున్నది.

మొట్టమొదటిది, సమ్మెకోర్కెల సమస్య సి.పి.ఐ(యం) నాయకులు యూనియనులకు ప్రాణప్రధమైన సెంట్రల్ ఇండస్ట్రియల్ సెక్యూరిటీ ఫోర్సును ఉపసంహరించుకొనాలనే "కోర్కె" కొరకు సమ్మె జరిగిందని, కొత్తవిషయాన్ని తీసుకొనివచ్చి సమర్థించుటకు విశ్వప్రయత్నం చేసారు. ఇంతకంటె పెద్ద అసత్యం మరొకటి లేదు.

సమ్మె మొదలైన మూడు రోజుల వరకు ఉపన్యాసాలు, పోస్టర్లు, కరపత్రాలు, వొకే వొక కోరిక దిలీప్ తదితరులను షరతులు లేకుండా విడుదల చేయాలని మాత్రమే స్పష్టం చేస్తున్నవి. సి.పి.యం పత్రిక జనశక్తి ఆగస్టు 11, సంచికలో దుర్గాపూర్ కథనంలో అదే పేర్కొనబడింది. ఆగస్టు 14న మాత్రమే సి.ఐ.యస్.యఫ్; సి.ఆర్.పి.లను ఉపసంహరించబడాలనే కోర్కె తదనంతర ఆలోచనా ఫలితంగా చేర్చబడింది.

అంతేగాక, గతంలో సి.పి.యం. నాయకులు స్టీలుప్లాంటు గార్డులను, సి.ఐ.ఎస్.ఎఫ్‌లో చేర్చుకొనాలనే సలహా ఇచ్చారు. కేంద్రం సి.ఐ.యస్.యఫ్.ను దుర్గాపూర్‌కు కేటాయించుటపై, జూన్-జులైలలో సి.పి.ఐ తదితర వామపక్షాలు దానికి వ్యతిరేకంగా వుద్యమాన్ని ప్రారంభించాయి, వీటికి సి.పి.ఐ(యం) దూరంగా వుంది. ఆగస్టు 3న, దుర్గాపూర్ బంద్ పిలుపుకు సి.పి.యం అంగీకరించింది. ఐక్యసార్వజనిక సంపూర్ణబందు 4న, బ్రహ్మాండమైన విజయంగా అందరి కళ్ళలలో మెదులుతుండగానే, ఎనిమిది రోజుల తరువాత సి.పి.ఐ(యం) దుర్గాపూర్‌లో నిరవధిక సమ్మెకు పిలుపు నిచ్చింది.

రెండవ అంశం, హింసాభయోత్పాదాల సమస్య, ఎవరు ఎవరిలో భయోత్పాదాన్ని కలుగజేసారు?

సమ్మె ప్రారంభమైన రోజుననే విఫలమైంది. మరుసటి రోజునుండే ఫ్యాక్టరీలలో కార్మికుల హాజరు రోజు రోజుకు యెక్కువ కాసాగింది. మూడో రోజునుండే "మాంకో" "డి.పి.యల్"లలో హాజరు 80 శాతం పెరిగింది.

నిరాశాహతులైన సి.పి.ఐ(యం) నాయకులు ఫ్యాక్టరీ వుద్యోగులపైన హింసా, దౌర్జన్యకాండలు చేసారు. ఆగస్టు 13న పారితోష్ రాయ్ బర్మార్,మాంకో యూనియన్ జాయింటు సెక్రటరీని బాగా కొట్టిగాయపరచగా ఆసుపత్రిలో చేర్పించారు. దీపావళిలో లాగ బస్తీలో బాంబులమంటలు లేచాయి. బస్తీకి వచ్చే రోడ్లు అన్నీ మూసివేసి, బస్తీ నుండి సి.పి.ఐ(యం) అనుమతి లేకుండా బయటకు వెళ్లజాలని పరిస్థితి కల్పించారు. బయటిప్రాంతాలనుండి సి.పి.ఐ(యం) అనుచరులు, గూండాలు, రౌడీలు, చాలామందిని సమీకరించి, ఫ్యాక్టరీ వుద్యోగుల, కార్మికుల యిండ్లపై వరుసక్రమంలో దాడి చేయించి, వారి భర్తలు ఫ్యాక్టరీలకు వెళ్ళి పనిచేసి, సమ్మను భగ్నం చేసినచో వారు విధవలౌతారని, వారి పిల్లలు తల్లిదండ్రులు లేనివారు అగుతారని బెదరించారు. అనేక మందిని కత్తిపోటులకు గురి చేసారు. టౌనులో నుండి కార్మికులను కొనివచ్చే ఫ్యాక్టరీ బస్సులు రాకుండటకు

కందకాలు తవ్వారు. ఈప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. గణనీయమైన సి.పి.ఐ(యం) కార్యకర్తలు కూడ పనిలోనికి వెళ్ళారు. అనేకమంది సి.పి.ఐ(యం) వలంటీర్లు ఉదయం పికిటింగు చేసినవారు సాయంకాలం పనిలోనికి వెళ్ళారు. మాంకొయూనియన్ ఆఫీసులో పనిచేయు ముగ్గురు సి.పి,యం వాదుల ఆగస్టు 14న పనిలో చేరారు. కంటి అద్దాలగ్లాసు ఫ్యాక్టరీ కార్మికులు సాయంకాలం నుండి పనిలోచేరారు.

ఆగస్టు 15 నుండి కార్మికుల ప్రతిఘటన పెరిగింది. లాఠీలు చేతబట్టి పనిలో చేరుటకు వెళ్లారు. ఆగస్టు 19న సి.పి.ఐ(యం) స్త్రీ కార్మికులను బారికేడ్సుకు ముందు నిలబెట్టి రక్తపాతాన్ని సృష్టించ ప్రయత్నించింది. ఈపోరాట జూదం విఫలమైంది. సమ్మె పూర్తిగా విఫలమై, షరతులు లేకుండా విరమించబడింది. సమ్మె తరువాత, సి.పి.ఐ(యం) కార్యకర్తలు కూడ అనేకమంది యీ సమ్మెను వాంఛించలేదని స్పష్టమైంది.

సమ్మె చేయుటకు యెలా వొత్తిడి, బలవంతం చేసారో తెలుసుకొనుటకు విచారణ కమిటిని వేయగా సాక్ష్యాలు యిచ్చిన 52 మంది స్త్రీలలో సి.పి.ఐ(యం) ప్రసిద్ధనాయకుల భార్యలు యిద్దరున్నారు. వారి కార్యకర్తలు 100 మంది సమ్మెకాలంలో శెలవు ధరఖాస్తులు పెట్టారు.

**రాజకీయ హత్యలు, పోలీసు, సి.ఆర్.పి హింసాకాండ.**

ఇటీవల 14 పార్టీల వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యసంఘటన కాంగ్రెసు పాలనకు వామపక్ష ప్రత్యామ్నాయంగా రూపొందింది. మధ్యంతర ఎన్నికలలో ఆది సాధించిన గొప్పవిజయం దేశరాజకీయాలపై బ్రహ్మాండమైన ప్రభావాన్ని కలుగజేస్తుంది.

"అట్టి పశ్చిమ బెంగాలులో ఐక్యసంఘటన విచ్ఛిన్నమగుటయే గాక స్వయంకృత విషాదాంత పరిస్థితులు యేర్పడినవి. నిన్నటి కామ్రేడ్స్, సహచర పోరాటయోధులు మధ్యయుగాల జ్ఞాతవైర రక్తపాతాలకు మించిన ఘోరదూరంతాలలో పరస్పరం మునిగి పోయారు. పెట్టుబడిదారి విధానానికి వ్యతిరేకంగా భుజం భుజం కలిపిపోరాడుతూ, ప్రజలను పోరాటాలలో సమీకరించవలసినవారు పరస్పరం హింసా, దౌర్జన్య, హత్యలకు వొడిగట్టని రోజులు కరువయ్యాయి.

"సౌరెన్థర్ చౌదరి అనే సి.పి.ఐ నాయకుడు 40 సంవత్సరాలుగా కమ్యూనిస్టుగా రాజకీయాలలో వున్నవాడు, అనేక సంవత్సరాలు అండమాను జైలుశిక్ష అనుభవించిన దేశభక్తుని, విప్లవకారునిపై సి.పి.ఐ(యం) వాదులు హత్యాదాడిని చేసారు. ఇది వొక వ్యక్తిపై చేసిన దాడికాదు. పశ్చిమ బెంగాల్ విప్లవసాంప్రదాయాలపై చేసిన దాడి. మాల్దాలో 5గురు సి.పి.ఐ మద్దతు దారులైన రైతులను చంపి, వొక సి.పి.ఐ అసెంబ్లీ సభ్యుని తీవ్రంగా గాయపరచారు.[1]

"సి.పి.ఐ(యం), నక్సలైట్లు పరస్పరం చంపుకొనే పోటీలో నిమగ్నులై వున్నారు. ఇందులో నిస్సందేహంగా సి.పి.ఐ.(యం) స్కోరు ఎక్కువగా ఉంది. సి.పి.ఐ వృద్ధనాయకుడు జిబన్మైతి, హస్పిటలో వున్నాడు, నక్సలైట్ల దాడికి గురయ్యాడు. ఒక సి.పి.ఐ(యం)ను

1. *న్యూ యేజ్ ఎడిటోరియల్ 30 ఆగష్టు 1970, టెర్రర్ ఇన్‌వెస్ట్ బెంగాల్, సి.పి.ఐ పబ్లికేషన్ పే. 46*

బలపరచే వ్యక్తిని చంపిన కారణంగా అనేక మంది నక్సలైట్లు చంపబడ్డారు. పోలీసులు ప్రేక్షకులుగా వుండి పోయారు. హంతకులు ముఖ్యంగా సి.పి.ఐ.(యం) మద్దతు దారులుగా గుర్తించబడ్డారు. పశ్చిమబెంగాల్ సి.పి.యం నాయకుడు ప్రమోద్‌దాస్‌గుప్తా, నక్సలైట్లు యెడల చేబట్టవలసిన చర్యలకు పూర్తి భాద్యతతో పాటు. వారికి పూర్తి స్వేచ్ఛను యివ్వాలని కోరాడు.

"దీనర్థం నక్సలైట్లు వ్యక్తిగత హింసావాదాన్ని చేబట్టి, హింసా, భయోత్పాత వాతావరణాన్ని కలుగజేస్తున్నారు. ఆలోచనలేనివారి యీచర్యలు, విప్లవ ప్రతిఘాతక చర్యలకు రాచబాట నేర్పరుచుచున్నవి. వాటిని మనం ఖండించవలసివుంటుంది. నక్సలైట్లను తీవ్రపదజాలంతో విమర్శించినంత మాత్రాన సి.పి.ఐ(యం) హృదయం హింసాకలుషితం కాకపోదు. నక్సలైట్లు వాడే తీవ్రపదజాలం, వారి "వర్గశతృవులఖతం" కార్యక్రమము, అందుండి యేర్పడిన ద్వేష, హింసా వాతావరణం, సి.పి.ఐ(యం) కత్తిపోట్ల హింసా చర్యలను తక్కువగా అంచనా వేయరాదు. దానిదే ప్రధాన బాధ్యతగా వుంది. "అది అధికారంలో వున్నదని, దానివెనుక ప్రభుత్వ, పోలీసు యంత్రాంగంతోపాటు గూండాలు, రౌడీలు అసంఖ్యాకంగా వున్నారని మరచి పోరాదు." పశ్చిమ బెంగాల్ పోలీసు యంత్రాంగంలో ఎక్కువ మంది, తీవ్రనక్సలైట్ల వేటసాగించుతున్నప్పటికి, వాస్తవానికి సి.పి.ఐ(యం)కే సాయపడుతున్నారు. అంచేతనే సి.పి.ఐ(యం) పెద్దగా సి.ఆర్.పి.ని విమర్శించుతున్నా, పశ్చిమ బెంగాల్ పోలీసుపై పల్లెత్తుమాట కూడ అనజాలకుండావుంది.

" పార్టీల మధ్యగల యీ అంతర్యుద్ధ వాతావరణం, అరాచక, హింసా, హత్యలు, విప్లవ ప్రతీఘాతక శక్తులకు స్వాగతం చెప్పుటయే అగుతుంది. అనేక దేశాలలో యిట్టి పరిస్థితులను ప్రజావ్యతిరేకులు, నిరంకుశ శక్తులు వినియోగించుకొని సైనిక లేక సెమిసైనిక పాలనను యేర్పరచారు.[1]

మితవాద అభివృద్ధి నిరోధకశక్తులు కేంద్రం అధికారాన్ని స్వాధీనం చేసుకొనగలందులకు నడుములు బిగించుచున్నారు. పశ్చిమ బెంగాలులోని పరిస్థితి, మితవాదుల కుట్రలకు అత్యంత సానుకూలంగా వుంది.

పార్టీల మధ్య అంతర్యుద్ధ పరిస్థితిమాటలలో అతివాదం, ఆచరణలో అవకాశవాదం, సైద్ధాంతిక శూన్యత, పిడివాదం విచ్ఛిన్నకరపోకడలు వివిధ కమ్యూనిస్టు శ్రేణులలో ముఖ్యంగా సి.పి.ఐ(యం)లో నిరాశ, నిస్పృహల కారణంగా రూపొందింది.

మారణాయుధాలతో పరస్పరం దాడులు, హత్యలు, పోలీసులతో సహా ఎవరు చేసినా, అవి రాజకీయమైనవి అయినా హత్యలు, హత్యలు కాకపోవు, పశ్చిమబెంగాలులో చట్టాన్ని అమలు చేస్తున్న అధికార వర్గాలు సైతం చంపేహక్కు తాము సంపాదించినట్లు ప్రవర్తించుచున్నవి. నక్సలైట్లతో వ్యవహరిస్తూన్నామన్న పేరుతో రాజ్యాంగ చట్టాన్ని, యితర చట్టాను చెత్తబుట్టలో వేసినట్లు కన్పడుతున్నది. ప్రజాస్వామ్యానికి యిది పెద్ద ప్రమాదాన్ని తెచ్చి పెట్టుచున్నది. సామాజిక క్రమ జీవితానికి నక్సలైట్లు అనబడే వారకందరి ప్రకటించన హింసా చర్యలన్నిటికంటె యెక్కువ ప్రమాదాన్ని తెస్తున్నది.[2]

---

*1. న్యూ యేజ్ ఎడిటోరియల్,30 ఆగష్టు 1970, టెర్రర్ ఇన్‌వెస్ట్ బెంగాల్, సి.పి.ఐ పబ్లికేషన్ పే.47*

*2. భూపేష్ గుప్తా, 1970 ఫైట్‌బ్యాక్ పోలీస్ అండ్ సి.ఆర్.పి ఫ్రైజల్స్ ఇన్‌వెస్ట్ బెంగాల్. సి.పి.యం. టెర్రర్ ఇన్‌వెస్ట్ బెంగాల్, సి.పి.ఐ పబ్లికేషన్స్ పే. 38.*

సెప్టెంబరు 25న, కలకత్తాలోని కాలేజి స్క్వేర్‌లోనే పోలీసులు నలుగురు యువకులను కాల్చిచంపారు. ప్రజలలో పెద్ద షాకును కలుగజేసింది. భవానిదత్తులేను ఘటనలలో పోలీసులు అనవసరంగా కాల్పులలో నక్సలైట్లు అనబడేవారిని కాల్చిచంపినట్లు ప్రాధమిక విచారణలో తేలింది. ఆ కాల్పులలో చనిపోయినవారిలో క్రితం రోజు అరెస్టుకాబడిన వ్యక్తిని, పోలీసు ఎస్కార్టులో తీసుకొని వెళ్ళి, తప్పించుకొని పారిపోతుండగా కాల్పులలో మరణించాడని చెప్పారు. అదే ఘటనలో మరోయిద్దరు దారుణంగా కాల్పులతో హత్య చేయబడ్డారు. పైగా తమపై బాంబులు వేసారని పోలీసులు సాకుగా చెప్పారు. మరణించిన కృష్ణదాస్ విస్వాస్ పోస్టుగ్రాడ్యుయేటు విద్యార్థి చేతులు పైకి ఎత్తి యూనివర్సిటీ గేటులోనికి క్లాసుకు వెళ్ళుతుంటే కాల్చి చంపబడ్డాడు. ఎటువంటి అల్లరి జరుగలేదు. అతను నక్సలైటు అని కూడ పోలీసులు అనలేదు. ఈ హత్యను యూనివర్సిటి సిండికేటు ఖండించింది, పబ్లిక్ విచారణ జరగాలని డిమాండు చేసింది. ప్రఖ్యాత దినపత్రిక "జుగాంతర్" 27 సెప్టెంబరున ఎడిటోరియల్‌లో "గాంగ్స్టరిజాన్ని, సామాజిక వ్యతిరేకశక్తుల చర్యలను అణచివేయవలసిన అవసరమున్నా, విచక్షణా రహితంగా ఎవరినీ చంపేహక్కులేదు." అని "మొట్టమొదట పోలీసును కంట్రోలు చేయవలసిన అవసరముందనే" శీర్షికతో సంపాదకీయం వ్రాసింది. పేపరు యింకా "పోలీసులు విచక్షణా రహితంగా కాల్పులు చేస్తున్నారు. అనివ్రాసింది. "అటువంటి, కంట్రోలులో ఇమడలేని పోలీసు బలగాలకు పరిమితులులేని అధికారాలనిచ్చుట ప్రమాదకరమైనది"గా మేము తలంచుతున్నామని వ్రాసింది. కలకత్తా పోలీసు కమీషనరు కూడ చివరకు వొత్తిడితో, వ్యక్తిగత విచారణ తరువాత, ఆమోదించునట్లు లాఠీ దెబ్బలతో చనిపోయో వరకు విపరీత హింసాకాండ జరుపగా, యువవీరుడైన సమీర్ బట్టాచార్య చనిపోయాడని పోలీసులపై 302 శెక్షను క్రింద ప్రోసిక్యూషన్ చేయవలసినదిగా కమీషనర్ ఆజ్ఞాపించాడు. ఇదే ప్రశ్నపార్లమెంటులో లేవనెత్తబడినపుడు గవర్నమెంటు నోరుమెదపలేదు, పార్లమెంటు చర్చించుటకు కాలవ్యవధిలేక పోయింది. పోలీసులు మొరటు పద్దతులలో జైలులో ఖైదిల చావుకు కారణమగుట యిది మొదటికేసు కాదు. ఈ హింసావిధానాలు అవలంభించిన పోలీసులు ఇండియన్ పీనల్‌కోడ్ ప్రకారం శిక్షార్హులు, యితర క్రిమినల్ కేసుల వలెనె వారి చర్యలను చూడవలసివుంది. ప్రెసిడెంటు పాలనలో హింసా, నేరాలు క్షమించుటయేగాక, వాటిని ప్రోత్సహించుటకూడ జరుగుతున్నది. ఇట్టి చర్యలుకు సి.ఆర్.పి నూతనంగా యేర్పడిన వ్యవస్థగా వుంది.

బెంగాల్ రాష్ట్ర రాజకీయ వాతావరణం దౌర్జన్యం, హింసా, హత్యకాండలతో కలుషితమై పోయింది. నక్సలైట్లు వారి చట్టవ్యతిరేక చర్యలు కారణంగా, పోలీసులు, సి.ఆర్.పి.లకు కుంటి సాకులు వారి అణచివేత చర్యలకు ఆజ్యమగుతున్నవి. హింసా, దౌర్జన్యం, మారణాయుధాలతోదాడులు, హత్యాకాండలతో బెంగాలులో భయ, భీభత్స పరిస్థితులు నెలకొన్నవి. వామపక్షాలే ప్రదాన భాధ్యత వహించవలసి వుంటుంది. సి.పి.ఐ(యం) టెర్రరిజంతో పూర్తిగ తెగతెంపులు చేసుకొనలేదు. నక్సలైట్లు, సి.పి.ఐ, సోషలిస్టు యూనిటిసెంటరు, పార్వర్డు బ్లాకు సి.పి.ఐ(యం) దాడులకు ప్రదానంగా ఎర అగుతున్నవి.

వామపక్షాలు ముఖ్యంగా సి.పి.ఐ(యం), నక్సలైట్లు తమ బాంబులు, కత్తులు, కఠారులు, తుపాకులు, హుగ్లీనదిలో పారివేయకుంటే పశ్చిమబెంగాల్‌లో ప్రశాంత పరిస్థితులు నెలకొనజాలవు.

సమాజ వ్యతిరేకశక్తులు గత కొద్ది శతాబ్దాలుగ పోలీసుల రక్షణ క్రింద వేరూని బలపడినవి. సమాజవ్యతిరేకశక్తులు – పోలీసు శక్తుల మధ్య యీకాలమంతా సంబంధాలు పెరిగిపోయి బలపడుట జగద్విదితము. ఐక్యసంఘటనా ప్రభుత్వకాలంలో సి.పి.ఐ(యం) రంగప్రవేశం చేసి, మంత్రదండంతో రాత్రికిరాత్రి సమాజవ్యతిరేక శక్తులను "విప్లవశక్తులుగ రంగు మార్చింది" ఇది సమాజద్రోహులను గుర్తించుట, అరికట్టుట కష్టతరం చేసింది.

పశ్చిమ బెంగాల్, కలకత్తా ప్రజలు పోలీసుల, సి.ఆర్.పి. శక్తుల దౌర్జన్య హింసాచర్యల నుండి కాపాడబడాలి. నక్సలైట్లు వారిని బలపరచేవర్గాల దాడులకు గురయ్యేవారు రక్షించబడాలి. ఇది, న్యాయసూత్రం, పౌరహక్కుల మౌలిక సూత్రాలకు సంబందించిన సమస్య మన పౌరుల న్యాయచట్టాలకు, సూత్రాలకు వ్యతిరేకంగా పోరాడుట ప్రజల మౌలిక హక్కువగా గుర్తించాలి. అదే కాలంలో చట్టవ్యతిరేకంగా ఎవరూ శిక్షించబడరాదు.[1] అంతేగాక సి.పి.ఐ(యం) తప్పుడు అవగాహనలతో నక్సలైట్లపై హత్యాపోరాటాలుగాక సైద్ధాంతిక పోరాటం చేబట్టునట్లు, అదేవిధంగా నక్సలైట్లు తుపాకి గొట్టం ద్వారానే జనతా ప్రజాస్వామ్య విప్లవం అనే సాహసిక అతివాదాన్ని విడనాడి, కార్మిక, కర్షక తదితర బడుగు వర్గాల ప్రజానీకాన్ని వ్యూడలు, భూస్వామ్యశక్తులకు, గుత్తపెట్టుబడిదారి వర్గాలకు వ్యతిరేకంగా ప్రజాసమీకరణ కావించి, జాతీయ బూర్జువా వర్గాన్ని కూడ కలుపుకొని ప్రజాస్వామ్యవిప్లవాన్ని సంపూర్ణం చేయాలని సి.పి.ఐ కార్యక్రమంగా వుంది.

**పశ్చిమ బెంగాల్‌లో పోలీసు, బురాక్రసీ ఆధిక్యత పంపాదించుట.**

పశ్చిమ బెంగాల్‌లోయే కార్మిక యూనియన్‌లోనూ, మరే సంస్థలోనూ సి.పి.ఐగాని మరే యితర వామపక్ష పార్టీ పనిచేయుట సి.పి.ఐ(యం) సహించజాలదు. కార్మికులపై విశ్వాసాన్ని కోల్పోయింది. కార్మిక సంఘాల ఎన్నికలలో సి.పి.ఐ, యితర వామపక్ష నాయకులు ఎన్నుకొనగలరనే భయము పీడించుచున్నది. అందుకే సి.పి.ఐ(యం) కార్మిక మంత్రి ట్రేడు యూనియనుల బిల్లును ప్రవేశపెట్టుతూ ట్రేడు యూనియనుల రిజస్ట్రారుకు సర్వాధికారాలు కట్టబెట్టారు. అంతేగాక, సి.పి.ఐ, పార్వర్డుబ్లాకు, రివల్యూషనరీ సోషలిస్టుపార్టీ, ప్రజాసోషలిస్టుపార్టీ తదితర వామపక్ష పార్టీలపై దౌర్జన్య సాయుధ దాడులు సాగించుట, పోలీసులు ప్రేక్షకులుగా నగుటతో వామపక్షాలు ఆత్మరక్షణ పేరుతో అదే విధంగా హింసా చర్యలు సాగించుట సర్వసాధారణమైంది. సి.పి.ఐ(యం.యల్) నక్సలైట్లుదళాలు, సి.పి.ఐ(యం) నయారివిజనిస్టు విద్రోహుల ఆటలు కట్టించాలనే నినాదాలతోపాటు, వర్గశత్రునిర్మూలనా విధానంతో సంలీనం చేసి హింసా దౌర్జన్య చర్యలను ముమ్మరం చేశాయి. సి.పి.ఐ.(యం) నాయకత్వంలోని ఐక్యసంఘటనా ప్రభుత్వకాలంలో ఆత్మరక్షణ పేరుతో సి.పి.ఐ(యం) దళాలు వొకవైపున, పోలీసు, సి.ఆర్.పి. దళాలు

1. *భూపేష్ గుప్తా, 1970 ఫైట్‌బ్యాక్ పోలీస్ అండ్ సి.ఆర్.పి ప్రైజల్స్ ఇన్‌వెస్ట్ బెంగాల్, సి.పి.యం. టెర్రర్ ఇన్‌వెస్ట్ బెంగాల్, సి.పి.ఐ పబ్లికేషన్స్ పే. 42–43.*

మరోవైపున నక్సలైట్ల హత్యాచర్యలను మట్టుబెట్టాలంటూ అట్టిచర్యలనే సాగించారు. సహజంగా హింసాదౌర్జన్య చర్యలను అణచివేయు ప్రయత్నాలలో పోలీసు సి.ఆర్.పి.లదే పైచేయి అయింది. అంతేగాక, ప్రభుత్వమూ, సి.పి.ఐ(యం) యిద్దరూ నక్సలైట్లను అణచివేయుట అనేపేరుతో నేరస్థులు, హంతకులు, దొంగలు, యితర సమాజ విద్రోహ శక్తులను పోత్సహించి, తమకు వ్యతిరేకులందరిపై తరచు వినియోగించుటతో, అదే క్రమంలోనే పాలకపార్టీ, ప్రభుత్వయంత్రాంగం పోలీసు పరస్పర సహకారంతో సాగిన క్రమంలో పోలీసు వర్గాలదిపై చేయి అయింది. తదుపరి అదే పోలీసు ఆధిక్యతను గ్రామం నుండి పైస్థాయి వరకు నెలకొల్పారు. ఈ ఆధిక్యత ప్రధానంగా పోలీసు బురోక్రటిక్ అధికార వర్గాలు తమ ఆధిక్యతను సుస్థిరం చేయుటతో విజయం పొందునట్లు చేసింది. ఈ క్రమంలో అతివాదపార్టీలు, ముఖ్యంగా సి.పి.ఐ(యం)ల ప్రభావంలోని పోలీసు, సి.ఆర్.పిలు తమయేజంట్లను ఆయాసంస్థల కార్యకర్తలు, నాయకత్వవర్గాలలోనికి చొప్పించారు. వాస్తవానికి పశ్చిమబెంగాల్‌లో హింసా, దౌర్జన్యం, హత్యలు పెరిగిపోవుటకు ఆయా పార్టీలలోనికి పోలీసు వర్గాలయేజంట్లు, సామాజిక విద్రోహకవర్గాల యేజంట్లను రహస్యంగాను, కొన్నిచోట్ల బహిరంగంగా, వారివారి చెప్పు చేతలలోని వారిని చేర్చుకొని, వారికి రాజకీయ గౌరవాన్ని కట్టబెట్టి, హత్యారాజకీయాలు పెరిగిపోవుటకు తోడ్పడ్డారు. తరతమ తేడాలతో కమ్యూనిస్టు శ్రేణులు మూడు యిదే మార్గాన్ని అనుసరించుటతో సామాజిక దుష్ట, విద్రోహక శక్తులెన్నో రాజకీయ పార్టీలలో చేరి తమకు రాజకీయ రక్షణను కల్పించుకొన్నవి. కొన్ని ప్రభుత్వపాలక యంత్రాంగంలో కూడ భాగస్వాములై ప్రభుత్వ రక్షణను కల్పించుకొన్నారు. అన్నిటికంటె యిదే అత్యంత సోచనీయమైనది.

నేరాలకు, నేరస్థులకు రాజకీయాలలో స్థానం కల్పించబడుట, వారికి లెక్కలేనంత ధైర్యమేర్పడింది. ఇప్పుడు కలకత్తాలో ప్రధాన ప్రాంతాలకు వారేమకుటంలేని మహారాజులు వారు యేదైనా, యేక్షణంలోనైనా చేయవచ్చు, వారిని ఆపగలవారు లేరు రాజకీయ హింసాచర్యలు, సాధారణ గ్యాంగ్ రౌడీచర్యలతో సంలీనమై, రాజకీయ కార్యకర్తల రూపంలో సాధారణ నేరస్తులు పత్యక్షమగుచున్నారు.

ఈ పరిస్తితి పోలీసు, సి.ఆర్.పి. వర్గాల మధ్య మరిన్ని నిరంకుశ అధికారాలు, ఆయుధాలతో శక్తివంతమైన దాడులను చేయుటకు ఆత్మస్థైర్యాన్ని చేకూర్చింది. ప్రజలపై వారి ఉధ్యమాలపైదారుణ, మారణ కాండను జరుపగల శక్తిని పెంపొందించుకొన్నవి.

అదేకాలంలో సి.పి.ఐ.(యం) హత్యా భయోత్పాత విధానాన్ని చేపట్టిన ఫలితంగా, యీ విధానానికంతటికి పోలీసు అధిక్యత పెరిగిపోయింది. ప్రధమ ఐక్యసంఘటన కాలంలో ప్రజల ఫిర్యాదులను శ్రద్ధగా విని, మర్యాదగా ప్రవర్తించిన రోజులు గతించాయి. పోలీసు ప్రజలను గౌరవ హీనంగా చూస్తూ హింసా, దౌర్జన్యాలకు ఎరగా చేస్తూ, ఆక్రమించిన సైన్యంగా ప్రవర్తించుచున్నది. పోలీసు క్యాంపులు, చెక్ పోస్టులు "పుట్టగొడుగులాగా" రాష్ట్రమంతటా వ్యాపించుతున్నవి.

అయినా కలకత్తా, పరిసరప్రాంతాలలో ప్రతిరోజూ నేరస్తుల ముఠాలు గ్రూపులు "కలకత్తా కాళీమాత" ఖడ్గాలు చేబూని మారణ హోమం సాగిస్తునే వున్నారు. ఉదాహరణకు, మూడు

ఘటనలు, లా అండ్ ఆర్డరును పోలీసులు ఎలా పరిక్షించుతున్నారో స్పష్టం చేస్తాయి.

1) కలకత్తాలోని బాలిఘటా ప్రాంతంలోని ఒక చదరపు మైలులో గ్యాంగులు మధ్య పోరాటాలు నాలుగు మాసాలు సాగాయి. ఎనిమిది వందల పోలీసులను ఆప్రాంతంలో శాంతి, భద్రతల పరిరక్షణకు వివిధ స్థలాలలో పోస్టు చేసారు. వారు ప్రేక్షకులుగానే వుండి పోయారు. పరిస్థితి రోజురోజుకు దిగజారింది. ప్రజలు ప్రదర్శనలు, వూరేగింపులు, ఆందోళన తరువాత తప్పని సరియై పోలీసులు చర్యలు చేబట్టారు.

2) బెల్ గటానియా ఉత్తర కలకత్తాలోని బస్తీ, నేరస్తుల కేంద్ర స్థావరమైంది. గ్యాంగులు పోరాటాలు, బాంబులుదాడులు, కత్తిపోటులు రోజువారి ఘటనలయ్యాయి. రెండుగ్యాంగుల మధ్య రెండు మాసాలు ఎడతెగని పోరాటాలు జరిగాయి. కారణం రైల్వే వాగనుల నుండి, వొకగ్యాంగు టెరిలిన్‌క్లాతు దొంగిలించబడగా, అది మరో గ్యాంగు చేతిలోనికి వచ్చినందున జరిగింది. ఒక రోజంతా యీ పోరాటం జరిగింది. పోలీసులు ప్రేక్షకులుగా వుండి పోయారు. ఆప్రాంతంలో యిటువంటి ఘటనలు సర్వసాధారణ మయ్యాయి.

3) ప్రెసిడెంటు పాలన మూడు మాసాలలో 100 రాజకీయ హత్యలు జరిగాయి. అందులో 56 మంది నక్సలైట్లు, 9మంది సి.పి.ఐ కి చెందిన వారు, ఈ హత్యలు చేసింది. ఎవరూ గొప్పగా చెప్పుకొనలేదు, రెండు హత్యలలో హంతకులు ఎవరైంది. మరణవాఙ్మూలంలో యిచ్చారు.

పోలీసులు రాజకీయ చదరంగం ఆడగలరని యీ క్రింది కథనాలు స్పష్టంచేస్తున్నది.

పోలీసు శాంతి, భద్రతలను రక్షించుటలో శ్రద్ధవహించక, సి.పి.ఐ(యం) నక్సలైట్ల మధ్య జరుగుతున్న సాయుధ దాడులు, ప్రతిదాడులు తమ రాజకీయచదరంగంలో వినియోగించుకొని, రాష్ట్ర ప్రభుత్వంపై పూర్తి అధికార, కార్యాచరణను తన గుప్పిటలోనికి తీసుకొన ప్రయత్నించిందనే నిర్ధారణకు వచ్చుటకు గల అవకాశము, సాక్ష్యాలు స్పష్టం చేస్తున్నవి.

పోలీసు నక్సలైట్లు అంటె గల భయాన్ని, పరిస్థితిని వినియోగించుకొని తన లక్ష్యం సాధించ తలచినట్లున్నది. రాష్ట్రంలో జరిగిన ఏ హింసా, దౌర్జన్యచర్యయైనా, నక్సలైట్ల చర్యగా చిత్రించి, తన హింసను ప్రతిచర్యగా చెప్పుతు, అణచివేతను సాగిస్తున్నది. ఉదాహరణకు కొన్ని ఘటనలు.[1]

1) అసన్సోల్‌లో వొక సి.ఐ.డి. కానిస్టేబులు చంపబడ్డాడు. పోలీసు అది నక్సలైట్ల చర్యగా ప్రకటించి బస్తీలో కర్ఫ్యూవిధించారు., ప్రతి యింటిని శోధించి, అనేకమందిని అరెస్టు చేసి లాఠీదెబ్బలకు గురిచేసారు. రెండు రోజులు తరువాత సాధారణనేరస్తుడు ఆహత్యచేసాడని, పోలీసులు ఆమోదించారు. అప్పటి వరకు వందల కొలది ప్రజలు పోలీసుల దౌర్జన్యానికి గురయ్యారు.

2) సెప్టెంబరు 23న యిద్దరు స్కూలు పిల్లలు, ఆరు సం॥ వొక అమ్మాయి కలకత్తా

---

*1. ప్రభాత్ దాస్ గుప్తా (1970) లేజెస్ ఆఫ్ సి.పి.యం సిన్ పోలీస్ కమింగ్ ఆన్‌టాప్ సి.పి.యం టెర్రర్ ఇన్ వెస్ట్ బెంగాల్ భూపేష్ గుప్తా ఎట్.ఆర్. పే.32.*

చక్రబెరియా రోడ్డులో పోలీసు కాల్పులలో తీవ్రంగా గాయపడ్డారు. పోలీసు నక్సలైట్లు వొక పోలీసు వ్యానుపై బాంబులతో దాడి చేసినందుకు ప్రతీకారచర్యగా చెప్పారు. మాజీ యం.యల్.ఎ. ఇలా మిత్రా అదే స్థలంలో విచారించగా ఆరోజున పోలీసులపై ఎవరూ బాంబులు వేయలేదని, క్రితం రోజున కూడ జరుగలేదని, ఆప్రాంతంలో అటువంటిరేమీ జరుగలేదని తెలిసింది. పోలీసులపై యేమీ జరుగకుండానే, ఆపిల్లలను గాయపరస్తూ కాల్పులు జరిపారు. ఆపిల్లలు వారి స్కూలు బిల్డింగు ముందు, మంచినీళ్ళు త్రాగుతున్నది.

3) బేహలా పోలీసు స్టేషన్‌పై జులై 18న దాడి చేయుట నక్సలైట్లు కుట్రచేసారని, దానిని పోలీసు భగ్నం చేసిందని పేపర్లలో పెద్ద ప్రచారం పోలీసులు చేసుకొన్నారు.[1] ఆకధనం యిలా వుంది.

బెహలా బజారులోని పార్కులో కూర్చొని వున్న వొక యువకుని, పోలీసులు రివాల్వరుతో భయపెట్టి, టాక్సీలో బెహలా పోలీసుస్టేషన్‌కు తీసుకొని వెళ్ళుట చూసిన ప్రజలు ఆకారుని వెంబడించి వెళ్ళి స్టేషనును చుట్టుముట్టారు. కాని సి.ఆర్.పి. లాఠీచార్చిచేసి తరిమివేసింది. మరుసటి రోజున సి.ఆర్.పి. హరిసభ బజారులోని ప్రతియింటికి వెళ్ళి, విచక్షణా రహితంగా లాఠీలతో మోది హింసించారు.

పోలీసులు నక్సలైట్లు హింసా, దౌర్జన్యాలు, హత్యలు అంటూ సృష్టించిన కట్టు కధలలో యివి కొన్ని నమూనాలు మాత్రమే వాస్తవానికి అంతులేనిన్నివున్నవి. పోలీసులు 14 మంది యీ కాలంలో చంపబడ్డారని, మరికొంతమంది గాయపడ్డారన్నది వాస్తమే. పోలీసు హింసా, దౌర్జన్యాలు, విచక్షణా రహిత కాల్పుల ఫలితంగా జరిగిన హత్యలు, ప్రజలను హింసించుట పోలీసుల మరణాలకు ఎంతో ముందుగానే జరిగాయి. వాస్తవానికి అని పోలీసు అన్యాయాలకు, హింసలు, హత్యలకు ప్రతీకారచర్యలుగా నెంచాలి. ఏమైనా విప్లవకారుల వ్యక్తిగత హింసాచర్యలు సమర్థించజాలనివి, వారి చర్యలన్నీ అట్టి నమాజాన్ని నిర్మూలించటానికి కేంద్రీకరించాలి గాని వ్యక్తిగత హింసా, దౌర్జన్య చర్యలు సమాజ విప్లవానికి తోడ్పడక పోగా హానికరమైనవిగా గుర్తించాలి.[2]

ఇటీవల పోలీసు యంత్రాగం వెంటవెంటనే అనేక రాక్షస చట్టాలు, బ్రిటిష్ ప్రభుత్వంచేసి, మూలకు నెట్టివేసిన వాటినన్ని బూజుదులిపి ప్రజోద్యోమాలను అణచివేయుటకు అమలు చేయసాగింది. అందులో కొన్ని

1) బెంగాల్ టెర్రరిస్టుల సప్రెషన్‌యాక్టు, 1932ను పునరుద్ధరించి, 10 సెప్టెంబరు 1969నుండి అమలుపెట్టారు.

ఎ) వారంటు లేకుండా ఎవరినైనా డిటేయిన్ చేసి జైలులో పెట్టవచ్చు.

బి) వారంటు లేకుండా ఏ ఇంటిలోనికైనా వెళ్ళి, పరిశీలించవచ్చు

సి) చట్టవ్యతిరేక చర్యలకుపయోగించే యిల్లు, వాహనాలను ఆక్రమించవచ్చు.

---

*1. ప్రభాత్ దాస్ గుప్తా (1970) లేజెస్ ఆఫ్ సి.పి.యం సిన్ పోలీస్ కమింగ్ ఆన్‌టాప్ సి.పి.యం టెర్రర్ ఇన్ వెస్ట్ బెంగాల్ భూపేష్ గుప్తా ఎట్.ఆర్. పే.32.*

*2. -- అదే --- పే. 35-36.*

డి) ఎట్టి చరాస్థినైనా ప్రభుత్వం స్వాధీనం చేసుకొనవచ్చు.

ఇ) ఏ పత్రిక పైన అయినా ఎట్టి చర్యలైనా తీసుకొనవచ్చు.

2) బ్రిటిష్ పాలన నాటి, ఏ ప్రాంతాన్నైనా " కల్లోలిత ప్రాంతంగా" ప్రకటించవచ్చు అంటే సైనిక పాలనను అసాధారణ పరిస్థితులుగా ప్రకటించి, యేర్పరచవచ్చు. స్పెషల్ ట్రిబ్యునల్స్‌ను యేర్పరచి, కోర్టుల పరిమితి నుండి రాజకీయ చర్యల నేరాలను, మామూలు కోర్టులలో విచారణ రద్దు చేసి, ట్రిబ్యునల్సు ద్వారా విచారించి, శిక్షలు విధించి, అమలు చేయవచ్చు.

3. ప్రివెంటీవ్ డిటెన్షన్ చట్టాన్ని చేసి అమలు చేయుటయేగాక, ఒక కొత్త పబ్లిక్ ఆర్డరు చట్టాన్ని చేసారు.

## బెంగాలులో రాజకీయ హత్యలపై సి.పి.ఐ(యం) వైఖరి, ఆచరణ.

కేంద్రంలో అధికారంలో వున్న పాలకవర్గాల రాజకీయ పార్టీ, కాంగ్రెసు, రాష్ట్రంలో రెండవ పర్యాయం ఐక్యసంఘటన యేర్పడిన వెంటనే గతంలో ఎన్నడూ లేనంతగా రాజకీయ హింసా, దౌర్జన్యాలు, హత్యలు, పెరిగిపోయాయి. మార్చి 1970లో ఐక్యసంఘటనా ప్రభుత్వం రాష్ట్రపతిచే బర్తరఫ్ చేయబడిన వెంటనే అవి మరింతగా పెరిగిపోయాయి. సి.పి.ఐ(యం) నుండి తొలగించబడిన తీవ్రవాదులు, నక్సలైట్లు సి.పి.ఐ(యం.యల్) వర్గాలు, సమాజవ్యతిరేక శక్తులు, సి.ఐ.ఎ. యేజంట్లుతో కలసి హింసాదౌర్జన్యచర్యలు, రాజకీయ హత్యలు ప్రారంభించారని. సి.పి.ఐ(యం) అవగాహనగా వుంది. ఈ అరాచకంలో సి.ఐ.ఎ ది ప్రధాన పాత్ర ప్రాముఖ్యత కలది అయింది. ఈ వర్గాల అండదండలతో పాలకపార్టీ కాంగ్రెసు,సి.పి.ఐ(యం) కార్యకర్తలను, నాయకులను పరలోకాలకు పంపే కార్యక్రమాలను ప్రజాస్వామ్య ఐక్యసంఘటనకు బలమైన కేంద్రాలలో అమలు చేయసాగింది. మిలటరీ కేంద్రరిజర్వు పోలీసు, సరిహద్దు రక్షణ దళాలు, రాష్ట్ర పోలీసు, సామాజిక శత్రువులు రౌడీలు అందరిని సమీకరించి రాష్ట్రంలో రక్తపాతపు వాతావరణాన్ని సృష్టించారు. రెండవ ఐక్యసంఘటనా ప్రభుత్వపాలన 13 మాసాలలో రాజకీయశక్తుల నూతన కలయికల కారణంగా ఐక్యసంఘటనలోని భాగస్వామ్య పార్టీలలో సంఘర్షణల కారణంగా సంఘటన ప్రభుత్వం పడిపోయింది.

బూర్జువా పత్రికలు ఉద్దేశపూర్వకంగా, ప్రక్కదారులు పట్టించే ప్రచారం చేసినా, ఐక్యసంఘటనా ప్రభుత్వం కాంగ్రెసు పార్టీని గాని తదనంతర వ్యతిరేకపక్షాలపైగాని దాడి చేసే విధానాన్ని అవలంభించలేదు. ఆ పార్టీల కార్యకర్తల, నాయకులపై ఎట్టి హత్యాప్రయత్నాలు, దాడులు సాగించలేదు. పశ్చిమ బెంగాలులో రాష్ట్రపతిపాలన తరువాత కాంగ్రెసు నాయకత్వంలో సంకీర్ణ ప్రభుత్వం యేర్పడిన తరువాతే ప్రతిపక్షాలపై దాడులు, రాజకీయహత్యలు అనేకరెట్లు పెరిగిపోయాయి. ప్రభుత్వం యిచ్చిన లెక్కల ప్రకారం 1970లో రాజకీయ హత్యలు 436 కాగా 1971లో 1169 జరిగాయి. ఐక్యసంఘటనా ప్రభుత్వం 1970లో పతనానంతరం అంతకుముందుకంటె 600లు పైగా రాజకీయహత్యలు జరిగాయి. వీరందరూ సి.పి.ఐ(యం) కార్యకర్తలు, బలపరచేవారు, ఐక్యసంఘటనలోని యితర పార్టీల కార్యకర్తలు, నాయకులు అయివున్నారు. వీటిని బూర్జువా

వార్తా సంస్థలు రాజకీయపార్టీలు అంతర్గత పోరాటాలుగ చిత్రించాయి. వాటి లక్ష్యం ఆవిధంగా కేంద్రరిజర్వుఫోర్సును అత్యధిక సంఖ్యలోను, అదేవిధంగా అత్యధికంగా రాష్ట్ర పోలీసు బలగాన్ని, వాటి దుశ్చర్యలకు ముసుగువేయుట తప్పమరొకటికాదు[1].

ప్రజాసామాన్యంలోని అనేకవర్గాలు, నక్సలైట్లనుండి, యితర రౌడీమూకలనుండి ఆత్మరక్షణ దళాలను యేర్పరచుకొనుటకు ప్రభుత్వం నుండి బాగా మద్దతులభించింది. పోలీసులలోని క్రింది వర్గాలు నక్సలైట్లుచే 200 వరకు హతులయ్యారు. అయినా పరిపాలనాధికారశాఖ ఆశ్చర్యకరంగా నిర్లిప్తతను ప్రదర్శించింది. పోలీసు శాఖలోని క్రిందతరగతి వుద్యోగులను, వారి కోర్కెలను సి.పి.ఐ(యం) బలపరస్తున్నది. అదేవిధంగా, 40 మంది ప్రభుత్వోద్యోగులు, సాయుధ రౌడీదళాలు చేతులలో హత్యచేయబడ్డారు. అయినా ప్రభుత్వం పట్టించుకొని నేరస్థులను పట్టుకొని శిక్షించే ప్రయత్నం చేయలేదు. ఇది పరోక్షంగా సామాజిక దుష్టశక్తులకు ప్రోత్సాహమిచ్చినట్టయింది. ఈ కాలంలోనే సైన్యం, పోలీసు కొన్ని ప్రాంతాలను చుట్టుముట్టి, యిండ్లలోని యువకులను బయటకు యీడ్చుకొనివచ్చి కాల్చి చంపారు. ముఖ్యంగా నక్సలైట్ల యువకులను, పోలీసులు చెప్పినట్లు గూండాచర్యలు చేబట్ట వ్యతిరేకించిన వారిని, నక్సలైట్లుగా చిత్రించి చంపివేసారు. సాధారణవిధానాలైన, విచారించి, కేసు నమోదుచేసి, కోర్టులో విచారించి, శిక్షించు, పాలనావిధానాలను అనుసరించుటకు బదులుగా కేంద్రప్రభుత్వ సూచనల ప్రకారం చంపివేశారు. అనేక ప్రాంతాలలో వామపక్షాలను బలపరచేవారిని భయభ్రాంతులను చేసి భయపెట్టారు, బెదిరించారు. ఆవిధంగా కమ్యూనిస్టులను, వామపక్షీయాలను, ప్రజాస్వామ్యవాదులను అణచివేసి, కాంగ్రెసుపార్టీ విజయానికి మార్గం సుగమం చేస్తారు. ప్రజలప్రతిఘటనను అణచివేయ జూచారు.

సి.పి.ఐ(యం) కేంద్రకమిటి చైనా కమ్యూనిస్టుపార్టీ మధ్య యేర్పడిన సైద్ధాంతిక భేదాభిప్రాయలను "అవర్ డిఫరెన్సెసెస్ విత్‌ది సి.పి.సి" అనే శీర్షికతో ప్రచురించిన పత్రంలో వివరించిందని నంబూద్రిపాద్ తెలియజేసారు. నక్సలైట్లు సి.పి.ఐ(యం)లో తమ చివర అంతర్గత పోరాటాన్ని మే 1968 ప్రత్యేక ప్లీనంలో జరిపారని, చైనా పంథాకై పోరాడారని, చైనా పంథాకు వ్యతిరేకంగా ప్లీనం తీర్మానించుటతో పార్టీని వదిలి వెళ్ళి, రాజకీయ సైద్ధాంతిక, భౌతిక పోరాటాన్ని సి.పి.ఐ(యం) వ్యతిరేకంగా తీవ్రతరం చేసారని "వర్గశత్రువులను భౌతికంగా రూపుమాపే" వారి రాజకీయపందాను, సాహసికవాదాన్ని అమలు చేయసాగారన్నారు. కమ్యూనిస్టు నాయకులను, కేరళలో అజికోడన్‌రాఘవన్‌ను నక్సలైట్లు కాల్చిచంపారని, యీ చర్యలను చైనా కమ్యూనిస్టుపార్టీ పూర్తి మద్దతునిస్తూ బలపరచిందని వ్రాసారు[2].

1. *జ్యోతిబసు (1970) సబ్‌వర్షన్ ఆఫ్ పార్లమెంటరీ డెమాక్రసీ ఇన్ వెస్ట్ బెంగాల్ డిస్మిసల్ ఆఫ్ సెకండ్ యునైటెడ్ ఫ్రంట్ గవర్నమెంట్ ఆఫ్ వెస్ట్ బెంగాల్, సి.పి.ఐ.(యం) పబ్లికేషన్స్. పే. 5-6.*
2. నంబూద్రిపాద్ .ఇ.ఎం.ఎస్. (1994) ది కమ్యూనిస్టు పార్టీ ఇన్ కేరళ సిక్సి డెకేడ్స్ ఆఫ్ స్ట్రగుల్ అండ్ అడ్వాన్స్. పే.234-35.

# 4

# ప్రజాసంఘాలను సి.పి.ఐ; సి.పి.ఐ(యం) లు చీల్చుట.

భారతకమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర భారత కార్మిక, కర్షకోద్యమాల చరిత్రతో విడదీయరాని సంబంధం కలిగివుంది. కమ్యూనిస్టుపార్టీ కార్మిక, కర్షక, బడుగువర్గాల రాజ్యాధికారాన్ని కార్మికవర్గ నాయకత్వంలో యేర్పరచే లక్ష్యంతో తద్వారా, సోషలిజాన్ని, కమ్యూనిస్టువర్గ రహిత సమాజ నిర్మాణ అంత్యలక్ష్యం చేరుకొనేందుకు కార్మికవర్గ ఐక్యతను వర్గపోరాటాల ద్వారానే నిర్మించి, పేదరైతువర్గాలతో "మిత్రసహకారాన్ని," మధ్యతరగుతుల మద్దతుతోపాటు జాతీయ బూర్జువా వర్గ మద్దతుతో సామ్రాజ్యవాద, భూస్వామ్య వ్యతిరేక విప్లవపంథాననుసరించింది. అఖిలభారత ట్రేడు యూనియనుకాంగ్రెసును కార్మికవర్గ ఐక్యపోరాట నిర్మాణంగా, అఖిలభారత కిసాన్ సభను భూస్వామ్య వ్యతిరేక కర్షక ప్రజాసామాన్య పోరాట సాధనంగా నిర్మించింది. ఈకర్తవ్య నిర్వహణలో కమ్యూనిస్టులు, సోషలిస్టులు, జాతీయవాదులు, పరిశుద్ధట్రేడు యూనియనిస్టులు, ప్రజాస్వామ్యవాదులు ఈఅసంఖ్యాక కార్మిక, కర్షకులు యెందరో ఎనలేని త్యాగాలతో యీ విప్లవపోరాట ఐక్యసంస్థలను నిర్మిచారు. అవివిస్తరించి బలోపేతమైన ప్రజామహోద్యమాలుగ అభివృద్ధి చెందాయి.

భారతకమ్యూనిస్టు వుద్యమం అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో వచ్చిన సైద్ధాంతిక విభేధాలు, చీలికలు ప్రభావాలకుగురై తత్ఫలితంగా కార్మిక, కర్షక ఉద్యమాలు రెండు పర్యాయాములు చీలిపోవుట చారిత్రక సత్యం. శైశవ దశలో వున్న కమ్యూనిస్టు ఉద్యమంలో 1930 దశకంలో వచ్చిన అభిప్రాయభేధాలను మార్క్సిస్టు లెనినిస్టు కార్మిక వర్గ ఐక్యతా సూత్రాలను విడనాడి సైద్ధాంతిక భేదాభిప్రాయాలుగ అభివృద్ధి చేసిన కారణంగా ట్రేడు యూనియన్, కిసాన్ ఉద్యమాలు చీలిపోయాయి. ఈ ప్రజాసంస్థలోని బూర్జువా జాతీయవాదులు, పవిత్రట్రేడు యూనియనిస్టులు చీలికమార్గాన్ని చేబట్టుటతోపాటు, కమ్యూనిస్టువర్గాల అతివాద, వొంటెత్తు పోకడల ఫలితంగానే చీలిపోవుట చరిత్రనేర్పిన గుణపాఠము. తదనంతరకాలంలో దానిని చారిత్రక తప్పిదముగా గుర్తించుట జరిగింది. తిరిగి 1970 దశకంలో అంతర్జాతీయంగా, జాతీయంగా కమ్యూనిస్టు శ్రేణులలో వచ్చిన భేదాభిప్రాయాలు సూడోసైద్ధాంతిక అభిప్రాయ భేదాలుగా రూపొందించబడి వివిధదేశాలలో కమ్యూనిస్టు, కార్మిక, కర్షక, యితర ప్రజాసంస్థలు చీలికలకు గురయ్యాయి. కార్మిక, కర్షక వర్గాలలోని వర్గఐక్యతను విచ్ఛిన్నం చేయుటకు దెయ్యాలు వేదాలు వల్లించినట్లు, కమ్యూనిస్టు శ్రేణులు మార్క్సిస్టు-లెనినిస్టు సూత్రాలను, అనుభవాలను వల్లించుట ఎంతటి అశాస్త్రీయమోవర్తమాన చరిత్ర రుజువు చేసింది. బూర్జువావర్గాలు చేయవలసిన పనిని కమ్యూనిస్టు శ్రేణులేపాల్పడుట, కమ్యూనిస్టుశ్రేణులపైగల పెటీబూర్జువా విప్లవ పిడివాద తత్వాన్ని, మాత్రమే తెలియజేస్తుంది. ఏకమ్యూనిస్టు శ్రేణి మార్క్సిస్టు లెనినిస్టు వివరణ, వ్యాఖ్యా, ఆచరణ కార్మికవర్గ ఐక్యతను, పోరాటపటిమను పెంపొందించేదిగా వుండాలి కాని మార్క్సిస్టు లెనినిజాన్ని అనుసరించుతున్నామని యెన్నిమాటలు, సిద్ధాంతాలు చెప్పినా,

ఐక్యతను వారి ఆచరణ విచ్ఛిన్నం చేస్తే, వారిని కార్మిక వర్గ ద్రోహులుగా, మార్క్సిజం లెనినిజం ముసుగులో వున్న విద్రోహులుగానే పరిగణించాలి.

భారతకమ్యూనిస్టు శ్రేణులు 1990 దశకంలో అఖిల భారత ట్రేడు యూనియనుల సమన్వయ కమిటీ యేర్పరచి, సమిష్టి కార్మిక పోరాటాలకు అవసరమైన కనీస కార్మిక వర్గ ఐక్యత పునరుద్ధరించే ప్రయత్నానికి హర్షామోదాలు తెలుపుతు, చారిత్రక తప్పిదాలను సరిచేసుకొను ప్రయత్నాలు కమ్యూనిస్టు అభిమానులు, ప్రజాస్వామ్యవాదులు హర్షించారు.

కమ్యూనిస్టులు ప్రజాసంఘాలపైన ట్రేడుయూనియనులు, కిసాన్‌సభలు, విధ్యార్థియువజన సంఘాలలో వివిధ సైద్ధాంతిక, రాజకీయ, ఆర్థిక, సామాజిక అభిప్రాయాలు కలవారందరు కలసి, ఆయావర్గసంఘాల ఆర్థిక కోర్కెలకై పోరాడే సంఘాలుగ ఎంతవరకు పనిచేస్తారో ఆమేరకే అవి ఆయావర్గాల ప్రజాసంఘాలుగా వాస్తవంగా, ఆచరణలో పని చేస్తాయి, ఆయావర్గాల ప్రాణప్రదమైన సంస్థలు అగుతవి. నేటి పరిస్థితి, ప్రజాసంఘాలు ఆయాపార్టీలు ఆయావర్గాలలో పనిచేసే ఆయారాజకీయపార్టీల కార్యకర్తల బ్రాంచిలుగా, పార్టీల శాఖలుగా వున్నవి, కాని, కార్మికులందరు, రైతులందరు, వ్యవసాయ కూలీలందరూ, విద్యార్థులందరూ గల సంఘాలుగలేవు. అన్ని రాజకీయ పార్టీలు ఒకే ట్రేడు యూనియను, రైతుసంఘం, వగైరాలలో అరమరికలు లేకుండా పనిచేయ కలిగి వుండే వాతావరణం, తమ తమ సైద్ధాంతిక, ఆర్థిక రాజకీయాలను వివరించుట అందరకూ అవకాశంగల నిర్మాణావేదికలై వుండాలి. తమతమ రాజకీయాలను సైతం వివరించి, ఆచరణలో ఆప్రజాసామాన్యపు అభిమానాన్ని సంపాదించి, విశ్వాసాన్ని పొందాలిగాని, కుయుక్తులు, ఎత్తుగడలతో ముఠాలు గట్టి, వర్గాసంఘాలలో మెజారిటి సంపాదించి, పార్టీ శాఖలుగ మార్చరాదు. పార్టీకి వొక వర్గ ప్రజాసంఘాన్ని నిర్మించు నిర్మాణంగా కాక అన్నిపార్టీలు ఒకే వర్గ ప్రజాసంఘంలో పనిచేయుట జరిగిననాడే అవినిజమైన ప్రజాసంఘాలు అగుతవి కాని లేనిచో అవి ఆయా పార్టీల బ్రాంచిలే అగుతవి. ఇప్పుడున్న ప్రజాసంఘాలలో సభ్యులు కాని వారు పార్టీయేతరులు వివిధ స్థాయిలలో ముఖ్యంగా బాధ్యులుగాలేరని అందరకూతెలుసు పార్టీ శాఖ, ప్రజాసంఘశాఖల భేదము అంతరించి, పార్టీ శాఖలుగా పరిణామమొంది. ప్రజాసంఘాలనైజాన్ని కోల్పోయాయి.

భారతకమ్యూనిస్టు ఉధ్యమం1964లో రెండుగా చీలినపుడు అఖిలభారత ట్రేడు యూనియను కాంగ్రెసు సి.పి.ఐ నాయకుడైన యస్.ఎ.డాంగే నాయకత్వంలోను, అఖిలభారత కిసాన్ సభ సి.పి.ఐ(యం) నాయకుడైన ఎ.కె.గోపాలన్ నాయకత్వంలోను వుండిపోయాయి. ఈరెండు ప్రజాసంఘాలు రెండు కమ్యూనిస్టుపార్టీల విధానాల ఆచరణకారణంగా చీలికల మార్గంలో పయనించాయి.

**కార్మిక వర్గ పోరాటాలు తీవ్రమగుట.**

కార్మిక వర్గపోరాటాలు 1970 దశకం చివరి మూడు సంవత్సరాలలో అత్యంత విస్తృతి చెంది, వెల్లువగా సాగాయి. కార్మికసంఘాల ప్రాథమిక హక్కులు, వేతన పెరుగుదల సమస్యలపై ప్రధానంగా యీ పోరాటాలు జరిగాయి. సమ్మె పోరాటాల కారణంగా పారిశ్రామిక రంగం 1970లో 19.7 మిలియనుల పనిదినాలను కోల్పోయిందని

గణాంకాలు తెల్పుచున్నవి. ఇవి గతంలో కోల్పోయిన దినాల రికార్డును మించిపోయింది. కొన్ని పరిశ్రమలలో ఫ్యాక్టరీలలో వేతనాలు "అవసరప్రాతిపదిగా నిర్ణయించబడిన వేతన స్థాయికిమించే పెంచుట జరిగింది. అదే యీ కాలంలో జరిగిన కార్మిక పోరాటాల ప్రత్యేకతగా వుంది[1]." గుత్తపెట్టుబడిదారులకు వ్యతిరేకంగా మొత్తం ప్రజాస్వామ్య ఉద్యమం, యీ పోరాటాల ద్వారా బలపడింది. కేంద్రప్రభుత్వోద్యోగులు 19 సెప్టెంబరు 1968న వొక్కరోజు చేసిన సార్వత్రిక సమ్మె ప్రత్యేకంగా పేర్కొన తగినది. అంతర్జాతీయ కార్మిక సంస్థ 1957లో రూపొందించిన త్రైపార్టీ కమిటి అవసరాల ప్రాతిపదికగా నిర్ణయించిన వేతన నిర్ణయం ఆమోదించబడింది. ప్రభుత్వం సంప్రదింపులను వ్యతిరేకించుటయేగాక వివాదాన్ని మధ్యవర్తుల తీర్పు సంఘానికి అప్పచెప్పుటను కూడ వ్యతిరేకించి, నిర్బంధవిధానాన్ని తీవ్రతరం చేసింది. అత్యవసర సర్వీసుల రక్షణ ఆర్డినెన్సు, రైల్వేల సవరణ ఆర్డినెన్సులను చట్టబద్దసమ్మెలను, చట్టవ్యతిరేక సమ్మెలుగా చేయుటను త్వరితంగా చేసింది.

"ప్రభుత్వం ఆర్డినెన్సుల ద్వారా తలపెట్టిన హింసా, ప్రభుత్వ నిర్బందచర్యలను చొరవతో వ్యతిరేకించుతు, సమ్మెపోరాటాలను ఎ.ఐ.టి.యు.సి. నిర్మాణబలంతో విజయవంతం చేసింది. ఫలితంగా మరుసటి రోజుననే 44వేలమంది వుద్యోగులు తిరిగి తీసుకొనబడ్డారు. అఖిలభారత ప్రభుత్వోద్యోగుల కన్వెన్షన్ ప్రప్రధమంగా 50లక్షలు ఉద్యోగులు, కార్మికులు కలసి, వొకే వేదికపై సమీకరించయబడినారు. ఐ.యన్.టి.యు.సి తప్ప అన్ని కేంద్ర కార్మిక ఫెడరేషనుల ప్రతినిధులు సమావేశమై జాతీయ కార్మిక సంఘాల సమన్వయ కమిటి"ని, ఎ.ఐ.టి.యు.సి., హెచ్.యం.యస్., హెచ్.యం.పి., యు.టి.యు.సి., లెనిన్ గ్రూపు., యు.టి.యు.సి., ఎ.ఐ.బి.ఇ.ఎ., ఎ.ఆర్.యఫ్., యన్.యఫ్.పి.టి.ఇ. ల ప్రతినిధులు యేర్పరచారు. కాన్ఫెడరేషన్ ఆఫ్ సెంట్రల్ గవర్నమెంటు ఎమ్ప్లాయీస్, ఫెడరేషన్ అఫ్ స్టేటు గవర్నమెంటు ఎంప్లాయిస్, ఎ.ఐ.డి.ఇ.యస్., బియం.యస్., పోలీసు కర్మచారి సంఘ ప్రతినిధులు పాల్గొన్నారు. "పార్లమెంటు ఎదుట ప్రజాప్రదర్శనను సి.పి.ఐ(యం) వ్యతిరేకించుతూ, భగ్నం చేయప్రయత్నించింది." ఐ.యన్.టి.యు.సి యూనియనులు పాల్గొని సహకరించాయి.

జాతీయ ట్రేడు యూనియనుల సంయుక్త సమావేశం నిర్ణయానుసారం మే1 1969న 30వేల మంది కార్మికులు పార్లమెంటుకు 16 లక్షల కార్మికులు సంతకాలు చేసిన పిటిషను సమర్పించారు. ప్రభుత్వం నిర్బంద విధానానికి స్వస్తి చెప్పింది, సుదీర్ఘ పోరాటం ఫలితంగా యిది జరిగింది.

అఖిల భారత బ్యాంకు వుద్యోగుల "రూలు ప్రకారం పని" అనే వుద్యమాన్ని 1968లో సాగించిన పోరాటం ఫలతంగా ముదటసారగా "జాతీయద్విపాక్షిక వొప్పందాలు" నేరుగా సంప్రదింపులు ద్వారా జరుగుటకు వొప్పందం జరిగింది. సుప్రీంకోర్టు బ్యాంకులను జాతీయం చేయు చట్టాన్ని చెల్లదని కొట్టి వేయుటతో 1970లో బ్యాంకు ఉద్యోగులు దేశవ్యాప్తంగా సమ్మెచేసారు.

---

*1. పొలిటికల్ రిపోర్టు అండ్ పొలిటికల్ రిజల్యూషన్ (డిశెంబరు 1971) అడాప్టెడ్ బై 9వ కాంగ్రెసు ఆఫ్ సి.పి.ఐ.(యం) కొచ్చిన్, అక్టోబరు 1972. పే.68.*

పశ్చిమ బెంగాలులో ఐక్యసంఘటనా ప్రభుత్వం, పారిశ్రామిక వివాదాలలో పోలీసు జోక్యాన్ని ఆపుచేయుటతో కార్మిక పోరాటాలు వెల్లువగా జరిగాయి, విజయాలు పొందాయి. ఎ.ఐ.టి.యు.సి; ఐ.యన్.టి.యు.సి; హెచ్.యం.యస్;యు.టి.యు.సిలు కలసి పరిశ్రమ తరువాత పరిశ్రమలో వేతనాల పెంపుకై సంయుక్త కార్యాచరణలను చేబట్టాయి. జూట్ కార్మికులు 2లక్షలు, టీ తోటలలో 2లక్షల కార్మికులు, సమ్మె పోరాటాలు సాగించి, తమ కోర్కెలు సాదించుకొన్నారు. అదే విధంగా ఇంజనీరింగు కార్మికులు తమ వేతనాలను 20 శాతం పెంచుకొన్నారు. బెంగాలులో వేతనాలపెంపుకై జరిగిన పోరాటాల విజయాలు, దేశంలోని కార్మికులను మేల్కొలిపి, పోరాటాలకు ఉత్సాహాన్నిచ్చి, వారు పోరాటాలు విజయవంతంగా తమ పోరాటాలు సాగించునట్లు చేసాయి.

జంషెడ్‌పూర్‌లో ఎనిమిది పెద్ద ఇంజనీరింగు యూనియనులు సంయుక్తంగా 48రోజులు సమ్మె చేసి నవంబరు 1969లో పోరాడి విజయాన్ని పొందారు.

ఈ సమ్మెల విజయాలు, పబ్లికురంగ పరిశ్రమలలో వేతనాల పెరుగుదలను, కరువు బత్తెమును సంప్రదింపు ద్వారా పరిష్కారమగుటకు పరోక్షంగా తోడ్పడినవి. ఈవిధంగా హెచ్.ఎ.యల్, హెచ్.యం.టి;హెచ్.ఇ.సి;బి.హెచ్.ఇ.యల్; హెచ్.ఇ.యల్. సంస్థలతో ఆంధ్రప్రదేశ్, రాజస్థాన్, బీహారు రాష్ట్రాలలో అధికవేతనాల, కరువు బత్తాన్ని సంప్రదింపుల ద్వారా పొందగలిగారు.

ఆంధ్రప్రదేశ్, కేరళ, పంజాబ్, మహారాష్ట్ర, హిమాచలప్రదేశ్,రాజస్థాన్,యు.పి.లలో సంయుక్త కార్యాచరణలతో, సమ్మెలలో పాల్గొని జీతాలలో, స్కేళ్ళలలో పెంపును పొందుటతోపాటు, కరువు బత్తెము, అలవెన్సులలో సమానత్వం, తాత్కాలిక రిలీఫ్, మూడవ పేకమీషన్ సమానస్కేళ్లను యివ్వాలనేవి వారి ప్రధాన కోర్కెలు, కోర్కెలు చాలా భాగం విజయవంతమయ్యాయి. ఈ సమ్మెలు కార్మికులు, మధ్యతరగుతుల ఐక్యతను పెంచాయి.

నిరంకుశ అధికారులు రైల్వే కార్మికుల కోర్కెలను వ్యతిరేకించుటతో వ్యతిరేకత పెరిగిపోయింది. రైల్వే కార్మికులు 8గంటల పని రోజుకై జరిపే సమ్మెపై సౌత్ ఈస్టరన్, నార్త్ ఈస్టరన్ రైల్వే జోనులలో కార్మికులపై, ధన్‌బాద్ వర్కర్లపై హింసా, దౌర్జన్యకాండలతో ప్రభుత్వపోలీసువర్గాలు అణచివేయు విఫలయత్నం చేసారు. ఈ పోరాటాలలో 1970 ఆగస్టులో అన్ని అఖిలభారత ట్రేడు యూనియనులు, ఐ.యన్.టి.యు.సి యూనియనులు కొన్ని పాల్గొన్నవి.

## అఖిల భారత ట్రేడు యూనియను కాంగ్రెసులో చీలిక

కార్మికవర్గ ఐక్యకార్యాచరణలు, ఐక్యసమ్మె పోరాటాలు వెల్లువగా రూపొందుతున్న తరుణంలో ఎ.ఐ.టి.యు.సి.లో 1964లో ముఖ్యంగా 1965 చివర నుండి సి.పి.ఐ., సి.పి.ఐ(యం)ల మధ్య అంతర్గత పోరాటంగా రూపొంది, ఆఫీసులు, రికార్డులు ఆక్రమించే రూపంలో, కొన్ని చోట్ల మారణాయుధాలతో సంఘర్షణలకు దిగజారిపోయారు. అదేకాలంలో ఇంతకాలంగా సాగుతున్న సి.పి.ఐ., సి.పి.ఐ.(యం) ఆ సైద్ధాంతిక పోరాటం వికృతరూపం ధరించి సాయుధ అంతర్గత పోరాటంగా మారి ప్రాణనష్టాలకు దారితీసింది. అర్ధశతాబ్దంపైగా పోరాట చరిత్రగలిగిన కమ్యూనిస్టు శ్రేణుల మధ్య వొకవిధమైన

అంతర్యుద్ధమే, సైద్ధాంతిక పోరాటం పేరుతో కొంతకాలం సాగింది. ఫలితంగా అఖిలభారత ట్రేడు యూనియను కాంగ్రెసు చీలికకు గురైంది. ఎ.ఐ.టి.యు.సి దానిలోని సి.పి.ఐ;సి.పి.ఐ(యం) నాయకత్వ శ్రేణులు చారిత్రక తప్పుడు విధానాలు అవలంభించి ఎ.ఐ.టి.యు.సి.లో చీలికకు కారకులయ్యారు. చరిత్ర వారిని క్రమించక, కసి తీర్చుకొన్నది.

## కార్మిక రంగంలో సి.పి.ఐ అనుసరిస్తున్న "మితవాద సంస్కరణవాదం" పై సి.పి.ఐ(యం) విమర్శన

ఎర్నాకులంలో 1957లో జరిగిన "ఎ.ఐ.టి.యు.సి" మహాసభ నుండి యస్.ఎ డాంగె నాయకత్వంలో సి.పి.ఐ. కార్మికరంగంలో మితవాద సంస్కరణవాద, అవకాశవాదాలను అనుసరించుచున్నదని, సి.పి.ఐ(యం) కేంద్రకమిటి 1968లో తీవ్రంగా విమర్శించింది.

ఇంకా "అపఖ్యాతికరమైన రెండు స్థంబాల విధానం" ఎ.ఐ.టి.యు.సి. సమావేశం మౌలిక పంధాగా ఆమోదించింది. స్వతంత్ర ఆర్థిక విధానాన్ని బూర్జువా వర్గపాలన అనుసరించు చున్నదన్న అవగాహనను ట్రేడు యూనియను కాంగ్రెసు విధానంగా వుంది."జాతీయ ప్రణాళికను మనం బలపరచాలి" "కార్మిక వర్గాన్ని, దానిపై దాడి చేసే విధానాన్ని వ్యతికించాలి." అనే నినాదాలతో తరువాత జరిగిన ఎ.ఐ.టి.యు.సి. కోయంబత్తూరు మహాసభ యీ విధానాన్నే పునరుద్ఘాటించింది.

జాతీయ ప్రణాళికా బద్ద ఆర్థికవిధానంలో అత్యవసరాల దిగుమతుల సైతం విదేశ సహాయపై ఆధారపడవలసి వుంటుందని 1963 డిశెంబరునాటికే స్పష్టమైంది. భారత గుత్తపెట్టుబడిదారి వర్గాలు ప్రవేటు రంగంలో సంయుక్తంగా స్థాపించే పరిశ్రమలకు కూడ విదేశీసహాయం అత్యవసరము.

డిశెంబరు 1963లో యస్.ఎ.డాంగే ట్రేడు యూనియన్ ప్రాక్షనుకు సమర్పించిన నివేదికలో "మనదేశంలో వున్న ఉత్పత్తి సాధనాలనే మన కార్మికవర్గం ఉపయోగించి, నేడు పెట్టుబడిదారి ప్రభుత్వంలో ఆవర్గపు సంపద సాధానాలుగ వున్నవాటిని, ప్రజల సుభిక్షానికి సాధానాలుగ మార్పు చేయాలి లేక పరిణామం చెందించాలి[1]." అని పేర్కొన్నారు. వాస్తవానికి బూర్జువావర్గం అనుసరించే పంధాయే దేశంలో అనుసరించేయేకైక పంధాయని స్పష్టం చేసారు.

ఇంకా యిలా అన్నారు. "మేము దేశంలో పారిశ్రామికాభివృద్ధిని, బలపరుస్తాం. మాకు అది పెట్టుబడిదారి విధానాభివృద్ధి తెలిసినప్పటికి బలపరుస్తాము."

వాస్తవానికి ఆచరణలో "ఎ.ఐ.టి.యు.సి" త్రైపాక్షక సమావేశాలను, వేతన బోర్డులను, కార్మికుల భాగస్వామ్యాన్ని, యాజమాన్యంలో ప్రవేశపెట్టుటను ప్రధాన విజయాలుగ పేర్కొన్నారు.

ఇంతకు ముందెన్నడూ ట్రేడు యూనియను రంగంలో సంస్కరణవాద పంధా ఎప్పుడూ ప్రతిఘటించబడలేదు. సి.పి.ఐ కేంద్రకమిటి టి.యు.సి.ఫ్రాక్షను కమిటిలో ఎప్పుడూ సంస్కరణవాదంపై చర్చ లేవనెత్తబడలేదు. ఇది స్థానిక నాయకులు, కార్యకర్తలు

---

*1. టాస్క్ ఆఫ్ ట్రేడ్‌యూనియన్ ఫ్రంట్ (1968) రిజల్యూషన్స్ ఆఫ్‌ది సి.సి., సి.పి.ఐ.(యం). పే.44.*

నిర్ణయించవలసియున్నది. పార్టీలోని నేటి తీవ్ర అభిప్రాయభేదాలు, రాజకీయవిధానాలు, విప్లవపంథా, తీవ్రచర్చలకు గురి అగుతున్నపుడు కేంద్రకమిటిలో చర్చలసరళి తీవ్రమైనపుడు, విస్తృత చర్చలు జరుగలేదు.

అభివృద్ధి చెందని వెనుకబడిన దేశాలలో స్వయంచాలక అర్థికాభివృద్ధిని సాధించుటకు కార్మికవర్గ ఉత్పత్తి, ఉత్పత్తిశక్తులు వాటి విషయంలో సామ్రాజ్యవాద శక్తులపై ఆధారపడక, స్వతంత్ర ఆర్థికవిధానాలను అవలంభించుటకు తోడ్పడాలనే అభిప్రాయముంది. అంతేగాక మరింత నిర్దిష్ట సంస్కరణవాద అభిప్రాయాలను పబ్లిక్ రంగంలోని ఉత్పత్తి విధానాలయెడల, అవలంభిచవలసిన వైఖరుల యెడల అభిప్రాయభేదాలున్నవి. ప్రవేటురంగంకంటె ప్రభుత్వం, పబ్లిక్‌రంగ పరిశ్రమల యెడల కొంత సానుభూతిని కలిగివుండుట సహజం, అయితే పబ్లిక్ రంగాన్ని ఆకాశానికి ఎత్తిపొగుడుట అవకాశవాద మగుతుంది. కాన దానిని దగ్గరకు చేరనీయరాదు.

ట్రేడు యూనియనులు స్వతంత్రంగా పార్టీ రాజకీయాలకు దూరంగా వుండాలనే వైఖరి, వొక నూతన సూత్రంగా కమ్యూనిస్టులలోనే వొక మార్గం అభివృద్ధి చేసింది. ట్రేడు యూనియన్ను, తదితర ప్రజాసంఘాలు విప్లవరాజకీయాలకు దూరంగా వుండాలనే, వొక మితవాదవర్గ వైఖరి ప్రబలింది. ఈ విధానపు దురదృష్టకర ఫలితమే కమ్యూనిస్టు పార్టీలోని అతివాదవర్గం, ట్రేడు యూనియనులలో పనిచేస్తున్న కార్యకర్తలు, నాయకులు కొందరు 1963లో అరెస్టు అయినపుడు "ఎ.ఐ.టి.యు.సి." జనరలు కౌన్సిలు సమావేశం జరిగినపుడు, అరెస్టులను ఖండించే జనరలు తీర్మానం నిరాకరించబడింది. కౌన్సిలులో యీ విధానానికి వ్యతిరేక తీవ్రత ఎక్కువగుటతో, చివరకు ట్రేడు యూనియను నాయకులు, కార్యాకర్తలను అరెస్టులు చేయుటను ఖండించు తీర్మానం చేయబడింది. పార్లమెంటు ఎదుట 1963లో ప్రజాప్రదర్శన జరిగినపుడు జైళ్ళలో వున్న రాజకీయ నాయకులందరిని విడుదల చేయాలనే నినాదాన్ని వ్యతిరేకించుట జరిగింది. సామ్రాజ్యవాద వ్యతిరేకపోరాటంలో జైళ్ళలో మ్రగ్గుతున్న ఖైదీలు ఎవరైనా, వారి రాజకీయ సిద్ధాంతాల భేధాభిప్రాయాలతో సంబంధం లేకుండా, వారినందరినీ విడుదల చేయాలనే కోర్కెలు ప్రకటించుట, నిరసన ప్రదర్శనలు చేయుట ట్రేడు యూనియన్ కాంగ్రెసు సాంప్రదాయంగావుంది. దానిననుసరించి ఏ ప్రభుత్వమైనా, ప్రజాస్వామ్య, పౌరహక్కులను హరించి, చట్టబద్ధంగా అరెస్టు చేసి, కేసులు పెట్టకుండా విచారణలేకుండా జైళ్ళలో మ్రగ్గుతున్న రాజకీయ ఖైదీలనందరిని విడుదల చేయాలనే ఆందోళనను కార్మికసంఘాలు చేబట్టకుండుట, ఆర్థిక, రాజకీయ మితవాద వర్గనాయకత్వాల పెడధోరణి పరాకాష్టగా నెంచవలసివుంటుంది.

ఒకే పరిశ్రమలో, వొకే ఫ్యాక్టరీలో కూడ అనేక కార్మిక సంఘాలు, అందులో కొన్ని కేంద్రట్రేడు యూనియనులకు అనుబంధసంస్థలుగా వున్నవి. యాజమాన్యం బలంకలిగిన ఎ.ఐ.టి.యు.సి ని సహజంగా గుర్తించక, కార్మికవర్గ ఐక్యతను భగ్నం చేయుటకు, రాజకీయ, ఆర్థిక ప్రయోజనాల కారణంగా కాంగ్రెసు ప్రభావంలోని నామమాత్రపు ఐ.యన్.టి.యు.సిని గుర్తించుతు, విచ్ఛిన్నాన్ని ప్రోత్సాహించాయి. మరోవైపున ఎ.ఐ.టి.యు.సి లోని కొన్ని యూనియనులు, కొందరు నాయకులు వర్గ సామరస్యాన్ని

ప్రభోదించుతున్నారని, అతివాద దృక్కోణాన్నుండి. సి.పి.ఐ(యం) నిందా ప్రచారం చేస్తూ, పరోక్షంగా కార్మికవర్గ ఐక్యతా విచ్ఛిన్నానికి తోడ్పడింది. అదే కాలంలో 1962లో దేశరక్షణ పేరుతో అధికోత్పత్తికి ప్రభుత్వంతో, యాజమాన్యంతో సహకరించినా, 1942లో వలె ఫ్యాక్టరీ యాజమాన్యాలు పనిలోడును కార్మికులపై అధికం చేసినపుడు అధికవేతనాలను డిమాండు చేయుటను డాంగే నాయకత్వంలోని ఎ.ఐ.టి.యు.సి ఉపేక్షించి యాజమాన్యం, ప్రభుత్వాలతో సహకరించింది. ఇట్టి ఆచరణ ఫలితంగా ప్రధానంగా అధిక లాభాల ప్రయోజనాలను పొందేది పెట్టుబడిదారి పారిశ్రామికవర్గాలు అన్నది స్పష్టం సి.పి.ఐ, సి.పి.ఐ(యం) ల నాయకత్వాలలోని యూనియనులు యీ ఆచరణ రెండు చర్యలు కార్మికవర్గ ఐక్యత, ప్రయోజనాలకు నష్టాన్నే కలుగజేసాయి. తమతమ సైద్ధాంతికవాదలను బలపరచుకొనుటకు మితవాద, అతివాద కమ్యూనిస్టు శ్రేణులు రెండూ "ట్రేడు యూనియనుల ఐక్యతా" నినాదాన్ని యిస్తూ, స్వపక్షాలవైపు కార్మికులను సమీకరించ ప్రయత్నించినా, ఐ.యన్.టి.యు.సి కార్మిక నాయకత్వాలే కార్మికులను సమీకరించుటలో యెక్కువ విజయాన్ని పొందారు. కార్మికులు కమ్యూనిస్టు శ్రేణులకు దూరమగుట ప్రారంభమగుట వాస్తవంగా గుర్తించవలసిన విషయము.

సి.పి.ఐ నుండి అతివాద కమ్యూనిస్టు శ్రేణులు 1964లో చీలి సి.పి.ఐ(యం) నిర్మాణ ప్రయత్నాలు ప్రారంభమగుటతో, ఎ.ఐ.టి.యు.సి నుండి అతివాద కమ్యూనిస్టు శ్రేణులు, ఎ.ఐ.కె.యస్. నుండి మితవాద కమ్యూనిస్టు శ్రేణులు పరస్పరం తొలగించుకొనుట లేక నిష్క్రమించుటలతో ప్రజాసంఘాల చీలకలకు 1966లోనే పునాదులు యేర్పడి, చీలికల ప్రమాదం యేర్పడింది.

## ట్రేడు యూనియన్ కాంగ్రెసు నాయకత్వానికై సి.పి.ఐ; సి.పి.ఐ(యం)ల మధ్య అంతర్గత పోరాటం.

ట్రేడు యూనియన్ కాంగ్రెసు సి.పి.ఐ నాయకత్వంలో వుంది. కొన్ని చోట్ల సి.పి.ఐ(యం) నాయకత్వంలో వున్నందున, సభ్యత్వరిజిస్ట్రేషన్ నుండి, రాష్ట్ర, జిల్లా సమావేశాలకు ప్రతినిధులను నిర్ణయించుట నుండి ఎన్నికల వరకు అన్ని విషయాలలో వివాదాలు, సంఘర్షణలు చెలరేగినవి. వీటిని దృష్టిలో పెట్టుకొని డిశెంబరు 1966లో ఎ.ఐ.టి.యు.సి జనరలు కౌన్సిలు వొక నిర్మాణ తీర్మానం చేసింది. ఎ.ఐ.టి.యు.సి చీలకుండ వుండగలందులకు రాష్ట్ర, అఖిల భారత స్థాయిలో వివాదాలను పరిష్కరించుటకు ఒక యంత్రాంగాన్ని రూపొందించాలని తీర్మానం పేర్కొంది. కాని ఎ.ఐ.టి.యు.సి కి అఖిల భారతస్థాయిలో నాయకత్వం వహించుతున్న డాంగే నాయకత్వం సి.పి.ఐ చొరవను యేమాత్రం తీసుకొనలేదు. అదే విధంగా బెంగాల్, కేరళలలో ట్రేడు యూనియనులకు నాయకత్వం వహించుతున్న రాష్ట్ర సి.పి.ఐ(యం) నాయకత్వాలు ప్రవర్తించాయి.

శ్రీడాంగే 25మే 1969 లేఖకు, కా॥సుందరయ్య సమాధానంగా వ్రాసిన లేఖలో కోయంబత్తూర్ ఎ.ఐ.టి.యు.సిలోని వివాదాంశాలను యిలా పేర్కొన్నారు. "మా కామ్రేడ్స్ కోయంబత్తూరులో జనరలు కౌన్సిలు నిర్మాణ సమస్యల తీర్మానాన్ని అమలు చేయుటకు "టి.యన్.టి.యు.సి" వొక కమిటిని యేర్పరచి, వివాదాస్పద కేంద్రాలకు సంయుక్తంగా వెళ్ళి, చీలికలను నివారించుటకు, లేక తొలగించుటకు గల అవకాశాలను పరిశీలించవలసి

వుంది. ఆ కమిటి వొక కేంద్రానికి వెళ్ళగా, వాస్తవాలు మీ పక్షానిది తప్పని, స్పష్టమైంది. మీ ప్రతినిధి నిర్ణయాలను ఉపేక్షించగా టి.యన్.టి.యు.సి నిర్ణయాలు బుట్టదాఖలా అయినవి. కమిటీ సభ్యులైన తంగమణి, మధురగుడ్డల మిల్లులో పోటీ సంఘాన్ని యేర్పాటు చేయగా, ఆకమిటి సహజంగానే మూలపడిపోయింది.

"ఈవివాదాన్ని క్రిందటి ఎ.ఐ.టి.యు.సి. లో లేవనెత్తబడుట మీకు గుర్తుండియే వుంటుంది. ప్రజాస్వామ్య పద్ధతులలో ఎన్నికైన ప్రతినిధులతో సాంవత్సరిక మహాసభ జరుపుటకు మీరు వ్యతిరేకించి, మరోవైపున శాఖ తరువాత శాఖను అత్యంతనిరంకుశ పద్ధతులలో రద్దు చేసారు. ఎ.ఐ.టి.యు.సి మహాసభలో రెండు యూనియనులు ఐక్యతను నిర్మించాలని కోరుట జరిగింది. అయినా మీ యూనియన్ మా యూనియన్‌కు వ్యతిరేకంగా కరపత్రాలు పంచింది[1]."

"సిమెంటు వర్కర్స్ యూనియన్ జనరల్ బాడి సమావేశం నుండి సి.పి.ఐ ప్రతినిధులు "వాకవుటు" చేసారు. మిగతా ప్రతినిధులు యూనియన్ ఆఫీసుకు ప్రదర్శనగా వెళ్ళి, కా.రామమూర్తి సమక్షంలో టి.యన్.టి.యు.సికి వొక లేఖనిచ్చి, రెండు పక్షాల నుండి చెరొక సభ్యుని పర్యవేక్షణలో తిరిగి ఎన్నికలు జరపాలని, పబ్లిక్ మీటింగులో సంయుక్తంగా ప్రకటించారు. ఎ.ఐ.టి.యు.సి మహాసభలో జెన్సోట్స్ ట్రేడు యూనియనులోని వ్యతిరేక పక్షాలు రెండూ ఐక్యతా ప్రయత్నాలు సంయుక్తంగా చేయాలని నిర్ణయించారు. జనరలు కౌన్సిలు సమావేశం తరువాత మా క్రామేడ్స్ మమ్ములను కలిసినా మీ నుండి స్పందన లేదు. ఇదేవిధంగా బాంబేలో కూడ మీరు ఎట్టి వుత్సాహాన్ని చూపలేదు. ఇక్కడ మరో యూనియన్ అనుబంధ సంస్థగా ఆమోదించు వివాదంలో, రెండు పక్షాలు సంప్రదింపులలో వొప్పందానికి రాజాలక పోయాయి.

సి.పి.ఐ "మాకు మెజారిటి రాకపోవుటతో యు.పి. "టి.యు.సి"ని చీల్చామని, ఇండియన్ ఆక్సిజన్ యాజమాన్యంతో టి.యు.సి చేసుకొనే వొప్పందానికి అడ్డుపడ్డామని ఇండియన్ ఆయిల్ యాజమాన్యం తొలగించిన కార్మికులను తిరిగి చేర్చుకొనుటకు చేయు ప్రయత్నాలకు మేము అడ్డుతగిలామని, టీ తోటల కార్మికులకై మీరు చేబట్టిన కార్యాచరణను నాశనం చేసామని, కేరళ, పశ్చిమ బెంగాలులలోని హోంశాఖ మంత్రులు సి.పి.ఐ.(యం) నాయకులయినందున, యితరులపై దాడులను పరోక్షంగా ప్రోత్సాహించుతు, మాయూనియనులను బలపరచుకొన్నామని బర్నపూర్ కార్మికుల యూనియన్‌ను విచ్ఛిన్నం చేసామని మాపై నిరాధారనిందలు మోపిందని" సి.పి.ఐ. శెక్రటరీ, డాంగేకు వ్రాసిన లేకలో వివరంగా సమాధానం యిచ్చారు.

యు.పి. "టి.యు.సి" చీలికపై మీరు "తప్పుడు వక్రీకరించిన కధనాన్ని యిచ్చారు. మీ అనుచరులే నేరుగా చీలికను సృష్టించారు. మీరు స్వయంగా వెళ్ళి, మూడు రోజులుండి, చీలిక కార్యక్రమాన్ని సాగించారు." అని సి.పి.ఐ శెక్రటరీకి సి.పి.యం శెక్రటరీ వ్రాసిన లేఖలో పేర్కొన్నారు. ఇంకా "కార్మికుల వేతనాలను కొద్దిగా పెంచి, రిట్రెంచిమెంటు

---

1. ది. రివిజనిస్టు డిజరప్షన్ ఆఫ్ ది ఎ.ఐ.టి.యు.సి., కరస్పాండెన్స్ బిట్వీన్ సి.పి.ఐ. అండ్ సి.పి.ఐ.(యం). సిపి.ఐ.(యం) పబ్లికేషన్. 1970.పే.16.

చేయమని సాధారణంగా ఉదహరించిన మాత్రాన మీరు యాజమాన్యపు మొత్తపు ప్రణాలికను ఆమోదించి కార్మికులకు ద్రోహం చేశారు. యాజమాన్యం కార్డు పంచింగు, డేటా ప్రొసెసింగు, యంత్రాలను ప్రవేశపెట్టింది. కొద్దిగా వేతనాన్ని పెంచుటను పెద్ద విజయంగా ప్రచారం చేస్తున్నారు.

"ఇండియన్ ఆక్సిజన్ బ్రిటిష్ కంపెనీ తరతరాల ఫ్యాక్టరీ యూనియన్‌లో మానాయకులు ముగ్గురు, మీ ప్రతినిధులు యాజమాన్యపు క్రమశిక్షణా చర్యలపై యిచ్చిన సాక్ష్యాల ఫలితంగా, వారు ఉద్యోగాలను కోల్పోయారు. ఏప్రిల్ 1967లో తొమ్మిది రోజులు సమ్మె కూడ జరిగింది. మధ్యవర్తిత్వసంఘం అందులో ఇద్దరిని తిరిగి ఉద్యోగాలలో చేర్చుకొనాలని నిర్ణయించినా, యాజమాన్యం తిరస్కరించి హైకోర్టుకు వెళ్ళింది. మీస్థానిక నాయకత్వం మౌనంగా వుంది. యూనియన్ సాంవత్సరిక ఎన్నికలలో మీ అభ్యర్థుల జాబితా త్రోసి వేయబడినా యూనియన్ అధ్యక్షుడు జ్యోతిబసు యేక పక్షంగా మీమేనేజింగ్ కమిటి ఎన్నికైనట్లు ప్రకటించారు, యాజమాన్యం మీయూనియన్‌ను గుర్తించింది. ఐక్యసంఘటన ప్రభుత్వం కార్మికమంత్రి, కార్మికుల యాజమాన్యపు ప్రతినిధుల సమావేశాన్ని మీ యూనియన్ బహిష్కరించి, పరోక్షంగా యాజమాన్యానికి తోడ్పడింది. మమ్మ, మామంత్రులను విమర్శించి, త్రైపాక్షిక సమావేశాన్ని యాజమాన్యం బహిష్కరించగా హర్షించాయి[1].

" ఈ సందర్భంలో మీ ప్రతినిధి వై.డి. శర్మ తిరిగి వారిని ఉద్యోగాలలో చేర్చుకొనుటను వ్యతిరేకించారు. అంచేతనే యాజమాన్యం చేసిన వాగ్దానాలను త్రోసివేయగలిగింది.

ఇంకా "మేము యూనియన్ విచ్ఛిన్నం చేస్తున్నామనుట నిరాధారము. మాపలుకుబడి పెరిగినదనుటకు, 1967 ఎన్నికలలో మీ అభ్యర్థి డిపాజిట్ కోల్పోవుట, మా అభ్యర్థి 700ల వోట్ల తేడాతో వోడిపోవుట మాబలాన్ని స్పష్టం చేస్తున్నది. మధ్యంతర ఎన్నికలలో పెద్ద మెజారిటితో ఆసీటులో మేము గెలుపొందాము. అయినా మీరు ఆయూనియన్‌ను "జేబు సంస్థ"గా కొనసాగిస్తున్నారు. మీవర్గ సామరస్యవిధానాల కారణంగా టీ తోటలలో కార్మికులలో మీరు మమ్మ తుడిచిపెట్టగలమని డంబాలు పలికినా, వాస్తవంగా మీరు మీబలాన్ని కోల్పోయారు. జాల్పగురి, డార్జిలింగ్, తెరైలలో మీరెక్కడా కానరారు. దోరాస్‌లలో కార్యవర్గంలో మాకు అత్యధిక మెజారిటి వుంది అయినా, మీపార్టీ సభ్యుని జనరల్ శెక్రటరీగా వున్నా అతనిని తొలగించలేదు. మీ అపజయాలను, మీబలం తగ్గిపోవుటను, మా విచ్ఛిన్నకర చర్యకారణంగా చెప్పి సమర్థించుకొంటున్నారు. మీ "ఎ.ఐ.టి.యు.సి" వందల కొలది ప్రతినిదులను సమావేశాలకు పంపే మీయూనియన్, సభత్వ వెరిఫికేషన్ అధికారులకు రికార్డులను చూపించ జాలక పోయింది. బెంగాల్, కేరళలలో ఎ.ఐ.యు.టి.సి నాయకులలో అత్యధికులు సి.పి.ఐ(యం) నాయకత్వంలో ఉన్నారు. మీరు మీ సభ్యత్వాన్ని అనేక రెట్లు పెంచి చెప్పుతు, మామెజారిటిని, అధిక్యతను త్రోసి బుచ్చుతున్నారు." అని వాదనలతో సి.పి.ఐ "నిందలను" సి.పి.ఐ(యం) త్రోసి బుచ్చింది.

---

*1. ది. రివిజనిస్టు డిజరప్షన్ ఆఫ్ ది ఎ.ఐ.టి.యు.సి.. కరస్పాండెన్స్ బిట్వీన్ సి.పి.ఐ. అండ్ సి.పి.ఐ.(యం)., సిపి.ఐ.(యం) పబ్లికేషన్. 1970. పే.22-24.*

ఏప్రిల్ 29, 1969న కా॥ సుందరయ్య, సి.పి.ఐ(యం) జనరలు శెక్రటరీ, "ఎ.ఐ.టి.యు.సి." కార్యక్రమ విధానాలను చైర్మన్ కా॥డాంగే తమకు, సి.పి.ఐకు అనుకూలంగా వినియోగించుకొని, పోటీ సంఘాలను పెట్టించి, ప్రోత్సహించి, సంస్థ అకౌంటు పుస్తకాలను మీ ప్రతినిధులు స్వాధీనం చేసుకొని అవి పోయినవని చెప్పారని, ఉత్తరంలో పేర్కొంటు వ్రాసారు. జాతీయ లేబరు కమిషన్‌కు మీపార్టీకి చెందిన కేరళ కార్మికశాఖమంత్రి "ఎ.ఐ.టి.యు.సి వర్కింగు కమిటిని ఖండించవలసిందిగా మెమొరాండం పంపించారు. మీపార్టీ, ముఖ్యమంత్రి ఆమెమొరాండం తిరిగి వెనుకకు తీసుకొనుటకు చేసిన నిర్ణయం సంవత్సరమైనా, మాకు పత్రికల ద్వారా తెలిసింది." అని అంటూ వ్రాసిన ఉత్తరానికి మే 25, 1969న కా॥డాంగే సమాధానంగా అపవాదనలను ఖండించుతూ వ్రాసిన అంశాలు కొన్ని యిలావున్నవి[1].

"మీ యూనియనులను అనుబంధసంస్థగా చేర్చుకొను అధికారం వొక్కవర్కింగు కమిటీకి మాత్రమే వున్నవి. అది కూడ క్రెడెన్షియల్ కమిటిని యేర్పరచిన తరువాత, అది పరిశీలించి, నివేదిక సమర్పించిన మీదట, వర్కింగు కమిటికి అట్టి అధికారముంది. ఆకమిటి నిర్ణయాలన్నీ ఏకగ్రీవంగా జరిగాయి.

ఆ కమిటీలో మీ ప్రతినిధులున్నారు, వారూ ఆనిర్ణయాలను అంగీకరించారు.

"మా యూనియనులను యెట్టి కారణం చూపకుండా అనుబంధ సంస్థలుగా వుండుటను రద్దు చేసారు," అనే మీనిందకు "ఎ.ఐ.టి.యు.సి"కి అనుబంధాన్ని తొలగించే అధికారంలేదు, ఎవరి అనుబంధస్థాయిని రద్దు చేయలేదు. మీరు ఉదాహరణ యివ్వగలరా" అని ప్రశ్నించారు.

"ఎ.ఐ.టి.యు.సి" వర్కింగు కమిటి సభ్యులైన మాపార్టీ సభ్యులను మీ అధిపత్యంలేక నాయకత్వంలో వున్న రాష్ట్రట్రేడు యూనియను కమిటీలు తొలగించి వేసారని సి.పి.ఐ(యం) చేసిన పిర్యాదుకు ప్రతిగా "ఎ.ఐ.టి.యు.సి" వర్కింగు కమిటిలనుండి ఎవరూతొలగించబడలేదు. మీ నాయకత్వంలోని ఎ.ఐ.టి.యు.సి. కమిటీలనుండి మీరు వ్యక్తులనేగాక, యూనియనులనే తొలగించివేసారు. మేము ఆవిధంగా చేయలేదని గుర్తుంచుకోవాలని" సి.పి.ఐ ప్రతిపిర్యాదును సమాధానంగా పేర్కొన్నది. అంతేగాక "ఒకే వొక సంఘటన ఆంధ్రట్రేడు యూనియన్ కాంగ్రెసుకు సంబంధించినది వుంది. కమిటి యీ విషయంలో కూడ వ్యక్తుల చర్యలను, వారి నిందా పూర్వక ప్రవర్తన, విచ్ఛిన్నకర చర్యలు, చీలికలు తెచ్చేయత్నాలను పరిగణలోనికి తీసుకొన్నది గాని యూనియనులపై మాత్రం కాదని" వివరించింది.

"వర్కింగు కమిటి, జనరలు కౌన్సిలు సమావేశాలు రెగ్యులర్‌గా జరుపలేదన్న సి.పి.ఐ(యం) ఫిర్యాదుకు, "అది పాక్షిక సత్యం, సరిగ్గా జరుగవలసిన తేదీలలో జరుగక పోయినా, ఆలస్యంగానైనా జరిగాయి. అది మా విధానంకాదు. నిర్మాణ సంబంధమైన చిక్కులు, ప్రజావుద్యమాలలో మునిగియుండుట, ప్రకృతి అవాంతరాలు వలన జరిగిందని

---

*1. ది. రివిజనిస్టు డిజనరేషన్ ఆఫ్ ది ఎ.ఐ.టి.యు.సి., కరస్పాండెన్స్ బిట్వీన్ సి.పి.ఐ. అండ్ సి.పి.ఐ.(యం). సిపి.ఐ.(యం) పబ్లికేషన్. 1970. పే.9-12.*

"సహేతకంగా సి.పి.ఐ వివరించుతూ, "జనరలు కౌన్సిలులో మాకు మెజారిటి వుంది, మేము వెనుకాడవలసిన అవసరంలేదని" కూడ సమర్థించుకొన్నది.

"మాక్రామేడ్స్‌తో మీరు ముందుగా సంప్రదించలేదనే" సి.పి.ఐ(యం) ఫిర్యాదుకు సమాధానంగా" అది సరికాదు. అన్ని ప్రధానసమస్యలపై ముందుగా సంప్రదింపులు జరిపాము. మీరు మెరుగుపరచుటకు, మరో మంచి విధానం చూచించితే పరిశీలించగలము" అన్నారు.

"జనవరి", "ఎ.ఐ.టి.యు.సి." సమావేశంపై వెలువడిన ప్రకటనలో మానాయకులపేర్లు, ఉదహరించబడలేదు" అన్న సి.పి.ఐ(యం) ఫిర్యాదుకు ఆసమావేశాన్ని "ఎ.ఐ.టి.యు.సి" గాక ట్రేడు యూనియనుల, సంస్థల సమన్వయ కమిటి యేర్పాటు చేస్తున్నది. అప్పుడు మీపార్టీ సభ్యుడైన కా॥మిరాజ్‌కర్ ఎ.ఐ.టి.యు.సి ప్రెసిడెంటు ఆప్రకటన చేసారు. మీరు తేది మార్పుకోరితే, మీ ప్రతినిధికి కా॥రామమూర్తికి, లేదా అతనికి బదులుగా హాజరైన మీ ప్రతినిధికి చెప్పి వుండవలసింది." అని సి.పి.ఐ లేఖ వివరించింది. అంతేగాక, "మీ నాయకత్వం, మహజరు, పార్లమెంటు ఎదుట ప్రదర్శన నిర్ణయానికి భాగస్వాములైనా మీ శ్రేణులు, మీ నాయకత్వంలోని యూనియనులు, ఆచరణలో దానిని భగ్నం చేయుటకు ప్రయత్నించాయని", ప్రతిఫిర్యాదును సి.పి.ఐ నాయకత్వం చేసింది.

" ఫలితంగా ఎ.ఐ.టి.యు.సి వెరిఫికేషన్‌లో మూడవ స్థానానికి వెళ్ళిందని" సి.పి.ఐ(యం) నాయకత్వపు లేఖ పేర్కొనుటకు సమాధానంగా "భారతప్రభుత్వ వెరిఫికేషన్ పద్ధతి"లో మీకు విశ్వాసం వుంటే మంచింది. యూనియనుల గుర్తించుటకు ప్రభుత్వ వెరిఫికేషన్ ప్రమాణాలను ఎ.ఐ.టి.యు.సి. తిరస్కరించుతున్నది. మీరు మెజారిటిగవున్నారని చెప్పబడుతున్న కేరళ, బెంగాల్ రాష్ట్రాలనుండి సభ్యత్వనివేదికలను పంపుటలో విఫలమైనందున, ఎ.ఐ.టి.యు.సి స్థాయి 3కు దిగజారిందని, సి.పి.ఐ లేఖ వివరించి, "మీరు ఎ.ఐ.టి.యు.సి స్థాయిని దిగజార్చుటకు పంపలేదా, లేక ప్రభుత్వ వెరిఫికేషన్ విధానాన్ని ఖండించుటకు పంపలేదా? యనిప్రశ్నించింది.

ఇంకా " మీ సభ్యులు యీ విధమైన విధానాలను అవలంభించారు. ఇవన్నీ మీరు ఐక్యతా కార్యాచరణ సమన్వయం అనిచెప్పే మాటల భూటకాన్ని స్పష్టం చేస్తున్నవి. ఎ.ఐ.టి.యు.సిని మీ ఆధీనం లేక నాయకత్వంలోనికి తెచ్చుకొనే విఫల ప్రయత్న ఎత్తుగడలే మీరు ఆవిధంగా మాట్లాడుటకు కారణముగా నెంచవలసివుంటుంది. ఎ.ఐ.టి.యు.సి. లోని కార్మికుల జాగరూకత, జాగృతియే మరోకారణము. ఎ.ఐ.టి.యు.సిలో మెజారిటి సంపాదించి, నాయకత్వాన్ని చేజిక్కించుకొనుటలో మీనాయకత్వం విఫలమైనందున, రెండు రాష్ట్రాలలో హోం, పోలీసు శాఖలను మీపార్టీ గుప్పిట్లో పెట్టుకొని, ఫ్యాక్టరీయాజమాన్యాలపై పరోక్షంగా వొత్తిడి తెస్తూ, మీ ప్రభావాన్ని, బలాన్ని పెంపొందించుకొంటున్నారని సి.పి.ఐ నాయకత్వపులేఖ ముగించింది.

**రాష్ట్ర జిల్లా, స్థానిక ట్రేడు యూనియనులలో అంతర్యుద్ధమే జరిగింది.**

దేశంలో సహజంగానే రాష్ట్ర జిల్లా శాఖలలో చారిత్రికంగా వివిధ యూనియనులు నాయకత్వ రూపొందిన విధానాన్ని బట్టి కొన్ని యూనియనులు సి.పి.ఐ నాయకత్వాల

అధ్వర్యంలోను, మరికొన్ని సి.పి.ఐ(యం) నాయకత్వాల అధ్వర్యలోను కమ్యూనిస్టుపార్టీ రెండుగా చీలిన నాటికి వున్నవి. ఈ యూనియనులలో అధ్యక్షుడు వొక పార్టీ, శెక్రటరీ మరొక పార్టీ, లేక నాయకులు వొక పార్టీకి, కార్యవర్గంలో మెజారిటి మరొక పార్టీకి చెందిన పరిస్థితి వున్నది. అంటే చీలికలు నిట్టనిలువుగా, అడ్డంగాను, మరొకొన్ని చోట్ల కమ్యూనిస్టేతరులు అధ్యక్షుడు, శెక్రటరీగానో వుండి కార్యవర్గంలో సి.పి.ఐకి చెందిన వారో లేక సి.పి.ఐ(యం)కు చెందిన వారో మెజారిటీ వున్న ఘటనలు వున్నవి. కార్మిక సంఘాలలో నాయకత్వం వహించుతున్న సి.పి.ఐ; సి.పి.ఐ(యం) పార్టీలు వాటి ఆధిక్యతను లేక నాయకత్వాన్ని నెలకొల్పుకొనుటకు నియమ, నిబద్ధతలేని అన్ని ప్రయత్నాలు చేయసాగారు. ఫలితంగా కొన్ని చోట్ల ఎత్తులు పైఎత్తులు ప్రశాంతంగాను, ఆంధ్రప్రదేశ్, కేరళ, బెంగాలులో ఘర్షణల నుండి, తీవ్రఘర్షణలు, సాయుధ ఘర్షణల వరకు వెళ్ళి అంతర్యుద్ధ పరిస్థితులు యేర్పడినవి. కొన్ని చోట్ల బూర్జువా ప్రభుత్వకోర్టులలో కూడ కొనసాగింది. ఈపోరాటాలలో ఇరుపక్షాలు యూనియను అధికార పీఠాన్ని స్వాధీనం పరచుకొనే యేకైక లక్ష్యంతో అన్ని అవాంచనీయపద్ధతులు అవలంభించారు, ఆమార్గాలలో పయనించారు. విఫలులు పోటీ సంఘాలను పెట్టి కార్మిక వర్గాన్ని, దాని ఐక్యతను చీల్చారు, ఫలితంగా కార్మికవర్గం పోరాట సాధనాన్ని కోల్పోయింది. ఇట్టి ప్రయత్నాలలో ప్రభుత్వ, యాజమాన్యాలు, సామాజిక ద్రోహుల, శత్రువుల మద్దతును స్వీకరించుటలో యేమార్క్సిస్టు, లెనినిస్టు సిద్ధాంతాలు అడ్డు రాకపోగా, చివరకు “దెయ్యాలతో” స్నేహ, సహకార వొప్పందాల కొచ్చారు.

మార్క్సిజం, లెనినిజం శాస్త్ర వివేచనతో కార్మికవర్గ ఐక్యత, ప్రయోజనాలకే పోటీ సంఘాలను పెట్టుచున్నామంటూ ఐక్య ఎ.ఐ.టి.యు.సి ని చీల్చుట శోచనీయము. ఈ కార్యాచరణ అమలుకు కార్మిక శ్రేణులలో వుద్రేకాలను పెంచి, పరస్పరద్వేషాలను పోషించి, పార్టీల శ్రేణులలో ఆలోచనా శక్తిని ద్వేషపూరిత భోదనలతో మొద్దుపారించి, వారి వర్గ ప్రయోజనాలకు ప్రయోజనకారిగా, కార్మికవర్గంలో వున్న కాస్త ఐక్యతను పోటీ సంఘాలు పెట్టే కార్యక్రమంతో పూడ్చివేసారు. ఇరుపక్షాలు సమానంగా యాజమాన్యాలకు తోడ్పడ్డారు. కమ్యూనిస్టులు చీలిపోయిన స్నేహితులుగా సహచరులుగా వొకే లక్ష్యం కోసం భిన్న మార్గాలలో పయనిస్తున్న తోటి ప్రయాణికులుగా కాక వర్గ శత్రువులనే పేరుతో పరస్పర వినాశనాన్నికోరే జ్ఞాతశత్రువులుగా వ్యవహరించారు. ఫలితంగా యిరువురూ ప్రజలకు, కమ్యూనిస్టులను సాధారణంగా బలపరచే వర్గాలకు కూడా దూరమయ్యారు.

ఎ.ఐ.టి.యు.సి లో లేక ఎ.ఐ.టి.యు.సి లో నాయకత్వం వహించుతు, జిల్లా, తాలూకా, స్థానిక యూనియనులలో మైనారిటిలో వున్నపుడు యేదోవొక వివాదాన్ని చేబట్టి, పోటీ సంఘాన్ని యేర్పాటు చేయుట, తమ పార్టీయేపై సంఘాలకు నాయకత్వం వహించునపుడు, వాటికి అనుబంధ సంస్థగా వెంటనే గుర్తింపుపొందుట జరిగింది. ఈ కాలంలో ప్రభుత్వం సి.పి.ఐ(యం) శ్రేణులపై నిర్భంధవిధానాన్ని యెక్కువ జేసి, అనేక మందిని జైళ్ళలో వేసినపుడు సి.పి.ఐ శ్రేణులు ట్రేడు యూనియనులు ఆఫీసులను ఆక్రమించి లేక కాన్ఫరెన్సులు, సమావేశాలు జరిపి, నూతన ఆఫీసు కార్యకర్తలు తమ గ్రూపు మెజారిటిని వెంటనే గుర్తింపు పొందుట జరిగింది.

సాంవత్సరిక ట్రేడు యూనియన్ సమావేశంలో యూనియన్ ఎన్నికలు

వివాదాస్పదమైనపుడు, మెజారిటి వచ్చే అవకాశములేనపుడు లేక ఎన్నికలలో వోడిపోయినపుడు వెంటనే పోటీ యూనియనులు స్థాపించుట, ప్రభుత్వం నుండి గుర్తింపుపొందుట జరిగింది. అంతేగాక రాష్ట్ర అఖిల భారత ట్రేడు యూనియన్ కాంగ్రెసుకు అనుబంధ సంస్థగా చేర్పించుట వెనువెంటనే జరిగింది.

అంతేగాక, యూనియన్ కార్యవర్గంలో మెజారిటి వుండి, క్రింది శ్రేణులు అన్నీ వ్యతిరేకంగా వున్నపుడు, యాజమాన్యంతో వొప్పందానికి వచ్చి, సమావేశం జరుగకుండా పోటీ సంఘాలను యేర్పాటు చేయుట జరిగింది. వ్యతిరేక గ్రూపులకు, సభ్యత్వఫారాలను అనుకూలమైన కొద్దిమందికి ఫారాలు యిచ్చి, తమవారే ఎదుటి పక్షంలో చేరి, మెజారిటియై తమను త్రోసిబుచ్చుతారనే భయం వెంటాడుతునే వుంది.[1]

తమిళనాడులో యీ విధమైన విచ్ఛిన్నకర కార్యాచరణ, పోటీసంఘాలు వేర్పాటు చేయుట విక్రమసింగపురం, వీరవనల్లోరు, షెన్‌రాటై, మదురై, తిరుచి, పాల్ఘాట్, నాగపట్నం, సేలం, నార్కాట్, గుడియాట్టంలోని వివిధ ఫ్యాక్టరీలలో సి.పి.ఐ; సి.పి.ఐ(యం)లు రెండూ పోటీ సంఘాలను పెట్టి, కార్మికవర్గ ఐక్యతను చీల్చి, విప్లవసైద్ధాంతిక పోరాటాలనే పేరుతో కార్మిక వర్గానికి తీరని ద్రోహం చేసారు.

విక్రమసింగపురం, గుడ్డల మిల్లు కార్మిక సంఘం 1940లోనే బలమైనది, కాని 1967లో డాంగే వర్గం మెజారిటిని కోల్పోవుట, సి.పి.ఐ(యం)కు మూడింట రెండువంతులు మెజారిటి లభించింది. సి.పి.ఐ కార్యకర్తలు కొందరు యూనియన్ వ్యతిరేకచర్యలు చేయగా, సహకారపరపతి సంఘం ఎన్నికలలో జరిగిన కొట్లాటలో వారికి దెబ్బలు తగిలాయి. దీనిని అవకాశంగా తీసుకొని పోటీ యూనియన్‌ను సి.పి.ఐ యేర్పాటు చేసింది.

గోమతి మిల్లువర్కర్స్ యూనియన్ ఎగ్జిక్యూటీవ్ కమిటిలో సి.పి.ఐ మెజారిటి వుంది. కార్మికులను సంప్రదించకుండా నాయకత్వం కార్మిక వ్యతిరేక వొప్పందంపై, యాజమాన్యంతో కలసి సంతకాలు చేసింది. వొప్పందంతో అదనపు పనిభారం,7రోజులు శలవు లేకుండా వారందినముల పనికి అంగీకరించుట జరిగింది.కార్మికులు చాల అసంతృప్తి చెందారు. ఇది చూచిన సి.పి.ఐ. కార్యకర్తలు ఏప్రిల్ 1968లో సభ్యులను చేర్పించుట, రుసుము తీసుకొనుట ఆపివేసారు. మెజారిటిని కోల్పోతామోననే భయం వారిని వెంటాడసాగింది. మని ఆర్డరులద్వారా పంపిన సభ్యత్వరుసుమును కూడ తీసుకొనలేదు. నోటిసు, టైము యివ్వకుండా సర్వసభ్యసమావేశం జరిపి, నూతన ఎగ్జిక్యూటీవు ఎన్నికైనట్లు ప్రకటించారు. వ్యతిరేకమైన వారందరిని మినహాయించారు. ఫలితంగా సి.పి.ఐ(యం) కార్యకర్తలు పోటీయూనియనును పెట్టారు.

మరో ఘటన షెక్‌కోటై గుడ్డలమిల్లు కార్మికులు యూనియన్ చివరి జనరల్ బాడి సమావేశం సి.పి.ఐ.(యం) నాయకులు, కార్యకర్తలు జైళ్ళలో వున్నపుడు 1965లో జరిగింది. ఎ.ఐ.టి.యు.సి. జనరలు కౌన్సిలు మెంబరు నల్లశివంను అధ్యక్షునిగా ఎన్నుకొంది. ఎగ్జిక్యూటీ కమిటిని సి.పి.ఐ నాయకులతో నింపి వేసారు. వారి నాయకత్వంలో యూనియన్

*1.ది. రివిజనిస్టు డిజరప్షన్ ఆఫ్ ది "ఎ.ఐ.టి.యు.సి" కరస్పాండెన్స్ బిట్వీన్ సి.పి.ఐ. అండ్ సి.పి.ఐ(యం), సి.పి.ఐ (యం) పబ్లికేషన్ పే. 10-15*

యాజమాన్యంతో వొప్పందం చేసుకొంది. కార్మికులలో అసంతృప్తి పెరిగింది. జనరల్‌బాడి సమావేశం జరుపని కోరినా అధ్యక్షుడు నిరాకరించుటతో, ఎగ్జిక్యూటీవ్ సమావేశమై, కా॥ నల్లశివంను బహిష్కరించి, యూనియన్ వదలించుకొన్నది.

మదురై జనరలు వర్కర్సు యూనియను "ఎ.ఐ.టి.యు.సి." కి అనుబంధంగా వుంది. కాని సి.పి.ఐ(యం) నాయకత్వంలో వుంది. ప్రజాస్వామ్య విధానాలేమీ పాటించకుండా సి.పి.ఐ నాయకులు పోటీ యూనియను పెట్టారు.

తిరుచి జిల్లా గుడ్డల మిల్లుల కార్మిక యూనియన్, పుగలూర్ షుగర్ వర్కర్స్ యూనియను, నాగపట్నం సిగర్ వర్కర్స్ యూనియన్, సేలంజిల్లా మిల్‌లేబర్ యూనియన్, సేలంజిల్లా గ్లాస్ ఫ్యాక్టరీ యూనియన్, నార్త్ ఆర్కాట్ బీడి లేబరు యూనియను, గుడియాత్తం మిల్ లేబరు యూనియనులలో తరతమ భేధాలతో సి.పి.ఐ; సి.పి.ఐ(యం) ల నాయకులు, కార్యకర్తలు, ఆఫీసుభాధ్యులు, యిరుపక్షాలు ఎవరికి ఆధిక్యత గల యూనియనులలో వారు ప్రజాసంఘాలలో అనుసరించవలసిన ప్రజాస్వామ్యసూత్రాలను,విధానాలను, అన్యవర్గీయులతో సహజీవనం అనే కనీస ధర్మాలను విడనాడి, ఏకపక్షంగా, వర్గ ప్రయోజనాలను విడనాడి, పార్టీ లేక గ్రూపుల ప్రయోజనాలకే స్వీయమానసిక దృష్టితో పార్టీ ఆఫీసులను ఆక్రమించుట, రికార్డులు, స్వాధీనం చేసుకొనుట, ఎదిరిపక్షం వారిని వారి భాధ్యతలనుండి తొలగించుట లేక పార్టీ వ్యతిరేక చర్యలమిషతో బహిష్కరించుట యేకైక లక్ష్యంగా సాగించారు. మైనారిటీగా వున్నవారు. పోటీ పార్టీలను యేర్పాటు చేసారు. ఈ కార్యక్రమాల ఆచరణలో బూర్జువాపార్టీలు సిగ్గుపడేవిధంగా, వారి విధానాలమించిన విధానాలను అవలభించారు. అన్ని అప్రజాస్వామ్య, కుట్ర, కుటిల,అవినీతికర, హింసా, దౌర్జన్యకర అన్ని మార్గాలు అవలంభించారు.కార్మికవర్గ ఐక్యత బలి అయిపోయింది, కార్మికవర్గ ప్రయోజనాలు. ఇది అద్దూ, అదుపులేకుండా జరుగుటకు బహుశా ట్రేడు యూనియనులలో వాస్తవంగా శ్రామికులుగా పనిచేస్తూ, కార్యకర్తలుగా నాయకులుగా పనిచేసే కార్మికవర్గం నుండి వచ్చినవారు లేకపోవుటయో లేక వున్నా నామమాత్రంగా వుండుట, వొక శక్తిగా లేకపోవుట, మధ్యతరగతి మేధావి వర్గాల్లో, యితర పెటి బూర్జువా వర్గాల నాయకత్వమే అత్యధికంగా వుండుటయే కారణంగా కన్పడుతున్నది. దీనికి బాధ్యత వహించవలసినది ఆయా యూనియనులలో మెజారిటి, మైనారిటి వర్గాలు రెండూ చరిత్రకు సమాధానం చెప్పవలసి వుంటుంది.

పశ్చిమబెంగాల్‌లోని దుర్గాపూర్ ఎలాయ్‌స్టీలు ప్లాంటులో "ఎ.ఐ.టి.యు.సి."కి బలమైన యూనియన్ వుంది, సి.పి.ఐ(యం) అత్యంత పెద్ద మెజారిటితో నాయకత్వం వహించుతున్నది. హిందూస్థాన్ స్టీలు ఎంప్లాయిస్ యూనియన్ దుర్గాపూర్‌కు రెండు స్టీలుప్లాంటులలోను సి.పి.ఐ సభ్యత్వాన్ని కలిగివుండి తరువాత సహజంగానే అలాగే పనిచేస్తూ వుంది. ఎలాయ్ స్టీలు ప్లాంటులో పోటీ యూనియన్ యేర్పడి పని చేయసాగింది. "ఎ.ఐ.టి.యు.సి." జనరలు కౌన్సిలు సభ్యుడైన కా॥నిహార్ ముఖర్జీ, నితిష్ సేథిలు యీ పోటీ యూనియనులును యేర్పరచుటలో ముఖ్యపాత్ర వహించారు. ఎ.ఐ.టి.యు.సి. తదనంతర వర్కింగు కమిటి మీటింగులో పోటియూనియన్‌ను గుర్తించింది. కారణం నాయకత్వంలో సి.పి.ఐ. నాయకుడు వున్నాడు. బ్రెయిత్‌వాయితె యూనియను జనరలు

శెక్రెటరీగా స్థానిక సి.పి.ఐ. నాయకుడు వున్నాడు. ఎనిమిది సంవత్సరాలుగా యూనియన్‌పని సమీక్షా, సమావేశం, ఎన్నికలు జరుగలేదు, ఎగ్జిక్యూటివ్‌కూడ లేదు. విస్తృత కార్యకర్తలు సమావేశం జరిపి బోనస్‌పై కార్మికుల ఆందోళనానంతరం సి.పి.ఐ(యం)కు చెందిన ఏడుగురు కార్యకర్తలను యాజమాన్యం తొలగించింది. వారిని పనిలో చేర్చుకొనకపోయినా యూనియన్ ఫ్యాక్టరీ యాజమాన్యంతో వొప్పందానికి వచ్చింది. హవురాబాబిన్ ఫ్యాక్టరీ యూనియన్ ఎ.ఐ.టి.యు.సి. అనుబంధంలో ఎంతోకాలం నుండి పనిచేస్తూ వుంది. వివాదాంశాలపై ''అడ్జుడికేషన్ ట్రిబ్యునల్‌కు యూనియన్ వెళ్ళవలసివచ్చింది. పోటీయూనియన్ ప్రతినిధినంటూ, వివాదంలో తాము భాగస్వాములమంటూ సి.పి.ఐ. స్థానిక నాయకుడు హాజరయ్యాడు. ఈ యూనియన్‌లో యింకా సి.పి.ఐ; సి.పి.ఐ(యం)ల మధ్య సంబందాలు అంతగా బెడిసి, చెడిపోలేదు. అసన్‌సోల్ కోల్‌మజ్దూర్‌సభ ప్రజాస్వామ్యంవదలి, నిరంకుశంగా పనిచూస్తూ వుంది. కలకత్తాలో వుండే కా॥కల్యాణ్ రాయ్ ఆయూనియన్ న్యాయసలహాదారుగ వచ్చి వెళ్ళుతుంటారు, కాని యూనియన్‌ను ప్రజాసంఘంగా రూపొందించు ప్రయత్నం చేయలేదు. అతని స్థానిక అనుచరులతో యూనియన్ నడుస్తుంటుంది. సి.పి.ఐ నాయకత్వంలోని యీ యూనియన్ గత 8 సంవత్సరాలుగ కాన్ఫరెన్సు జరుపలేదు.

బెంగాల్‌లో జూట్ పరిశ్రమ సామాన్య ప్రజానీకంపై ఆర్థికప్రభావం అతి ముఖ్యమైన పరిశ్రమ. ఈ పరిశ్రమ కార్మికులు బెంగాల్ చట్కల్ మజ్దూర్ యూనియన్ అధ్యక్షుడు కా॥ ఇంద్రజిత్ గుప్తా నాయకత్వంలో సమీకృతులై వున్నారు. కొన్నిచోట్ల సి.పి.ఐ మెజారిటిగల పోటీ యూనియలను కూడ యేర్పరచారు. రాష్ట్ర ట్రేడు యూనియన్ కాంగ్రెసు బర్జ్ కాన్ఫరెన్సులో అన్ని పోటీ సంఘాలను రద్దు చేయాలనే నిర్ణయం తీసుకొన్నా, సి.పి.ఐ నాయకత్వంలోని బన్సబెరియా, టెలినిపరా, చంపధాని, శేరాంపురె, రిష్రా, హవురా, హాజీనగర్, హాలియా, టిటాఘుర్ జూట్ మిల్లుల యూనియనులను రద్దు చేయుటకు ఎట్టి ప్రయత్నం చేయలేదు.

ఈవిధంగా పశ్చిమబెంగాల్ అంతటా సి.పి.ఐ; సి.పి.ఐ(యం)లు తాము బలంగా వున్న యూనియనుల నుండి మైనారిటీలను యేక పక్షంగా బయటకు నెట్టివేస్తూ, తాము బలహీనంగా వున్న యూనియన్‌లకు పోటీ యూనియనులను యేర్పాటు చేస్తూ, తమ నాయకత్వంలో వున్నా, రాష్ట్ర లేక అఖిల భారత ట్రేడు యూనియన్ కాంగ్రెసులచే గుర్తింపును కూడ పొంది పని చేయు సాగాయి. కార్మికవర్గంలో వచ్చిన చీలికలతో, కార్మికవర్గ ఐక్యత నాశనమగుటతో అసంతృప్తి చెందిన కార్మికవర్గంలో పోరాట పటిమ తగ్గిపోవుట స్పష్టము.

కేరళ రాష్ట్ర ఎలక్ట్రిసిటీ బోర్డు రోజు వారి కార్మికులు 21 ఏప్రిల్ 1968 నుండి సమ్మె చేస్తూ, తమను మస్తరు కార్మికులుగా చేర్చుకొనాలని, తమ సర్వీసులను పరిగణలోనికి తీసుకొని, రెగ్యులర్‌గా తీసుకొని తిరిగి వెనుకకు పంపిన కార్మికులను ఖాళీలలో తీసుకోవాలని కోరుతున్నారు. వాస్తవానికి 1966లో, శాశ్వత ఖాళీలు యేర్పడినపుడు, సంవత్సరంలో 240 రోజులుకు తక్కువ పనిచేసిన కార్మికులను రెగ్యులర్‌గా తీసుకొనగలమని యాజమాన్యంలో సంతకాలు చేసిన వొప్పందాన్ని అతిక్రమించి విద్యుత్ బోర్డు కార్మికులను తీసుకొననందున సమ్మె ప్రారంభమైంది. కా॥గోవిందన్ నాయర్ సి.పి.ఐ మంత్రి రోజు

వారి కూలీలను కొత్తగా తీసుకొనమని ఆజ్ఞలు జారీ చేసారు. ఇది గతంలోని వొప్పందానికి పూర్తి వ్యతిరేకంగా, నూతనంగా కార్మికులను తీసుకొన ప్రారంభించారు. సమ్మె 22రోజులు జరిగిన తరువాత ట్రాన్సిమిటర్ విద్రోహచర్యలతో పాడుచేసారని తప్పుడు ప్రచారం చేసారు. ఇడికి ప్రాజెక్టుకు సహాయం చేస్తున్న కెనడియన్ హైకమిషనరును ఆయన బెదరించారని, తనకు టెలిగ్రాం ధార్వరా సమాచారం అందిందిని తప్పుడు ప్రచారం చేసారు. హైకమిషన్రు తననెవ్వరూ బెదరించలేదని, ప్రకటించారు. కేరళ టి.యు.సి. జనరలు శెక్రటరీ సత్యాసత్యాలను ధృవపరచుకొనకుండా, సమ్మె చేయుచున్న కార్మికులను ఖండించారు.

కేరళ ట్రేడు యూనియన్ కాంగ్రెసు ఎట్టి ప్రజాస్వామ్య వ్యతిరేకవిధానాలను అవలంభించిందో చూడండి. రాష్ట్ర టి.యు.సి నాయకత్వంలో వహించే సి.పి.ఐ ఎన్నిసారులు విజ్ఞప్తిని చేసినా 8సంవత్సరాల నుండి మహాసభను జరుపకపోగా, సంయుక్తంగా ఆఫీసు, కార్మికవర్గ కార్యక్రమాలను నిర్వహించుటకు అంగీకరించక స్వపక్ష ప్రయోజనాలకే ప్రాముఖ్యత నిచ్చింది. వాస్తవానికి కేరళలో సి.పి.ఐ(యం), కార్మికవర్గం, తదితర ప్రజసామాన్యంలో సి.పి.ఐ కంటె అధికబలాన్ని, ప్రభావాన్ని కలిగియున్నదనుట ప్రశ్నించజాలని సత్యం. ఈ వాస్తవికత రాష్ట్ర టి.యు.సి.ఎగ్జిక్యూటీవ్లో యేమాత్రం ప్రతిబింబించలేదు. సి.పి.ఐ నాయకత్వం, సి.పి.ఐ(యం) రాష్ట్ర నాయకత్వం ముఖ్యంగా టి.యు.సి నాయకత్వంను సంప్రదించుతున్నా, నిర్ణయాలు పూర్తిగా వారే తీసుకొంటున్నారు. కేరళ రాష్ట్ర ట్రేడు యూనియను కాంగ్రెసు ఎ.ఐ.టి.యు.సి మార్గదర్శికత్వంలో పనిచేస్తుందని నిర్ణయించారు.

అలెప్పీలో ట్రావెంకూర్ కోయిర్ ఫ్యాక్టరీ వర్కర్స్ యూనియన్ అనే శక్తివంతమైన పోరాడే యూనియన్ వుంది. అది సి.పి.ఐ(యం) ప్రభావంలో వుంది. యాజమాన్యం కార్మికులపై దాడి ప్రారంభించగా, సి.పి.ఐ నాయకత్వం ప్రతిఘటించి, త్రిప్పికొట్టుటలో విఫలమైనందున, యూనియన్ సభ్యత్వం పడిపోయింది. ఏ యూనియనూ 1964 నుండి 1967 వరకు జనరలుబాడి సమావేశాలను, నూతన కార్యవర్గ ఎన్నికలను జరుపజాలక పోయాయి. కార్మికవర్గపోరాటాలను అభివృద్ధిచేయు లక్ష్యంతో కొన్ని కమ్యూనిస్టు శ్రేణులు, సంయుక్త నాయకత్వాన్ని అభివృద్ధి చేయనెంచిన ప్రయత్నాలు విజయవంతం కాలేదు.

పరూర్ తాలూకు ఛేతుతోప్లే యూనియన్ 80 మందితో జనరలుబాడి సమావేశం జరిపింది. యూనియన్ ఆఫీసు, రికార్డు అంతా అధికార టి.యు.సి అనగా ఎ.ఐ.టి.యు.సి నాయకత్వాన్ని సి.పి.ఐ వహించుచున్నది.

కొచ్చిన్ ఫోర్ట్ ట్రస్టు యూనియన్లో మెజారిటి సి.పి.ఐ.ని ఆమోదించదని తెలుసుకొన్న నాయకత్వం విద్రోహానికి తలపడింది. సాంవత్సరిక సమావేశాలను వాయిదాపై వాయిదాలు వేసింది. చీలి పోటీ సంఘాలుగా యేర్పడిన వాటినే రాష్ట్ర టి.యు.సి గుర్తించింది.

కలంచెరి హెచ్.యం.టి.ఎంప్లాయీస్ యూనియన్ సి.పి.ఐ(యం) సభ్యులను ఆఫీసు కార్యకర్తలుగ ఎన్నుకొంది సి.పి.ఐ ట్రేడు యూనియన్ నాయకులు 50 మంది సభ్యులతో జనరలుబాడి సమావేశం జరిపింది.

ఆల్వే టైల్ అండ్ పోటరీ వర్కర్స్ యూనియన్కు సి.పి.ఐకు చెందిన వ్యక్తి జనరలు

శెక్రటరీగా యున్న, సంయుక్త యూనియన్ ప్రెసిడెంటుగా సి.పి.ఐ(యం)కు చెందిన వ్యక్తి వున్నారు. సాంవత్సరిక సమావేశం సమీపించుటతో ఎన్నికలలో అపజయం కలుగుతుందిని భయపడిన సి.పి.ఐ.యేవిషయం లేవనెత్తక ఎట్టి నిందను కారణంగా చూపక, పోటీ సంఘాన్ని పెట్టింది. షోరాన్‌పూర్‌మెటల్ వర్కర్స్ యూనియన్ ప్రెసిడెంటుకు పోటీచేసి, వోడిపోయిన వెంటనే సి.పి.ఐ నాయకులు మరో పోటీ యూనియన్ స్థాపించారు.

"మితవాదులు (సి.పి.ఐ) అనేక "ఎ.ఐ.టి.యు.సి. యూనియనులకు పోటీ యూనియనులను కేరళలో స్థాపించి, వాటిని "ఎ.ఐ.యు.టి.యు.సి" యూనియనులుగా పిలువ సాగారు. వారు పెట్టిన పోటీ యూనియనుల జాబితా యిలా వుంది. అఖిల వైపిన్ చేతు తోజ్‌హిలాల్ యూనియన్, మట్టన్ చెర్రి ఛేతు తోజ్‌హిలాలి యూనియన్, తోదుపుజ్ హఛేతు తోజ్‌హిలాలి యూనియన్, త్రిపులి తురఛేతు తుజ్‌హిలాలి యూనియన్, గ్వాలియర్ రేమాన్ ఫ్యాక్టరి ఎప్లాయిస్ యూనియన్, రైస్ అండ్ ఆయిల్ మిల్స్ వర్కర్స్ యూనియన్ కోజ్‌హికోడ్, కోజ్‌హికోడ్ ఛేతు తోజ్‌హిలాలి యూనియన్, వైనాడ్ ఎస్టేట్ వర్కర్స్ యూనియను; పెరువెన్న ముజ్‌హి గవర్నమెంటు ప్లాంటేషన్ వర్కర్స్ యూనియన్, జిల్లా మోటారు ట్రాన్స్‌పోర్టు ఎంప్లాయిస్ యూనియను, పాల్ఘాట్, ఇంజనీరింగు అండ్ ఇండస్ట్రియల్ వర్కర్స్ యూనియను, పాల్ఘాట్, వల్లవనాడు ప్లాంటేషన్ లేబరు యూనియను; విజయమోహిని మిల్ వర్కర్స్ యూనియను, త్రివేంద్రం; సిటి టాక్సీవర్కర్స్ యూనియన్, త్రివేంద్రం"[1] లుగా సి.పి.ఐ(యం) పేర్కొన్నది. ఇవేగాక యింతకు ముందు వివిధ పేరాలలో పేర్కొన్నవి, పేర్కొననివి చాలా వున్నవని తెలుస్తున్నది.

ఆంధ్రప్రదేశ్ సి.పి.ఐ నిట్టనిలువుగా చీలి, దగ్గరి దగ్గరిగా రెండు సమాన బలం కలిగినవిగా అయ్యాయి. అంచేత ప్రతి కార్మిక సంఘం కూడరెండుగా చీలిపోవుట లేక పోటీ సంఘాలుగా యేర్పడుట జరిగింది. ఎన్ని మార్క్సిస్టు సిద్ధాంతాలు వల్లించినా ప్రధాన లక్ష్యం పార్టీలు-గ్రూపుల ప్రయోజనాలు, తమతమ బలాలను నిరూపించు ప్రయత్నాల ఫలితంగా ప్రతిపక్ష కమ్యూనిస్టుపార్టీ నామ రూపాలు లేకుండా పోవుటయో లేక ఒక కమ్యూనిస్టుపార్టీ రద్దు అయిపోయి బలమైన దానిలో చేరిపోవుతుందనీ ఎత్తుగడలతో, కార్మికవర్గ ఐక్యతను పెంపొందించ మౌలిక కర్తవ్యాలను వదిలివేసి, చీలికల చారిత్రిక తప్పిదాన్ని కమ్యూనిస్టు శ్రేణులన్నీ చేసాయి. అదే నాటి మార్క్సిస్టు లెనినిస్టు విధానంగా సమర్థించుకొన్నారు. స్వీయమానసిక ధోరణిలో రెండు కమ్యూనిస్టుపార్టీలు పెడమార్గం పట్టినవి. ప్రజాసంఘాలను చీల్చుటను శాస్త్రీయ సోషలిజం నాటి పరిస్థితులలో సమర్థిస్తుందాయని ఆలోచించని "పిడివాదు"లయ్యాయి కమ్యూనిస్టుపార్టీ. "పిడివాదం" వొక్క అతివాదం సొత్తేగాదు, మితవాదం కూడ పిడివాదంలో యేమాత్రం తీసిపోందని రుజువు చేసారు.

ఆంధ్రప్రదేశ్‌లో "ఎ.ఐ.టి.యు.సి" శాఖలుగా వున్న రాజమండ్రి, విజయవాడ రిక్షా యూనియనులు రెండుగా చీలిపోయాయి. నెల్లూరు జిల్లా మోటారు వర్కర్స్, నాగార్జునసాగరు ప్రాజెక్టు వర్కర్స్, హైదరాబాద్ బైలాజికల్ .వర్కర్స్, విజయవాడ సిటీ మోటారు వర్కర్స్,

---

1. *డాంగె అండ్‌కొ, డిసరప్టర్స్ ఎ.ఐ.యు.టి.సి (1970) ఎ బుక్‌లెట్ పబ్లిష్‌డు బై కమ్యూనిస్టుపార్టీ ఆఫ్ ఇండియా (మార్క్సిస్టు) పే.18-19.*

ఆంధ్రరాష్ట్ర మునిసిపల్ అండ్ లోకలుఫండు ఎంప్లాయీస్, ఆంధ్రప్రదేశ్ ఐ.యల్.టి.డి.వర్కర్స్‌ల యూనియనులు చీలిపోయి రెండు రెండుగా అయినవి. ఈ యూనియనుల రాష్ట్ర నాయకులు "ఎ.ఐ.టి.యు.సి"లోని తమ మెజారిటిని, యాజమాన్యాలు గుర్తించునట్లు చేయుటకు వినియోగించారు.

పోటీ సంఘాల ఏర్పడిన ఫలితంగా రూపొందిని క్లిష్టపరిస్థితులను పరిశీలించుటకు రెండు సంయుక్త కమిటీలను, నెల్లూరుజిల్లా మోటారు వర్కర్స్ యూనియను, నాగార్జునసాగర్ యూనియనులు యేర్పరచారు. వాటిపని అసంతృప్తికరంగానే, వుంది, చివరకు విఫలమైంది. సి.పి.ఐ(యం) ఎన్నికలను ఐ.యల్.టి.డి. కార్మికసంఘం రహస్యబాలెట్‌లో నిర్వహించాలని ప్రతిపాదన చేయగా సి.పి.ఐ నాయకత్వం తిరస్కరించింది.

"సి.పి.ఐ నాయకత్వంలోని "ఎ.పి.టి.యు.సి" లోనే విచ్ఛిన్నకరచర్యలకు వొడిగట్టారు. కా॥బాలాజీదాస్, యస్. ఆంజనేయులను బహిష్కరించారు. కా॥ పి. సత్యనారాయణ, "ఎ.ఐ.టి.యు.సి" వర్కింగు కమిటి మెంబరు పి. లక్ష్మణదాస్, కృష్ణన్,నాయర్‌లపై యాజమాన్యాలతో కార్మిక ప్రయోజనాలపై వ్యతిరేకంగా వొప్పందాలు చేసుకొన్నారని, క్రమశిక్షణా చర్యలు తీసుకొన్నారు. ఈ ఎ.పి.టి.యు.సి వర్కింగు కమిటి సభ్యులు యీ పరిణామాలన్నిటిలో "ఎ.ఐ.యు.టి.సి" కేంద్రం, దాని పత్రిక యీ చర్యలన్నిటిని బలపరచింది."[1]

రాష్ట్ర మోటారు ట్రాన్స్‌పోర్టు వర్కర్స్ యూనియన్ శెక్రటరీగా సి.పి.ఐ. నాయకులు ఉన్నారు. ఎగ్జిక్యూటీవ్‌లో సి.పి.ఐ(యం) కు మెజారిటి ఉన్నది. అధ్యక్షుడు ఐదు సంవత్సరాలుపైగా ఎగ్జిక్యూటివ్ సమావేశాన్ని యేర్పరచమని కోరినా చేయలేదు, అధ్యక్షుడు సి.పి.ఐ(యం) కు చెందినవారు, ఎగ్జిక్యూటివ్ సమావేశాన్ని యేర్పాటు చేసారు. ఇది తెలిసిన వెంటనే శెక్రటరీ వొక సమావేశాన్ని యేర్పాటు చేసి, నూతన ఎగ్జిక్యూటివ్‌ను ఎన్నుకొన్నారు. అయితే ఎ.పి.టి.యు.సి గుర్తింపును సి.పి.ఐ అధ్వర్యంలోని యూనియనుకే యిచ్చింది. ఈవిధంగా చీలికలతో రెండు యూనియనులు యేర్పడి, వున్న యూనియనుకు మరోచీలిక, పోటీ యూనియను యేర్పడుట జరిగింది.

ఆంధ్రప్రదేశ్ హైవే వర్కర్స్ యూనియన్ నిజామాబాద్‌లో వున్నప్పటికీ సి.పి.ఐ మరో పోటీ నిజామాబాద్ జిల్లా హైవేస్ యూనియన్‌ను ఏర్పరచింది.

కా॥ కె.యల్. నరసింహం చనిపోయిన తరువాత సి.పి.ఐ(యం), సి.పి.ఐ రెండూ ఐ.యల్.టి.డి. యూనియన్‌ను తమ పూర్తి నాయకత్వంలోనికి తెచ్చుకొనుటకు అన్ని ప్రయత్నాలు చేసాయి. ఆఫీసు సి.పి.ఐ శ్రేణుల అధ్వర్యంలో వుండుటతో సి.పి.ఐ(యం) కార్యకర్తలకు సభ్యత్వఫారాలు కూడ యివ్వలేదు. అయినా సి.పి.ఐ(యం) ప్రతినిధులు 190మంది, సి.పి.ఐ ప్రతినిధులు 130 మంది సాంవత్సరిక కాన్ఫరెన్సుకు హాజరుకాగా, సి.పి.ఐ శ్రేణులు ప్రాతినిధ్య విషయమై పేచీ పెట్టుకొని కాన్ఫరెన్సు భగ్నం చేసారు. కంపెనీ యాజమాన్యం గుర్తింపును సి.పి.ఐ నాయకత్వంలోని యూనియనుకు యిచ్చింది.

---

1. డాంగే అండ్ కొ డిస్ట్రర్స్ ఎ.ఐ.టి.యు.సి *(1970)* ఎ బులెటిన్ పబ్లిష్డ్ బై సి.పి.ఐ (మార్క్సిస్టు) పే. *19.*

ఆర్.టి.సి: సింగరేణి కాలరీస్ వర్కర్స్ యూనియనులు ఆంధ్రప్రదేశ్‌లో చాలా పెద్ద యూనియనులు. సింగరేణి యూనియన్ సి.పి.ఐ నాయకత్వంలో యాజమాన్యంతో వొప్పందం చేసుకొన్నది. కొద్దిమందిని వుద్యోగ విరమణ చేయించారు. రెండవదశలో 2వేల మందిని రిట్రెంచిమెంటు చేసారు. ఈ విషయాన్ని మంత్రి అసెంబ్లీలో స్వయంగా తెలిపారు. కాలరీస్ కార్మికులు 40వేల మంది 1967లో సమ్మెలలో పాల్గొన్నారు. సంప్రదింపులు లేకుండా సమ్మె విరమించారు. ఆయూనియన్ నాయకులు సత్యనారాయణ యీ చర్యను ఖండించారు.

## "ఎ.ఐ.టి.యు.సి" కేంద్రపు విచ్ఛిన్నకర చర్యలు.

"ఎ.ఐ.టి.యు.సి" కేంద్రం సి.పి.ఐ. నాయకత్వంలోని యూనియనులను మాత్రమే అనుబంధ సంస్థలుగా చేర్చుకొంటూ, పేపరు యూనియనులతో కృత్రిమ మెజారిటి కలిగి, డాంగే నాయకత్వంలోని "ఎ.ఐ.టి.యు.సి" నిర్మాణ సూత్రాలకు సవరణలతో మార్పుచేసి, తనస్థానాన్ని బలోపేతం చేసుకొన తలచాడు. దానితోపాటు విచ్ఛిన్నకరశక్తిని బలవత్తరం చేసుకొనదలచాడు. "ఎ.ఐ.టి.యు.సి" మహాసభకు సవరణలను, ప్రతిపాదలను చర్చల నిమిత్తం పంపారు. జనరలు కౌన్సిలుకు, వర్కింగు కమిటికి వొక యూనియను విచ్ఛిన్న కార్యకలాపాలు సాగించినా, అటి వారిని బలపరచినా, అనుసరించినా అనుబందాన్ని రద్దుచేయు అధికారం వుండాలని సవరణ సారాంశము. అంతేగాక, యీ నిర్ణయాలను వొక్కవోటు మెజారిటితోనైనా చేయగల అధికారాలు వర్కింగు కమిటికి వుండాలని కోరాడు, తన విధానాలకు యెట్టి ప్రతిఘటన వుండదని తలచాడు.

" అతి తరచుగా క్రమశిక్షణలను ఉల్లంఘించే డాంగేకు క్రమ శిక్షణపై యింత ప్రేమ. యూనియన్, పార్టీపై ఎందుకు కలిగిందో అది వాస్తవంగా ప్రేమైతే "ఎ.ఐ.టి.యు.సి" కి గల ప్రజాస్వామ్య ఆచరణను మంట కలిపేవారు కాదు. జనరలు కౌన్సిలుని ప్రేక్షకుల స్థాయికి దిగజార్చేవారు కాదు. క్రమ శిక్షణయే గాక, వివిధ రాజకీయ పార్టీల అభిప్రాయాలు కలవారిని, వివిధ యూనియనులను క్రమశిక్షణా దండాన్ని చూపించి, భయపెట్టేవారు కాదు. డాంగే "ఎ.ఐ.టి.యు.సి" ని మితవాద సి.పి.ఐ తోకగా చేసేవారు కాదు.

"రెండు పరిణామాలకు యీ విచ్ఛిన్నకర చర్యలు అవసరమయ్యాయి. ప్రభుత్వంతో డాంగే వొప్పందాలు చేసుకొన్నందున, అదికార కార్మిక విధానాలకు పూర్తి సహకారాన్నిచ్చుట, బహిరంగంగా కార్మికవర్గ ప్రయోజనాలకు విజ్ఞప్తి చేయుట'' మరో వైపున ".ఐ.యన్.టి.యు.సి" ని పొగుడుట, డాంగే శిష్యులు చేయసాగారు. బహిరంగంగా పెట్టుబడిదారులతో చేతులు కలిపి, కార్మికులసమ్మెలను నిషేదించాలని కోరారు. చురుకుగా పోరాడే యూనియనులను, సి.పి.ఐ(యం) ను తీవ్రంగా విమర్శించారు. వారి రాజకీయ విధానాలను కేంద్రప్రభుత్వం ఆమోదించింది. వర్గసామరస్యవాదులను, వారి రాజకీయ విధానాలను, పంథాను బహిరంగంగా విమర్శించుట డాంగే దృష్టిలో "ఎ.ఐ.టి.యు.సి" కి వ్యతిరేకమని చిత్రించుతు, అట్టి వ్యక్తులను, యూనియనులను బహిష్కరించుట చేస్తున్నారు, సవరణలకు అవసరము, భూమిక పైవిధంగా వుంది. కార్మిక సంఘాలు ఐక్యతకై నిలబడే వారందరూ, నిర్మొహమాటంగా పై చర్యలను వ్యతిరేకించవలసియున్నది.[1]

*1. డాంగే అండ్ కొ డిస్టర్బ్స్ ఎ.ఐ.టి.యు.సి (1970) ఎ బులెటిన్ పబ్లిష్డ్ బై సి.పి.ఐ (మార్క్సిస్టు) పే. 24.*

**ప్రజాసంఘాలు, ట్రేడు యూనియనుల పాత్రపై సి.పి.ఐ అవగాహన.**

కమ్యూనిస్టుపార్టీ 1964లో చీలి సి.పి.ఐ మరియు సి.పి.ఐ(యం) లుగా యేర్పడిన తరువాత 7వ, పార్టీ కాంగ్రెసులను, వాస్తవాలను గుర్తించి జరుపుకొన్నవి. సి.పి.ఐ.8వ పార్టీ కాంగ్రెసు 1968లోను, సి.పి.ఐ(యం) 8వ, పార్టీ కాంగ్రెసును 1969లోను జరిగినవి. సి.పి.ఐ. కాంగ్రెసు సి.సి. సమర్పించిన నివేదిక, ట్రేడు యూనియను అవగాహన ఆచరణ, కార్యక్రమాల గురించి తెలుసుకొందాము.

“ట్రేడు యూనియన్ రంగంలో ప్రధానకర్తవ్యం, ఆరంగంలో పార్టీ పనిని విస్తృత పరచి, నిర్మాణాన్ని బలపరచాలి. అందుకు పార్టీ ఫ్రాక్షనును పునర్మించాలి. వివిధ రంగాలలో సి.పి.ఐ(యం) విచ్ఛిన్నకర చర్యలను ప్రతిఘటించుటకు, బలహీన శాఖలకు సహాయాన్ని అందచేస్తూ నిర్మాణచర్యలు చేబట్టాలి. అన్ని రాష్ట్రాలలో, కేంద్రాలలో సి.పి.ఐ(యం) విచ్ఛిన్నకరచర్యలనుండి కాపాడుకొనాలి. బొంబే ఎ.ఐ.టి.యు.సి మహాసభ తదనంతరం బలహీనతలను మే 1966లో అధిగమించుటకు చర్యలు చేబట్టుట జరిగింది. పార్టీ 7వ, పార్టీ కాంగ్రెసు తదనంతరం, అంతకు ముందెన్నడు కానరాని, కార్మికవర్గ ఐక్యకార్యాచరణ వెల్లువగా కొనసాగింది. నూతన విస్తృత వర్గాలు కార్మికవర్గ వుధ్యమ నిర్మాణంలోనికి ముఖ్యంగా మధ్యతరగతి వుద్యోగులు, ప్రధానంగా రాష్ట్రప్రభుత్వోద్యోగులు ముఖ్యపాత్రవహించారు. ఇది ఐక్యకార్యాచరణ ద్వారా ఐక్యతను నిర్మించుట వామపక్షాల ప్రభావంతో సాధ్యమగుతుందని. విశ్వాసాన్ని కలిగించింది.

కమ్యూనిస్టుపార్టీల కాంగ్రెసుల తదనంతరం 1965 నుండి టి.యు.సి.లలో సి.పి.ఐ(యం) నాయకత్వాన్ని స్థాపించాలనే లక్ష్యంతోను, అదే కాలంలో సి.పి.ఐ తన నాయకత్వ ఆదిక్యతను, వున్నదానిని మరింత పటిష్టం చేసుకొను ప్రయత్నాలలో ట్రేడు యూనియన్ కార్యకలాపాలలో ఫ్రాక్షను పోరాటాలు సి.పి.ఐ 7వ కాంగ్రెసు 1964లో జరిగిన తరువాత, అఖిలభారత ట్రేడు యూనియను పార్టీ ఫ్రాక్షను సమావేశాలు ఫిబ్రవరి 1966లో, తిరిగి ఆగస్టు 1967లో రెండుసార్లు జరిగాయి. కార్మికరంగంలో కార్యక్రమాల ఆచరణ, పోరాటాల సమీక్షజరిగి, 1967 సమావేశంలో ట్రేడు యూనియనులలో పనిచేయుటకు మార్గదర్శిక సూత్రాల పత్రం ఆమోదించబడింది. ప్రతి పరిశ్రమలోని ఫ్రాక్షనులు విడివిడిగా సమావేశమై కర్తవ్యాలు నిర్ధారణ చేస్తారు. ప్రతిఫ్యాక్టరీలో, పరిశ్రమలో పార్టీశాఖను యేర్పాటు చేసి పని చేయించాలని, ప్రతి ట్రేడు యూనియన్‌లో పార్టీ ఫ్రాక్షను యేర్పాటు చేసి పార్టీ పనిని మెరుగుపరచాలని నిర్ణయించారు. నూతన పరిస్థితులలో టి.యు.లలో అనేక రాజకీయపార్టీలు పనిచేస్తున్నందున అవియే అఖిల భారతసంస్థలకు అనుబంధం చేయబడివున్నా సంయుక్త కార్యాచరణను పెంపొందించే పనివిధానాని అనుసరించి, అభివృద్ధి చేయాలని నిర్ణయించారు. మధ్యతరగతి ఉద్యోగులలో, వారి సంఘాలలో పార్టీ మరింత పారదర్శిక విధానాలను అవలంబించి, రాజకీయ చైతన్యాన్ని పెంపొందించాలని, అదే కాలంలో సి.పి.ఐ(యం) విచ్ఛిన్నకర చర్యలను, వాటి అసలు స్వరూపాన్ని బహిరంగ పరస్తూ, కార్మికవర్గ ఐక్యతను పెంపొందించాలని, ఫ్రాక్షను నిర్ణయించింది.

ఐరను, స్టీలు పరిశ్రమలలో సి.పి.ఐ తన స్థానం బలహీనంగా వున్నదని, దుర్గాపూర్‌లో సి.పి.ఐ(యం) మంచి ఆధిక్యతలోను, బరన్‌పూర్, భిలాయ్‌లలో కూడ కొంత బలం కలిగివుందని, పార్టీ నింపాదిగా కాక చురుకుగా పనిచేసి, మెరుగుపరచ నిర్ణయించింది. అంతేగాక, రాంచి పరిశ్రమలవాడలో సి.పి.ఐ పరిస్థితి అంసతృప్తి వున్న దానిని మెరుగుపరచాలన్నది.

"సి.పి.ఐ.(యం) నాయకులు పెద్ద యెత్తున జరిపే విచ్ఛిన్నకర చర్యలను, కార్మికరంగంలోని యూనియనులను, కేంద్రాలను, స్థానిక, జాతీయ స్థాయిలో తమ ఆధిక్యత క్రిందకు, నాయకత్వం క్రిందకు తెచ్చుకొనాలనేవారి ప్రయత్నాలను జాగరూకులైవమ్ము చేయాలని, కార్మికసంఘాల ప్రజాస్వామ్యాన్ని గాలిలో కలిపి, బోగస్ యూనియన్‌నులను సభ్యత్వాలను సృష్టించి, సాగించే నిందా ప్రచారాలను ఎ.ఐ.టి.యు.సిపై చేయుటను ఖండించాలని కోరింది. వారు తమ సాహసిక, అతివాద ఎత్తుగడలతో, వొంటెత్తు పోకడలతో కార్మిక పోరాటలను విచ్ఛిన్నం చేయుటయో లేక స్తబ్ధతా బురదలో కూరుకొని పోవుటో చేస్తూ, యూనియనులను నాశనం చేస్తున్నారని, వారు కార్మికులలో వారికి గల గౌరవాన్ని కోల్పోవుటతో మరింత పెడమార్గంలో పోయి సి.పి.ఐ;ట్రేడు యూనియనుల నాయకత్వాన్ని దూషించుతున్నారని"[1] సి.పి.ఐ అవగాహనగావుంది. అంతేగాక "సి.పి.ఐ(యం) నాయకత్వపు విచ్ఛినకరపాత్ర తక్కువేమీకాదు. కార్మికవర్గంలోని కొన్ని శాఖలలో వారి ప్రభావంతోపాటు, ప్రజాపునాది బాగా వుంది. కొన్ని రాష్ట్రాలలో ప్రభుత్వోద్యోగులలో కూడ బలంగా వున్నారు. వారు తమ రాజకీయాలను కార్మికవర్గంలోనికి తీసుకొని పోతున్నారు. "ఈ కర్తవ్యనిర్వహణలో మనం తగినంత శ్రద్ధవహించలేకపోయాము. వారి నాయకత్వం తమ శక్తినంతా వినియోగించి, అన్ని పద్ధతులను అవలంభించి, "ఎ.ఐ.టి.యు.సి." నాయకత్వాన్ని పట్టుకొనాలని, అందులో విఫలమైతే చీలికలను తెచ్చేందుకు సి.పి.ఐ(యం) ప్రయత్నాలు చేస్తున్నది. అతివాదం నుండి వచ్చే యీ విచ్ఛిన్నాన్ని కార్మికులను సమీకరించి, వోడించాలి, ట్రేడు యూనియను ఐక్యత కాపాడాలి. మన యూనియునులను బలోపేతం చేయూలి, ప్రజా యూనియునులుగా చేయూలి. కార్మికవర్గప్రయోజనాలను కాపాడు పోరాటాలు, కార్మికవర్గ ప్రజాస్వామ్యమే దీనికి పునాది కావాలి[2].

సి.పి.ఐ 8వ, పార్టీ కాంగ్రెసు కమ్యూనిస్టుపార్టీ రెండుగా చీలినందున రెండింటి మధ్యరేగిన వివాదాంశాలను అధిగమించి, ఐక్యకార్యాచరణకు ప్రాధాన్యత నివ్వాలని నొక్కి చెప్పింది. అన్ని స్థాయిలలో సి.పి.ఐ. దీనిని ఆచరణ పెట్టుటకు, కేంద్ర శెక్రటేరియట్ స్థాయివరకు ద్వైపాక్షి సంప్రదింపులకు, సి.పి.ఐ.(యం) పొలిట్ బ్యూరోతో సహా మే 1969లో నిర్ధిష్ట ప్రతిపాదనలు, రెండు పార్టీల మధ్య సంబంధాలను మెరుగు పరచుటకు చేసింది. అదేవిధంగా రెండు పార్టీల ప్రతినిధులు "ఎ.ఐ.టి.యు.సి" పరిరక్షించుటకై ప్రయత్నించారు.

---

*1. సి.పి.ఐ ఆర్గనైజేషన్ రిపోర్టు ఆఫ్ 8వ, కాంగ్రెసు, పాట్నా, 1968 (ఆంగ్లంలో) సి.పి.ఐ. పబ్లికేషన్. పే.60–61*

*2. సి.పి.ఐ. ఆర్గనైజేషనల్ రిపోర్టు, ఆఫ్ 8వ, కాంగ్రెసు, పాట్నా. 1968 (ఆంగ్లంలో) సి.పి.ఐ. పబ్లికేషన్. పే. 61–65*

ఐక్యకార్యాచరణకు కూడ సి.పి.ఐ(యం) వ్యతిరేకించుచున్నందున సాధ్యం కాలేదు. నిజానికి కిసాన్ సభ స్థాయిలో సంయుక్త కార్యాచరణకు చేసుకొన్న వొప్పందాన్ని కూడ సి.పి.ఐ(యం) నాయకుదు వ్యతిరేకించి ఖండించారు. అప్పటికి "ఎ.ఐ.టి.యు.సి."లో కూడ చీలిక వచ్చింది. దానికి ముఖ్యకారణం సి.పి.ఐ(యం) అయినా, దానిపై నాయకత్వం వహించుతున్న సి.పి.ఐ. కూడ సమాన బాధ్యతనే వహించవలసి వుంటుంది.

"నిజానికి పశ్చిమబెంగాల్, కేరళలలో యింకా సి.పి.ఐ(యం) తన ప్రధాన శత్రువు సి.పి.ఐ యని తలచుచున్నది. అదేవిధంగా తన కమ్యూనిస్టు శ్రేణులను విషపూరితం చేసింది. సి.పి.ఐ.కి వ్యతిరేకంగా భౌతిక హింసాదాడులకు వొడిగట్టింది. " ఈవిధమైన ద్వేషపూరిత శత్రువైఖరి సి.పి.ఐ(యం) చేబట్టిన సైద్ధాంతిక, రాజకీయ పంథాలనుండి వుధ్భవించింది. అవిధంగానే వారు కార్మికవర్గ ఐక్యత, వర్గ విస్తృత దీర్ఘకాల ప్రయోజనాలకు మరింత దూరమగ్గుట, మార్క్సిజం–లెనినిజంలకు దూరమగుట జరుగుతుందని, వారి సిద్ధాంత వక్రీకరణ వారి కళ్ళు కప్పివేసి, చూడజాలని వారిని చేసింది. దురదృష్టకరంగా, భారతకార్మికోధ్యమానికి కార్మికవర్గ శ్రేణుల నుండి వచ్చిన వారి నాయకత్వం లభించకపోవుట, మధ్యతరగతి మేధావివర్గాలు స్వీయమానసిక ధోరణులతో కార్మికవర్గ మౌలిక ఐక్యతా, దీర్ఘకాల ప్రయోజనాలను విడనాడి, మార్క్సిజం, లెనినిజం, కమ్యూనిజం పదజాలముసుగుతో తీరని నష్టాన్ని కలుగజేసారు. చరిత్రలో యిది శిలాక్షరాలతో చెక్కబడింది. మార్క్సిజానికి దానిని వల్లించే వారి వలననే ఎక్కువ ద్రోహం జరిగింది. ఫలితంగా రెండు కమ్యూనిస్టుపార్టీలు తమ సహజవర్గాలకే దూరమయ్యారు.[1]

ఆర్థికమాంధ్యం, నిజవేతనాలు పడిపోవుట, ధరలు ఆకాశాన్ని అంటుటతో 1960 దశకం చివరకు కార్మికవర్గంలో క్రమంగా పోరాటవెల్లువ అభివృద్ధిచెంద సాగింది. వీటిన్నిటిలో "ఎ.ఐ.టి.యు.సి" నాయకత్వం వహించి నడిపింది. మే 1న పార్లమెంటు ఎదుట 30వేల మంది మహిళా కార్మికులు బ్రహ్మాండమైన ప్రదర్శన, తమకోర్కెలు ఎలుగెత్తి చాటుతూ ప్రదర్శన చేసారు. సి.పి.ఐ తదితరులు సంయుక్తంగా, దేశమంతటా సంయుక్త జాతాల ప్రచారానంతరం పార్లమెంటు ఎదుట ప్రదర్శనానంతరం "మహామహజరు" సమర్పించారు. క్రింది నుండి ఐక్యకార్యాచరణ పునాదులు అంతగాలేనందున, కార్మికవర్గ ఐక్యత విచ్ఛిన్నమై యున్నందునపై స్థాయిలో జరిగిన ప్రదర్శనలు పరిమిత లక్ష్యాలను కూడ సాధించలేక పోయాయి. కమ్యూనిస్టు, ట్రేడు యూనియనులు చీలికల మార్గంలో పయనించుచున్నందున చెదురుమదురుగా జరిగిన కార్మిక పోరాటాలు కార్మికోధ్యమంలో తగిన ప్రభావాన్ని కలిగించుటలో విఫలమయ్యాయి. చీలికల మార్గానికి చెలియలు కట్టలు కాజాలక పోయాయి.

**ట్రేడు యూనియనులకు సి.పి.ఐ 8వ, పార్టీ కాంగ్రెసు యిచ్చిన అవగాహన, నిర్దేశించిన లక్ష్యాలు, కార్యక్రమాలు, ఆచరణ, ఫలితాలు.**

పాట్నా సి.పి.ఐ. 8వ, పార్టీ కాంగ్రెసు ప్రధానంగా ట్రేడు యూనియనులలో పనిచేస్తూ,

---

1. *సి.పి.ఐ. ఆర్గనైజేషనల్ రిపోర్టు. ఆఫ్ 8వ. కాంగ్రెసు, పాట్నా. 1968 (ఆంగ్లంలో) సి.పి.ఐ. పబ్లికేషన్. పే. 61–65*

రాటుతేలిన వారందరికి కమ్యూనిస్టు చైతన్యాన్ని పెంపొందించవలసిందిగా, ఆమోదించిన కార్యక్రమంతోపాటు కోరింది. ఈ కాలంలో ప్రభుత్యోద్యోగులు తదితర సర్వీసుల సమ్మె ప్రత్యేకంగా చెప్పవలసివుంటుంది. మహారాష్ట్ర ప్రభుత్యోద్యోగులు ఐక్యంగా సమ్మెచేసారు. ఈ సమ్మెను ఆసంఘాల నాయకులే వ్యతిరేకించారు. ఈసమ్మెలలో కమ్యూనిస్టులు కొన్ని చోట్ల నాయకత్వం వహించి నడిపారు. మరొకొన్ని చోట్ల వుద్యమంలో చురుకుగా పాల్గొన్నారు. ఈ సమ్మెలను బలపరచుటకు అన్నివర్గాలు, అన్ని రాజకీయపార్టీలు కలసిన వొక ఐక్యవేదికను యేర్పాటు చేసారు. ఈ సమ్మెకు ద్రోహం తలపెట్టిన శివసేనను రాజకీయంగా వేరుచేసి, వారి విచ్ఛిన్నకర ప్రయత్నాలను వమ్ముచేసారు. ఈ కాలంలో జరిగిన వివిధ ఐక్యపోరాటాలలో క్రింది నుండి పెరుగుతున్న కార్మిక ఐక్యత, కార్మికోధ్యమంలోని చీలికలను అధిగమించలేక పోయింది.

కమ్యూనిస్టుపార్టీ రెండుగా చీలిన తరువాత "ఎ.ఐ.టి.యు.సి."లోని సి.పి.ఐ ఫ్రాక్షను వివిధ సమావేశాల తదనంతరం చేబట్టిన ముఖ్యచర్యలు యిలా చెప్పుకొనవచ్చును. ఈ సమావేశాలలో నిర్మాణాంశాలపై నిర్ణయాలు ఫిబ్రవరి 1966, ఆగస్టు 1967లలో జరిగాయి. ముఖ్యంగా 1967లో వొకవిధాన పత్రాన్ని ఆమోదించుట జరిగింది. మే 1966లో "ఎ.ఐ.టి.యు.సి" మహాసభ సందర్భంలో ఫ్రాక్షను సమావేశం జరిగింది. అంతేగాక, ప్రతి పరిశ్రమ ట్రేడు యూనియనులోను సి.పి.ఐ. ఫ్రాక్షను సమావేశాలు జరిగాయి.

"ఆగస్టు 1967ట్రేడు యూనియను ఫ్రాక్షను సమావేశం, 1) ప్రతి ఫ్యాక్టరీలో పార్టీ యూనిట్లను యేర్పాటు చేయాలి. 2) ప్రతి ట్రేడు యేనియనులో పార్టీ ఫ్రాక్షను యేర్పాటు చేయాలని, ఆవిధంగా పార్టీ పని విధానాన్ని మెరుగుపరచాలని నిర్ణయించింది. నూతన పరిస్థితులలో ట్రేడు యూనియనులు పలు రాజకీయ పక్షాలు, తమతమ ప్రభావాన్ని ప్రసరింపగలిగేవిగా వున్నవి. అంచేత యూనియనులు యేసంస్థలకు అనుబంధంగావున్నా ఐక్యకార్యాచరణ తప్పనిసరి పనివిధానమగుతుంది. మధ్యతరగతి ఉద్యోగుల తదితర ట్రేడు యూనియనులలో, కమ్యూనిస్టుపార్టీ బహిరంగంగా, మరింత పారదర్శిక విధానాలను అవలంభించాలని ట్రేడు యూనియన్ ఫ్రాక్షన్ సమావేశంనిర్ణయించింది.[1] ఫ్రాక్షన్ పత్రం, సి.పి.ఐ(యం) విచ్ఛిన్నతను విమర్శించి, ఐక్యతకు కృషి చేయాలన్నది.

"సి.పి.ఐ(యం) నాయకత్వం, ఘోరమైన విచ్ఛిన్నకర చర్యలను చేబట్టుటను గుర్తుపెట్టుకొనవలసిన అవసరముంది. ట్రేడు యూనియను రంగంలో యూనియనులను, వాటి కేంద్రాలను, రాష్ట్ర, జాతీయ స్థాయిలో ట్రేడు యూనియను ప్రజాస్వామ్యాన్ని గాలికి వదలి, ఆక్రమించే ప్రయత్నాలు లేక కృత్రిమంగా సభ్యత్వాన్ని పెంచి, బోగసు యూనియనులను యేర్పాటు చేయుట, మాపార్టీకి చెందిన యూనియను నాయకులపై దుష్ప్రచారాన్ని సాగించారు. వారు స్వంత సాహసిక, అతివాద, వొంటెత్తు ఎత్తుగడలతో కార్మికవర్గ పోరాటాలను నాశనం చేయుటయో, లేక బయటకు రాజాలని "వూబి" లో గుడ్డిగా త్రోసివేసి, యూనియనుల నాశనం చేసారు. ఫలితంగా వారి స్థానిక నాయకత్వాలు అప్రదిష్టపాలయ్యాయి. దీనితో హతాసులై సి.పి.ఐ., ట్రేడు యూనియనుల నాయకత్వాలను దష్ప్రచారంతో ముంచెత్తారు.

---

*1.సి.పి.ఐ 8వ. పార్టీ కాంగ్రెసు (1968) నిర్మాణనివేదిక (ఆంగ్లంలో) పే.59*

" సి.పి.ఐ(యం) నాయకుల విచ్ఛిన్నకర పాత్రను, సామర్థ్యాన్ని, తక్కువగా అంచెనావేయరాదు. కార్మికవర్గంలోని కొన్ని శాఖలలో బలమైన ప్రజాపునాది, ప్రభావాన్ని కలిగి వున్నారు. కొన్ని రాష్ట్రాలలో మధ్యతరగతి ఉద్యోగవర్గాలలోను బలాన్ని కలిగివున్నారు. మనం తగినంత శ్రద్ధవహించని కర్తవ్యాలపై వారు కేంద్రీకరించి, ఆయాకార్మికవర్గాలలోని రాజకీయాల ప్రచారాన్ని ముమ్మరం చేస్తున్నారు. వారి నాయకత్వం వారి శక్తినంత వినియోగించి, అన్ని మార్గాలలో "ఎ.ఐ.టి.యు.సి."ని ఆక్రమించాలనే ప్రయత్నాలు చేస్తున్నారు. అది సాధ్యంకానందున "చీలిక" ప్రయత్నాలు చేసారు. అతివాదంవైపు నుండి టి.యు. ఐక్యతను విచ్ఛిన్నం చేయు ప్రయత్నాలను ఎదుర్కొనుటకు కార్మికవర్గాన్ని సమీకరించాలి. కార్మికవర్గ ప్రయోజనాలను, కార్మికసంఘాల ప్రజాస్వామ్యాన్ని చురుకుగా పరిరక్షించే ప్రాతిపదికపై యూనియనులను బలపరస్తూ, విచ్ఛిన్నతను ప్రతిఘటించాలి.

నాడు కార్మిక వర్గం పెద్ద యెత్తున కదలి కార్మిక, రాజకీయరంగాలలో జాతీయ ప్రజాస్వామ్యశక్తులపై అభివృద్ధి నిరోధక, మతతత్వశక్తులు చేసేదాడిని ప్రతిఘటించవలసివున్నది. ఈ కర్తవ్యనిర్వహణను కార్మికవర్గ ఐక్యతను నిర్మించినపుడు మాత్రమే ట్రేడు యూనియన్, రాజకీయరంగాలలో సమర్థవంతంగా నిర్వహించగలమని, సి.పి.ఐ విశ్వశిస్తున్నది. అందుకు యీ క్రింది మూడు అంశాలు సత్వరం పాటించవలసి వుంటుందని సి.పి.ఐ అవగాహనగావుంది.[1]

మొదటిది: కేంద్ర, రాష్ట్ర నాయకత్వాలు, టి.యు.ల కార్యక్రమాలను విస్తరింపజేసి, బలోపేతం చేయుటకు రూపొందించిన సమగ్ర ప్రణాళికలను అమలు చేయుటకు పని విధానాలను నిర్ణయించాలి.

రెండవది : రాజకీయాలను కార్మికవర్గంలోనికి తీసుకొనిపోయి, తుది కార్యక్రమాన్ని రూపొందించి, ఆచరణ నిర్మాణ విధానాలతో నిరవధిక ప్రచారం చేయాలి.

మూడవది : కార్మికవర్గ కార్యకర్తలను ప్రణాళికాక్రమంలో రాజకీయ శిక్షణనిచ్చి, తయారుచేసిపై భాధ్యతలను అప్పగించాలి. అత్యవసర పరిస్థితిగా పరిగణించి, ప్రత్యేక పాఠ్య ప్రణాళికను రూపొందించి, కార్మికవర్గ కార్యకర్తలకు ప్రత్యేక తరగతులలో శిక్షణ యివ్వాలి.

పార్టీ చైతన్యంతో జాతీయ ప్రజాస్వామ్య సంఘటనా నిర్మాణలక్ష్యానికి, ఆ కర్తవ్యనిర్వహణకు కార్మికవర్గ ఐక్యతను పునాదిగా చేసుకొని పురోగమించాలి.

కార్మికరంగంలోని ముఖ్య పరిణామాలను సి.పి.ఐ. 9వ, పార్టీ కాంగ్రెసు నిర్మాణ నివేదిక పేర్కొన్నది క్లుప్తంగా యిలా వున్నది.

1. జాతీయ కార్మిక సమితికి సమర్పించవలసిన "విజ్ఞప్తి"ని రూపొందించుటకు "ఎ.ఐ.టి.యు.సి." జనరలు కౌన్సిలు సి.పి.ఐ.,సి.పి.ఐ(యం) సభ్యులతో కూడిన వొక జాయింటు సబ్ కమిటిని వేసింది. అలా రూపొందిన "విజ్ఞప్తి"ని అచ్చువేసి పంపకంచేసారు. కాని సబ్ కమిటిలోని సభ్యులు కొందరు "ఎ.ఐ.టి.యు.సి." విధానాలు, సూత్రాలకు

---

*1. సి.పి.ఐ 8వ. పార్టీ కాంగ్రెసు (1968) నిర్మాణనివేదిక (ఆంగ్లంలో) పే.63*

భిన్నంగా, వ్యతిరేకంగా నంతకం చేసిన నివేదికను విడిగా ప్రకటించారు. "ఎ.ఐ.టి.యు.సి."విధానాలకు భిన్నంగా వున్నందును ఆప్రకటన నుండి "ఎ.ఐ.టి.యు.సి." సభ్యులుపైవాటికి దూరంగా వుండాలని కోరింది.

2. మహాసభ సందర్భంగా 1968లో జరిపిన పరిశీలనలో 420 యూనియనులు రిటర్నులు పంపనందున 354 యూనియనుల గుర్తింపు రద్దు చేయబడింది. మరో 134 యూనియనులు పరిశీలనకు రికార్డులు పంపనందున సభ్యత్వాన్ని కోల్పోయాయి. ఫలితంగా "ఎ.ఐ.టి.యు.సి." రెండవస్థానాన్ని కోల్పోవుట, హెచ్.యం.యస్. రెండవ స్థానంనకు ఎదుగుట జరిగింది.

3. "ఆటోమాషన్" సమస్యను "ఎ.ఐ.టి.యు.సి." కౌన్సిలు, పార్టీఫ్రాక్షనులు జులై 1968లో చర్చించాయి. దానిని మొత్తంగా ఉన్న రూపంలో ఆమోదించజాలమని, మానవాళి శ్రేయస్సుకు సేవాదృక్పథంలో కొన్ని షరతులు, పరిమితులకులోనై ఆమోదించగలమని సి.పి.ఐ స్పష్టం చేసింది. ఎట్టి సంప్రదింపులు లేకుండా యాజమాన్యం ప్రభుత్వం ఆమోదం లేకుండా, ఆటోమేషన్ ప్రవేశపెట్టుటలో పురోగమించుతున్నారు.

4. కేరళ ప్రభుత్వం ఇ.యం.యస్. నంబూద్రిపాద్ నాయకత్వంలో జాతీయసమితికి సమర్పించిన విజ్ఞప్తిని "ఎ.ఐ.టి.యు.సి." చర్చించి, దానిలోని అభివృద్ధి నిరోధక ప్రతిపాదనలను గుర్తించి, ఆవిజ్ఞప్తిని ఉపసంహరించుకొనవలసిందిగా కోరుతు లేఖ వ్రాసింది. అయినా ఎట్టి ప్రత్యుత్తరంలేదని పేర్కొన్నది. వర్కింగు కమిటిలో సి.పి.ఐ(యం) సభ్యులు ఆవిజ్ఞప్తిని తమ ఆమోదంలేదన్నారు. చర్చలు జరుపుటకు వర్కింగు కమిటి ప్రయత్నించినా, కా॥రామమూర్తి దానిని ప్రక్కదారులు పట్టించి, అవి జరుగకుండా చేసారు. జులై 1968లో జరిగిన టి.యు.సి ఫ్రాక్షన్ సమావేశంలో యీ విషయాన్ని జాతీయసమస్యగా చర్చించి, సమన్వయం చేయాలని సి.పి.ఐ. చేసిన ప్రయత్నం విఫలమైంది.

5. సి.పి.ఐ యూనియనుల గుర్తింపుకు వొక సమగ్రబిల్లు చేయాలని, అందుకు సంయుక్త సంఘటన తదితర ప్రభుత్వాలు చొరవను చూపాలని కోరింది.

6. బెంగాలులో సంయుక్త సంఘటన ప్రభుత్వం యేర్పడిన వెంటనే ప్రజావసరాల సాధ్యాసాధ్యాలపై చర్చించుట జరిగింది. "కేంద్రంపై పోరాటం అన్న నినాదాన్ని మన కామ్రేడ్సులో కొందరు ప్రధానకర్తవ్యంగా చేబట్టుట, రాష్ట్ర ప్రభుత్వ అధికారాలు ఎన్ని పరిమిలులోనైనా వాటిని ప్రజోద్యమాలను బలపరచుటకు వినియోగించుటనుండి మనలను దూరం చేస్తుంది. కాన టి.యు. నాయకత్వం బెంగాలు వెళ్లి, కార్మికరంగంలోని బెంగాల్ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంతో చర్చించి మార్చి 1969లో యీ క్రింది ప్రతిపాదనలతో వొక ప్రకటన చేసారు. అవి 1) తప్పనిసరిగా చట్ట ప్రకారం యూనియను గుర్తింపబడే హక్కు 2) కార్మికులను తీసివేయుట, ఫ్యాక్టరీలు మూసివేయుటకు వ్యతిరేకంగా పోరాడుట, 3) తక్షణ కార్మిసంఘాల కోర్కెలపై, వేతన పెరుగుదలకు కార్మికులను సమీకరించుట. అంతేగాక, యిట్టి పోరాటాలు సంయుక్తసంఘటన ప్రభుత్వాలను యేవిధంగాను యిబ్బందులలో పెట్టజాలవని స్పష్టం చేయబడింది.

7. మే 1969లో జరిగిన సమావేశంలో సి.పి.ఐ.,సి.పి.ఐ(యం) ల మధ్య

భేధాభిప్రాయాలు ఎకుక్కువగా చున్నందున అన్ని స్థాయిలలో ట్రేడు యూనియనుల పనిపై, ఛైర్మన్ లేఖలు, సమాచారం పంపకం చేయబడాలని నిర్ణయించి, అబమలు చేయబడింది. అయినా సి.పి.ఐ(యం) నాయకత్వం తప్పుడు పాతనిందనే పునశ్చరణ చేసారు. అదే సమావేశంలో ఫ్రాక్షను గుత్తపెట్టుబడి సంస్థలపై పోరాటం ముమ్మరం చేయాలని నిర్ణయించింది. ప్రధమంగా బిర్లా సంసర్థలపై కేంద్రీకరించాలని, చిరుపుస్తకం ప్రచురించాలని నిర్ణయించారు. ఆచరణలో యీ కార్యక్రమ పురోగమనం శూన్యమైంది. కేంద్రప్రభుత్వం ఎంప్లాయిస్ యూనియన్ పార్టీ ఫ్రాక్షన్ మే 1969లో పరిస్థితి చర్చించి, భేదాభిప్రాయాలను పరిష్కరించిన నూతన ఫ్రాక్షను కమిటిని యేర్పరచింది. అదేవిధంగా, ఎ.అండ్.టి.కి ప్రత్యేక ఫ్రాక్షన్ కమిటీని రూపొందించింది.

8. అస్సాం, యు.పి పంజాబులలోని టి.యు.సి శాఖలలో వచ్చిన పరిణామాలను చర్చించుట. సి.పి.ఐ.లోని టి.యు.శాఖ సి.పి.ఐ(యం) విచ్ఛిన్నకర చర్యలను ప్రతిఘటించుటకు తగిన సహాయాన్ని అందించింది. అయినా యు.పి.లో పరిస్థితి మెరుగుపడలేదు. యు.పి రాష్ట్ర మహాసభలో సి.పి.ఐ(యం) వర్గాలు పరాజయం పొందాయి. దానితో పోటీ కమిటీలను యేర్పరచారు.

9.సి.పి.ఐ పార్టీ టి.యు. శాఖ సి.పి.ఐ(యం) విచ్ఛిన్నకర చర్యలను చర్చించి, "ఎ.ఐ.టి.యు.సి." నిర్మాణ సూత్రాలకు సవరణల చిత్తును తయారుచేసి, చర్చల నిమిత్తం పంపకం చేసింది. విచ్ఛిన్నకర చర్యలు జరిపేవారిపై క్రమశిక్షణా చర్యలు సులభంగా గైకొనగలందులకు సవరణలు, సమావేశాలలో ప్రతినిధుల సంఖ్యాబలాన్ని తగ్గించి, సమావేశాలను తేలిక చేయుటకు సవరణలు చేబట్టారు. అదేవిధంగా, అనుబంధ సంస్థలుగా చేర్చుకొనుటకు నిబంధనలకు సవరణలు గుంటూరు అఖిలభారత మహాసభలో ప్రతిపాదించుటకు రూపొందించబడినవి. ఈ నిబంధనల సవరణలన్నిటిని సి.పి.ఐ(యం) వ్యతిరేకించి, సంప్రదింపులకు తన అంగీకారాన్ని తెలియజేసింది. గుంటూరు"ఎ.ఐ.టి.యు.సి."మహాసభను బహిష్కరించి, హాజరు కాలేదు. వాయిదా వేయుటకు ముందు ప్రయత్నించి, విఫలమైంది.[1]

10. "ఎ.ఐ.టి.యు.సి." మహాసభను గుంటూరులో 28 జనవరి నుండి ఫిబ్రవరి 1, 1970 వరకు జరపాలని నిర్ణయించారు. మహాసభను వాయిదావేయాలని సి.పి.ఐ(యం) కోరింది. సి.పి.ఐ చీలికను నివారించుటకు సంప్రదింపులకు తయారుగవున్నామని, తెలియజేసింది. అందుకు వీలుగా సి.పి.ఐ యొక్క టి.యు. డిపార్టుమెంటు గతంలో సి.పి.ఐ(యం) పార్టీ సభ్యులు భాద్యులుగవున్న పదవులలో తిరిగివారినే ఆఫీసు కార్యకర్తలుగా, నాయకులుగా వర్కింగు కమిటి మెంబరుగా, జనరలు కౌన్సిలు మెంబరులుగ గుంటూరులో ఎన్నుకొనగలమని నిర్ణయించి, దానిని సి.పి.ఐ(యం)కు తెలియపరచారు. ఈ ప్రతిపాదనలకు "ఎ.ఐ.టి.యు.సి." లోని యితర పార్టీలు, గ్రూపులు ఆమోదాన్ని తెలిపాయి. అంతేగాక, తలపెట్టబడిన "ఎ.ఐ.టి.యు.సి." నిర్మాణ సూత్రాలకు సవరణలను, ముఖ్యంగా సి.పి.ఐ(యం) వ్యతిరేకించిన వాటిని సి.పి.ఐ వుపసంహరించుతామన్నా రాజీ, వొప్పందం

*1.డాక్యుమెంట్సు ఆఫ్ ది నైన్తు కాంగ్రెసు ఆఫ్ ది సి.పి.ఐ(యం) ఆర్గనైజేషనల్ రిపోర్టు (1971) పే. 77-84*

కుదరలేదు. రాజీ అనేది ఎప్పుడూ వ్యవహారంకాదు రెండు పక్షాలు హృదయపూర్వకంగా వాచించితేనే విజయవంతంగా జరుగుతుంది.

## "ఎ.ఐ.టి.యు.సి." 1970 చీలిక చివరి ఘటనలు

కమ్యూనిస్టుపార్టీ 1964లో చీలి సి.పి.ఐ., సి.పి.ఐ(యం)లుగా అయినప్పటికి, సి.పి.ఐ(యం) నాయకత్వం ఇండియా-పాకిస్థాన్ యుద్ధ అత్యవసర పరిస్థితులలో డిటెయిన్ చేయబడినవారు, 1965 నుండి క్రమేణా విడుదల చేయబడుటతో, కార్మికవర్గంలో పోరాటాల వెల్లువ ప్రారంభమగుట, అదేకాలంలో సి.పి.ఐ.,సి.పి.ఐ(యం)ల మధ్య భేదాభిప్రాయాలు తీవ్రమై, కార్మికోద్యమంలో చీలికల క్రమం ప్రారంభమైంది. అదియెలా అభివృద్ధి చెందింది, యింతకు ముందే తెలుసుకొన్నాము.

మే 1970 మధ్యలో సి.పి.ఐ కేంద్రసమితి న్యూఢిల్లీ సమావేశమై కార్మికోద్యమంలోని అభిప్రాయభేదాలు తీవ్రమై "చీలిక పరిస్థితి" యేర్పడుట గమనించి, "ఎ.ఐ.టి.యు.సి." లో నేడున్న ఐక్యత కొనసాగుటకు యీలా విజ్ఞప్తి చేసింది.

"సి.పి.ఐ(యం) నాయకత్వం బహిరంగంగా "ఎ.ఐ.టి.యు.సి." ని చీల్చి, నూతన పోటీ కేంద్రాన్ని యేర్పాటు చేస్తామనే ఆకాంక్షను ప్రకటించుట, సి.పి.ఐ. కేంద్రసమితికి తీవ్ర ఆందోళన, కలతను కలుగజేసింది. అందుకు సి,పి.ఐ(యం) కలకత్తాలో తన నాయకత్వంలోని కార్మిక సంఘాల సమావేశాన్ని మే చివరలో యేర్పాటుకు పిలుపు నిచ్చింది. ఇంతలో రాష్ట్రస్థాయిలో చీలికల క్రమానికి నాంది పలికి, పోటీ రాష్ట్ర టి.యు. కమిటీలను యేర్పాటు చేయుట కేరళతో ప్రారంభించింది.

"కొరవైన కార్మికవర్గ ఐక్యత నేర్పరచి, బలోపేతంచేసి, కార్మికుల కోర్కెలు, ప్రయోజనాలకై చురుకైన ఐక్యకార్యాచరణమెంతోవున్నా, తగినంతగా లేదని జాతీయ సమితి విశ్వసిస్తున్నది. మారిన దేశ, రాజకీయ పరిస్థితులలో కార్మికవర్గం మహోన్నతంగా, గుత్త పెట్టుబడిదారి వర్గ శక్తుల దోపిడిని సమర్థవంతంగా ప్రతిఘటించుటకు గతంలో ఎన్నడూ లేని అవకాశాలు ఉద్భవించాయి." అని హేతుసహితంగా విజ్ఞప్తి వివరించింది.

అంతేగాక "భయపెడుతున్న 'ఎ.ఐ.టి.యు.సి.'లోని చీలిక, సి.పి.ఐ(యం) ఎన్ని గొప్పమాటలు చెప్పినా "చేయాలని ప్రణాళిక ప్రకారం చేస్తున్న యీ చీలిక ప్రయత్నాలు పెట్టుబడిదారి వర్గాలకు తప్ప మరెవ్వరికి సహాయపడకపోగా, కార్మికవర్గ శ్రేణులలో మరింత విచ్ఛిన్నతను తెచ్చి, వారి పోరాట శక్తిని క్రుంగదీస్తుందని" విజ్ఞప్తి స్పష్టం చేస్తుంది.

వాస్తవమేమంటే సి.పి.ఐ(యం) పార్టీ యేతర ఐక్యట్రేడు యూనియనులు ప్రజాసంఘాలపై "పార్టీ పొలిట్‌బ్యూరో నిర్ణయాలను మొరటుగా ట్రేడు యూనియనులపై రుద్దేప్రయత్నం చేస్తున్నది." సి.పి.ఐ(యం) టి.యు.లను మొత్తంగా తనక్రింది సంస్థలుగా చేసి, పార్టీ నిర్ణయాలను డిక్టేటు చేయప్రయత్నిస్తుంది. వాటికి విముఖతచూపి, మెజారిటీ యూనియనులు,కార్మికులు వ్యతిరేకించితే, సి.పి.ఐ(యం) నాయకత్వం "ఎ.ఐ.టి.యు.సి."

నే చీల్చుటకు సిద్ధంగా వుంది. సి.పి.ఐ(యం) విప్లవ సిద్ధాంతం ట్రేడు యూనియను ఐక్యతను గౌరవించకపోగా, భగ్నం చేయుటకు సిద్ధం, ఆవిధంగా బూర్జువా ప్రయోజనాలకు సేవచేస్తున్నది.[1]

"సి.పి.ఐ(యం) అతివాద అవకాశవాదం మాత్రమే, అటువంటి చీలికలను తెచ్చి పెట్టుతుంది. అభివృద్ధి నిరోధక మితవాద బూర్జువా వర్గం కూడ అటువంటి వైఖరినే కలిగివుంది. ఇట్టి చీలికలను 1947లో "ఎ.ఐ.టి.యు.సి." నుండి జాతీయవర్గాలు చీలిపోయి, ఐ.యన్.టి.యు.సి.ని యేర్పరచి, అవకాశవాద చీలికలకు బాటనువేసి, నైతిక బలాన్ని కలుగజేసి తోడ్పడు జరిగింది.

"సి.పి.ఐ(యం) నాయకత్వం వారి విచ్ఛిన్నకరవైఖరి, చర్యలకు, చీలికలు తెచ్చుటకు ఎట్టి, ఎన్ని కారణాలను చూపెట్టినా, జాతీయ సమితికి వారి వాదనలలో సరియైన, సమాధానం కనిపించదు. "ఎ.ఐ.టి.యు.సి." నాయకత్వం "వర్గ పొత్తు" నిందను మోపినా, అది రాజకీయ ప్రయోజనాన్ని ఆశించినదే అగుతుంది.

"సి.పి.ఐ(యం) అకస్మాత్తుగా అంతవల్లమాలిన ప్రేమ, నిర్మాణేశ్చ "ప్రజాస్వామ్యంపై ఎందుకు పుట్టు కొచ్చిందో అర్థమగుటలేదు. గుంటూరు "ఎ.ఐ.టి.యు.సి." మహాసభలకు హాజరు కాకపోయినా, వారి విచ్ఛిన్నకర వైఖరిని కొనసాగించుతున్నా, "ఎ.ఐ.టి.యు.సి." పై అధికృతగల నాయకత్వం, గత నాయకత్వంలోని అతివాదులను అలాగే కొనసాగించింది.

కార్మికులకు, ట్రేడుయూనియనిస్టులకు జాతీయ కౌన్సిలు విజ్ఞప్తి చేస్తూ, ఐక్యత కొనసాగించుటకు తమశక్తినంత వినియోగించి, కార్మికవర్గ సౌభాతృత్వాన్ని, ఐక్యతను, గణనీయమైన "ఎ.ఐ.టి.యు.సి." జెండా గౌరవాన్ని కాపాడుట, విచ్ఛిన్నకారులు చీలికలు తెచ్చే ప్రయత్నాలను, కార్మికోధ్యమ ప్రజాస్వామ్యాన్ని, ఉధ్యమాన్ని, దేశప్రయోజనాలను "ఎ.ఐ.టి.యు.సి." గౌరవాన్ని, ఇనుమడించమని విజ్ఞప్తి చేసింది.

కార్మికవర్గ సంస్థలలో పనిచేస్తున్న నాయకత్వంలో సైద్ధాంతిక స్థిరత్వం లేకపోవుట, వర్గ దృక్పధం లేకపోవుట కన్పడుతున్నది. నాయకత్వంలోని కొందరు, జాతీయ లేబరు కమిషన్ వేసిన కమిటీలలో సభ్యులుగా నివేదికలపై విచక్షణా రహితంగా సంతకాలు పెడుతున్నారు. కాంగ్రెసు ప్రభుత్వాలు ముఖ్యంగా మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్‌లలో అభివృద్ధి నిరోధక పారిశ్రామిక విధానాలను సమర్థించుకొనుటకు వాటిని వినియోగించారు.

కార్మికోధ్యమంలో సి.పి.ఐ-సి.పి.ఐ(యం)ల దృక్పధాలు చీలికలకు ప్రధానాంశాలు అగుటయేగాక, సి.పి.ఐ నాయకత్వం విచ్ఛిన్నతను అరికట్టే ప్రయత్నమంటూ, "ఎ.ఐ.టి.యు.సి" నిర్మాణ సూత్రాలకు సవరణలను గుంటూరు మహాసభలో ప్రతిపాదించుటకు రూపొందించింది, అంతేగాక ప్రతినిధుల సంఖ్యను కుదించుటకు, మరోవైపున వ్యవసాయ కూలి సంఘాలకు ప్రాతినిధ్యాన్ని యిచ్చే సవరణలు చేయ సమకట్టింది. వీటన్నిటిని కార్మికోధ్యమంలోని సి.పి.ఐ(యం) నాయకత్వం ప్రతిదశలో వ్యతిరేకించింది, కాని ఎట్టి మంచి ఫలితాలు కలుగలేదు. పైగా చీలికల పంథావైపులకే

1. *రిజల్యూషన్స్ అండ్ రిపోర్ట్సు ఆఫ్ ది యన్.సి. ఆఫ్ ది మే, 1970 సి.పి. పబ్లికేషన్ పే. 77-79.*

యిరువర్గాలు పయనించి, కార్మికవర్గ ఐక్యతను సిద్ధాంతాల పేరిట భగ్నం చేసారు. ఇందుకు కమ్యూనిస్టుపార్టీలు రెండూ సమాన భాధ్యులే. ప్రధానంగా రెండు కార్మికసంస్థలుగా యేర్పడాలనే, వారి రాజకీయ నిర్ణయాలే చీలికలకు కారణముగా చెప్పవచ్చును.

కార్మికోధ్యమంలోని సి.పి.ఐ(యం) నాయకత్వం ప్రత్యేక కన్వెన్షన్ జరిపి, "ఎ.ఐ.టి.యు.సి."లోని 340 యూనియనుల ప్రతినిధులు సమావేశమై "సెంటర్ ఫర్ ఇండియన్ ట్రేడు యూనియన్స్" అనే సంస్థను యేర్పాటు చేసారు.

## "ఎ.ఐ.టి.యు.సి.", జనరలు కౌన్సిలు, రాష్ట్రకమిటీలలోని సి.పి.ఐ(యం) సభ్యుల గోవా కన్వెన్షన్

పోరాట పంథాను చేబట్టిన కార్మికోధ్యమానికి అత్యంత క్లిష్ట పరిస్థితి యేర్పడిందని, వర్గ చైతన్యం కలిగిన దేశంలోని కార్మిక శ్రేణులు గుర్తించిన ఫలితంగా గోవాకన్వెన్షన్ సమావేశం అవసరమైందని వివరించారు. "ఎ.ఐ.టి.యు.సి." ఎంతో పోరాట చరిత్రగలిగినది, కార్మికవర్గాన్ని సమీకరించినది, సంయుక్త పోరాటాలకు నాయకత్వం వహించుటలో పూర్తిగ విఫలమైంది, డాంగే నాయకత్వంలో వర్గసామరస్య విధానాలను అనుసరించుటతో, కార్మికోధ్యమాన్ని విచ్ఛిన్నకర మార్గంలో నడుపుతు, సంయుక్త పోరాటాలను విచ్ఛిన్నం చేస్తున్నది. ఇది "ఎ.ఐ.టి.యు.సి." అనుసరిస్తున్న 'రెండు స్థంబాల' విధానంలో స్పష్టమగుచున్నది. విదేశగుత్తపెట్టుబడిదారుల, అమెరికా సామ్రాజ్యవాద పెట్టుబడితో, వారిపోత్తులోప్రభుత్వం ప్రణాళికా బద్ధ పెట్టుబడిదారి విధానాభివృద్ధిని తలపెట్టింది. కమ్యూనిస్టుపార్టీ "ఎ.ఐ.టి.యు.సి."లు యీ ప్రభుత్వ ప్రణాళికలను "స్వతంత్ర అభివృద్ధిగా" పేర్కొంటూ బలపరస్తూన్నవి. ఈ ప్రభుత్వం ప్రణాళికలు విధానాలు, గుత్తపెట్టుబడిదారుల, భూస్వాముల ప్రయోజనాలకు ఉద్దేశించబడినవని, గోవాకన్వెన్షన్ తీర్మానం పేర్కొన్నది.[1]

"సహజంగా అది అనుసరించే పంథా ప్రకారం" "ఎ.ఐ.టి.యు.సి." లో ఆధిక్యత గల నాయకత్వం, త్రైపాక్షిక సమావేశాలను, కమిటీలను, వేతనబోర్డులను ఆకాశానికెత్తి పోగుడుచున్నది. ప్రభుత్వవిధానాల యెడల భ్రమలు కల్పించుచున్నది. జాతీయ ప్రయోజనాలకంటూ, "రేషనైలేజేషను"ను ఆమోదించింది. అంతేగాక, ప్రభుత్వ "ఉత్పాదకత, కార్మికులకు విద్య," అనే స్కీముల "క్రమ శిక్షణా సూత్రాలు" ప్రధానంగా పారిశ్రామికుల లాభాలను పెంచేవిధానాలను కూడ బలపరచాయి, ఆమోదించాయి. కార్మికవర్గం వారి పోరాటాలకు బంధనాలను విధించిన యీ విధానాలనన్నిటిని తీవ్రంగా వ్యతిరేకించారు. కార్మికోధ్యమంపై ఆదిక్యత గల నాయకత్వం, ట్రేడు యూనియనులలో నిరంకుశ విధానాలను అవలంభించప్రారంభించింది. ప్రజాస్వామ్య విధానాలు పనిచేయుటలేదని గుర్తించిన కార్మికులు తమంతటతాము ఎన్నికలు జరుపుకొని, నూతన కార్యకర్తలను, నాయకులను ఎన్నుకొన్నారు. "ఎ.ఐ.టి.యు.సి."లో ఆధిక్యతగల నాయకత్వం వీటిని గుర్తించ నిరాకరించిన కారణంగా, యివి కార్మికోధ్యమంలో వెలుపలవుండిపోయాయి. అతివాదులు ఆధిక్యతగల యూనియనులలో డాంగే అనుచరులు వోడిపోయారు. అనేకచోట్ల పోటీ యూనియనులను

*1. రణదివె, బి.టి. (1990) ఆన్ ట్రేడు యూనియన్ మూమెంటు. వాల్యూం 1. రిజల్యూషన్సు, గోవా కన్వెన్షన్. ఎ సి.టు. పబ్లికేషన్ పే. 1.*

పెట్టి "ఎ.ఐ.టి.యు.సి." గుర్తింపు పొందారు. వందలకొలది యూనియనులు గుర్తింపుకు ప్రయత్నించినా పొందజాలక పోయాయి. ఆవిధంగా వేలాది పోరాడే కార్మికులు "ఎ.ఐ.టి.యు.సి." బయటనేవుండి పోయారు.

"ఎ.ఐ.టి.యు.సి." యూనియనుల ఎన్నికలలో ఐక్యతను కాపాడుటకై పోలైన వోట్ల దామాషా నిష్పత్తిలో ప్రతినిధులను, నాయకత్వాలను ఎన్నుకొనే పద్ధతికితిలోదకాలు యిచ్చింది. ఎన్నివిజ్ఞప్తులు చేసినా దామాషా నిష్పత్తిపద్ధతి అనుసరించక విచ్ఛిన్నకర విధానాలను అవలంభించింది. అంతేగాక, తమ యూనియనుల సభ్యత్వాన్ని అధికం చేసి, చూపెట్టనారంభించింది. సభ్యత్వ పరిశీలనకు యేకొలమానాన్ని అంగీకరించలేదు. వివాదాస్పద యూనియనులలో "రహస్యబాలెట్"తో మెజారిటిని నిర్ణయించు పద్ధతిని "ఎ.ఐ.టి.యు.సి." నాయకత్వం అంగీకరించలేదు. బూర్జువా రాజకీయ పార్టీల అధ్వర్యంలోని యూనియనులకు పక్షపాతవైఖరితో ప్రభుత్వ గుర్తింపు లభించినపుడు ట్రేడు యూనియనులను "రహస్య బ్యాలెటు" జరిపి గుర్తించాలని ఉమ్మడి కమ్యూనిస్టుపార్టీ, "ఎ.ఐ.టి.యు.సి." ఎంతోకాలంగా కోరుతూవస్తున్నది. అదే విధానాన్ని ఒక యూనియనులో "మితవాదులకు లేక అతివాదులకు" మెజారిటి వున్నదో తేల్చుకొని, దామాషా నిష్పత్తి ప్రకారం కమిటిలో ప్రాతినిద్యాన్ని ఆమోదించియున్నట్లయితే, కార్మిక ఐక్యత కాపాడిబడి యుండేదని, సోషలిస్టు అభిమానులుతలచుట సమంజసమగుతుంది. అనేక బోగస్, నామమాత్రపు బోగసు, పేపరు యూనియనులకు గుర్తింపునిచ్చింది. అదేకాలంలో నిజంగా కార్మికులలో బలవైన యూనియనులు, సి.పి.ఐ(యం) నాయకత్వంలో వున్న కారణంగా గుర్తింపుపొందజాలక పోయాయి.

కేరళలో సి.పి.ఐ నాయకులు కాంగ్రెసు తదితర అభివృద్ధి నిరోధకనాయకులందరు కలసి, ఐక్యసంఘటనా ప్రభుత్వాన్ని కూలదోసి, మినీసంఘటనా ప్రభుత్వాన్ని యేర్పాటు చేసారు. తరువాత యీనాయకుల సమ్మెలను భగ్నం చేసారు. కొబ్బరితాడు పరిశ్రమ, రోడ్డురవాణా కార్మికుల సమ్మెలను భగ్నంచేసారు.

ఈసమ్మెలను బలపరచిన వారిపై గూడ నిర్బంధవిధానాన్ని సాగించారు. ఈ విధంగా "ఎ.ఐ.టి.యు.సి." కాంగ్రెసు తోకగా తయారైందని కన్వెన్షనులో తీవ్రంగా, సి.పి.ఐ(యం) కార్మికనాయకత్వం విమర్శించింది. జనరలు కౌన్సిలు, రాష్ట్ర కౌన్సిలు, కమిటీల మాజీ "ఎ.ఐ.టి.యు.సి." సభ్యులు, మైనారిటీ వర్గపోరాటాన్ని, కార్మికవర్గ ఐక్యత కొనసాగించాలంటే, టి.యు.సిలలో కార్మిక ప్రజాస్వామ్యం కొనసాగాలంటే, "ఎ.ఐ.టి.యు.సి."లో వుంటే అసాధ్యమనే నిర్ణయానికి వచ్చారు.

అంచేత, "ఐక్యతకై పోరాటం జరుపుటకు నూతన అఖిలభారత ట్రేడు యూనియను కేంద్రం యేర్పాటు చేయబడాలని విశ్వసించుతున్నది. అదే నిరవధిక వర్గపోరాట పంథావైపు కార్మికవర్గాన్నంతా సమీకరించగలదని, ఆవిధంగా ఐక్యపోరాటాలు పాలకవర్గాల దాడికి వ్యతిరేకింగా కార్మికులను సమీకరించి, పోరాటాలను సాగించుగలుగుతుందని" కన్వెన్షను తలచుచున్నది.

"కన్వెన్షన్, బాంబే ట్రేడుయూనియను కాంగ్రెసుకు, కాన్సరెన్సుకు అన్ని యేర్పాట్లు

చేయుటకు అధికారాలను యిచ్చుచున్నది. జనరలు కౌన్సిలును, గుంటూరు "ఎ.ఐ.టి.యు.సి." కాన్ఫరెన్స్‌ను బాయికాటు చేసినవారు, మాపంథాను అనుసరించేవారు; మహాసభ విజయవంతమగుటకు అన్ని చర్యలను తీసుకొనగలరు".[1]

## "సి.టు" పుట్టుక మహాసభ

అఖిల భారత ట్రేడు యూనియను కాన్ఫరెన్స్ కలకత్తాలోని రంజిస్టేడియంలో నిర్మించిన 'లెనిన్‌నగర్' లో 29-30, మే 1970లో, గోవా కన్వెన్షన్ 10 ఏప్రిల్ 1970లో చేసిన నిర్ణయం ప్రకారం జరిగింది.

పశ్చిమబెంగాల్ ట్రేడు యూనియన్ కాంగ్రెసు అధ్వర్యంలో జ్యోతిబసు ఆహ్వానసంఘ అధ్యక్షుడుగా, మనోరంజన్‌రాయ్ జనరల్ శెక్రటరీగా అన్ని యేర్పాట్లు కావించింది.

కా॥ రామమూర్తి క్రెడెన్షియల్ కమిటికి, కా॥ పాండే, నల్లముత్తు, శాంతి ఘటక్, బిరేన్ రాయ్‌లను ప్రతిపాదించగా, మనోరంజన్‌రాయ్ బలపరచగా ఆమోదించబడింది.

కా॥ రామమూర్తి నివేదిక ముఖ్యాంశాలను వివరించారు. కాన్ఫరెన్స్ రామమూర్తి చర్చలలో లేవనెత్తబడిన ప్రశ్నలకు జవాబులు యివ్వకముందే కొన్ని తీర్మానాలు ఆమోదించింది. కా॥పాండే క్రెడెన్షియల్ కమిటి నివేదికను సమావేశం ముందుంచారు. ప్రధానంగా 1759 యూనియనులు 8,04,637 మొత్తం సభ్యులు 4264 మందిని ప్రతినిధులుగ, సోదరసంఘాలు 116 మంది ప్రతినిధులను 1134 మంది పరిశీలకులుగ పంపుటతో మొత్తం 5514మంది సభ్యులు పాల్గొన్నారని నివేదికలో పేర్కొన్నారు.

కా॥ బి.టి.రణదివే సమావేశ నిర్ణయాలను సమీక్షించారు. తరువాత సమావేశపు అధ్యక్షవర్గం, నూతన ఆఫీసుభాధ్యులను, నాయకులను కౌన్సిలు ఎన్నుకొన్నది. కా॥ రణదివె, రామమూర్తులు అధ్యక్షులు, జనరలు శెక్రటరీగ ఎన్నుకొనబడ్డారు. ఈవిధంగా, అఖిలభారతస్థాయిలో సి.పి.ఐ(యం) నాయకత్వంలో నూతనంగా "సెంటర్‌ఫర్ ఇండియన్ ట్రేడు యూనియన్" కేంద్ర కార్మిక మరో సంస్థ అవతరించింది.

అంత్యోపన్యాసంలో బి.టి.రణదివె, "యీనూతన సంస్థయిద్దరు నాయకుల మధ్యనో, రెండు ప్రాక్షనుల గ్రూపుల మధ్య సంఘర్షణల కారణంగానో యేర్పడలేదని, సమ్మెల వెల్లువ, లక్షలకొలది, కార్మికుల సమ్మెల పోరాటాల ఫలితంగా యేర్పడిందని," "భవిష్యత్తులో మితవాదులో, డాంగేనో "ఎ.ఐ.టి.యు.సి." నియో లేక "ఆవ్యక్తి చీల్చారని వ్రాస్తారు. కాన గుర్తుంచు కొనాలన్నారు." ఇంకా "మేము వర్గపోరాటాల నుండి, కార్మికుల పోరాటాల అవసరాల నిమిత్తం, వాటి కొరకు మేము నిలబడ్డాము అలా యేర్పాటు చేస్తున్నామని" అన్నారు. నూతన బోర్డును పెట్టాలనే కోరికతో కాక, "కార్మికవర్గ ఐక్యతను పెంపొందించు నిమిత్తం, డాంగే "ఎ.ఐ.టి.యు.సి." చొరవను యింకేమాత్రం యివ్వకుండా

---

*1. రణదివె, బి.టి. (1990) ఆన్ ట్రేడు యూనియన్ మూమెంటు. వాల్యూం 1. రిజల్యూషన్సు ఆఫ్ గోవా కన్వెన్షన్, ఎ సి.టు పబ్లికేషన్ పే. 4-5.*

వుండగలందులకు, కార్మికవర్గం తామే చొరవను ప్రదర్శించగలందులకు నూతన సంస్థ రూపుదాల్చిందని"[1] వివరించారు.

కా॥ రణదివే ఉపన్యాసంలోని మరికొన్ని ముఖ్యాంశాలు యిలా వున్నవి.

చర్చల నివేదికలో కా॥పి.రామమూర్తి తదితరలు ఎంతోమంది తమ స్వతంత్ర సమాచారాన్ని, "ఎ.ఐ.టి.యు.సి." అగ్రనాయకత్వం, పోరాటాలను విచ్ఛిన్నం చేస్తున్నది. కార్మికవర్గ ఐక్యతను భగ్నం చేస్తున్నదీ, ఆధారసహితంగా, కా॥ రామమూర్తి నివేదికను బలపరచారు. మా అనుభవం కూడ "ఎ.ఐ.టి.యు.సి." నాయకత్వం, వర్గపోరాటానికి, కార్మిక ఉనికికి తోడ్పడుట లేదని స్పష్టమైంది. మనం భారతదేశంలో " చావోబ్రతుకో" పోరాటాన్ని శతృవు వర్గ శతృవులకు వ్యతిరేకంగా జరుపుతున్నామని మన కామ్రేడ్స్ గుర్తు పెట్టుకోవాలి. "ఎ.ఐ.టి.యు.సి." వర్గపోరాటాలకు నాయకత్వం వహించుట లేదు.[2]

కా॥ రామమూర్తి సంక్షిప్తంగా అంతర్జాతీయ కార్మికవర్గపోరాటాలను సమీక్షించి, అంతర్జాతీయ సానుకూల పరిణామాల స్ఫూర్తితో పురోగమించి వర్గపోరాటాలను పెంపొందించి, విస్తృత పరచాలని ప్రబోదించారు. సమావేశం కంబోడియాపై వొక తీర్మానాన్ని కూడ ఆమోదించింది. అంతర్జాతీయ కమ్యూనిస్టువ్యవస్థలో వచ్చిన చీలికల కారణంగా, అమెరికా సామ్రాజ్యవాదంకు, కంబోడియాపై సైనికదాడి చేయగల ధైర్యం వచ్చింది. ఆర్థిక సంక్షోభం మన శతృవుల ఐక్యతను విచ్ఛిన్నం చేస్తున్నది. పదిసంవత్సరాల పూర్వం యీ సామ్రాజ్యవాద శక్తులన్నీ ప్రపంచ సోషలిస్టు వ్యవస్థపై ఐకమత్యంతో పోరాడాయి. దేశంలో కాంగ్రెసు ఐక్యతతో కార్మికవర్గంపై దాడి చేసింది. కాని ఆ ఐక్యత 1967కు కాంగ్రెసులో నశించింది. అభివృద్ధిచెందుతున్న కార్మిక, రైతాంగ పోరాటాలే యీ పరిణామాలకు మూలస్థంబాలయ్యాయి. ఈ పరిస్థితులలో ప్రభుత్వం, పెట్టుబడిదారివర్గాలు, సంస్కరణవాదులు కమ్యూనిస్టులపై దాడి చేస్తున్నారనే వైఖరిని సి.పి.ఐ(యం) చేబట్టింది. ఈ అవగాహన ప్రాతిపదికపై తన వ్యూహం, ఎత్తుగడలు, పోరాటవిధానాలు నిర్ణయించింది. ఆర్థిక, రాజకీయ సంక్షోబాలు తీవ్రతరమగుటతో వర్గపోరాటాలు రోజురోజుకు అభివృద్ధి చెందసాగాయి. లాఠీచార్జీలు, జైళ్ళనిర్బంధాలు పోలీసు దౌర్జన్యాలు యెక్కువగుటయేగాక, కలకత్తా సందు, గొందులలో కత్తిపోట్లు, గూండాచర్యలు గూడ వర్గపోరాటారూపాలుగ మారాయి. కేరళలో గూడ యిదే పునరావృతం కాసాగింది.

"గత నాలుగు సంవత్సరాలుగ క్రమేణా వారు "ఎ.ఐ.టి.యు.సి."లోని డాంగేవర్గం విద్రోహచర్యలు సాగించారు. బెంగాల్ కేరళలలో కార్మికవర్గం యితరశక్తులతో కలసి కాంగ్రెసు వ్యతిరేక ఐక్యసంఘటను యేర్పరచుటకు బదులు, అవతలిపక్షానికి, వెళ్ళి ఐక్యసంఘటనలను విచ్ఛిన్నం చేసి, కార్మిక కర్షకులపై నిర్బంధకాండను సాగించే మంత్రి వర్గాలను యేర్పరచారు. "ఎ.ఐ.టి.యు.సి."లోని నాయకత్వపార్టీ చర్యలకు వ్యతిరేకంగా

---

*1. రణదివె, బి.టి. (1990) ఆన్ ట్రేడు యూనియన్ మూమెంటు. వాల్యూం 1. రిజల్యూషన్సు ఆఫ్ గోవా కన్వెన్షన్. ఎ.సి.టు పబ్లికేషన్ పే. 8*

*2. -- అదే --- పే.9.*

ప్రతిఘటన ప్రారంభమైంది. వారి రాజకీయపంధా, కార్మికసంఘాలను విచ్ఛిన్నం చేసే పందా విఫలమైంది. వారు కాంగ్రెసుతో చేతుల కలుపు వరకు వెళ్లింది. మేము ప్రజాస్వామ్యవిధానాలను అనుసరించమని కోరాము. కాంగ్రెసు ప్రభుత్వంతో సహకరించే విధానాలను అనుసరించమని కోరాము, కాంగ్రెసు ప్రభుత్వంతో, సహకరించే విధానాన్ని విమర్శించాము. వారు కార్మికుల సమ్మెలను వ్యతిరేకించుటయేకాక, సమ్మెల వ్యతిరేక బిల్లులకు మద్దతుకూడా ఇచ్చారు. సంక్షోభకాలంలో లక్షలకొలది ప్రజాసామాన్యానికి నాయకత్వం వహించవలసిన కార్మిక సంఘాల నాయకత్వం విద్రోహచర్యలకు పాల్పడుట, ఎంతటి ప్రమాదకరము"[1]

"మేము నూతన పంధాలో నూతన సంస్థను యేర్పాటు చేస్తున్నాము. మేము ట్రేడు యూనియను ఉధ్యమానికి నూతన దృక్పధాన్ని యివ్వదలచాము. అందుకు పాత అవగాహనలను, పాత ఆచరణను విడనాడుట వలన మాత్రమే, అందరి సంస్కరణవాద పంధాలపై సరియైన నిర్దిష్ట పోరాటాన్ని సాగించగలము. ఏమిటి మాపోరాటం? మాపోరాటం అంటే కార్మికవర్గ ఐక్యతకై, కార్మికోధ్యమ ఐక్యతకై జరిగే పోరాటం. ఆ ఐక్యత కార్మికుల అందరి మధ్య విస్తరిస్తుంది. మీరు పరిశీలించితే కార్మికవర్గంలో అత్యధిక భాగం యింకా "ఐ.యన్.టి.యు.సి." లోగాని, "హెచ్.యం.యస్."లోగాని "ఎ.ఐ.టి.యు.సి."లోగాని, మరే టి.యు.లోగాని సమీకరించబడలేదని, అసంఘటితంగానే వున్నారని స్పష్టమగుతుంది. ఏఅఖిల భారత కార్మిక సంస్థలలో అనుబందంగా చేరని కార్మికులు 1968లో సమ్మెలలో పాల్గొన్న కారణంగా 40శాతం పనిదినాలు వివిధ పరిశ్రమలు మొత్తంగా కోల్పోయాయని తెలుస్తుంది. అసంఘటితంగా వున్న యీ 40శాతం కార్మికవర్గాన్ని నిర్మాణాలలో సమీకరించందే కార్మికవర్గ ఐక్యతకు అర్థం లేదు.[2]

"ఐక్యసంఘటన రాష్ట్ర ప్రభుత్వాలు అనేకరాయితీలను కార్మికవర్గానికి బడుగువర్గాలకు, ప్రజలకు యిచ్చాయి. వాటి అర్ధమేమిటి? దేశంలోని ప్రజాస్వామ్య శక్తులతో కార్మికవర్గం మిత్రత్వాన్ని నెరపునపుడు, కాంగ్రెసును వోడించాలనే సర్వప్రజానీక లక్ష్యమైనపుడు, అనేక ఆర్థికలక్ష్యాలలోని విజయాన్ని సాధిస్తుంది. ఇది పశ్చిమబెంగాలులో అందరికి అనుభవమైనప్పటికి, బొంబాయి తదితర రాష్ట్రాలకు యీ అనుభవం యింకాలేదు. ట్రేడు యూనియనోధ్యమం, వొక్క ఆర్థిక సమస్యలకు మాత్రమే పరిమితం కాకుండా నేటిపాలక వర్గాలపై ప్రజలు సాగించే పోరాటాలలో తాము భాగస్వాములమనే దృక్పదాన్ని చేబట్టి, తనవంతు పోరాటపాత్ర నిర్వహించితే, వొక్క ప్రజాస్వామ్య శక్తులు మాత్రమే బలపడక, కార్మికవర్గపు ఆర్థిక కోర్కెలకై జరిపే కార్మికోధ్యమ పోరాటాలు బలవత్తరమైనవి అగుతాయి. ఈ చిన్న సత్యాన్ని లక్షోపలక్షల ప్రజాసామాన్యం అర్థం చేసుకొన్నపుడు, ప్రభుత్వం వారిపైదాడి జరిపినపుడు వెంటనే అర్థం చేసుకొనగలరు. ఎందువలన, కార్మికవర్గం ప్రజాసామాన్యపు ఐక్యత పెంపొంది వుండుటవలన, దీనికి ఎవరు భయపడుతారు?

---

*1. రణదివె, బి.టి. (1990) ఆన్ ట్రేడు యూనియన్ మూమెంటు. వాల్యూం 1. రిజల్యూషన్సు ఆఫ్ గోవా కన్వెన్షన్, ఎ.సి.టు పబ్లికేషన్ పే. 12*

*2. రణదివె, బి.టి. (1990) ఆన్ ట్రేడు యూనియన్ మూమెంటు. వాల్యూం 1. రిజల్యూషన్సు ఆఫ్ గోవా కన్వెన్షన్, ఎ.సి.టు పబ్లికేషన్ పే. 13-14.*

పెట్టుబడిదారులు, కాంగ్రెసు మాత్రమే గాక, డాంగేలాంటి మనపాతమిత్రులు, ఐక్యసంఘటనలకు విద్రోహం చేసినవారు, వొకసారి కార్మికవర్గ ప్రజాసామాన్యం పోరాటాలలో విజృంభించి, పురోగమించితే వారు, చివరకు ఎక్కడకు వెళ్ళుతారోనని భయపడుతారు. వారి స్వార్థప్రయోజనాలు దెబ్బతింటాయి. పాతపద్ధతులలోనే మన కార్మికోధ్యమం, పాత సిద్ధాంతాలతోనేవారి ఆర్థికపోరాటాలు కొనసాగించినెంచితే పెద్దపొరపాటు చేసినదగుతుంది. ప్రజాస్వామ్యశక్తులకు దూరంగా వుండి,ఆర్థిక పోరాటాలు కొనసాగించ తలచుట పొరపాటు, చైతన్యవంతమైన వారి మద్దతును పొందగలగాలి. వర్గపోరాటం సహజంగానే భయంకరమైన పోరాటం. కార్మికవర్గం వొక్కటే ఆ పోరాటాన్ని సాగించలేదు. ప్రజాస్వామ్యశక్తులలో శక్తివంతమైన మిత్రులు దానికి వుండాలి. కార్మికవర్గానికి మళ్లీ మళ్ళీ గుర్తుచేయవలసిన గుణపాఠమిదే, యీదృక్పధమే వారిని సాయుధులను చేస్తుంది.[1]

## కార్మికవర్గ ఐక్యకార్యాచరణపై "సిటు" అవగాహన

"సిటు" ప్రారంభమహాసభలో ప్రవేశపెట్టబడిన "కార్మికవర్గ ఐక్యకార్యాచరణపై" తీర్మానంలోని ముఖ్యాంశాలు అధ్యయనం చేద్దాము.

కార్మికవర్గం గతనాలుగు సంవత్సరాలుగ దుర్భర పరిస్థితులకు గురైందని, అనేక సుదీర్ఘ పోరాటాలు ద్వారా పొందిన వేతన పెంపుదల ద్రవ్యోల్బణము, అధికధరలతో వమ్ము చేయబడేవిధంగా, జాతీయ ప్రణాళిక రూపొందించబడిందని తీర్మానము పేర్కొన్నది. నిజవేతనాలు 1965కే రెండవ ప్రపంచయుద్ధ పూర్వపు బ్రిటిష్‌పాలన నాటి స్థాయికి దిగజార్చబడినవని స్పష్టం చేసింది.

జాతీయ ఆర్థిక విధానం, అమెరికా అప్పు సహాయంపై ఆధారపడుటతో, విదేశాలకు అప్పులవడ్డీలు, తదితరాలకై ప్రతి సంవత్సరం 375కోట్ల రూపాయలు చెల్లించవలసిన పరిస్థితి యేర్పడింది. అమెరికను ఆయిలు కంపెనీలు ప్రప్రథమంగా "ఆటోమాషన్" ప్రవేశపెట్టి నిరుద్యోగాన్ని, ప్రజలదుస్థితిని పెంచారు. విదేశ గుత్తపెట్టుబడిదారులపై ఆధారపడిన దేశపెట్టుబడిదారి పంధాలో దేశ ఆర్థిక విధానం అమలు జరుగుటతో ఆర్థిక సంక్షోభం యేర్పడి దుర్భర పరిస్థితి యేర్పడింది. దాని నుండి బయటపడుటకు పాలకవర్గాలు కార్మిక, బడుగు, తదితర మధ్యతరగతి వర్గాలపై తీవ్రమైనదాడులు ప్రారంభించారు. ఈ దాడి కార్మికులను వుద్యోగాలనుండి తొలగించుట, ఫ్యాక్టరీలు మూసివేయుట, పనిని యెక్కువ చేయుట ప్రత్యక్ష పరోక్షవేతనాల తగ్గింపు, రాయితీలను వుపసంహరించుట ద్వారా జరిగింది. ధరలు పెరిగిపోవుటతో నిజవేతనం తగ్గిపోవుట జరిగింది.[2]

అనేక ప్రాంతాలలో కార్మికవర్గం ఐక్యత పెంపొందించుకొని, రాజకీయపార్టీల నాయకత్వాలలో వున్నప్పటికి అన్ని కార్మిక సంఘాలను ఐక్యకార్యాచరణలో భాగస్వాములను

*1. రణదివె, బి.టి. (1990) ఆన్ ట్రేడు యూనియన్ మూమెంటు. వాల్యూం 1. రిజల్యూషన్సు, గోవా కన్వెన్షన్, ఎ సి పబ్లికేషన్ పే.22.*

*2. రణదివె, బి.టి. (1970) ఆన్ యునైటెడ్ యాక్షన్ ఆఫ్ ది వర్కింగ్‌క్లాస్ ఆన్ ట్రేడు యూనియన్ మూమెంటు. వాల్యూం 1. ఎ సి.టు పబ్లికేషన్ పే.25.*

చేయుటతో ప్రతిపక్షంగా రూపొందారు. ఐక్యటెక్స్టైల్స్ సమ్మెలు మధురై, కోయంబత్తూరులలో జరిగాయి. ఇవి కార్మికవర్గంలో ఐక్యత అవసరాన్ని ప్రత్యక్షంగా ముందుకు తెచ్చాయి. ఈవిధంగా 1966లోనే ప్రారంభమైన ఐక్యకార్యాచరణ వాంఛ 1967 ఎన్నికలలో, 1969 మధ్యంతర ఎన్నికలలో బలమైనదై కాంగ్రెసు ప్రభుత్వానికి వ్యతిరేకంగా, యితర ప్రజాస్వామ్య పక్షాలతో కలసి, కాంగ్రెసును వోడించి, కేరళ, పశ్చిమబెంగాలులో గణనీయమైన విజయాలను సాధించింది.

"ఐక్యతా వాంఛ 1967,1969 ఎన్నికలలో బలమైనదై, తదనంతరకాలంలో పెరిగి వెల్లువైంది. కేరళ, బెంగాలులో ఐక్యసంఘటనా ప్రభుత్వాలు కార్మికుల, ప్రజల ప్రయోజనాలను కాపాడుటతో నూతన ఐక్యతా నిర్మాణ వెల్లువ ప్రారంభమైంది." అంతేగాక, "జూట్, తేయాకు, టెక్స్టైల్స్ పరిశ్రమలలో ఐక్యకార్యాచరణ, సమ్మె పోరాటాలలో "ఐ.యన్.టి.యు.సి.తో సహా అన్ని యూనియనులు కలసి పోరాడాయి. చెప్పుకొనదగిన విజయాలు లభించాయి. పశ్చిమబెంగాల్ యునైటెడ్ ఇంజనీరింగు కార్మికుల సమ్మె విజయమగుటతో గణనీయమైన, వేతన పెంపును సాధించారు. కేరళలో అనేకరాయితీలను కార్మికవర్గం పొందింది."[1]

ప్రధానంగా తక్షణ సమస్యలు, కోర్కెలపై పోరాటాలద్వారా రాయితీలను పొందుటకు ఐక్యకార్యాచరణ అవసరాన్ని గుర్తించిన రాజకీయ శక్తులు వివిధ కార్మిక సంఘాల ఐక్యత యొక్క రాజకీయ ప్రాముఖ్యత అవసరం అందరి కనువిప్పుకాసాగింది. ఇతర రాష్ట్రాలలో కార్మికులు, ఉద్యోగులు ఐక్యమయ్యే ప్రయత్నాలు ద్వారా ప్రజాఐక్యత నిర్మించి, ప్రజలపై ప్రభుత్వదాడిని ప్రతిఘటించే ఉన్నతదశకు కొనపోయే రాజకీయ అవగాహన ముఖ్యవామపక్ష పార్టీలలో కొరవడిన కారణంగా, వాస్తవంగా ప్రజలు పోరాడే పరిస్థితులు ఉన్నప్పటికి, పోరాట వెల్లువ పరిస్థితులున్నప్పటికి ప్రజోధ్యమాలు పురోగమించజాలక, సమసిపోయాయి.

కార్మికవర్గం, మతదురహంకారశక్తులు మైనారిటి వర్గాలపై జరిగే హింసాదౌర్జన్యాలను ఎదుర్కొనవలసివుంది. కార్మికవర్గంలో కుల,మత భాషా తత్వాలను రెచ్చగొట్టి కార్మికవర్గ ఐక్యతను విచ్ఛిన్నం చేసే శివసేనలాంటి దుష్టశక్తుల ఆటకట్టించందే, కార్మిక ప్రయోజనాలు పూర్తిగా సంరక్షింపబడజాలవనే వాస్తవికతను బడుగువర్గాలలో కలిగించి, సమీకరించాలి.

"పాలక వర్గాలు కార్మిక, బడుగు వర్గాలను, ఐక్యసంఘటనా ప్రభుత్వాలకు, మంత్రివర్గాలకు బలాన్ని చేకూర్చుతున్నశక్తులను, కాంగ్రెసు వ్యతిరేకశక్తులను చీల్చుటలో తాత్కాలికంగా విజయాన్ని సాధించారు. దీనిని సంస్కరణవాదుల ద్వారా సాధించారు. ఐ.యన్.టి.యు.సి. నాయకత్వంవలెనె "ఎ.ఐ.టి.యు.సి." పై ఆధిక్యతగల నాయకత్వం (సి.పి.ఐ) కాంగ్రెసు ప్రభుత్వపు అనధికారశాఖగా పనిచేస్తూ, కార్మికవర్గపు హక్కులు అణచివేయబడుటకు సహాయపడుతు, కార్మికవర్గపు సమిష్టి పోరాటానికి విఘ్నం కలుగజేస్తున్నారు.

తక్షణ సమస్యలదైనందిన పోరాటాలకు, ప్రజల రాజకీయ ఐక్యసంఘటనను మరింత

---

*1. రణదివె. బి.టి. (1970) ఆన్ యునైటెడ్ యాక్షన్ ఆఫ్ ది వర్కింగ్‌క్లాస్ ఆన్ ట్రేడు యూనియన్ మూమెంటు. వాల్యూం 1. ఎ సి.టు పబ్లికేషన్ పే.26.*

శక్తివంతంచేయుటకు, వర్గపోరాటాల విజయానికి కార్మికవర్గ ఐక్యత అవసరం, ప్రాణప్రదము అయినది. దానిని రూపొందించి, కాపాడు కొనాలి. అంతర్గత విచ్ఛిన్నత, ప్రభుత్వ నిర్ధాక్షిణ్యదాడిని వ్యతిరేకించి కార్మికవర్గం పోరాడవలసివున్నది.

"ఈ కాన్ఫరెన్సు అన్ని పరిశ్రమలలోని కార్మికులకు, అన్ని కేంద్రకార్మిక సంఘాలకు సమిష్టి పోరాటాలకు, ఐక్యకార్యాచరణలకు మార్గదర్శికత్వం వహించి పోరాడుతుందని ప్రతిన చేస్తున్నది. వివిధ ఫ్యాక్టరీలలోని వివిధ యూనియనుల కార్మికులను సమిష్టి ప్రయోజనాల రక్షణకై ఐక్యమై పోరాడండని పిలునిస్తున్నది.[1]

# 5

# అఖిల భారత కిసాన్ సభలో చీలికలు

అఖిల భారత రైతాంగపు ప్రజాసంఘం, 1936లో అఖిల భారత కిసాన్ సభగా యేర్పడింది. ఏరాజకీయసిద్ధాంతాలనువిశ్వసించేవారైనా, కిసాన్‌సభ ఆశయాలను, నిర్మాణ సూత్రాలను ఆమోదించి పనిచేయువారు సభ్యులుగా, సభ్యులు ఎన్నుకొనిన సభాభాద్యులుగా భాద్యతలను సీకరించవచ్చును, మెజారిటీ నిర్ణయాల ప్రకారం పనిచేయవచ్చును. బయట తమపార్టీ లేక స్వతంత్రవేదికలపై తమతమ రాజకీయ అభిప్రాయాలను ప్రచారం చేసుకొనే స్వతంత్ర్యం, హక్కు కలిగివుంటారు. అఖిలభారతకిసాన్‌సభ (ఎ.ఐ.కె.యస్) సి.పి.ఐ(యం) మెజారిటి నాయకత్వం అధ్వర్యంలో వుంది, అఖిల భారత ట్రేడు యూనియన్ కాంగ్రెసు (ఎ.ఐ.టి.యు.సి) అదేవిధంగా సి.పి.ఐ నాయకత్వంలో వుంది. ఎ.ఐ.టి.యు.సి.లో వలెనె కిసాన్ సభలో సి.పి.ఐ.,సి.పి.ఐ(యం)లు నాయకత్వ ఆధిక్యతను సంపాదించుట కొరకు అంతర్యుద్ధాన్నే సాగించుతున్నారు. ఈ సందర్భంలో గతంలో రాజకీయ అభిప్రాయాల కారణంగా వచ్చిన ఒకటి, రెండు చీలికల గురించి క్లుప్తంగా తెలుసుకొంటే, కమ్యూనిస్టులు ప్రజాసంఘాలలో పనిచేయు విధానాలపై సమగ్ర అవగాహన యేర్పడగలదు.

## కిసాన్ సభలో కమ్యూనిస్టు - కాంగ్రెసుల మధ్య భేదాభిప్రాయాలు

జాతీయ కాంగ్రెసు అగ్రనాయకత్వం ముఖ్యంగా గాంధీ అనుచరులు కిసాన్ సభ యెడల ప్రారంభం నుండి సదభిప్రాయంతో సహకరించలేదు. వామపక్ష సానుభూతి గల జవహర్‌లాల్ నెహ్రూ, సుభాష్‌చంద్రబోస్, నారిమన్‌లు, సహకార, సహాయాలను మొదటినుండి చూపారు. కిసాన్ సభ మౌలికంగా రైతాంగ ప్రయోజనాలను కాపాడుట, జమిందారుల, భూస్వాముల ప్రయోజనాలకు యేమాత్రం హాని తలపెట్టరాదనే కాంగ్రెసు జాతీయ నాయకుల మధ్య సహజంగానే అభిప్రాయభేదాలు వచ్చుటకు అవకాశాలున్నవి. కాంగ్రెసులోని కొందరి అభిప్రాయాలు, వామపక్ష అభిప్రాయాలకు దగ్గిరిగావున్నా, వారెప్పుడూ రైతాంగ ప్రయోజనాలను పట్టించుకొనలేదు. కాంగ్రెసుకు రైతాంగ బలాన్ని చేకూర్చుటకు రైతాంగంపై సానుభూతి ప్రకటనలు వెలువడుతుండేవి.

కాంగ్రెసు వామపక్షవాదులు కొందరు కిసాన్ సభకు వ్యతిరేకులు కారు, రైతాంగ ప్రయోజనాలపై లిబరలు వైఖరి, సానుభూతి కలిగియుండిన అది బ్రిటిష్‌వారిపై వారు చేయు రాజకీయ వొత్తిడికి బలం చేకూరుతుందని, వొక ఎత్తుగడగా నెంచారు.

బీహారులో "బకాష్ట్" రైతాంగ పోరాటం, వర్గపోరాట రూపమగుట భూస్వాముల దోపిడి, దౌర్జన్యాలకు వ్యతిరేకంగా ప్రజావుద్యమంగా అభివృద్ధి చెందుట, 1937 ఎన్నికల అనంతరం రాష్ట్ర పాలనాదికారాలను చేబట్టిన కాంగ్రెసు నాయకత్వం, తమ వర్గ ప్రయోజనాలకు నిజమైన ప్రమాదం యేర్పడిందని తలచింది. కాంగ్రెసు బాబు రాజేంద్రప్రసాద్ నాయకత్వంలో యితర బడుగు వర్గాలలో అనైక్యత, చీలికలు తెచ్చుటకు

"ఖేతిహార్ మజ్దూర్ యూనియన్" అనే వ్యవసాయ రైతుకూలి సంఘాన్ని పోటీగా యేర్పరచారు. కాని అంతగా పురోగమించజాలక పోయారు.

## కిసాన్ సభలో ఆచార్య రంగా విచ్ఛిన్నకర పాత్ర

ఆచార్య రంగా ప్రధానంగా కృష్ణానది పరివాహక ప్రాంత జిల్లాలలో ధనిక, మధ్యతరగతుల రైతాంగాన్ని వారితక్షణ సమస్యలపై సమీకరించి, బలమైన రైతుసంఘం నిర్మించారు. మార్చి 18, 1944లో విజయవాడలో జరిగిన అఖిలభారతకిసాన్ సభ అనంతరం మాతృకిసాన్ సభతో విభేధించి, మహాసభకాలంలో పోటీ కిసాన్ సభను ఏర్పాటు చేసారు. మహాసభను భగ్నం చేయాలనుకొన్నవారి ఆశలు అడియాశలై గొప్పగా విజయవంతమైంది. ఆంధ్రరైతాంగంలో నూతనోత్సాహాన్ని తెచ్చి కిసాన్ సభ మరింత బలమైనదిగా రూపొందుటకు ఆమహాసభ తోడ్పడింది.

అఖిల భారత కిసాన్ సభ, కేంద్రకిసాన్ కౌన్సిలు డిశెంబరు 1944లో స్వామి సహజానందసరస్వతి అధ్యక్షులు, బంకింముఖర్జీ జనరలు శెక్రటరీల సాధ్యంలో సమావేశమైనపుడు యన్.జి.రంగా అనుచరులు కొందరు అఖిలభారత కిసాన్ కాంగ్రెసును యేర్పరచామని, దానికేంద్రకార్యాలయము ఆయన స్వగ్రామంలో యేర్పరచబడిందని ప్రకటించారు. పైగా, ఆసంస్థ 1936 డిశెంబరులో ఫెయిజ్‌పూర్‌లో ప్రారంభించబడిందని పత్రికా ప్రకటనగావించి, రైతాంగంలో గందరగోళాన్ని సృష్టించ ప్రయత్నించారు. అంతేగాక కాంగ్రెసు సోషలిస్టుపార్టీ, పార్వర్డుబ్లాకు బీహారులో మరోపోటీ కిసాన్ సభను ప్రారంభించ తలపెట్టామని ప్రకటించారు. బాంబే కాంగ్రెసు వాదులు 1944 అక్టోబరులో సమావేశమైనపుడు రైతాంగంలో పనిచేయాలని నిర్ణయించారని, పోటీ కిసాన్ సభను పెట్టబోతున్నారని ప్రకటించుతు, దానిని వొకవైపున ఆహ్వానించుతు కిసాన్ కాంగ్రెసు సంస్థవుండగా మరోపోటీ సంస్థను సహించజాలమని. అంతేగాక జనరల్ సెక్రెటరీ బెంగాల్‌లోని ఢక్కా కుల్నా కిసాన్ సభలు "ఎ.ఐ.కె.యన్." ముస్లింల స్వయం నిర్ణయాధి కారాన్ని గుర్తించుతూ తీర్మానించాలని, కేంద్రకిసాన్ కౌన్సిలుకు ప్రతిపాదించాయి.[1]

## ప్రపంచయుద్ధం, కిసాన్ సభలో భేదాభిప్రాయాలు.

ఆగస్టు "క్విట్ ఇండియా" స్వాతంత్ర్యపోరాటంలో కిసాన్ సభ కమ్యూనిస్టుల నాయకత్వంలో వున్న కారణంగా హృదయపూర్వకంగా పాల్గొనలేదని జాతీయ కాంగ్రెసు, కాంగ్రెసు సోషలిస్టు వర్గాలు పోటీ కిసాన్ కాంగ్రెసును యేర్పాటు చేయసాగారు.

బూర్జువా, భూస్వామ్యవర్గాలు జాతీయ కాంగ్రెసులో నాయకత్వపాత్ర గలిగియున్నందున, కిసాన్‌సభ చేబట్టే రైతాంగ సమస్యలపై పోరాటాలు సహజంగానే వారి వర్గ ప్రయోజనాలకు వ్యతిరేకమైనందున కమ్యూనిస్టు వ్యతిరేకతను రెచ్చగొట్టి చీల్చే ప్రయత్నాలు సాగించారు. మరోవైపున భూస్వామ్య, మతతత్వశక్తులు, సామ్రాజ్యవాద, పెట్టుబడిదారి వర్గాల ప్రభావం అత్యధికంగా వున్న ముస్లింలీగు కూడ ముస్లిం రైతాంగాన్ని

---

*1. రసూల్ యం.ఎ. (1974) ఎ హిస్టరీ ఆఫ్ ది ఆల్ ఇండియా కిసాన్ సభ. నేషనల్ బుక్ ఏజన్సీ. కల్‌కోటా. పే.324-5.*

వేరుగా పోటీ కిసాన్ సభను యేర్పాటు చేయు ప్రయత్నాలను తూర్పు బెంగాలులోని కొన్ని జిల్లాలలో ప్రచారము మొదలుపెట్టింది.

బీహారులో 1942లో జరిగిన అఖిలభారతకిసాన్ మహాసభలో పాకిస్థాన్, అఖండభారతం సమస్యలపై తటస్థవిధానం చేబట్టబడింది. అంటే దేశరాజకీయాలకు, విధానాలకు అభిప్రాయభేదాలున్నప్పుడు, ఏకగ్రీవంగా ఆమోదించబడిన రైతాంగ సమస్యలపై పోరాటాలకు మాత్రమే ప్రాధాన్యత యివ్వబడింది. " అఖిభారతకిసాన్‌సభ కార్యక్రమం, విధానం, ఆచరణ విశాలప్రాతిపధికపై ఆధారపడుటయేగాక, సామ్రాజ్యవాద వ్యతిరేక, భారతస్వాతంత్ర్య ప్రియులందరిని ఆహ్వానించుతున్నది. కిసాన్ సభ యొక్క లక్ష్యం, నిర్మాణ సూత్రాలలో యిలా నొక్కి చెప్పబడింది.

"కిసాన్ సభ ఉద్దేశ్యం - లక్ష్యం, జాతీయ స్వాతంత్రోద్యమంతో కలసి భారతదేశంలో ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని స్థాపించుట."[1]

"సైనిక వ్యూహం, సామ్రాజ్యవాద రక్షణ సమస్య, బ్రిటన్, అమెరికా, రష్యా, చైనాల ఫాశిస్టు వ్యతిరేక పోరాటంతో స్వాతంత్ర్యప్రియులు స్వాతంత్ర్యానికై చేయు రాజకీయ వొత్తిడితో సంలీనం, సమన్వయం, చేయవలసివుంది.

"ఫాశిస్టు నిరంకుశ రాజ్యాలకు వ్యతిరేకంగా చెప్పలేనంత పెద్దయెత్తున విస్తృతంగా సాగే యీ యుద్ధం, స్వాతంత్ర్యం, సంక్షేమం, వారి వాస్తవ ప్రయోజనాలకై అందరి యిచ్ఛాపూర్వక సహకారాలతోనే సాగగలదు. అట్టి ప్రజాయుద్ధాన్ని రష్యా విజయవంతంగా సాగిస్తున్నది. ఈ యుద్ధం జాతీయ ప్రభుత్వనాయకత్వంలో, భారతీయ ప్రజానీయపు హృదయపూర్వక సహకారంతో, భారత ప్రజాయుద్ధంగా, సమర్థవంతంగా మార్పు చెందుతుందని" నాగపూరు కేంద్రకిసాన్ కౌన్సిలు యుద్ధం యెడల ప్రజాసంఘమైన అఖిలభారతకిసాన్‌సభ వైఖరిని స్పష్టం చేసింది. వివిధ రాజకీయ వర్గాల వారికి వారు యుద్ధం యెడల తమవైఖరిని నిర్ణయించుకొనే స్వేచ్ఛయివ్వబడింది. అయినా జాతీయ వాదులచే "విద్రోహం" అనే నిందా ప్రచారం, విమర్శలకు గురికావలసి వచ్చింది." ప్రజాసంఘాలు రాజకీయ సమస్యలపై తీవ్రభిన్నాభిప్రాయాలు కలిగియుండి, ఏకాభిప్రాయానికి రాజాలనప్పుడు, ఎట్టి నిర్ణయం చేయకుండా, వివిధ రాజకీయ పార్టీలు. తమతమ స్వంత, స్వతంత్ర వేదికలపై ప్రచారాన్ని చేసుకొను స్వాతంత్ర్యాన్ని కలిగివున్నందునే కిసాన్ సభ పునరుద్ఘాటించి ప్రజాసంఘపు ఐక్యతను, నైజాన్ని కాపాడే ప్రయత్నం చేసింది.

స్వామి సహజనంద సరస్వతి 1944 విజయవాడ అఖిల భారత కిసాన్ మహాసభ అధ్యక్షోపన్యాసంలో ముస్లింలీగు పాకిస్థాన్ కోర్కెను తీవ్రంగా విమర్శించారు. నాగపూరు కిసాన్ కౌన్సిలు 1942లో యీ సమస్యపై తటస్థవైఖరి నిర్ణయించింది. కాన, అధ్యక్షుని ఉపన్యాసం కార్యకర్తలలో అసంతృప్తిని రేకెత్తించింది. అది స్వామిజీ వ్యక్తిగత అభిప్రాయంగా నెంచబడింది. నాగపూరు నిర్ణయం కిసాన్ సభ నిర్ణయంగా కొనసాగింది.

కిసాన్ సభ అధ్యక్షుడుగా 12 డిశెంబరు 1944న కేంద్ర కిసాన్‌కౌన్సిలు

1. రసూల్ యం.ఎ. *(1974)* ఎ హిస్టరీ ఆఫ్ ది ఆల్ ఇండియా కిసాన్ సభ, నేషనల్ బుక్ ఏజన్సీ. కలకోటా. పే. *326*

సమావేశానంతరం, యుద్ధంపై కిసాన్ సభవైఖరిని కాంగ్రెసువాదుల విమర్శనకు సమాధానంగా కిసాన్ సభ కమ్యూనిస్టుల నాయకత్వంలో వారి అధీనంలో వున్నదన్న దానిని ఖండించుతు వొక పత్రికాప్రకటన, విజ్ఞప్తిని చేసారు. ప్రధానాంశాలు యిలా వున్నవి.

"కాంగ్రెసు భారతదేశంలో కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్యం కోసం కృషిచేస్తుందని, మహాత్మాగాంధి ఆమోదించుట చాలా సంతృప్తిని కలుగజేస్తున్నది. స్థానికంగాలేని భూస్వాములకు భూములుండరాదని, జమీందారీ విధానం రద్దుచేయబడాలని గాంధీజీ ఆమోదించారు. వర్గసంస్థల నిర్మాణాన్ని,కిసాన్ సభ తన ప్రత్యేక చిహ్నాన్ని, జెండాను గుర్తించి. జాతీయ జండా ప్రక్కన ఎగురవేయుటను ఆమోదించారు. మరో వైపున రైతాంగాన్ని, వ్యవసాయ కూలీలను సంఘాలుగ యేర్పరచండని కాంగ్రెసు వారికి సలహానిచ్చారు.

"బీహారులో ఆగస్టుఉద్యమం, తరువాత అధికారుల ఆగ్రహానికి గురై మా కార్యకర్తలు నిర్బంధాలు, అరెస్టులు, జైలుశిక్షలు అనిభవించారు. ఇతర రాష్ట్రలలోనూ యిదే జరిగింది. ఇది కిసాన్ సభ సామ్రాజ్యవాదుల, నాయకులు పెంపుడు బిడ్డ అనుటకు రుజువు అగుతుందా? బీహారు రాష్ట్ర కిసాన్ సభ చరిత్ర, 1929లో అది ప్రారంభించినప్పటి నుండి. అఖిల భారత కిసాన్ సభగా అనేక పోరాటాలలో నిర్బందాలు. అరెస్టులు, అర్డినెన్సులు, లాఠీచార్జీలు చవిజూసింది. కాంగ్రెసు ప్రారంభించిన అన్ని వుద్యమాలలో పాల్గొనిన, చరిత్ర కలిగి వుంది, కాంగ్రెసు వాదులే దీనికి సాక్షులు. అంచేత, అఖిలభారత కిసాన్ సభను నిందించి, నిషేదించి, నూతన సంస్థను యేర్పాటు చేయుటకు వారికెట్టి కారణాలు లేవు.

"కిసాన్ సభను కాంగ్రెసుకు అనుబంధ సంస్థగా చేయాలనే మౌలికాంశకపై, అది దీర్ఘకాల ప్రయెనాలకు నష్టం. ఇతర పార్టీలు, గ్రూపులు. కాంగ్రెసు రాజకీయాలు ఆమోదించని వారు, పోటీకిసాన్ సభను యోర్పాటు చేయుటకు అవకాశాన్నీ, ప్రోత్సాహాన్ని కలుగజేసాము. ఒకేవొక బలమైన కిసాన్ సభకు మారుగ, విచ్చిన్నత ప్రాతిపదిక, గందగగోళం రూపొందుతుంది. ఇది స్వాతంత్ర్యం లక్ష్యానికి చేటు అగుతుందని స్వామిజీ వివరించారు.[1]

" ఈ సంధర్బంలో బీహారు, యు.పి.లలోని అగ్రశ్రేణి నాయకులు కొందరు, వ్యక్తిగతంగా పోటీ కిసాన్ సభను యేర్పరచుటకు వ్యతిరేకులమని, అంతేగాక, కిసాన్ సభను కాంగ్రెసుకు అనుబంధం చేయుటకు వ్యతిరేకులు. కాంగ్రెసువాదులు మూకుమ్మడిగా కిసాన్ సభలో చేరితే వారి లక్ష్యం మరొక కిసాన్సభన స్థాపించకుండానే, కాంగ్రెసుకు అనుబంంధం చేయకుండానే నెరవేరదగలదని ఆశిస్తున్నానన్నారు స్వామిజీ.

" అన్ని భయాలను తొలగించుటకు, యేరాజకీయ పార్టీ తమ రాజకీయ విధానాలను ఎవరిపైనా రుద్దకుండా, జాతీయ కాంగ్రెసువాదులు కిసాన్ సభలో చేరుటకు వీలుగా, సభా నిర్మాణసూత్రాలలో యే రాజకీయతీర్మానమైనా నాలుగింట మూడువంతులు మెజారిటీచే ఆమోదించబడాలనే సవరణ చేయగలమన్నారు.

---

1. *రసూల్ యం.ఎ. (1974)* ఎ హిస్టరీ ఆఫ్ ది ఆల్ ఇండియా కిసాన్ సభ, నేషనల్ బుక్ ఏజన్సీ. కల్‌కోటా. పే. *327*

"అదేవిధంగా, గ్రామం లేక కొన్నిగ్రామాలు కలసియేర్పాటు చేసుకొన్న ప్రాధమిక లేక స్వతంత్ర కిసాన్ సభలు నేరుగా యే తాలూకా, జిల్లా, రాష్ట్ర కిసాన్ సభలకు అనుబంధ సంస్థలు కాకుండానే నేరుగా అఖిల భారతకిసాన్ సభలో ప్రాతినిధ్యం కలుగచేయు సవరణలు చేయగలమన్నారు.

" ఈవిధానం ప్రతిపార్టీ, గ్రూపు యొక్క వాస్తవిక బలాన్ని అఖిలభారత కిసాన్ సభలో ప్రతిబింబించుతుంది. అన్ని వున్నత కమిటీలలో తగిన ప్రాతినిధ్యం వుంటుంది. ఆవిధంగా చురుకుగా, నిజాయితిగా పనిచేసేవారే అధికృత కలిగియుండుట జరుగుతుంది.

" కాన, అన్ని రాజకీయపార్టీలకు, గ్రూపులకు, ప్రత్యేకంగా కాంగ్రెసువాదులకు కిసాన్‌సభలో చేరి పనిచేయువలసిందిగా నేను విజ్ఞప్తి చేయ సాహసించుతున్నాను. రైతాంగానికి కష్టదినాలైన యీ రోజులలో ఆచరణ కార్యక్రమాలతో రైతులకు సేవ చేయువలసిందిగా, ప్రజావుధ్యమంగా బలవత్తరం చేయువలసిందిగా, దేశ స్వాతంత్ర్యపోరాటంలో రైతాంగం తనవంతు చారిత్రిక కర్తవ్యాన్ని నిర్వహించునట్లుగా చేయకోరుతున్నానన్నారు.[1]

## ఆంధ్ర రాష్ట్ర కిసాన్ సభపై స్వామి సహజానంద సరస్వతి క్రమశిక్షణా చర్య

జనవరి 1944లో కేంద్ర కిసాన్ కౌన్సిలు సమావేశం పాట్నాలో జరుగునపుడు స్వామి సహజానంద సరస్వతి, ఆంధ్ర రాష్ట్ర కిసాన్ సభపై తనకు అధ్యక్షునిగా నిర్మాణ నిబంధనల ప్రకారం అధికారం లేనప్పటికి, క్రమశిక్షణా చర్యలు తీసుకొన్నారు. అయితే పాట్నా కేంద్ర కిసాన్ కౌన్సిలు అధ్యక్షుని యీ చర్యను ఆమోదించలేదు. కారణం, తీసుకొన్న చర్యకు ఆధారాలు లేవు. అధ్యక్షుని యేమాత్రం కించపరచకుండా సమస్యను తేలికగా పరిష్కరించింది. మార్చి 1944 అఖిల భారత కిసాన్ మహాసభకు అధ్యక్షునిగా స్వామిజీని బంకింముఖర్జీ ఆహ్వానించినపుడు స్వామిజీ అంత ఉత్సాహం కనపరచలేదు. విజయవాడలో యీ నిరుత్సాహం కొంత వ్యక్తమైనా, సహచరులు సానుభూతితో వ్యవహరించి పరిస్థితిని మెరుగు పరచారు. కలకత్తా కేంద్ర కిసాన్ కౌన్సిలు డిశెంబరు 1944 సమావేశం వరకు సత్సంబంధాలు కొనసాగినా, తనకు తానే 12 డిశెంబరు 1944న పత్రికా విలేఖరుల సమావేశంలో కిసాన్ సభ వ్యతిరేక ప్రచారాన్ని, కమ్యూనిస్టు నాయకత్వంలో, ఆధీనంలో ఉన్నదనే ప్రచారాన్ని ఆపివేయవలసిందిగా విజ్ఞప్తి చేసారు.

దురదృష్టకరంగా, అసంతృప్తికి రెండు మాసాల తరువాత గుర్రై, అదే రకపు ప్రచారానికి దిగారు. ఫిబ్రవరి 1945 మధ్యకు అఖిలభారత కిసాన్ సభతో తన సంబంధాలు మనస్తాపదశకు, తన సహచరులకు తెలియని కారణాల వలన చేరాయని, బంకింముఖర్జీ, గోపాల్ హల్దార్‌లు బిహ్టా వెళ్ళి స్వామిజితో దీర్ఘసంభాషణలు సాగించినా పరిస్థితులు మెరుగుపడలేదు. స్వామిజీ అధ్యక్షుడుగా 27 ఫిబ్రవరి 1945న శెక్రటరీ బంకిం ముఖర్జీని, బొంభాయిలోని కేంద్ర ఆఫీసుని దాని భాద్యుడు యం.ఎ. రసూల్‌ని సస్పెండు చేస్తూ ఆశ్చర్యకరమైన వొక పత్రికా ప్రకటనచేసారు. బెంగాల్ కిసాన్ సభ, కుల్నా, ఢక్కా జిల్లా

---

*1. రసూల్, యం.ఎ(1974) ఎ హిస్టరీ ఆఫ్ ది ఆల్ ఇండియా కిసాన్ సభ. నేషనల్ బుక్ ఏజన్సీ. కలకత్తా. పే. 328*

కిసాన్ సభ కమిటీలు, కేంద్ర కిసాన్ కౌన్సిలు. తటస్థత తీర్మానాన్ని విడనాడి, దానికి వ్యతిరేకంగా పాకిస్తాన్ అనుకూల ప్రచారం చేస్తున్నవని ప్రకటించారు.

విజయవాడ మహాసభ అనంతరం అనేక పత్రికా ప్రకటనలు, వాటిని ఖండించు ప్రకటనలు, తదనంతరం నేత్రకోన మహాసభవరకు చేస్తూ వచ్చారు. కిసాన్‌సభ నిర్మాణ నిబందనల ప్రకారం అన్ని శాఖలు తమ నివేదికలను కేంద్ర ఆఫీసుకు, కార్యదర్శికి గాక తనకు మాత్రమే పంపాలని కొక సర్క్యులర్ పంపుతూ దానిని పత్రికా ప్రకటనకు విడుదల చేసారు. ఈవిధంగా జనరలు శెక్రటరీ, ఆఫీసు శెక్రటరీ అధికారాలను స్వతం చేసుకొన్నారు. అంతేగాక, ఏప్రిల్ 1945లో నేత్రకోనలో జరుగనున్న అఖిలభారతకిసాన్ మహాసభకు ప్రతినిధులు హాజరై దానిని బలపరచరాదని 25 మార్చి 1945న వొక పత్రికా ప్రకటనను విడుదల చేసారు.[1]

## కేంద్ర కిసాన్ కౌన్సిలు ప్రతి స్పందన

స్వామి సహజానంద సరస్వతి 27 ఫిబ్రవరి 1945న చేసిన పత్రికా ప్రకటన వెంటనే కిసాన్ కౌన్సిల్ 9 మార్చి 1945న జనరల్ సెక్రెటరీ పిలుపున సమావేశమై చర్చించింది. స్వామిజి సమావేశానికి హాజరుకాలేదు. ఉపాధ్యక్షుడైన కార్యానంద శర్మ అధ్యక్షతవహించారు. కౌన్సిలు పరిస్థితి చర్చించి చేసిన నిర్ణయాలు ఇలా ఉన్నవి.

స్వామి సహజానంద సరస్వతి మొదటి ప్రకటనలో జనరల్ శెక్రటరీని సస్పెందు చేసి, ఆభాధ్యతలను తానే స్వీకరించారు. బెంగాల్ రాష్ట్ర కిసాన్ సభను సస్పెందు చేసారు. రెండవ ప్రకటనలో అధ్యక్షపదవికి తానే రాజీనామా చేసినట్లు ప్రకటించి, రోజు వారి కార్యక్రమాలు యెవ్వరూ చేబట్టే వీలు లేకుండా చేసి, కిసాన్ సభకు విఘ్నం కలిగించారు. కిసాన్ సభ భాధ్యులు యీ విధంగా రద్దు చేయ ప్రయత్నించుటకు కౌన్సిలు విచారిస్తున్నామన్నది.

"స్వామిజీకి క్రమశిక్షణా చర్యలు తీసుకొను అధికారమివ్వబడలేదని, వొక్క కేంద్రకిసాన్‌సభ కౌన్సిలుకే అట్టి అధికారం వుంది. జనరలు శెక్రటరీ బిహ్టావెళ్ళి స్వామిజీతో చర్చించి, కేంద్ర కిసాన్ కౌన్సిలు సమావేశాన్ని పిలుస్తానని చెప్పివచ్చారు. జనరలు శెక్రటరీ వెళ్ళిన వెంటనే, స్వామిజీ క్రమశిక్షణా చర్యలను పత్రికలో ప్రకటించారు. గతంలో స్వామిజీ జనరలు శెక్రటరీగా ఆంధ్ర కిసాన్‌సభపై క్రమశిక్షణా చర్యను తీసుకొనుట, కౌన్సిలు ఆమోదముద్రవేయకుండుట జరిగింది. స్వామిజీ క్రమశిక్షణా చర్యలు తీసుకొనుట తానుయే పదవిలోవున్నా, తనకుగల ప్రత్యేకాధికారంగా తలచుచున్నట్లు కన్పదుతున్నది.

"ఏ ప్రజాస్వామ్య సంస్థలోనైనా విధానంలో మార్పుకోరుతు, ప్రతిపాదనలు పంపే హక్కువుంది. అందుకువారు క్రమశిక్షణా చర్యలకు గురి కారు. ఈ సమస్యలన్నిటిని స్వామిజీ పాల్గొన్న కేంద్రకిసాన్ కౌన్సిలులో, కిసాన్‌సభ అత్యున్నత అధికార సమితిలో చర్చించుట జరిగింది. అదియే విధమైన క్రమశిక్షణా చర్యతీసుకొనాలని తలచలేదు. ఈ వాస్తవ విషయాల ముందు స్వామీజీ ప్రకటనలు తప్పుదారి పట్టించేవేగాక, తప్పుదు ప్రకటనలు అగుతవి.

---

*1. రసూల్, యం.ఎ. (1974) ఎ హిస్టరి ఆఫ్ ది ఆల్ ఇండియా కిసాన్ సభ – నేషనల్ బుక్ ఏజన్సీ, కలకత్తా పే. 329–30.*

## స్వామీజీకి విజ్ఞప్తి

స్వామీజీ కేంద్ర కిసాన్ కౌన్సిలుని సమావేశపరచి, తన ఉద్దేశాలను, తానేమి కోరుతున్నది తెలియజేయకుండా, తనంతట తానే వచ్చే సంవత్సరంలో తన సహచర అభ్యర్థులెవ్వరూ ఆఫీసు భాధ్యులుగా ఎన్నికకారని, మెజారిటిపై తన అభిప్రాయాలను బలవంతంగా రుద్దే ప్రయత్నం చేసారు. కిసాన్ సభను స్థాపించినవారే, కమ్యూనిస్టుల కృషి తెలిసిన వారే కమ్యూనిస్టులు సభపై పెత్తనం సాగిస్తున్నారనే అపవాదు వేయుట, సమర్థనీయంకాదని కేంద్ర కిసాను కౌన్సిలు తలచింది.

స్వామీజీ అధ్యక్షత క్రింద గత మమాసభ చేసిన తీర్మానాన్ని కేంద్రకిసాన్ కౌన్సిలు గుర్తు చేసింది. స్వామీజీ ఆమోదంతోనే "జాతివ్యతిరేక, విచ్ఛిన్నకర శక్తులు కొన్ని కిసాన్ సభ బలోపేతమగుట సహించలేనివారు కిసాన్‌సభపై కమ్యూనిస్టులు పెత్తనం చెలాయిస్తూ వారి విధానాలను సభపై రుద్దే ప్రయత్నం చేస్తున్నారనే, నిందా ప్రచారం చేస్తున్నారని" తీర్మానం పేర్కొనుటను కౌన్సిలు గుర్తు చేసింది.

"కిసాన్‌సభ ప్రజాస్వామ్యనిర్మాణ సూత్రాలను గౌరవించి, నేత్రకోనలో జరుగబోయే అఖిలభారతకిసాన్‌సభ, సాంవత్సరిక మహాసభలో పాల్గొనమని, చివరకు స్వామిజీని, వారి అనుచరులను బహిరంగ మహాసభలో తాముగతంలో ఆమోదించిన తీర్మానాన్ని వ్యతిరేకించుతు, బహిరంగసభలో తమ అభిప్రాయాలను సంకోచించక వెలిబుచ్చుమని, కౌన్సిలు విజ్ఞప్తి చేసింది.

"బెంగాల్ రాష్ట్ర కిసాన్‌సభ సాంవత్సరికమహాసభ యేర్పాటులు, 8లక్షల 25వేల సభ్యత్వం కల కిసాన్‌సభ గౌరవాన్ని పెంచేవిధంగా విజయవంతంగా చేయమని కేంద్రకిసాన్ కౌన్సిలు పిలుపు, విజ్ఞప్తులు చేసింది.

## జాతీయ కాంగ్రెసుకు స్వామి సహజానందసరస్వతి సూచనలు

అఖిల భారత కిసాన్ సభకు జనరలు శెక్రటరీ సమర్పించిన నివేదిక, విజయవాద మహాసభ అధ్యక్షోపన్యాసంలో పాకిస్తాన్ ఆలోచనపై స్వామిజీ తీవ్రవిమర్శనను ప్రస్తావించి "స్వామిజీ యింకా మరికొంత దూరం పోయి, యేకిసాన్ సభవాది, ముస్లింలీగు అభిప్రాయాలు కలవారు. అంగీకరించని విధంగా, కాంగ్రెసుతో అవగాహనకు వచ్చుటకు సంప్రదింపులు జరిపారు. కాంగ్రెసుకు రాజకీయవిధానాలలో కిసాన్‌సభ మద్దతు నిస్తుందనే హామీనివ్వ ప్రయత్నించారు. అట్టి ప్రయత్నఫలితంగా, ముస్లింలీగు మరో కిసాన్‌సభను ప్రారంభించి, అది రాజకీయవిధానాలలో లీగుకుమద్దతునిస్తుందని హామీనిచ్చుట జరుగుతుంది. వివిధ రాజకీయపార్టీలకు మద్దతునిచ్చే,వివిధ కిసాన్‌సభలు యేర్పడి, అవి ఆయా పార్టీలకు మద్దతునివ్వగలమని హామీలనిస్తూ పోతే రైతాంగవర్గ ఐక్యత, కిసాన్‌సభ విచ్ఛిన్నతయే మనకు మిగిలేది. "అంచేత, స్వామిజీ ఆమోదించనెంచే యీవిధానాన్ని కిసాన్‌సభ ఆమోదించజాలదు. కిసాన్‌సభ యీ స్వతంత్రవిధానాన్ని నేడు స్వామిజీ, యితర అనేక మంది వలనె కమ్యూనిస్టుల పెత్తనమని ఖండించుచున్నారు. స్వామిజీ ప్రతిపాదనను కేంద్రకిసాన్ కౌన్సిలులోని అత్యధికులు, అది కాంగ్రెసుకు కిసాన్‌సభను అనుబంధసంస్థగా

చేస్తుంది. కనుక అంగీకరించలేదు. అంచేతనే కిసాన్‌సభను స్వామిజీ కమ్యూనిస్టుల పెత్తనం క్రిందవుంచునెంచారని నిందించారు.

"స్వామిజీ ఎప్పుడూ యేసందర్భంలోనూ, యేతీర్మానం తనపై వొత్తిడిచేసి, రుద్దబడిందని ఫిర్యాదు చేసి వుండలేదు.[1]

నేత్రకోనలో యీవిషయం కులంఖషంగా చర్చించబడింది, ప్రతివొక్కరూ, స్వామిజీని తిరిగి కిసాన్ సభలోనికి తీసుకొని వచ్చుటకు ఆతురత కనబరచారు. మహాసభ కార్యానందశర్మ, జడ్.ఎ. అహమ్మద్‌లు బీహారులోని వారి నివాసానికి వెళ్ళివారితో సంప్రదింపులు జరుపుటకు అధికారమిచ్చింది. సంప్రదింపులు విఫలమయ్యాయి. స్వామిజీ తనమార్గాన్ని నిర్ణయించుకొన్నారని స్పష్టమైంది. స్వీయమానసిక దృక్పధంతో కృత్రిమ ఆశలు, కోరికను పెంచి పోషించుకొన్నారు. వారిని కిసాన్ సభలోనికి తీసుకొని రావానుకొన్న నాయకులందరి ఆశలు అడియాశలయ్యాయి.

## బీహారు మాత్రమే స్వామీజీని అనుసరించింది.

కేంద్రకిసాన్ కౌన్సిలు తీర్మానంలోని భాగాల ఉదహరింపులు పరిస్థితులను, తదనంతర పరిణామాలను విశదం చేస్తున్నది. స్వామిజీ తన క్రమశిక్షణా చర్యలు, తన రాజీనామాతో యేర్పడిన ప్రతిష్టంబన, నేత్రకోన అఖిలభారతకిసాన్ మహాసభ నూతన నాయకత్వాన్ని యెన్నుకొన్న తదనంతరం, అధ్యక్ష పదవికి రాజీనామా చేయకుండా, యింకా అధ్యక్షునిగానే నెంచుకొంటూ క్రమశిక్షణాచర్యలు గైకొను" పిల్లచేష్టలు" చేబట్టారు. రాజీనామా చేయకుండా పోటీకిసాన్‌సభను యేర్పాటు చేయు ప్రయత్నాలు మొదలుపెట్టారని, శ్రీకోటంరాజు రామారావు సంపాదకత్వంలోని" సెర్చిలైటు అనే ఆంగ్లదినపత్రిక 25 మార్చి, 1945న, స్వామిజీ "నేను అధ్యక్షునిగా వున్న కిసాన్‌సభ నుండి నేను తొలగివెళ్లిపోవలసిన కారణమేఖీ కనుపించదు" అని అన్నట్లు పత్రిక వ్రాసింది.

ఈ పరిణామాలలో స్వామిజీ దాదాపు అన్ని రాష్ట్ర శాఖలను బర్తరఫ్ చేసారు. తనను అనుసరించే బీహారు రాష్ట్ర కిసాన్‌సభతో సంతృప్తిచెందారు. తాను 12 డిశెంబరు 1944న ఖండించిన పోటీ కిసాన్‌సభ యేర్పాటుకు తానే ఉపక్రమించారు. స్వామీజీ తిరుగుబాటు రాష్ట్ర కాసాన్ సభ పేర్కొన్నది. నేత్రకోన మహాసభతో తిరిగి బలమైన కిసాన్‌సభగా యేర్పడి, రైతాంగ పోరాటాకు అఖిలభారత నాయకత్వాన్ని యివ్వసాగింది.

## కిసాన్ సభ ఉద్యమంపై కాంగ్రెసు అగ్రనాయకత్వాల వైఖరి

"క్విట్‌ఇండియా" ఉద్యమంలో అరెస్టు అయిన నాయకులు సెప్టెంబరు 1945లో విడుదలానంతరం సమావేశమై,రాజకీయ పరిస్థితి సమీక్షించి, పోటీ అఖిలభారతకిసాన్ సభ యేర్పాటు చేయు విషయమై చర్చించారు. కాంగ్రెసులోలేని స్వామీజీని కూడ ఆహ్వానించారు. సుభాస్‌చంద్రబోసుతో స్వామిజీ 1939లో కాంగ్రెసును వదలి వచ్చారు.

---

1. రసూల్, యం.ఎ. *(1974) ఎ హిస్టరి ఆఫ్ ది ఆల్ ఇండియా కిసాన్ సభ* - నేషనల్ బుక్ ఏజన్సీ, కలకత్తా పే.333-4.

కాంగ్రెసు నాయకులు శ్రీటాండన్, నరేంద్రదేవ్, సంపూర్ణానంద్, హుమాయూన్ కబీరులతోపాటు, రైతునాయకులు స్వామీ సహజానంద్, ఇందులాల్ యాగ్నిక్, హర్షదేవ్ మాలవ్యాలు కిసాన్‌సభను వీడిపోయినవారు హాజరుకాగా, శ్రీటాండన్ అచ్చువేసిన ప్రకటననుపంచి, స్వామీజీని మాట్లాడమని కోరారు.

స్వామీజీ రైతాంగ సమస్యలలో ఎక్కువభాగం పరిమితి లేక స్థానిక ప్రభావం కలవని, గోధుమ,పంచదార ధరల సమస్యలు అఖిలభారత సమస్యలని, అందరికి సంబంధించిన సామాన్య సమిష్టి సమ్యలని, వాటికై పోరాటానికి, పరిష్కారానికి అఖిలభారత కిసాన్‌సభ అవసరం ఎంతో వుందన్నారు. “మనచే యేర్పాటు కావించబడే ఆల్ ఇండియా, కిసాన్‌సభ తప్పనిసరిగా స్వతంత్ర సంస్థగా వుండాలని, బహుళ సంఖ్యాక కాంగ్రెసువాదులు వుంటారని, అయినా అందరు కాంగ్రెసు సిద్ధాంతాలను నమ్మేవారు, అనుసరించే వారే వుండాలనే నియమం విధించరాదు. ముస్లింలీగు, తదితర రాజకీయపార్టీలవారు కూడ చేరి, పనిచేసి నాయకులయ్యే అవకాశముండాలి. ప్రస్తుతకిసాన్‌సభ కమ్యూనిస్టుల పెత్తనం క్రిందవుందని తీవ్రంగా విమర్శించారు,పోటీ కిసాన్‌సభను యేర్పాటు చేయాలన్నారు. కాని కార్యక్రమాన్ని రాజకీయ విధానాన్ని సూచించలేదు.

అసమావేశంలో పరస్పర విరుద్ధ, భిన్న అభిప్రాయాలను, జాతీయ కాంగ్రెసు కిసాను సభలతో ఎట్టి సంబంధము కలిగియుండరాదనే అభిప్రాయంతో సహావెలిబుచ్చారు. సంపూర్ణానంద్ అభిప్రాయ భేదాలు అంత తీవ్రమైనవి త్రోసి బుచ్చారు. కొంతమంది స్వామి సహజానంద కాంగ్రెసు వ్యతిరేకియని అనుమానించగా, స్వామీజీ కాంగ్రెసు వాదులు కొంతమంది రైతాంగ అభిమానులు కానే కాదని అనుమానం వెళ్ళబుచ్చారు.

సంపూర్ణానంద్ గతంలో కిసాన్‌సభ సమస్యలను కాలక్రమంలో కాంగ్రెసు అనేక పర్యాయములు చర్చించిందని, కాంగ్రెసు వారిని యిరుకున పెట్టె సమస్యఅంటూ “కిసాన్‌సభను కాని నూతన కిసాన్‌సభను కాని కాంగ్రెసుకు వ్యతిరేకంగా యేర్పాటు చేయు ప్రశ్నకాదని, కాంగ్రెసు తీర్మానం కిసాన్‌సభను యేర్పాటు చేయాలని సూచించుతున్నదని, గతంలో యు.పి.లో మాకు వొక కిసాన్‌సభ వున్నదని” వివరించారు.

ఈవిధంగా, సంపూర్ణానంద్ రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రి వర్గాలు పాలనలో వున్నప్పుడు, కిసాన్ సభలలో చురుకుగా పనిచేస్తున్న సోషలిస్టులు, కమ్యూనిస్టులు, తదితర వామపక్షశక్తులు జమిందారీ, జాగీర్థారీ, మాల్గుజారీ, భూస్వామ్యవిధానాలను రద్దు చేయాలంటూ, కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికలలోని అంశాలను అమలు చేయాలంటూ, నడిపిన ఆందోళనలు, ప్రజాఉద్యమాల అనుభవాలను, తలనొప్పులను మరచి పోజాలనందుననే, తనమనసువిప్పి, కిసానుసభలు తమకు తలనొప్పులను కలిగించి, యిరుకునపడవేశాయిన, వివిధ రాష్ట్రాలలో కిసాన్ సభ చర్యలను యిలా పేర్కొన్నారు.

“మేము యు.పి.లో 1942లో కిసాన్‌సభలో వున్నాము. పురాతనకిసాన్‌సభను సస్పెండు చేసారు. మరో దానిని కమ్యూనిస్టులు యేర్పాటుచేసారు.

“బీహారులో వేరువేరుగా మూడు కిసాన్ సభలున్నవి. ఒకటి యిప్పటికి ప్రభుత్వ నిషేధంలోనేవుంది. కిసాన్ కార్యకర్తలలో కొందరు సోషలిస్టులు, కొందరు గాంధీవాదులు,

మరికొందరు సాధారణ కాంగ్రెసువాదులు,వారు స్వామిజీతో పనిచేయుటకు సిద్ధంగా లేరు.

"పంజాబులో రెతాంగం మొదటినుండి కమ్యూనిస్టుల నాయకత్వంలోనే వుంది. కాంగ్రెసుకు రైతాంగంలో యేమిాబలంలేదు. పంజాబులో యూనియనిస్టుపార్టీ ముఖ్యమంత్రిగా వున్న సర్‌సికందర్ హయ్యత్‌ఖాన్ యు.పి.లో కాంగ్రెసుమంత్రివర్గం చేసిన విధంగా రైతులకు కొన్ని చట్టాలు చేయ ప్రయత్నించగా కాంగ్రెసు నాయకులు వ్యతిరేకించారు. ఫలితంగా వున్న కిసాన్ సభలో కమ్యూనిస్టుల నాయకత్వంలో బలపడి, స్థిరపడింది. వారే అక్కడ రైతాంగాన్ని సమీకరించుతున్నారు.

"బెంగాల్‌లో కృషక్ ప్రజాపార్టీ మాతో కలియుటకు యింకా సిద్ధంగాలేదు. మానుండి వేరుగానే వుండనెంచుతున్నది.

ఇదే పరిస్థితి యించుమించుగా అన్ని రాష్ట్రాలలో వుంది.

"ఈ పరిస్థితులలో అఖిలభారతకిసాన్‌సభను మరో దానిని నూతనంగా యేర్పాటు చేసిన, చాలావరకు "ఒకపేపరు" సంస్థగానే వుంటుంది.

"అందువలన మూడు, నాలుగు రాష్ట్రాలలో కిసాన్‌సభలను యేర్పాటు చేయాలి, అవి రైతాంగ సమస్యలను చేబట్టి, రైతులను సమీకరించగలుగుతవి. తరువాత కొంతకాలానికి పరిస్థితి పరిపక్వమైనపుడు అఖిలభారత కిసాన్‌సభను యేర్పాటు చేయవచ్చును.

సంపూర్ణానంద్ తెలిపిన వాస్తవాలతో సమావేశమైన జాతీయకాంగ్రెసు నాయకులకు ఎక్కడా రైతాంగంలో బలంలేదని తేలింది. అయినా, పోటీ కిసాన్‌సభను నిర్మించాలంటే రైతాంగం యెడల ప్రేమతో కాక, రైతాంగాన్ని వారి సమస్యల సమీకరించుతున్న కమ్యూనిస్టులు వర్గపోరాటాలను తీవ్రతరం చేయుటతో కలిగిన కోప, ద్వేషాలతో చేస్తున్నారేగాని, రైతాంగవర్గ ప్రయోజనాలను పెంపొందించుటకు కాదని స్పష్టమైంది.

సంపూర్ణానంద్ పోటీకిసాన్ సభను యేర్పాటు చేయుటను వాయిదా వేయుటకు ప్రతిపాదించగా, కమ్యూనిస్టులు రైతాంగంలో యింకా బాగా విస్తరించుటకు అవకాశాన్ని కలుగజేస్తుందని, "మూడు, నాలుగు మాసాల తరువాత మీరు ఎంత ప్రయత్నించినా, మీరు కాలుమోపలేరని" బెంగాల్ కాంగ్రెసువాది వ్యతిరేకించారు.

బెంగాల్ క్రిషక్ ప్రజాపార్టీకి చెందిన హుమాయూన్ కబీర్ "మావొక్క పార్టీయే 1936లో యేర్పడి రైతాంగంలో బలంగావుందని, 1936లోనే ఎన్నికలలో పాల్గొన్నదని, 1946లో జరుగబోయే ఎన్నికలలో పాల్గొనబోతున్నదని ఆతరువాత కిసాన్ సభలో చేరుతుందన్నారు. ముస్లింవోటరులను వొక ముస్లింపార్టీగా సంపాదించచనెంచుట స్పష్టం, కబీరు యొక్క అవకాశవాదం స్పష్టమైంది. వారు కాంగ్రెసుతో కలియుటకు సిద్ధంగా లేరు. కబీర్ అంతేగాక, పాకిస్థాన్ సమస్య పంజాబ్, బెంగాల్ 1946 ఎన్నికలలో తేల్చబడుతుందన్నారు.

సుదీర్ఘచర్చల తరువాత వెంటనే మరో కిసాన్ సభను యేర్పాటు చేయుటలేదని నిర్ణయించారు. అయితే, శ్రీయుతులు పి.డి.టాండన్, స్వామిజీ, నరేంద్రదేవ్, సంపూర్ణానంద్‌లతో 14మంది గల వొక కమిటీని వేసి, ఇందులాల్ యాగ్నిక్, ఆల్గురాయ్ శాస్త్రీలను కన్వీనరులుగా యేర్పరచారు.

అనంతరం,జులై 1946లో కాంగ్రెసు వాదులు, కాంగ్రెసు సోషలిస్టులు, పార్వర్డుబ్లాక్ తదితరులు సమావేశమై "హింద్ కిసాన్ సభను" యేర్పరచారు.

బెంగాల్ కాంగ్రెసు సోషలిస్టుపార్టీ మరో పోటీ కిసాన్‌సభను యేర్పాటు చేసింది. దానికి పురిట్లోనే సంది కొట్టింది. మహారాష్ట్రలో మరో మూడో కిసాన్‌సభను యేర్పాటు చేసారు, నామమాత్రంగానే వుండిపోయింది. ఆంధ్రలో ఆచార్య రంగా మరో కిసాన్ కాంగ్రెసును యేర్పాటు చేసారు. బీహారులో మూడు కిసాన్ సభలు యేర్పడినవి. వీటిలో "ఎ.ఐ.కె.యస్" శాఖగా గతంలో వున్నదే బలంగా వున్నది.

## పోటీ కిసాన్ సభ (1948-52)

అఖిలభారతకిసాన్ సభ నాయకత్వం తీవ్రనిర్బంధానికి గురై జైళ్ళలో డిటెన్యూలుగనో లేక రహస్య జీవితం గడుపుటయో 1948-52 మధ్యకాలంలో జరిగింది. కిసాన్ సభ ఆఫీసులపై పోలీసు దాడులలో అన్ని ధ్వంసమయ్యాయి. అదేకాలంలో కొన్ని ముఖ్య పరిణామాలు జరిగాయి.

ఎ.ఐ.కె.యస్. నాయకత్వం స్వామి సహజానందసరస్వతితో జరిపిన ఐక్యతాసంభాషణలు విఫలంకాగా, బీహారులో విశ్వాసపాత్రులైన అనుచరులు యదునందనశర్మ, మరికొందరు అవకాశవాదులు, చివరకు కమ్యూనిస్టు వ్యతిరేకులతో కలిసి, అఖిల భారత ఐక్యకిసాన్ సభను యేర్పాటు చేసారు. స్వామీజీ నూతన కిసాన్ సభను యేర్పాటు చేయుటకు, రాష్ట్ర కిసాన్ సభలతో మేజువాణి సంప్రదింపులకు ఆహ్వానాలు పంపారు. ఎట్టి ప్రతిపాదనలు, కాలవ్యవధి లేకుండా అఖిలభారత "ఐక్యకిసాన్ సభ" యేర్పడినట్లు ప్రకటించారు. ఇది స్వామిజీకి నైతిక బలాన్ని యివ్వజాలకపోయింది.

ఐక్య కిసాన్ సభ లక్ష్యాన్ని "ఆర్థిక, సామాజిక, రాజకీయ దోపిడినుండి రైతాంగానికి సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సాధించుట, భారత సోషలిస్టు రిపబ్లిక్కుల యూనియను సర్వాధికారాలు శ్రామిక ప్రజాసామాన్యానికి చెందునట్లు చేయుట"గా నిర్వచించారు.

"అఖిలభారత ఐక్యకిసాన్ సభ కేంద్రకౌన్సిలులోగాని, దాని రాష్ట్ర, జిల్లా కౌన్సిలులోగాని యేవొక్క రాజకీయపార్టీకి, గ్రూపులకు మెజారిటి వుండరాదు. ఈ నిర్మాణ, నిబంధనలననుసరించి వొకటి కంటె యెక్కువ పార్టీలు గాని, గ్రూపులు గాని మెజారిటి కలిగివుండరాదు. కేంద్ర, రాష్ట్ర కిసాన్ సభయే తీర్మానం హాజరైన వారిలో నాలుగింట మూడువంతుల ప్రతినిధుల ఆమోదంతోనే అమలు చేయబడుతుంది. ఈవిధంగా ఏవొక్కపార్టీ లేక గ్రూపు పెత్తనం చెలాయించకుండునట్లు నిర్మాణ, నిబంధనలు రూపొందించబడినవి.

ఐక్యకిసాన్‌సభ నిర్మాణ నిబంధనలు ఏజెండాను ఆమోదించలేదు. కాంగ్రెసువాదులను సంతృప్తిబరచుటకు, కిసాన్‌సభ బావుటా ఎర్రజెండాను ప్రతిపాదించలేదు. నిర్మాణ, నిబంధనలు 1948లో ప్రచురించారు కాని ఈ సంస్థ నామమాత్రంగా, పేపరు సంస్థగా వుండిపోయింది. బీహారులో కూడ బలాన్ని చేకూర్చుకొనజాలకపోయింది. స్వామీజీ ఆశలన్నీ, నిరాశలు కాగా జులై 1950లో చనిపోయారు.

## కిసాన్ సభ పునర్నిర్మాణం, ఐక్యతా ప్రయత్నాలు

అఖిల భారత కిసాన్‌సభ నాయకత్వం జైళ్ళలోనో, రహస్యంగానో వుండుటతో 1951 ఆగస్టులో కలకత్తాలో కేంద్రకిసాన్ కౌన్సిలు సమావేశం సాధ్యంకాలేదు. ఐక్యకిసాన్ సభనాయకులతో ఐక్యతావకాశాలను అన్వేషించు ప్రయత్నంగా సంప్రదింపులు జరిపారు. వీటి ఫలితంగానే కార్యానందశర్మ, బంకింముఖర్జీ, జోగేంద్రశర్మలు ఎ.ఐ.కె.యస్. తరపున ప్రతినిధులుగా, మరోవైపున యదునందనశర్మ, శీలాబధ్రయాజిలు, ఐక్యకిసాన్‌సభ ప్రతినిధులుగ సమావేశమై ఆగస్టు 1951లో సంభాషణలు కొనసాగించి వొక వొప్పందానికి వచ్చారు.

రెండు పక్షాలు రెండు కిసాన్ సభలను యీక్రింది షరతులపై ఏకంచేయుటకు ఆమోదించి, వొప్పందంపై సంతకాలు చేసారు.[1]

1. సంయుక్త సంస్థపేరు అఖిలభారత కిసాన్ సభగా వుంటుంది.

2. సభ ఆశయం, రైతులకు ఆర్థిక, రాజకీయ, సామాజిక దోపిడీల నుండి సంపూర్ణ స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలుండాలి. భారతదేశంలో సర్వాధికారాలు శ్రామిక ప్రజాసామాన్యం కలిగి వుండే ప్రజాప్రభుత్వం యేర్పరచుట.

3. ప్రాధమిక సభ్యత్వానికి, 16సంవత్సరాలు వయసుగలిగి, సంవత్సరానికి 2అణాలు సభ్యత్వరుసుం చెలించిన ఎవరైనా, అర్హుడు. ప్రాథమికశాఖ, సభ ఆశయాన్ని ఆమోదించిన, రైతుకాని యితరులను కూడ సభ్యునిగా చేర్చుకొని వచ్చును.

4. డిశెంబరు 1951 చివరి వారంలో సంయుక్త అఖిలభారత కన్వెన్షన్ బీహారులోని లకిసరాయ్‌లో జరుగుతుంది. అఖిల భారత కిసాన్ సభ మొత్తం 305మందికి అఖిలభారత ఐక్యకిసాన్‌సభ 105మంది ప్రతినిధులను కలిగివుంటారు.

బీహారులో సంయుక్త రాష్ట్ర కౌన్సిలు రెండు కిసాన్ సభలు కలిసి రాష్ట్ర ఆహ్వాన సంఘం కార్యానందశర్మ, యదునందన శర్మలు జాయింటు కన్వీనరులుగా యేర్పడుతుంది.

రెండు కిసాన్ సభల కేంద్రకిసాన్ కౌన్సిలు సంయుక్త సమావేశం అఖిలభారత కన్వెన్షన్ ముందు, రెండు రోజులు జరుగుతుంది. సంప్రదింపుల కమిటీలు కన్వెన్షనుల ముసాయిదాలను చర్చించే కమిటీలుగా పని చేస్తాయి.

అన్ని నోటిసులు, సర్క్యులర్స్, తీర్మానాలు, రెండు సభలవి యిక నుండి కేంద్రకిసాన్ కౌన్సులుకు, రాష్ట్ర కిసాన్ కౌన్సిలుకు పరస్పరం పంపు కొనాలి.

5. సంయుక్త కిసాన్ సభ జెండా, సుత్తి–కొడవలి గల ఎర్రజెండా అగుతుంది. కన్వెన్షన్ వరకు రెండు కిసాన్‌సభలు తమ తమ సభ్యత్వఫారాలను వినియోగించి సభ్యులను చేర్పించవచ్చును. కన్వెన్షను బంకింముఖర్జీని అధ్యక్షుడుగా, యదునందనశర్మను కార్యదర్శిగా జాయింటు సభ ఎనుకొంటుంది. ఆఫీసు శెక్రటరీగా "ఎ.ఐ.కె.యన్." వ్యక్తి వుంటారు. ఈ యేర్పాట్లన్ని ఏకగ్రీవంగా ఆమోదించబడినవి. ప్రెసిడెంటు, శెక్రటరీలు యేపార్టీకి చెందని వారుండాలి. అంటే పార్టీ, సభ్యులు ఆస్థానాలకు ఎన్నికఅగుటకు అనర్హులు.

---

1. రసూల్, యం.ఎ. *(1974)* ఎ హిస్టరి ఆఫ్ ది ఆల్ ఇండియా కిసాన్ సభ పే. *345-6.*

## సంప్రదింపులు కొనసాగింపు

"ఎ.ఐ.కె.యస్" నాయకత్వం జైళ్ళలో వున్నందున, డిశెంబరు 1951లో కన్వెన్షన్ జరుపుట సాధ్యపడలేదు. సంప్రదింపులకు జులై1952ను నిర్ణయించారు. మే 1952 చివరకు కిసాన్‌సభ నాయకులు విడుదల చేయబడ్డారు. కేంద్రకిసాన్ కౌన్సిలు పాట్నాలో జూన్ 1952లో సమావేశంకానున్నందున, బంకింముఖర్జీ కోరికపై జనరలు శెక్రటరీ రాజీనామా చేసి, సంప్రదింపులకు వీలు కలిగించారు.

శెక్రటరీగా బంకింముఖర్జీ ఎన్నుకొనబడుటతో తిరిగి రసూల్‌ను బంకింముఖర్జీ స్థానంలో కో ఆప్టెడ్‌గా చేసుకొన్నారు.

కిసాన్ సభ కౌన్సిలు కార్యానందశర్మ, బంకింముఖర్జీ, యం.ఎ.రసూల్‌లను సంప్రదింపుల కమిటీగా నియమించింది. విదేశాలలో యాజ్ఞిక్ వున్నందున సంప్రదింపులు ఆలస్యమయ్యాయి. యాజ్ఞిక్ వచ్చినాక మద్రాసు సమావేశంలో ఆహ్వానంపై పాల్గొన్నారు. రెండు కిసాన్ సభలు వెంటనే ఏకంకావాలనే అభిలాషను వెల్లడించారు. పాట్నాలో 17 సెప్టెంబరు 1952లో సంప్రదింపులు జరిపారు. కా॥ యాగ్నిక్ అధ్యక్షుడుగా సంతకాలు చేయబడిన ఐక్యకిసాన్ సభ గత సంవత్సరవొప్పందాన్ని చదివి వినిపించారు. ఐక్యకిసాన్‌సభ, కేంద్రకిసాన్‌సభ కౌన్సిలు క్రితం రోజున సమావేశమై వొప్పందానికి నాలుగు సవరణులు ప్రతిపాదించిందని, వాటికి వారి సభ్యులు కొందరు అనంగీకారం తెలిపారని అన్నారు. ఆసవరణలు యిలా వున్నవి.

1. సంయుక్త కిసాన్‌సభ పేరు "ఆల్ ఇండియా ఐక్యకిసాన్‌సభ" గా వుండాలి.

2. ఆశయం, కిసాన్-మజ్దూర్ రాజ్యస్థాపనగా వుండాలి. అంత్యధ్యేయం భారత సోషలిస్టు రిపబ్లిక్కుల యూనియనుగా వుండాలి.

3. కార్యక్రమం రెండు కిసాన్ సభల సాధారణ కార్యక్రమాంశాలుండాలి.

4. రాజకీయ పార్టీలకు చెందినవారు ఆఫీసుభాధ్యులుగా ఎన్నుకొనుటకు అనర్హులు అధ్యక్షుడు, జనరలు శెక్రటరీ ఎన్నిక కాబడతారు.

కా॥ యాగ్నిక్ నిజమైన ముఖ్యసవరణ, పేరు, ఆశయాలకు సంబంధించినవన్నారు. ఈ సవరణల ప్రతిపాదనలు నాగపూరులో నవంబరు 1952లో జరిగిన సంయుక్త సమావేశంలో చర్చించబడి నిర్ణయాలు గైకొనబడగలవన్నారు. సంప్రదింపుల సంయుక్త కమిటీ ఆ క్రింది తీర్మానాలను ఆమోదించారని ప్రకటించారు. ఏ రెండు కిసాన్ సభలు ఐక్యమగుటపై అత్యనిర్ణయానికి రాజాలక పోయినందున తిరిగి నాగపూరులో నవంబరు 1952 చివరివారంలో సమావేశమై సంప్రదింపులు కొనసాగించగలవు. రెండు కిసాన్ సభలు ఐక్యతా సమస్యపై తమ కేంద్రకిసాన్ కౌన్సిలు నుండి అంత్యనిర్ణయాలకు ప్లీనరీ అధికారాలనుపొంది సమావేశానికి రాగలవు. "ఎ.ఐ.కె.యస్" మరియు "ఎ.ఐ.యు.కె.యస్"ల జనరలు శెక్రటరీలు సంప్రదించి, సమావేశపు తేదీలు ప్రకటించగలరు" అని తీర్మానం పేర్కొన్నది. నాగపూరు సమావేశం తలచిన విధంగా జరుగలేదు. సంప్రదింపులకు తెరపడింది. ఇందులాల్ యాగ్నిక్ తిరిగి "ఎ.ఐ.కె.యస్"లో చేరారు. అధ్యక్షులుగా 1954లో జరిగిన మోగా మహాసభ అధ్యక్షులుగా ఎన్నుకొనబడ్డారు. జులై 1972లో స్వర్గస్తులయ్యారు.

## కమ్యూనిస్టుల చీలిక ఫలితంగా అఖిలభారతకిసాన్ సభ రెండుగా చీలుట.

భారత కమ్యూనిస్టుపార్టీ 1964-65లలో చీలి సి.పి.ఐ., సి.పి.ఐ(యం) లుగా రెండయిన నాటినుండి, రాజకీయ సిద్ధాంత భేదాభిప్రాయాలతో వేరైనా, ప్రజాసంఘాలు చీల్చబడవని ప్రజాసామాన్యానికి కొంతకాలం వరకు రెండు పార్టీలు నమ్మబలికాయి. పైగా పార్టీలో ప్రజాసంఘాలలో తమతమ బలాలను, ఆధిక్యతలను నిరూపించుకొనాలనే జ్ఞాతవైరాన్నిమించిన పోటీ ఫలితంగా సి.పి.ఐ నాయకత్వంలోని ట్రేడు యూనియను కాంగ్రెసులో సి.పి.ఐ(యం) నాయకత్వంలోని కిసాన్ సభలో క్రిందిస్థాయినుండి పై స్థాయి వరకు అంతర్యుద్ధాన్ని పోలిన పరిస్థితులు ముఖ్యంగా పశ్చిమబెంగాల్, కేరళ, ఆంధ్రప్రదేశ్‌లలో "ఆఫీసుల ఆక్రమణల అంతర్గతపోరాటాలు తరచు హింసా దౌర్జన్య పోరాటాలు కొనసాగాయి. చైనాలో మావో "రెడ్‌గార్డులకు" బొంబార్డు దిహెడ్‌క్వార్టర్స్" అన్న నినాద ప్రభావం, గణనీయంగా భారతకమ్యూనిస్టు శ్రేణులపై బలంగానేపడింది. కొన్ని స్థానిక సంఘాలలో సి.పి.ఐ మెజారిటీగా,మరికొన్ని సంఘాలలో సి.పి.ఐ(యం) మెజారిటి వుండుట వుద్యమాల అభివృద్ధి క్రమంలోనే జరిగింది. మెజారిటి గల కమ్యూనిస్టు శ్రేణులే మైనారిటిశ్రేణుల అభిప్రాయాలను లెక్కవేయకుండా ప్రజాసంఘాల స్థానిక యూనిట్లను నిరంకుశ పెత్తనందారీ తత్వంతో వ్యవహరించుటతో మైనారిటి కమ్యూనిస్టుశ్రేణులు బయటికి ఆచరణలో త్రోసివేయబడ్డాయి. ఒకచోట బలంగావుండి సి.పి.ఐ ప్రత్యర్థి సి.పి.ఐ(యం) బయటకు వెళ్ళే పరిస్థితులను కలుగజేసి మరోచోట సి.పి.ఐ(యం) బలంగా వుండి సి.పి.ఐ బయటకు వెళ్ళే పరిస్థితులను కల్పించుటతో, భిన్నాభిప్రాయాలు కలవారికి స్థానం లేకుండా పోయింది. ఈ అతివాద, మితవాద పోటీలో ఎటూ చేరలేనివారు యెంతోమంది ఎటూ చేరక, తటస్థులుగా మనజాలక బయటకే వెళ్ళేపోయి, రాజకీయాలకే దూరంగా వుండిపోయారు. ప్రజాసంఘాలలో సైతం, యేగ్రూపులోనూ చేరనివారు చివరకు బయటకు వెళ్ళే పరిస్థితులు కల్పించబడింది.

పంజాబులో "యీచీలికల చదరంగపు ఆట" రాష్ట్ర, అఖిలభారత కిసాన్ సభల వర్కింగు కమిటీ యేకగ్రీవ తీర్మానాలను అతిక్రమించి, సావంత్సరిక సమావేశాలను వాయిదాపైవాయిదా వేస్తూ పంజాబు, యు.పి.మహారాష్ట్ర, అస్సాం, తమిళనాడులోపై కధనాలే పునరావృతమయ్యాయి.

"ప్రత్యేక కాన్ఫరెన్సులు జరుపుతున్నా ప్రభుత్వం కిసాన్ సభలపై చేస్తున్నదాడిని "రక్షణనిధి" పేరుతో బలవంతంగా వసూలు చేస్తున్న మొత్తాలు, భూమిశిస్తు పెంచుటకు ప్రతిఘటించి ఉద్యమాలు చేబట్టి కిసాన్ సభలను బలోపేతం చేయలేకపోయారు. అంతేగాక, 1960లో జడ్.ఏ. అహమ్మద్ వొక్కరే యు.పి. అసెంబ్లీలోని ప్రతిపక్ష సభ్యులలో భూమిశిస్తును రాష్ట్ర ప్రభుత్వం పెంచే ప్రతిపాదనను చేసినపుడు బలపరచారు.

కేంద్రకిసాన్ కౌన్సిలు సభ్యులు 1966లో విడుదల అనంతరం సమావేశమై వియత్నాం ప్రజలపై అమెరికన్ సామ్రాజ్యవాదపు దురాక్రమణకు వ్యతిరేకంగా ప్రత్యేక మద్దతు, ప్రచార, ఆందోళనావుద్యమాన్ని చేబట్టినపుడు, కిసాన్ సభలోని "మితవాద" కమ్యూనిస్టులు యెక్కువభాగం చిన్నచూపుచూచి దూరంగా ఉండిపోయారు. వారు కిసాన్ సభలో

మెజారిటిగా వున్న తమిళనాడు, ఆంధ్రప్రదేశ్‌లలో కూడ వియత్నాం సహాయార్థం వసూలు చేసిన చందాలను కేంద్రానికి పంపలేదు. అందుకే కేంద్రకిసాన్ కౌన్సిలు న్యూఢిల్లిలో సమావేశమై యిద్దరు కేంద్ర కిసాన్ కౌన్సిలు మెంబరులను సెన్సారు చేసింది. కేంద్రకిసాన్‌కౌన్సిలు సభ్యులు పెక్కుమంది అరెస్టుకాగా బయటవున్న అధ్యక్షుడు ఎ.కె.గోపాలన్‌తో కేంద్రాన్ని నడుపుటకు "మితవాద కమ్యూనిస్టునాయకులైన సి.కందస్వామి, జడ్.ఎ. అహమ్మద్, వైవి.కృష్ణారావులు యేమాత్రం సహాయం చేయకపోగా కౌన్సిలు సమావేశాలకు హాజరు కాలేదు. సభ్యత్వాన్ని కూడ చేర్పించలేదు.

## ఢిల్లీ కేంద్ర కిసాన్ కౌన్సిలు నిర్ణయాలు.

అరెస్టు అయిన కేంద్ర కిసాన్ కౌన్సిలు ఏప్రిల్, మే 1966కు విడుదల చేయబడుటతో, డిల్లీలో జులై 1966లో సమావేశం యేర్పాటు చేయబడింది. అప్పుడే పోటీ కిసాన్‌సభ యేర్పాటుపై చర్చ జరిగింది.మితవాద కమ్యూనిస్టు నాయకులైన జడ్.ఎ. అహమ్మద్, కృష్ణారావు తదితరులు సమావేశానికి హాజరయ్యారు. ఈక్రింది తీర్మానాలను చర్చించి, ఆమోదించింది.

అఖిలభారత కిసాన్‌సభ, జనరలు కౌన్సిలు అనేక రాష్ట్రాలలో పోటీ కిసాన్ సభలు, కిసాన్ సభ నాయకులలో చాలా భాగము జైళ్ళలో వున్నపుడు యేర్పడినవి. కేంద్రకిసాన్ కౌన్సిలు వివాదాస్పదమై యేకమిటీలకు ఆమోదం తెలుపలేదు, అవి న్యాయంగా, చట్ట సమ్మతంగా యేర్పడలేదు.

వివిధ రాష్ట్రాలలోని కామ్రేడ్స్ 15 సెప్టెంబరు 1966 నాటికి ఆమోదయోగ్యమైన వొప్పందానికి వచ్చినట్లుయితే కేంద్రకిసాన్ కౌన్సిలు స్వాగతం పలికి సంతోషించేది. ఆమోదం పొందిన పరిష్కారకుదరనిచో. కేంద్రకౌన్సిలు యధాస్థితిని కొనసాగించాలని నిర్ణయించేది, అంటే 1961-62 నాటి కమిటీల సూత్రబద్ధంగా కాన్ఫరెన్సులలో ఎన్నికైన కమిటీలు, వివాదం లేనపుడు ఎన్నికైన వాటిని తాత్కాలిక రాష్ట్ర కమిటీలుగా, జిల్లాకమిటీలుగా ఆమోదించబడతాయి.

కేంద్రకిసాన్ కౌన్సిలు నిర్ణయాలను మితవాద కమ్యూనిస్టులు ఆమోదించక, వారు యేర్పరచిన పోటీకమిటీలను మామూలు కమిటీలుగా గుర్తించాలని పట్టుబట్టారు. పత్రికలలో కిసాన్ కౌన్సిలును విమర్శించారు. ఐక్యతకు కౌన్సిలు చేసిన ప్రతిపాదనలను విమర్శించారు. వివిధ రాష్ట్రాలలోని పోటీకమిటీలు, రాష్ట్ర జిల్లా పోటీ కమిటీలు పనిచేయసాగాయి. ఆమోదయోగ్యమైన పరిష్కారానికి, సంబంధిత కామ్రేడ్స్ చర్చించ ప్రయత్నించ తిరస్కరించారు.

అంచేతనే, డిల్లీలో అక్టోబరు 1966లో సమావేశమైన కేంద్రకిసాన్ కౌన్సిలుకు 1961-62లో యేర్పడిన కమిటీలను పునఃప్రతిష్ఠించుట కంటె మరోమార్గం లేకుండా పోయింది. కౌన్సిలు నూతనంగా సభ్యత్వాన్ని చేర్పించుటకై పిలుపునిచ్చింది. సాధారణ జనరలు ఎన్నికలు 1967లో జరిగిన తరువాత ఢిల్లీ రెగ్యులరు కాన్ఫరెన్సు జరపాలని నిర్ణయించారు. కౌన్సిలు ఐక్యతకై ప్రయత్నాలు సాగించింది.

మే 1967లో డా॥ అహమ్మద్ కలకత్తా వెల్లిన సందర్భంలో కిసాన్‌సభ నాయకులు ఐక్యతా సంప్రదింపులు ప్రారంభించారు. డిల్లీలో తిరిగి పరస్పర సంప్రదింపులు కొనసాగించుటకు మే 1967 చివరిలో యం.ఎ. రసూల్ కలకత్తా నుండి వచ్చారు. అహమ్మద్, భోగేంద్రఝూ, వొకవైపున, గోపాలన్, రసూల్, లాయల్పూరి మరోవైపున సంభాషణలలో పాల్గొన్నారు.

సుదీర్ఘ చర్చల తరువాత మితవాదుల ఆమోదంతో 30 జూన్ 1967ను ప్రయమరీసభ్యులను చేర్పించుటకు చివరిరోజుగా, సభ్యత్వరుసుం మొత్తం 22జులై 1967కు చేరవలసిందిగా నిర్ణయించారు.

బీహారులో కరువు పరిస్థితులు వున్నందున, పశ్చిమబెంగాలులో సాంవత్సరిక మహాసభ జరుగగలదని నిర్ణయించారు.

ఈ నిర్ణయాలు వొక సంయుక్త ప్రకటనలో పొందుపరచి, ఎ.కె.గోపాలన్, లాయల్పూరి, జడ్.ఎ. అహమ్మద్‌లు 19జులై 1967న విడుదల చేసారు. వొప్పందం పూర్తిపాఠం యిలా వుంది.

**సి.పి.ఐ.,సి.పి.ఐ(యం)ల మధ్య కిసాన్ సభ ఐక్యతా వొప్పందం.**

అఖిల భారత కిసాన్ సభలో యేర్పడిన వివాదాంశాలను పరిష్కరించి, ఐక్యతను పునరుద్ధరించుట, అన్ని స్థాయిలలో కిసాన్‌సభను బలపరచి, ప్రధానపక్షాలు సంయుక్త పనివిధానాన్ని రూపొందించుటకు మేము యీ క్రింది నిర్మాణాంశాలను చేబట్టే వొప్పందం చేసుకొన్నాము జులై 1961-62 వొప్పందం అంశాలు:[1]

1. కేంద్ర కిసాన్ కౌన్సిలు పునరుద్ధరించిన 1961-62 నాటి కిసాన్ కమిటీలను మామూలుగ అందరూ గుర్తించాలి. ఆకమిటీలలో సమిష్టి పనివిధానాన్ని అభివృద్ధి చేయాలి.

2. ఈ కమిటీలు తమ రాష్ట్రాలలో రెండు పక్షాలు చేర్పించిన, నాటి సభ్యత్వ ప్రాతిపదికపై రాష్ట్ర, జిల్లా కాన్ఫరెన్సులను వాయిదా వేయకుండా జరపాలి.

3. కిసాన్ సభ నిర్మాణనిబంధనల ప్రకారం, ఏక్రింది కిసాన్ కమిటి అయినా సభ్యత్వరుసుమును కేంద్ర, కౌన్సిలుకు నేరుగా చివరతేదీ లోపలపంపవచ్చును. కౌన్సిలు సభ్యత్వాన్ని యేరాష్ట్రం కిందపనిచేస్తుందో దానికి అప్పజెప్పుతుంది. రాష్ట్రకమిటికి దానిని చెక్‌చేసే అధికారముంటుంది.

4. భవిష్యత్తులో సమిష్టి పనివిధానాన్ని పెంపొందించుటకు, కమిటీలు, ఆఫీసుభాధ్యులను,పోలైన వోట్ల నిష్పత్తిలో ఎన్నుకొనే విధానంలో జరుగుతుంది. అందుకు అఖిలభారత కాన్ఫరెన్సులో కిసాన్‌సభ నిర్మాణ నిబంధనలకు సవరణలు చేయబడుతవి. ఈసూత్రం అధ్యక్షుడు, కార్యదర్శిలాంటి వొకేవొక స్థానాలకు వినియోగించరాదు. ఒకటికంటె యెక్కువ స్థానాలున్నపుడి వినియోగించాలి.

---

*1. రసూల్, యం.ఎ. (1974) ఎ హిస్టరి ఆఫ్ ది ఆల్ ఇండియా కిసాన్ సభ – నేషనల్ బుక్ ఏజన్సీ, కలకత్తా పే.352-3.*

5. కమిటీలు ఎన్నికలకు పోలైన వోట్ల నిష్పత్తిలో గెలుపును నిర్ణయించుట ముఖ్యపోస్టులకు, కిసాన్‌సభ అన్ని క్రింది కమిటీలకు అన్వయించుతుంది.

6. అఖిలభారతకిసాన్ సభ కాన్ఫరెన్స్ బీహారులో జరుపుటకు చిక్కులున్నందున, రెండు పార్టీలు బెంగాలులో జరుపుటకు అంగీకరించాయి. అదేవిధంగా కాన్ఫరెన్సుకు సన్నాహాలు కొనసాగించుమనికోరాలి.

7. కాన్ఫరెన్సు తేదీలను బెంగాలు కమిటి నిర్ణయించుతుంది. అక్టోబరు 1967లో జరుపుతున్న కాన్ఫరెన్సుకు సన్నాహాలు చేస్తుంది.

8. అన్ని రాష్ట్ర జిల్లా కాన్ఫరెన్సులు సెప్టెంబరు 1967 చివరకు పూర్తికావాలి.

9. కేంద్ర కిసాన్ కౌన్సిలు తదుపరి మీటింగు ఆగస్టు 1967లో జరగాలి.

10. రెండు పార్టీలు పంజాబ్ రాష్ట్ర కమిటీని సమానప్రాతినిధ్యంతో అడ్‌హాక్ కమిటిని యేర్పాటు చేసుకొని కా॥దిలిప్‌సింగ్ తపియాలాను కన్వీనరుగా నియమించాలి. అడ్‌హాక్ కమిటీయే జిల్లా, రాష్ట్ర కాన్ఫరెన్సులను పరస్పరం సర్దుబాటు చేసుకొని యేర్పాటు చేస్తుంది.

11. హర్యానాలో గూడ అదే నమూనా విధానాన్ని అనుసరించి, చత్తర్‌సింగ్‌ను కన్వీనరుగా చేసి మిగతా కార్యక్రమాన్ని నిర్వహించాలి.

12. అన్ని క్రమశిక్షణా చర్యలను ఆఫీసు భాధ్యులు, తదితరులపై తీసుకొన్నవాటిని, యిరుపక్షాలు రద్దు చేయాలి. అఖిల భారత కిసాన్ సభ సమావేశం రద్దయిపోతుంది. వివిధ కమిటీలు ఆఫీసు భాధ్యులు అందరూ తమతమ 1961-62 పూర్వస్థానాలను తిరిగి స్వీకరిస్తారు.

ఒప్పందపుపై షరతులను సి.పి.ఐ(యం), సి.పి.ఐల తరపున ఎ.కే గోపాలన్, జడ్.ఎ.అహమ్మద్, జగత్‌సింగ్ లాయల్పురీలు ఆమోదపు సంతకాలు చేసారు. ఈ వొప్పందం సంతకాలు జరిగిన 10-7-1967 నుండి అమలుకువచ్చింది.

## రాజకీయ వాస్తవికతా వొప్పందంపై స్వీయ మానసిక ధోరణులు ఆధిక్యత

అవసరాల నిమిత్తం జరిగిన వొప్పందాలు రాజకీయ సైద్ధాంతిక అభిప్రాయాల తీవ్రత రాజకీయ ప్రయోజనాల అవసరాల ముందు నిలబడ జాలకపోయాయి. పోటీలో యేర్పరచబడిన నూతన శాఖలు సి.పి.ఐ; సి.పి.ఐ(యం)లచే యేర్పరచబడినవి. అవి రైతాంగ ప్రయోజనాలకై రూపొందవలసిన ఐక్యరైతాంగ ఉద్యమాల కంటె, ఆయా పార్టీల స్వప్రయోజనాలు, తమ బలాన్ని పెంపొందించు కొనగలందులకు యేర్పరచినవి, వాటికి మౌలిక శక్తులై రెండు పార్టీల మధ్య సహకార భావన కంటె పరస్పర శతృభావం తీవ్రమైనపుడు 1961-62 నాటి కమిటిల క్రమశిక్షణలకు లోబడి వుంటారనుకొనుట అడియాశయే అగుతుంది. పశ్చిమబెంగాల్, కేరళలు తప్ప మిగిలిన రాష్ట్రాల నుండి రాష్ట్ర కమిటీల ద్వారా సభ్యత్వపట్టికలను రుసుము పంపుట జరకుగలేదు. ఇది ఇటీవల జరిగిన వొప్పందాన్ని వుల్లంఘించుటయేయని వేరుగా చెప్పనవసములేదు. కిసాన్ సభల విషయంలో సి.పి.ఐ యీవిధంగా వ్యవహరించితే, ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు విషయంలో

సి.పి.ఐ.(యం) వ్యవహరించి యుండుటలో ఆశ్చర్యంలేదు. ఇరువురూ, అవలంబించిన ఎత్తుగడలు వొకటే, పైకమిటీలు సి.పి.ఐ(యం) నాయకత్వంలో వుంటే సి.పి.ఐ నాయకత్వంలోని శాఖలు వొప్పందాన్ని వ్యతిరేకించాయి. అదే విధంగా పై కమిటీలు సి.పి.ఐ. నాయకత్వంలో ఉంటే సి.పి.ఐ(యం) నాయకత్వంలోని శాఖలు ఒప్పందాన్ని వ్యతిరేకించాయి.

ఎవరు వొప్పందాన్ని ఎన్నిచోట్ల వ్యతిరేకించారు అన్న దానిలో అభిప్రాయభేదానికి అవకాశముంది కాని యిద్దరూ, అవసరము, వీలైనది అనుకొన్నచోట్ల వ్యతిరేకించారు అన్నది అందరూ ఆమోదించుతారు.

జాతీయ కాంగ్రెసులో వివిధ బూర్జువా వర్గాల గ్రూపులు ప్రజలలో తమతమ కార్యకర్తల శ్రేణులలో, ఒకరి మించి మరొకరు బలంగా వున్నామని ప్రచారం చేసుకొనుటకు ఎన్నికలలో ఎక్కువమంది తమ గ్రూపు ప్రతినిధులను పొందుటకు "బూటకపు సభ్యతాన్ని" ఒకరిని మించి మరొకరు చేర్పించి, తమ జేబులలోని డబ్బును సభ్యత్వరుసుముగా పంపిన "బూర్జువా సాంప్రదాయాన్ని" ప్రజాసంఘాల సభ్యత్వాన్ని "మితవాద","అతివాద" కమ్యూనిస్టువర్గాలు అనుసరించాయి. కమ్యూనిస్టుపార్టీలలో కూడ ఆచరణలో నిర్మాణసూత్రాలను ఉల్లంఘించి, లేక సవరణలు ఆమోదించి, "లాకుల షట్టర్లనెత్తి" పోటాపోటీగా ధన, భుజబల, సమాజవ్యతిరేక శక్తులకు సభ్యత్వాలనిచ్చి, ఆశ్రయం కల్పించారు. చీలి రెండు కమ్యూనిస్టుపార్టీలుగా అయిన కమ్యూనిస్టుశ్రేణులు, వొక్క దశాబ్దంలో ఉమ్మడి కమ్యూనిస్టుపార్టీ సభ్యత్వాన్ని మూడు రెట్లుగా పెంచుట 9,10వ. పార్టీ కాంగ్రెసుల నిర్మాణ నివేదికలలోని అంకెలు స్పష్టం చేస్తాయి. పార్టీలు రెండూ, ప్రజాసంఘాలు పోరాటశక్తిని, వాసినికోల్పోయి బూర్జువాపార్టీలవలె లారీలలో ప్రజాసామాన్యాన్ని సమావేశాలకు, మహాసభలకు చెరవేసే నూతన "విప్లవ సాంప్రదాయాన్ని నెలకొల్పారు. ఎర్రజెండాలతో కాలినడకన, సద్దిఅన్నపు మూటలతో దారి పొడుగునా వున్న గ్రామాలలో ప్రచారం చేసుకొంటూ, మహాసభలకు తండోపతండాలుగా వచ్చే 1944 సత్సంప్రదాయంకానరాకుండా పోయింది. మహాసభలకు ఒక్కొక్కరూపాయి, వొకరోజుకూలిగా లక్షల ప్రజాసామాన్యంనుండి రాజకీయ ప్రచారంగా చందాలు సేకరించే సాంప్రదాయంపోయి, వందలమందినుండి లక్షల కొలది సేకరించే "నూతన విప్లవప్రజాసాంప్రదాయం" నెలకొన్నది. ఎంతమందినుండి నిధిని సేకరించామనే కొలమానంపోయి ఎంత తక్కువ కాలంలో ఎంతకొద్దిమంది నుండి ఎంత నిధి మొత్తాన్ని సేకరించామనే కొలమానం వచ్చింది. కమ్యూనిస్టుపార్టీల మధ్య పెరిగిన పోటీ తత్వప్రభావం కారణంగా తాలుకా, జిల్లానాయకత్వాలలో ఎన్నో అవాంచనీయ బూర్జువా వర్గపు లక్షణాలు ప్రబలి, కమ్యూనిస్టుపార్టీ వర్గ నైజములో మార్పులు వచ్చాయి. ఏవర్గం నుండి వచ్చినా కమ్యూనిస్టులు కార్మికవర్గ లక్షణాలను, వర్గ చైతన్యాన్ని, సంస్కృతిని పెంపొందించుకొనాలనే లక్ష్యం "పలుచబారి" నిక్కర్లు పోయి ప్యాంటులు, హాఫ్ షర్టులు పోయి, లాల్చీలు చివరకు అంచు డోవతుల బూర్జువా సంస్కృతి మొలకెత్తింది.

## కేంద్రకిసాన్ కౌన్సిలు నుండి "వాకవుటు"

సంయుక్తంగా నిర్ణయించబడిన కేంద్ర కిసాన్ కౌన్సిలు సమావేశం 29 ఆగస్టు 1967న మద్రాసులో జరిగింది. కిసాన్ సభ సభ్యత్వం రుసుం, లిస్టులు 4 లక్షల సభ్యత్వంపైగా వొప్పందాన్ని అతిక్రమించి, కేంద్రకిసాన్ కౌన్సిలుకు ఆలస్యంగా చేరినందున ప్రధాన

వివాదాంశమైంది. జాతీయ కాంగ్రెసులోని గ్రూపులవలెనె కిసాన్ సభలోని కమ్యూనిస్టుశ్రేణులు జేబులోని డబ్బులు కట్టి "బోగసు సభ్యత్వ అధికోత్పత్తిని" పెంపొందించాయి. ఈవిధంగా రెండు కమ్యూనిస్టుపార్టీలు పరస్పరం వాస్తవాలను నిందా ప్రచారంగా సాగించారు. రాష్ట్ర కిసాన్ కమిటి సిఫార్సు చేసిన సభ్యత్వాన్ని కూడ కేంద్ర కిసాన్ కౌన్సిలు ఆమోదించలేదంటే కారణం వొకటే ఆ రాష్ట్ర కిసాన్ కమిటి ప్రత్యర్ధి కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంలో వుండినందున జరిగింది. స్వవిషయంలో ప్రత్యర్ధిని అణచివేయాలనే నిర్ణయం జరిగితే యేప్రజాస్వామ్య సూత్రాలు అడ్డుపడజాలవు. హరిదాసు "గోంగూర" చందాన ప్రజాస్వామ్యం యితరులు అనుసరించుటకే తమకు మాత్రం ఆజీర్తిని కలుగజేస్తుంది. ఇవి, వొకరికిసాన్‌సభ శాఖలను మరొకరు "ఆక్రమణ" చేయు ఎత్తుగడలు. ఈ ఎత్తుగడలు సాధారణ రాజకీయ వ్యూహాన్ని కూడ అతిక్రమించి, తరచుగా మొత్తం రాజకీయ పంధానే ప్రక్కదారులు పట్టించాయి. అందుకే, కమ్యూనిస్టు శ్రేణులలో "మాటకు–చేతలకు" దూరం పెరిగిపోయి, సంబంధం తెగిపోయినందున విశ్వాసం సన్నగిల్లింది. ఆశయవిశ్వాసం, ఆత్మవిశ్వాసం కోల్పోయిన తరువాత యేమి జరుగుతుందో అదే కమ్యూనిస్టుశ్రేణుల నాయకత్వంలోని కిసాన్ ఉద్యమంలో జరిగింది.

కిసాన్ సభలో సి.పి.ఐ వారి "ఆక్రమణ" ఎత్తుగడలు విఫలమైనందునవారు కేంద్రకిసాన్ కౌన్సిలు నుండి "వాకవుటు" చేసారని సి.పి.ఐ(యం) అంటున్నది అక్షరాల వాస్తమే అయినా, ట్రేడుయూనియన్ కాంగ్రెసులో సి.పి.ఐ(యం) వారి "దురాక్రమణ" ఫలించపోవుటతో సెంటర్‌ఫర్ ఇండియన్ ట్రేడు యూనియన్స్ "సిటు"ను యేర్పాటు చేసారని సి.పి.ఐ అంటున్నది అక్షరాల నిజమే అయినా, ఆఎత్తుగడల కాపీరైటు సి.పి.ఐ(యం)ది, సి.పి.ఐ కాపీ చేసింది అనేదే వాస్తవము. రెండు కమ్యూనిస్టుపార్టీలు అందరికి తెలిపే సత్యంవొకటే. ఏ ప్రజాసంస్థలోనైనా పెత్తనం సాగనప్పుడు, ఆక్రమణ కూడ సాధ్యం కానపుడు, పోటీ సంస్థను యేర్పాటు చేయుట ఆచరణలో జరిగిన "అసలు సిసలైన సత్యం", నూటికి నూరు పాళ్ళు విశ్వసించ తగినసత్యం.

"ఈవిధంగా 1964లో సి.పి.ఐ.అధికారికంగా చీలి పోగా, "మితవాద కమ్యూనిస్టుల నాయకత్వంలోని కిసాన్ సభలోని నాయకులు, ఆగస్టు 1967లో "ఎ.ఐ.కె.యస్" నుండి చీలిపోయి, వారి పోటీ "ఎ.ఐ.కె.యస్" కేంద్రాన్ని కొన్ని వారాల తరువాత యేర్పాటు చేసారు. వారు తమ కిసాన్ మహాసభను మహారాష్ట్రలోని అమరావతిలో మార్చి 1970లో 20వ మహాసభ పశ్చిమబెంగాల్‌లోని బారాసాత్‌లోను, మూడవ మహాసభ పంజాబ్‌లోని భటిండాలో సెప్టెంబరు 1973లోను జరిపారు.[1]

"గతరెండు సంవత్సరాలలో మాకిసాన్ సభ, సి.పి.ఐ.(యం) నాయకత్వంలోనికిసాన్ సభతో ఐక్యకార్యాచరణ ప్రజా సంయుక్త పోరాటాల విషయమై ఒక అవగాహనకు వచ్చుటకు అనేక చొరవలను తీసుకొన్నది. మా కేంద్ర కిసాన్ కౌన్సిలు 1969 ఏప్రిల్‌లో ఆమోదించిన తీర్మానం ఆ చొరవలను యిలీ తెలియ జేసింది.[2]

---

*1. రసూల్, యం.ఎ. (1974) ఎ హిస్టరి ఆఫ్ ది ఆల్ ఇండియా కిసాన్ సభ – నేషనల్ బుక్ ఏజన్సీ, పే.353-4.*

*2. ఆహ్మద్, జడ్.ఎ. (1970) 20వ, ఎ.ఐ.కె.యస్. మహాసభ బారాసత్ ప. బెంగాల్ (ఆంగ్లంలో) ఏప్రిల్ 1970 జనరలు శెక్రటరీ రిపోర్టు, ఎ.ఐ.కె.యస్.పబ్లికేషన్ పే. 79-80.*

"ఎ.ఐ.కె.యస్." ప్రజాసంఘాల ఐక్యతా మౌలిక సూత్రాలను ధృఢంగా విశ్వశించుతు, సత్వరం రాష్ట్రంలో కేంద్రంలో రెండు ఆలిండియా కిసాన్ సభల సమన్వయ కమిటిని ఏర్పరచి, పురోగమించుటకు సంయుక్త ప్రజాకార్యాచరణ రూపొందించాలని కోరుతున్నది. అన్ని శాఖలకు కా.ఎ.కె.గోపాలన్, హెచ్.కె.కొనార్‌ల నాయకత్వంలోని అఖిలభారత కిసాన్ సభ కార్యకర్తలను కలుసుకొని ఆయాస్థాయిలలో సమన్వయ కమిటీలను ఏర్పాటు చేయగల అవకాశాలను పరిశీలించవలసినదిగా కోరుతన్నదని" ఆ నివేదికలో తమ మౌలిక విధానాన్ని ఆచరణ దృక్పధాన్ని వివరించారు. అదే నివేదికలో జనవరి 1968లో తాము "పోటీకిసాన్ సభను" ఎందుకు ఏర్పాటు చేయవలసి వచ్చిందో యిలా వివరించారు. "త్రిచూర్‌లో 1962 కిసాన్ మహాసభ అనంతరం సుదీర్ఘస్తబ్ధత, క్షీణతలో కూరుకొని పోయినదేశంలో కిసాన్ ఉద్యమాన్ని పునర్నిర్మించు ప్రయత్నంలో అమరావతి మహాసభ (1968) ఒక నిర్ణయాత్మకమైన మలుపు" అని పేర్కొన్నది. అంతేగాక "అమరావతి మహాసభ అనంతరం కిసాన్‌సభ ఉద్యమం సత్వరం పునర్నిర్మించుట, రైతాంతగ శక్తులను పునర్మించుట, దేశంలో అన్నిప్రాంతాలలో కిసాన్ సభ సంస్థను జీవంపోసి, పునరావాసం కర్పించుట, మా యొక్క నిర్ణయం సరియైనదని, మేము పునర్నిర్మించి, అఖిలభారత కిసాన్ సభను సరైన ప్రజాస్వామ్య పునాదిగా నెలకొల్పుటకు తీసుకొన్న చొరవ సరియైనదని తేలిందని" మరోకిసాన్ సభను ఏర్పాటు చేయుటను సమర్ధించుకొన్నారు. ఇది సరిగా మరో అఖిల భారత ట్రేడు యూనియను సంస్థను" సెంటర్ ఫర్ ఇండియన్ ట్రేడు యూనియను"ను కలకత్తాలోని రంజి స్టేడియంతో మే 1970లో ఏర్పాటు చేసిన "లెనిన్ నగర్"లలో యిదే విధమైన సమర్ధన జరిగింది.

ఈ సాకులు, వివరణలు, సమర్ధనలు అన్నీ సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)ల అగ్రనాయకత్వాలు తమతమ రాజకీయ సైద్ధాంతిక ప్రాతిపదికలపై రాజకీయ నిర్ణయాలుగై కొన్న తరువాత, వాటిని ఆచరణలో పెట్టుటకు తమ తమ శ్రేణుల విశ్వాసాలను సడల కుండా జాగ్రత్తలు వహించుటకై రూపొందించు కొన్న కుంటి సాకులు, వాదనలు, సమర్ధనలు తప్ప, "విప్లవం" వారి ఏజెండాలలోనికి వచ్చి, తులపులు తట్టుచున్నందున తీసుకొన్ననిర్ణయాలు కావు. కమ్యూనిస్టు శ్రేణులలో ఎవరు యేకారాణాలు చెప్పినా అఖిలభారత కార్మిక, కర్షక బడుగు వర్గాల సంఘాలలో తెచ్చిన చీలికలు పెటీబూర్జువా, స్వీయమానసిక, నాయకత్వం ధోరణలు ప్రకోపించినందున, శాస్త్రీయ సమాలోచన, అధ్యయనం, దృక్పదము కొరవడుటవలన జరిగింది. శాస్త్రీయ సోషలిస్టు రాజకీయ, సైద్ధాంతిక నిర్మాణ, ఆచరణల ఉత్కృష్టలతో కార్మిక, కర్షక, పీడిత, బడుగు వర్గాల చైతన్యాన్ని సంఘటిశక్తుల బలాన్ని పెంపొందించుటతో మొత్తం శ్రేణుల బలంపెరగాలి కాని సంఘాలు చీల్చి, వర్గాల ఐక్యతకు చేటుతెచ్చివాటి పోరాటశక్తిని బలహీనపరచే ఏచర్యయైనా, ఎవరు యేమిచెప్పి చేసినా వర్గ శక్తులకు విద్రోహం చేయుటయే అగుతుంది. గతరెండు, మూడు దశాబ్దాల కార్మిక, కర్షక చరిత్ర యీ శాస్త్రీయ సత్యాన్నే చాటింది. శ్రామికవర్గాల పోరాట శక్తులకు కలిగిన నష్టాన్ని గుర్తించిన కమ్యూనిస్టు శ్రేణులు అఖిల భారత సమన్వయ కమిటీల రూపంలో దశాబ్దకాలంపైగా ఐక్యకార్యాచరణను రూపొందించే విఫల ప్రయత్నాలు జరిగాయి. విజయం పొందజాలక పోవుట, వారు చీలికలతో కలుగ

జేసిన చారిత్రక నష్టం ఎంతటి తీవ్రమైనదో, కోల్పోయిన ప్రజా విశ్వాసాన్ని పునరుద్ధరించుట ఎంతటి కష్టతరమో తెలియజేస్తున్నది.

కిసాన్ సభ చరిత్రలో బూర్జువా వర్గరాజకీయపార్టీలు స్వప్రయోజనాలకు, తమపార్టీల నాయకత్వాలను, ఆధిపత్యాలను నెలకొల్పుటకు చేసిన ప్రయత్నాలలో భాగంగా, కిసాన్ సభను, ట్రేడు యూనియనును వివిధ కాలాలలో చీల్చారు. వారికి కార్మిక, కర్షక, బడుగు వర్గాల ప్రయోజనాలు, అందుకు సమిష్టిపోరాటాలు ముఖ్యంకాదు. వారి వర్గ, రాజకీయ పార్టీల ప్రయోజనాలు ముఖ్యం. కార్మిక వర్గ పార్టీలైన కమ్యూనిస్టు పార్టీలకు ఆవర్గ ప్రయోజనాలు తప్ప మరో ప్రయోజనాలుండవు. అయితే, కమ్యూనిస్టు పార్టీలు అన్యవర్గనాయకత్వంలో లేక అన్యవర్గ ప్రభావాలలో, స్వీయమానసిక అశాస్త్రీయ ధోరణల ప్రభావంలో మునిగిపోయినందున మార్క్సిస్టు-లెనినిస్టు శాస్త్రీయ వివేచనా, అవగాహనలు మనకబారుటతో యీ చీలికలు వచ్చాయి, వస్తవి.

## అమరావతి పోటీకి కిసాన్ సభ

నూటికి 75 శాతం వ్యవసాయంపై ఆధారపడిన సెమిఫ్యూడలు, సెమివలస 100 కోట్ల జనాభాకల, వెనుకబడిన భారతదేశంలో వర్గచైతన్యంగల పేదరైతాంగ ఐక్యఉద్యమం, బలమైనది, నిర్మాణయుతమైనదిగా ఉండ వలసిన అవసరం ఎంతోవుంది. జాతీయ ప్రజాసామ్యవిప్లవం విజయవంతమై జనతా ప్రజాసామ్య విప్లవంగా పురోగమించుటకు అవసరం. విశాలమైన హిందీ భాషా ప్రాంతాలు చాలావరకు నిర్మాణయతము, బలమైన కిసాన్ వుద్యమానికి దూరంగానే వుండిపోయాయి. ప్రధానంగా సెమిఫ్యూడలు బడుగురైతాంగం అదే ప్రాంతాలలో అసంఘటితంగానే వుండిపోయింది.

జాతీయ ప్రజాస్వామ్య కర్తవ్యాలలో ప్రధానంశమైన అభ్యుదయకర భూసంస్కరణలకై అత్యధిక సంఖ్యాక రైతాంగాన్ని, వ్యవసాయకూలీలను వారికి మద్దతుగా కార్మిక వర్గాన్ని సమీకరించి పోరాటాలు సాగించవలసిన కర్తవ్యం అలాగే వుంది. కారణం, భారతరైతాంగపు ప్రధాన సంస్థయైన అఖిల భారత కిసాన్ సభ బలోపేతమైన రైతు, వ్యవసాయకూలీ మహోద్యమాల నిర్మాణంగా చేయవలసిన కర్తవ్యం యెడల అశ్రద్ధ చిరకాలంగా సాగుటతో పక్షపాతానికిగురైంది. ఒక్కమాటలో కిసాన్‌సభ నైజాన్ని అనగా ధనికరైతు, మధ్యతరగతుల సంస్థ స్వరూపాన్ని శ్రామిక పేదరైతాంగ పోరాట సంస్థగా రూపొందించివలసిన, నూతన దృక్పధం ఆచరణలో కానరాకుండా పోయింది. గత 7సంవత్సరాల విలువైన కాలం, సదవకాశాలు సాంవత్సరిక మహాసభలు జరిపి, వ్యవసాయ సమస్యలు పరిశీలించి, సమీక్షించి, బేరీజు వేసుకొని సరియైన తక్షణ కర్తవ్యాలను, విధానాలను రూపొందించుకొని, రైతాంగ పోరాటాలకై సమీకరించి పోరాడవలసిన సదవకాశాలు కోల్పోవుట జరిగింది. అంతేగాక, రెండుమహాసభల మధ్య నిర్మాణ నిబంధనల ప్రకారం ఆరుమాసములకు వొకసారి జరుగవలసిన అఖిలభారత కిసాన్ సమితి సమావేశం 1961మార్చి తరువాత వొక్క సమావేశం కూడ జరుగలేదు. కిసాన్ సభ సమితి సభ్యులు నిబంధనల ప్రకారం, మూడవవంతు సంతకాలు చేసి "రిక్విజిషన్" సమావేశాన్ని యేర్పాటు చేయవలసిందిగా కోరినా యేర్పాటు చేయలేదు. దీనితో అసంతృప్తిపడిన అధ్యక్షుడు, జనరలు శెక్రటరీలు, వారిపార్టీ "సి.పి.ఐ(యం) వలెనె విచ్ఛిన్నకర చర్యలు కొనసాగిస్తూ" అన్ని ప్రజాస్వామ్య

సూత్రాలు పద్ధతులు, పనివిధానాలను, ప్రమాణాలను త్రోసిబుచ్చి 1966నుండి మెజారిటి రాష్ట్ర కిసాన్ సభలను రద్దు చేయుటయేగాక, 1967మధ్యలో దగ్గర దగ్గరగా 50లక్షల ప్రాధమిక సభ్యత్వానికి మాట, వోటు లేకుండా అఖిలభారత కిసాన్‌సభ అగ్రనాయకత్వం చేసింది. ఇది కిసాన్ సభ సభ్యులను, కార్యకర్తలను రాజకీయ చైతన్యాన్ని కలిగించి, తమ రాజకీయాలకు ఆకర్షించి, సమీకరించుటకాదు. బూర్జువా, పార్టీలు కేంద్ర రాజకీయపార్టీల ఆఫీసులను చేజిక్కించుకొన్న తరువాత, వాటిని యేవిధంగానైనా అంటిపెట్టుకొనదలచి ఆడే "బూర్జువా రాజకీయాల ఆట"

" ఇట్టి పరిస్థితులలో అఖిలభారత కిసాన్ కౌన్సిల్ మెజారిటి సభ్యులు 19వ, ఎ.ఐ.కె.యస్. మహాసభ జరుపనిర్ణయించి, మహారాష్ట్రలోని అమరావతిలో విజయవంతంగా జనవరి 10-12, 1968 లలో జరిపారు. ఈ కిసాన్‌సభ ప్రజాస్వామ్యాన్ని పునరుద్ధరించుతుందని, చురుకుగా రైతాంగాన్ని, సమస్యలపై సమీకరించి, పోరాటాలు చేబట్టుతుందని ఆశించారు సరియైన విధానాలను నినాదాలను మారిన దేశ పరిస్థితులలో ప్రత్యేకంగా వ్యవసాయరంగంలో రూపొందించి, పురోగమిస్తుందని ఆశించారు.

"కిసాన్ సభలో విచ్ఛిన్నకరచర్యలతో" పక్షపాతరోగగ్రస్థ స్థితికి దిగజార్చే పరిస్థితి, పాత్రను సి.పి.ఐ(యం) నాయకత్వం చేబట్టుటతోవపాటు, పార్టీ స్థాయిలో వ్యవసాయరంగంలో మాస్వంతవైఫల్యం మరచి పోరాదు. రాష్ట్ర, తదితర శాఖలు ప్రజాసంఘాలను వాస్తవ ప్రజాసంఘాలుగ విస్తృత పరచే కర్తవ్యం యెడల తగినంత శ్రద్ధ తీసుకొనుటలో విఫలమయ్యాయి. పార్టీ 7వ, కాంగ్రెసు నిర్ణయమైన, కిసాన్ డిపార్టుమెంటులను యేర్పరచుటను రాష్ట్రాలలో అన్ని స్థాయిలలో చేయలేదు". కొన్నిచోట్ల యేర్పాటుచేసినా, అవి పనిచేయక "పేపరు నిర్మాణాలు" గానే వుండిపోయాయి. కేంద్రంలో కూడ అదే జరిగింది. ప్రముఖపార్టీ కార్యకర్తలు ముఖ్యంగా రైతురంగంలో పనిచేయువారు, నాయకులతో, ఒక కన్వెన్షన్ 1-3 జనవరి 1966 లలో జరిగింది, కాని నిర్ణయాలను యేమాత్రం ఆచరణలో పెట్ట ప్రయత్నించలేదు.

అంతేగాదు "ఇంతవరకు వ్యవసాయరంగంలో ప్రజాపందాను రూపొందించుటలో నేటినూతన పరిస్థితులలో కార్యకర్తలకు ఆపరిజ్ఞానాన్ని అందించుటలో విఫలమయ్యాయి. కార్యక్రమంలో వ్యవసాయరంగ విషయంలో విశాల వర్గ సంబందాల విశ్లేషణచేసి, అభివృద్ధి పథాన్ని అది రైతాంగాన్ని యెలా ప్రభావితం చేసేది తెలిపింది. పార్టీ కాంగ్రెసు తరువాత, రైతురంగంలో పనిచేసే కార్యకర్తల కన్వెన్షన్ జరిగింది. రైతాంగం యెదుర్కొంటున్న సమస్యలపై వుపయోగకరచర్చలు జరగాయి. కోర్కెలు రూపొందించబడినాయి. అయినా, ప్రజాకార్యాచరణ ప్రణాళిక బలంగా శక్తివంతంగా ఆచరణలో పెట్టలేదు. సి.పి.ఐ(యం) విచ్ఛిన్నకర చర్యలను లెక్కచేయకుండా, ప్రజాసంఘాల కార్యాచరణను వుధృతం చేయుట కార్యకర్తలకు తగిన శిక్షణ యిచ్చుటలో సి.పి.ఐ విఫలమైంది. అంచేత పరిస్థితులను చక్కబరచుటకు యీ క్రింది చర్యలను సి.పి.ఐ చేబట్టనిర్ణయించింది.

కేంద్రంలో కిసాన్ శాఖను అనుభవం కలిగిన చురుకైన కార్యకర్తలను సమీకరించి, వారు తమ కాలాన్ని, శక్తిని యీ రంగానికి వినియోగించునట్లు చేయాలి. కేంద్రంలో

వ్యవసాయ కూలిరంగానికి వొక ప్రత్యేకశాఖను యేర్పాటుచేసి, రాష్ట్రాలలో కిసాన్ సభలో శాఖలను యేర్పాటు చేసి, అఖిలభారత వ్యవసాయకూలి సంఘాన్ని యేర్పాటు చేయుటకు సన్నాహాలు. ప్రారంభించాలి. ఈ నిర్మాణానికి సహాయం చేయుటకు గ్రామసీమలోని పార్టీ శాఖలను కదిలించాలి. విస్తృత ప్రజాసంస్థగా కిసాన్ సభను నిర్మించి, బలోపేతం చేయాలి. దాని ప్రాతిపదికగా, మొట్టమొదటసారిగా బీదరైతాంగాన్ని మౌలికంగా చేసుకోవాలి. అదే కాలంలో మనకిసాన్ సభ పునాదిని, విస్తృతం చేసి, యితర రాజకీయశక్తులను కార్యాచరణలోపాల్గొనునట్లు చేయాలి. రెండు ప్రజాసంఘాలలో అన్ని స్థాయిలలో పని చేయుటకు కార్యకర్తలను కేటాయించి కేంద్రీకరించి పనిచేయునట్లు కార్యకర్తలకు ప్రత్యేకపార్టీ తరగతులు నిర్వహించాలి. కేంద్రపాఠశాలలో ప్రారంభించి, రాష్ట్రాలకు విస్తరించబడాలి. ఎ.ఐ.కె.యస్. ఐక్యతను పునరుద్ధరించుటకు, ఐక్యకార్యాచరణ పెంపొందించుటకు, నిరంతరం ప్రయత్నించి, విజయం పొందాలి. వ్యవసాయరంగానికి చర్చించి, వొక ప్రజాపంథాని రూపొందించి, నిర్దిష్ట స్వరూపాన్ని చేకూర్చాలి.[1] అనే నినాదాన్ని సి.పి.ఐ. చేపట్టింది.

# 6

# మార్క్సిజం, లెనినిజం : ప్రజాసంఘాలు.

కార్మికవర్గం ఆర్థిక పోరాటాలపై మార్క్సు దృక్పధం, మౌలిక అవగాహన, కార్మికవర్గం తనవర్గం కొరకై పోరాట దృష్టిని కేంద్రీకరించవలసిన అవసరాన్ని గుర్తించి, బూర్జువావర్గం-కార్మికవర్గాల మధ్య లక్ష్మణరేఖను అవగాహన చేసుకొని, వర్గ ఐక్యతను పెంపొందించుకొని. సుస్థిరం చేసుకొని బూర్జువావర్గానికి ప్రతిద్వందిగా నిలబడే శక్తిగా చేయతలపెట్టింది. ఇదే వివిధ మార్క్సురచనలలో సూదిలో దారంలాగా కొనసాగింది. ఈ అవగాహనే ట్రేడు యూనియనులపై మార్క్సు దృక్పదాన్ని నిర్ధేశించింది. వాటి కర్తవ్యాలను, వర్గపోరాటాలలో కార్మికవర్గ సాధారణ పాత్రను స్పష్టంచేసింది.

"శ్రామికవర్గం వొకవర్గంగా రూపొందుట, తన కొరకే పోరాడుట, వర్గపోరాటసిద్ధాంతాన్ని, వ్యూహాన్ని, ఎత్తుగడలను అవగాహన చేసుకొన్నపుడే సాధ్యమగుతుంది. మార్క్సు 1852 మార్చిలో వెడ్మేయర్‌కు వ్రాసిన లేఖలో తాను వర్గపోరాట సిద్ధాంతాన్ని కనుగొనలేదన్నాడు. నేను కొత్తగా రుజువు చేయగలిగింది. 1) ఉత్పత్తి అభివృద్ధిక్రమంలోని వొక చారిత్రక దశలో వర్గాలువున్నవని, ఉత్పత్తికి సంబంధం కలిగివున్నవని 2) వర్గపోరాటం తప్పనిసరిగా కార్మికవర్గ నియంతృత్వానికి దారి తీస్తుంది. 3) వర్గాలను రూపుమాపి, వర్గాలులేని సమాజ నిర్మాణంలో నియంతృత్వంతాత్కాలిక వొకదశయని కొత్తగా చెప్పానన్నారు.[1]

మార్క్సు విశిష్టత, వర్గపోరాట సిద్ధాంతాన్ని ఆర్థిక వునాదిపై సుస్థిరంగా ప్రతిష్టించుటయేగాక, ఆర్థిక విశ్లేషణ చేసి రాజకీయ, ఎత్తుగడల సూత్రాలను రూపొందించి, కార్మికవర్గం బూర్జువా వర్గాల వుద్యమ సామరస్యవంతెన నిర్మాణానికి వ్యతిరేకంగా రాజీలేని పోరాటాన్ని నిర్ధాక్షిణ్యంగా సాగించుటలో వుంది. కార్మికవర్గాన్ని సైద్ధాంతికంగా, రాజకీయంగా, బూర్జువావర్గపు ద్వితీయశ్రేణి ఆయుధంగా చేయనెంచేవారిని చెండాడాడు. వేతనం, అదనపువిలువ, పనివిలువ, విలువ సిద్ధాంతాలను రూపొందించి, కార్మికవర్గపు పదునైన పోరాటసాధానాలుగ చేసాడు. మార్క్సు యేచిన్న రాజకీయ కార్యాచరణ సాధ్యపడినా, రచన ప్రక్కన పెట్టి, పాల్గొన్న విప్లవకారుడని ఎంగెల్సు శ్లాగించాడు. "సంతోషం అంటే నీ ఉద్దేశంలో యేమిటి అని ప్రశ్నించితే "పనిచేయుట" అని అన్నారని, ఏంగెల్సు వ్రాసారు.

మార్క్సు ట్రేడు యూనియనులు అప్పుడే యేర్పడి ఫ్రాన్సు ఇంగ్లండు దేశాలలో వొక స్వరూపాన్ని చేకూర్చుకొని పరస్పరసహాయాన్ని ఆర్థిక పోరాటాలను సాగించుతున్న దశలో రాజకీయంగా, సామాజికంగా ఆలోచించ మొదలుపెట్టాడు. బీజప్రాయమైన నిర్మాణాలను, సైద్ధాంతికంగా వివిధ ఆదిమ ఆలోచనావిధానాలు, అవగాహనలను, అస్పష్టతలను చూసాడు. కార్మికవర్గం పాలుత్రాగే దశలో దాని అభివృద్ధి, దాని చారిత్రాత్మకపాత్రను

---

*1.లోజోవస్కీఎ. (1933) మార్క్సు అండ్ ది ట్రేడు యూనియన్స్ పి.పి.హెచ్. బాంబే 1948 పే.6.*

గ్రహించగలుగుటలోనే, నిశిత శాస్త్రీయ పరిశీలన అవగాహనాశక్తి అవగహన మగుతుంది. బ్రిటనులో ఆర్థిక సమ్మెలతోపాటు, వోటు హక్కుకై కూడ పోరాద సాగింది.

మార్క్సు ట్రేడు యూనియనులను కార్మికవర్గ శక్తులను, సంఘాలను నిర్మాణాత్మకంగా సమీకరించే కేంద్రాలుగా, ప్రాథమికవర్గ చైతన్యాన్ని శిక్షణ యిచ్చేసంఘాలుగా నెంచారు. విడివిడిగా దూరంగా త్రోసివేయబడి వొకరితోవొకరు పోటీపడుతువుండేవారు వొకరివొకరు దగ్గరై సమిష్టిగా ముందుకు వచ్చుట ట్రేడు యూనియనులలో జరుగుటతో కార్మికవర్గం వొక స్వతంత్రశక్తిగా అభివృద్ధి చెందగలదనే విశ్వాసం అతనిలో కలిగింది. మార్క్సు, ఎంగెల్స్ యిరువురూ తమరచనలలో ట్రేడు యూనియనులను సహకార, సౌభాతృత్వాన్ని సోషలిజాన్నిచ్చే పాఠశాలలుగా పేర్కొన్నారు. అంతర్జాతీయ కార్మికోద్యమం నాడు ప్రాథమిక దశలో వున్నందున నాటి అంతర్జాతీయ సమావేశాలలో లేవనెత్తజాలని అనేక కార్మిక, సైద్ధాంతిక సమస్యలను వారి ఉత్తర, ప్రత్యుత్తరాలలో లేవనెత్తారు.

కార్మిక సంఘాలు సోషలిజపు పాఠశాలలు, అనే దానికే మార్క్సు పరిమితంకాక తన అవగాహన, దృక్పథాన్ని అన్ని కోణాలనుండి కార్మిక సంఘాల సమస్యలను విస్తృతంగా అధ్యయనం చేసాడు. జెనివా ప్రథమ అంతర్జాతీయ కార్మిక కాంగ్రెసులో (ఇంటర్నేషనల్‌లో) కార్మిక సంఘాల భూత, భవిష్యత్, వర్తమానకాలంలో వాటి పాత్రపై తీర్మానాన్ని రూపొందించారు.

కార్మికులకు గల వొకేవొక సామాజికశక్తి, వారి సంఖ్యాబలం ఐక్యతలేనందున యీశక్తి తగినంత బలంగాలేదు. వారిలో వారికి పోటీతో ఐక్యత లేక బలహీనంగావుంది వారిలో వున్న పోటిని రూపుమాపుటకై యాదృచ్ఛిక ప్రయత్నాలుఫలితంగా ప్రథమంగా ట్రేడు యూనియనులు ఉద్భవించాయి. కనీసం పోటిని అదుపులో పెట్టి, నగ్నభానిసత్వస్థాయిని, పరిస్థితిని మెరుగుపరచుకొను షరతులను పొందుటకు యూనియనులు యేర్పడినవి. కార్మికసంఘాల తక్షణ లక్ష్యం వేతనాలు, పనిగంటలు నియామకానికై, పెట్టుబడికి వ్యతిరేకింగా పోరాడుట అయింది. ఈ పోరాటం అవసరమేగాక, న్యాయచట్టసమ్మతం. ప్రస్తుత వుత్పత్తి విధానం కొనసాగినంతవరకు దీనిని త్రోసిబుచ్చుట శ్రేయస్కరంకాదు. మధ్యయుగ సమాజాలకు మునిసిపాలిటీలు, బూర్జువావర్గాలకు కమ్యూనిటీలు వలెనె కార్మికవర్గానికి ట్రేడు యూనియనులు అంతటి ముఖ్యపాత్ర వహించుతున్నవి. పెట్టుబడి–కార్మికుల మధ్య జరిగే 'గెరిల్లా' పోరాటాలు ఎంత ముఖ్యమైనవో, వేతనకూలి విధానాన్ని రూపుమాపేందుకు కార్మికవర్గాల నిర్మాణ ప్రయత్నాలలో అంతకంటె ముఖ్యమైనవి. తీర్మానం వీటినే గాక మరెన్నో కార్మికవర్గ అంశాలను వెలుగులోనికి తెచ్చింది. ఆర్థిక కర్తవ్యాలపై కార్మికవర్గ సంఘాలు, ట్రేడ్‌యూనియన్లు కేంద్రీకరిస్తే రాజకీయ కర్తవ్యాలపై కార్మికవర్గ రాజకీయ పార్టీలు కేంద్రీకరిస్తాయి. అదే కాలంలో కార్మిక సంఘాలలో రాజకీయ చైతన్యస్థాయిని ఉన్నతంగా పెంచగలిగితే రాజకీయ కర్తవ్యాల నిర్వహణలో కార్మికవర్గం తనవంతు రాజకీయ పాత్రను మహోన్నతంగా నిర్వహించి పార్టీ నాయకత్వంలో విజయాన్ని చేకూర్చుగలుగుతుంది.

## ప్రజాసంఘాలలో మార్క్సిజం, లెనినిజం ఆచరణ అంటే యేమిటి?

మార్క్సు కార్మికవర్గసంఘాల సిద్ధాంతానికి పునాదులు వేసారు. పెట్టుబదిదారి విధాన ప్రభుత్వంలో కార్మిక సంఘాల పాత్రను నిర్వచించాదు. ఆర్థిక, రాజకీయ పోరాటాల మధ్యగల సరియైన సంబంధాలను నిర్ధిష్టంగా నిర్వచించాదు, అనుసరించాదు. ఆర్థిక పోరాటాలపై రాజకీయ పోరాటాల ప్రాధాన్యతను నొక్క చెప్పాదు. అంతే గాదు, మార్క్సు ట్రేడు యూనియనుల పరిమితులను, వాటికిగల అవకాశాలను స్పష్టం చేస్తూ, కార్మికవర్గ అంత్యలక్ష్యం దృష్టిలో కార్మికుల తక్షణ కోర్కెలకై జరిగే పోరాటాలను కార్మికవర్గం విప్లవపోరాటాలతో సంధానపరచే వ్యూహలక్ష్యంతో కార్మిక సంఘాల పోరాట ఎత్తుగడలను రూపొందించాదు. బూర్జువా వర్గానికి వ్యతిరేకంగా పోరాదని కార్మికసంఘాలు, కార్మికవర్గ ప్రయోజనాలకు వ్యతిరేకసాధానాలుగ మారుతాయని మార్క్సునిరూపించారు. మార్క్సు పెట్టుబడిదారి దేశాలలోని కార్మిక సంఘాల, పాత్రను భూత,భవిష్యత్తు, వర్తమాన కాలాలలో వివరించాదు. కాని, కార్మికవర్గం రాజ్యాధికారాన్ని స్వాధీనం చేసుకొన్న తరువాత కార్మిక సంఘాలపాత్ర ప్రత్యేకంగా కార్మికవర్గ నియంతృత్వంలో, పేర్కొనలేదు. ఇది, మార్క్సు అనుయాయుదు, బోల్షివిక్ కమ్యూనిస్టుపార్టీ నిర్మాతయైన వి.ఐ.లెనిన్, మార్క్సిస్టు మూలసూత్రాలననుసరించి చేసాదు. లెనిన్ మార్క్సిజాన్ని, అభివృద్ధి, సంపద్వంతం చేసాదు. అందుకే, సామ్రాజ్యవాద-కార్మికవిప్లవాల యుగంలోని మార్క్సిజమే లెనినిజంగా చెప్పబదుతున్నది.

కార్మిక సంఘాలపై లెనిన్ కేంద్రమార్గదర్శిక సూత్రాలు, అవగాహనలు యేవి? మార్క్సు, కార్మికసంఘాలు కమ్యూనిజపు పాఠశాలని పేర్కొన్నారు. ఈసూత్రం, ఎంతో సంక్షిప్తంగా వున్నాదాని విస్తృతి సంపద్వంతంగా వుంది. ఈ నిర్వచనంలో నాలుగు ప్రధాన అవగాహనలు యిమిడి వున్నాయి. 1) కార్మిక సంఘాలు తప్పనిసరిగా ఆవర్గాన్నంతటికి విస్తరించిన నిర్మాణాలు, 2) ట్రేదు యూనియనులు ప్రజలకు కమ్యూనిజం ఆశయ ధ్యేయాలపై పరిజ్ఞానాన్ని కార్మికవర్గ కర్తవ్యాలను అర్థంచేసుకొనగల స్థాయిలో కలుగజేస్తాయి: 3) కార్మికసంఘాలు కార్మికవర్గ పార్టీకి అగ్రగామి కార్మికవర్గ ప్రజాసామాన్యానికి మధ్య సంధానకర్తలుగా వ్యవహరిస్తాయి. 4) కార్మికసంఘాలు కార్మికవర్గ విప్లవపార్టీ నాయకత్వంలో పెట్టుబడిదారి విధానానికి వ్యతిరేకంగా పోరాదుతవి.

"కార్మికసంఘ కమ్యూనిజపు పాఠశాల", "సాధారణ పాఠశాల అనే పదాలలో అస్పష్టత యేమీలేదు. కార్మికసంఘ పాఠశాల కార్మికవర్గపు పాఠశాల, సాధారణ పాఠశాల ప్రజాసామాన్యానికి విధ్యాగంధాన్ని యిచ్చేది, మొదటి పాఠశాల కమ్యూనిజపు ఆశయ, సిద్ధాంత పరిజ్ఞానాన్ని ఆచరణ కార్యక్రమ పరిజ్ఞానాన్ని, పోరాటశక్తిని కలుగజేసి, నిర్మాణ ఆయుధాన్ని యిస్తుంది. ఇదే యీ రెండు పాఠశాలలో లభించే విజ్ఞానాభివృద్ధిలో గల ప్రధాన బేధము. కార్మికవర్గ పోరాటాలే, సమ్మెలు వగైరాలే ఆపాఠశాలలు వాటి అనుభవ పాఠాలే కార్మిక ప్రజాస్వామాన్యం నేర్చుకొనే పాఠాలు అవే కార్మికసంఘాలు కమ్యూనిజపు పాఠశాలలనుటలో అర్థమిది అయితే, కార్మికవర్గపార్టీ కమ్యూనిజపు పాఠశాల కాదా? అదేవిధంగా కార్మిక సహకార సంఘాలు, కార్మికక్లబ్బులు పాఠశాలలు కావా? లెనిన్ నాయకత్వంలో రెండవ అంతర్జాతీయకమ్యూనిస్టు కాంగ్రెసు (కామింటరను) లో ఆమోదించిన తీర్మానం, నివేదికలు యిచ్చిన అవగాహనలు చూద్దాం.

కార్మికవర్గపార్టీ-కమ్యూనిస్టుపార్టీ కార్మికసంఘం-ప్రజాసంఘాల నైజాలలో కొంత, అస్పష్టతకన్పడుతున్నది. మార్క్సు,లెనిన్‌లు అన్ని కార్మిక సంఘాలు, అన్ని దేశాలలో, అన్నికాలాలలో, ట్రేడు యూనియనులు కమ్యూనిజపు పాఠశాలలు అని నిర్వచించక, పెట్టుబడిదారి విధానానికి, పెట్టుబడిదారులకు వ్యతిరేకంగా వర్గ పోరాటం సాగించే కార్మిక సంఘాలను నిర్వచించునపుడు స్పష్టం చేసారు. లెనిన్ కార్మిక సంఘాల ఉద్యమాల సిద్ధాంతాన్ని అభివృద్ధి చేయుటయేగాక, వ్యూహం ఎత్తుగడలను విప్లవానికి పూర్వం, విప్లవకాలంలో, విప్లవానంతరకాలంలో ఆచరణాను కూలంగా చేసారు.

మార్క్సు,ఎంగెల్స్‌లు రూపొందించిన ఇంటర్నేషనల్ వర్కింగ్‌మెన్స్ అసోషియేషన్‌లో రాజకీయపార్టీలు ట్రేడు యూనియన్స్‌రెండు వ్యవస్థా నిర్మాణాలు సభ్యులుగా వుంటూ వచ్చాయి. వ్యతిరేకులు మార్క్సుపై ఆనాడు ద్విముఖ పోరాటాన్ని సాగించారు. కొందరు ఇంటర్నేషనల్ వర్కింగ్ మెన్స్ అసోషియేషన్ ట్రేడు యూనియనులను మాత్రమే సభ్యులుగా చేర్చుకొనాలన్నారు. మరికొందరు రాజకీయపార్టీలను మాత్రవే సభ్యులుగా చేర్చుకొనాలన్నారు. ఈవిమర్శకులు అసోషియేషన్ నిర్మాణ రూపంలోని ప్రత్యేకతను అవగాహన చేసుకొనుటలో విఫలులయ్యారు.

ప్రధమ ఇంటర్నేషనల్ స్వరూపం, సిద్ధాంతం, ఎత్తుగడలలో మార్క్సు పుణ్యమా అంటూ నిర్మాణంలోవున్న సంస్థలకంటె ఉన్నతస్థాయిలోవుంది. రాజీపడలేని సైద్ధాంతిక రాజకీయాలలో భేదాభిప్రాయాల ఫలితంగా కమ్యూన్‌కూలిపోయింది, కొంతమంది చరిత్రకారులు మరోవిధంగా నెంచుతున్నారు. మార్క్సు-బకునిన్‌ల మధ్యగల రాజకీయ అభిప్రాయ భేదాల కారణంగా నిర్మాణ అభిప్రాయభేదాలు పెరిగిపోయాయి. కాని చీలికలకు అవి కారణాలు కావు. కమ్యూనిస్టు సిద్ధాంతాలను ఆమోదించనివారికి ఇంటర్నేషనల్‌లో సభ్యత్వానికి స్థానంలేదనే సూత్రమేమీ లేకపోగా ఆకారణంగా సభ్యత్వం యివ్వాలా, లేదా అనే ప్రశ్నయే చర్చించబడలేదు. కమ్యూనిస్టుల అధ్వర్యంలోని కొన్ని యూనియనులు ఇంటర్నేషనల్‌లో సభ్యులుగా వున్నవి. అదేకాలంలో కమ్యూనిజాన్ని ఆమోదించని, వ్యతిరేకించే కొన్ని యూనియనులు కూడ సభ్యత్వాన్ని కలిగివున్నవి. అంతేగాక, కమ్యూనిస్టుపార్టీలు సభ్యులుగా వున్నవి, కొన్ని సాధారణ ట్రేడు యూనియనులు కూడ సభ్యులుగా వున్నవి.

ఇంటర్నేషనల్‌లో లెనిన్ నాయకత్వం స్థిరపడిన తరువాత సోషలిజం ధ్యేయంగా కల కమ్యూనిస్టు, సోషల్ డెమోక్రటిక్ పార్టీలు ఇంటర్నేనల్‌లో సభ్యులగుటయే గాక, సోషలిజంపై విశ్వాసంగల ట్రేడుయూనియనులు కూడ కార్మిక రాజకీయ పార్టీలుగా స్వీకరించబడి, సభ్యత్వాన్ని పొందాయి. అంతే వొక విధంగా కమ్యూనిస్టుపార్టీలు-ట్రేడు యూనియనులు సంలీనమైనందున, ట్రేడుయూనియనులు తమ పూర్వనైజాన్ని కోల్పోయాయి, కమ్యూనిస్టుపార్టీలుగా రూపొందుట జరిగింది. అంతమాత్రంచేత కమ్యూనిస్టుపార్టీలు-ట్రేడు యూనియనుల మధ్యగల నైజం, స్వభావం, అంతరాలను రూపుమాపుటతో ట్రేడు యూనియను వొకవర్గ రాజకీయపార్టీ, కమ్యూనిస్టుపార్టీ అయింది. కార్మికవర్గ ప్రజాసంస్థ, కార్మికవర్గపార్టీ అయింది. ఇది అవాంచనీయం.

## రష్యా 1917 విప్లవ పోరాటాల అనుభవం

జారు చక్రవర్తి నిరంకుశపాలనకు వ్యతిరేకంగా జరిగిన 1905 విప్లవపోరాటాలలో కార్మికవర్గ అగ్రగామి కార్యకర్తల చొరవతో ప్రప్రథమంగా "సోవియట్లు" కార్మికుల పంచాయితీలు పోరాట నిర్మాణాలుగ యేర్పడినవి. లెనిన్ వాటిని వెంటనే గుర్తించి వాటిని పోరాట సాధనాలుగ, కార్మికుల స్వపరిపాలన కేంద్రాలుగ సిద్ధాంతీకరించి వాటిని భవిష్యత్తులో విప్లవ ప్రజాస్వామ్య నియంతృత్వ కార్మిక, కర్షక తాత్కాలిక పరిపాలనా కేంద్రాలుగా అభివృద్ధిచెంది, తాత్కాలికవిప్లవ ప్రభుత్వం యేర్పాటుగా రూపొందగలవని, తలచినవిధంగానే 1917 ఫిబ్రవరి ప్రజాస్వామ్య విప్లవంలోయేర్పడి, అక్టోబరు విప్లవంలో ప్రధాన పాత్రవహించాయి. కార్మిక, కర్షక, సైనిక సోవియట్లు యేర్పడినవి, ప్రతిఫ్యాక్టరీ, గ్రామీణపాలన ప్రాంతాలనుండి, సైనిక రెజిమెంట్లు ఎన్నికల ద్వారా తమ ప్రతినిధులను ఎన్నుకొన్నవి. వారే సోవియట్లుగా యేర్పడ్డారు. ఆ సోవియట్లే ఎగ్జిక్యూటీవు కమిటీలను దామాషానిష్పత్తిలో యేర్పాటు చేసుకొన్నారు. అవే కార్మిక, కర్షక, సైనిక ప్రతినిధుల సోవియట్లుగా పోరాటాల, పాలన భాధ్యతలను నిర్వహించాయి. అన్ని రాజకీయపార్టీలు, ధోరణలకు ప్రాతినిధ్యం కలిగియున్నవి.

ఫిబ్రవరి 1917 రష్యన్ ప్రజాస్వామ్య విప్లవానంతరం–మార్చి–మే 1917లో నగరాల కార్మికుల, సైనికుల సోవియట్లలో వివిధ పార్టీల ప్రాతినిధ్యాలు యిలావున్నవి. మాస్కో కార్మిక, సైనిక సోవియట్లలో ప్రతినిధులు మొత్తం 625లో బోల్షివిక్కులు 143, మెన్షివిక్‌లు 126, సోషలిస్టు రివల్యూషనరీలు 67 మంది కాగా, యేపార్టీకి, గ్రూపు చెందనివారు తదితరులుగా వున్నారు. బోల్షివిక్కులు 22.8 శాతం మాత్రమే వున్నారు. కీవ్‌నగరంలో మొత్తం 444 ప్రతినిధలలో 62 మంది బోల్షివిక్కులు, 131 మంది మెన్షివిక్కులు, 53 మంది సోషలిస్టు రివల్యూషనరీలు, 91మంది యితరులు, 105 యేపార్టీకి చెందనివారున్నారు. బోల్షివిక్కులు 14శాతం వున్నారు. కార్కోవ్ నగరంలో మొత్తం 320మంది ప్రతినిధులలో 41మంది బోల్షివిక్కులు, 52మంది మెన్షిమిక్కులు, 34మంది సోషలిస్టు రివల్యూషనరీలు, 8 ఇతరపార్టీలు, 185 మంది యేపార్టీకి చెందనివారు వుండగా, బోల్షివిక్కుల శాతం 12.8మాత్రమే వుంది. ఇవి విప్లవప్రజాసంఘాలు ఫిబ్రవరి 1917విప్లవానంతరం బోల్షివిక్కులు లెనిన్ నాయకత్వంలో కార్మిక, కర్షక, సైనిక సోవియట్లలలో యుద్ధం విరమణ, శాంతి, సోషలిజం ప్రచారం ముమ్మరంచేస్తూ, "సోవియట్లకు తిరిగి ఎన్నికలు జరగాలని, సోవియట్లకు అత్యధికులుగా బోల్షివిక్కులను ఎన్నుకొని, విజయం చేకూర్చాలని లెనిన్ నినాదాలతో విస్తృత ప్రచారం కావించారు. ఫలితంగా తదనంతరం జరిగిన ఎన్నికల తరువాత అక్టోబరు 1917లో సోవియట్లలో వివిధ శ్రేణులు యీక్రింది విధంగా ప్రతినిధులు వున్నారు.

కీవ్ నగర కార్మిక సోవియట్ 444 ప్రతినిధుల మొత్తంలో బోల్షివిక్కులు 101మంది, మెన్షివిక్కులు 111మంది, సోషలిస్టు రివల్యూషనరీలు 54మంది, ఇతర పార్టీలు 41 మంది, యేపార్టీకి చెందనివారు 91 మంది కాగా 22.7శాతం మాత్రమే బోల్షివిక్కులు వున్నారు. కార్కొవ్‌నగరంలో 527మంది ప్రతినిధులలో 120మంది బోల్షివిక్కులు, 40మంది మెన్షివిక్కులు, 150మంది సోషలిస్టు రివల్యూషనరీలు వున్నారు. బోల్షివిక్కులు 20.9శాతం వున్నారు.

కీవ్, కార్కొవ్ రెండు నగరాల కార్మిక సోవియట్ల ప్రతినిధుల గణాంకాలను ఫిబ్రవరి ప్రజాస్వామ్య విప్లవప్రారంభంలో, తదనంతరం అక్టోబరు విప్లవం ప్రారంభంలో బోల్షివిక్కులు రాజకీయంగా పెరిగింది తెలియజేస్తుంది. ఈ రెండు నగరాలకు మాత్రమే పూర్తి సమాచారం లభించింది. కీవ్ నగరంలో 14శాతంగాను కార్కొవ్‌లో, 12.8 శాతంగాను వున్న బోల్షివిక్ ప్రతినిధులు అక్టోబరుకు 22.7మరియు 20.9 శాతంగా క్రమంగా పెరిగారు. అంటే మొత్తం ప్రతినిధులలో 5వ వంతుకు కొంచెం పైగా ఉన్నారు.

సోవియట్లు కార్మికుల, కర్షకుల, సైనికుల పోరాట ప్రజాసంఘాలు వివిధ రాజకీయపార్టీల ప్రతినిధులు యేపార్టీకి చెందనివారితో కలసియేర్పడినవి. లెనిన్ ఫిబ్రవరి ప్రజాస్వామ్య విప్లవానంతర కాలంలో "అన్ని అధికారాలు సోవియట్లకే" అనే నినాదాన్ని ప్రచారం చేసి, తిరిగి ఎన్నికలు, జరుగునట్లు ప్రజోద్యమాన్ని ఉన్నత స్థాయికి తీసుకొని పోవుటతో సోవియట్లు పరిపాలనా భాధ్యతలను చేబట్టి, ప్రభుత్వరూపంగా పరిణామమొందాయి. క్రమేణా విప్లవ ప్రజాస్వామ్య కార్మిక నియంతృత్వ ప్రభుత్వరూపంగా పరిపక్వత చెంది యుద్ధవిరమణ శాంతి, భూస్వామ్య విధానం రద్దు విధానాలు చేబట్టి మరింత బలపడినవి.

మొట్టమొదటగా 1905పోరాడే కార్మిక, కర్షక సైనిక ప్రజాసామాన్యం తమంతటతామే సోవియట్లను, పోరాట సాధనాలుగ కార్మిక సోవియట్లు, రైతాంగ సోవియట్లు, సైనిక సోవియట్లుగా యేర్పడుటను గుర్తించి, వాటిని విప్లవపోరాటసాధనాలుగ లెనిన్ విశ్లేషణగావించి, వాటి ప్రాముఖ్యతను భవిష్యత్తు పోరాటాలలో వివరించి, అవే పాలనాయంత్రాంగంగాను, తదుపరి కార్మికవర్గ నియంతృత్వంగా రూపొందగలవని విశ్వాసం ప్రకటించారు.వివిధ రాజకీయపార్టీలు పనిచేసే ప్రజాసంఘాలుగా సోవియట్ నిర్మాణం, దామాషా నిష్పత్తులలో పైకమిటీలకు ప్రతినిధులు ఎన్నుకొనుబడుట సూత్రబద్ధం చేయుబడింది. సోవియట్లకు వివిధ పైకమిటీల నిర్మాణానికై ప్రతినిధులను ఎన్నుకొనబడుటకుగాను ప్రజాభిమానాన్ని కార్మిక, కర్షక, సైనిక ప్రజాసామాన్యంలో పనిచేయసాగారు. అన్ని పార్టీలు ఆ సోవియట్లలో కలసిపనిచేస్తూనే, వారి అభిమానాన్ని పొందుటకు పోటీ పడసాగారు. అంతేగాని, అట్టి సోవియట్లలోనే మైనారిటీ చీలిపోయి మరో సోవియట్లను ఏర్పాటుచేయుటగాని, సోవియట్లలో మెజారిటి గల పార్టీ, మిగతా మైనారిటి పార్టీల అభిప్రాయాలకు విలువ, ప్రాతినిధ్యం లేకుండా చేసి బయటకు గెంటివేసే ప్రయత్నాలను బోల్షివిక్‌లు గాని, మెన్షివిక్‌లుగాని చేసినట్లుకానరాదు. అదే కాలంలో అతి తీవ్రమైన సైద్ధాంతిక, రాజకీయవిధానాలపై పోరాటాలు జరిగాయి. ఆవిధంగానే విప్లవశ్రేణులలో సోవియట్లలో అత్యధికస్థానాలను పొందుటకు ప్రజాభిప్రాయాన్ని కూడ గట్టే ప్రయత్నాలు అన్ని పార్టీలు చేసాయి. అంతేగాని సోవియట్లను ప్రజాసంఘాలుగానే పని చేయించారుగాని, రాజకీయపార్టీలు బ్రాంచీలు లేక శాఖలుగా మార్చే ప్రయత్నం జరుగలేదు. కార్మిక, కర్షక, సైనిక ప్రజాసామాన్యాన్ని తమతమ రాజకీయాలవైపు ఆకర్షించి, సమీకరించే ప్రయత్నం మాత్రమే జరిగింది. కావున సోవియట్లు రోజురోజుకు బలపడి, మరిన్ని పాలనాభాధ్యతలను స్వీకరించేదశకు ఎదిగాయిగాని, సమసిపోలేదు.

**పార్టీ-ప్రజా సంఘాల సంబంధాలపై ఇటలీ కమ్యూనిస్టులు వైఖరి.**

మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాల ఆచరణలో పెట్టు ప్రయత్నంలో కమ్యూనిస్టుపార్టీ-ప్రజాసంఘాలు ముఖ్యంగా పార్టీ అధ్వర్యంలోని, యితర ట్రేడు యూనియన్‌ల మధ్య వుండవలసిన సంబంధాలపై ఇటాలియన్ కమ్యూనిస్టుపార్టీ, జనరలు శెక్రటరీ లూయిగీ లాంగో 12వ. పార్టీ కాంగ్రెసుకు 1969లో సమర్పించిన నివేదికలో పేర్కొన్న అంశాలు మరువరానివి. "గత కొలది సంవత్సరాలుగ కార్మికుల ఐక్యతా సహజమైన, ఐక్యకార్యాచరణ. ప్రజాపోరాటాలలో పెద్దగా పాల్గొన్న అనుభవాలతో ప్రజాసంస్థలైన ట్రేడు యూనియనులకు కమ్యూనిస్టుపార్టీకి మధ్యవుండవలసిన సంబంధాలపై యేర్పడిన నిర్దిష్ట అవగాహనలను ఆచరణాత్మక దృక్కోణం నుంచి రూపొందించిన విధానం యిలా చెప్పవచ్చును. రాజకీయపార్టీ-ప్రజాసంఘాలు, ప్రజోద్యమాల మధ్య వుండవలసిన సంబంధాలపై మాకు వొక నిర్దిష్టవైఖరి వుంది. మేము ఎల్లప్పుడూ ట్రేడు యూనియనులకు తమ విధానాల రూపకల్పన, ఆచరణలపై పూర్తి స్వయం నిర్ణయాధికారాన్ని కలిగి వుండాలని పోరాడుతూనే వచ్చాము. ప్రజా సంఘాల ఆలోచనావిధానాన్ని, నిర్ణయాలను పార్టీ త్రోసిబుచ్చి, పార్టీ నిర్ణయాలనే ట్రేడు యూనియనుల నిర్ణయాలుగ రుద్దుటకు ప్రయత్నించలేదు. అంతేగాక ప్రజాసంఘాల, నిర్ణయాలకు, పార్టీ నియమాలను పోటీగా పెట్టె ప్రయత్నం చేయలేదు. పార్టీ కార్మిక రంగంలో నిర్మాణాత్మకంగా, అన్ని ప్రయత్నాలను, దశలను. దాటి ప్రజాసమీకరణ, ప్రచారాల అనంతరం జరిగిన ట్రేడు యూనియను పోరాటాలను బలపరచుట, చేబట్టుట జరిగింది. అంతే గాని యాదృచ్ఛికంగా జరిగే ఘటనలు, పోరాటాలను పార్టీ ప్రోత్సహించుట సాధారణంగా జరుగదు.

"నేడు అట్టి వైఖరుల ఫలితాలు చూస్తున్నాము. రాజకీయపార్టీలు తమ విధానాల ప్రాతిపదికలపై రూపొందించే కార్యాచరణలను నిరాకరించే అవకాశాలు యేర్పడినవి. పార్టీల విధానాలు, సైద్ధాంతిక అవగాహనలు, వైఖరులను, ప్రజాసంఘాల దైనందిన ఆచరణ చర్యలుగా చేయుటకై జరిపే సైద్ధాంతిక, రాజకీయ పోరాటాలు ముఖ్యంగా పార్టీలకు-ప్రజాసంఘాలు నిర్వహించవలసిన పాత్ర; కార్యాచరణలను వ్యతిరేకించే శక్తులపై జరిగినపుడు ఆశించని ఫలితాలు యెదుర్కొనవలసివచ్చుట జరుగుతున్నది. ఆవిధమైన ఫలితాలలో చీలికలు, విడిపోవుటలు, ఉద్యమం కుదించుకుపోవుట, స్తబ్ధత, సంక్షోభంలో దిగబడి పోవుట జరుగుతుంది.

కార్మిక వర్గం తక్షణ కోర్కెలపై జరిపే పోరాటాలలో కార్మిక వర్గ ఐక్యత బలపడుట, తన ప్రయోజనాల పరిరక్షించుకొనే శక్తి పెరుగుటయేగాక, పరోక్షంగా ప్రజాస్వామ్యం బలపడుట రాజకీయ ప్రాముఖ్యతను కలిగి వుంటుంది.

**చైనా కమ్యూనిస్టుపార్టీ ట్రేడు యూనియన్ నాయకుడైన లీషావీ అభిప్రాయాలు.**

చైనా పీపిల్స్ రిపబ్లిక్ అధ్యక్షుడు 1932లో కార్మిక నాయకుడుగా, కమ్యూనిస్టుపార్టీ-ట్రేడు యూనియనుల మధ్య వుండవలసిన సంబంధాలపై "ఎక్రిటిక్ ఆఫ ది టాక్టిక్స్ ఆఫ క్విటింగు ది ఎల్గోయూనియన్సు" అనే వ్యాసంలో వెలుగును ప్రసరించారు.

"మా తీర్మానాలలో " ఎల్లో యూనియనులను" బహిష్కరించి బయటకు వచ్చివేయాలని, కొత్త యూనియనులను యేర్పాటు చేయాలని ఎత్తుగడలలో ఎక్కడా పేర్కొనబడలేదు.[1]

నాటి ప్రత్యేక వాస్తవ భిన్న పరిస్థితులలో "ఎల్లో యూనియను"ను విడిచి బయటకు వచ్చే ఎత్తుగడలనువొక కామ్రేడ్ కొన్ని మాసాలక్రితం ప్రతిపాదించారు. పైగా "ఎల్లో యూనియనుల"ను బహిష్కరించి బయటవచ్చే ఎత్తుగడ గతంలో తప్పే అయినా "మారిన పరిస్థితులలో" బహిష్కరణ, విడిచి వచ్చే నినాదం ఎంత సరియైనదో, అవసరమైనదో వివరించలేదు. "మా తీర్మానాలలో యీ క్రింది ప్రతిపాదనవుంది. కార్మికుల అభిమానాన్ని చూరగొన్న "ఎల్లో యూనియనులలో" సభ్యులుగా "రెడ్ ట్రేడు యూనియనుల సభ్యులను సైతం చేరమని కోరాలిగాని, అభిమానాన్ని చూరకొనజాలని యూనియనులలో కాదు."ఆయూనియనులలో విప్లవ ప్రతిపక్షాలను యేర్పాటు చేసి, పనిచేస్తూ, వారి అభిమానాన్ని పొందాలి, ఆ యూనియనులు ప్రజాబలాన్ని పొందే ప్రయత్నం చేయాలి. ప్రతిపక్షంవైపువారు ఆకర్షించబడి మెజారిటిని సంపాదించి, ఫ్యాక్టరీ యాజమాన్యపు ప్రాపకంలో వున్న ఆ "ఎల్లోయూనియను" ను చీల్చి. రెడ్ ట్రేడుయూనియను యేర్పాటు చేయాలి. తీర్మానం యీ క్రింది అంశాలను స్పష్టం చేస్తుంది. 1) రాజకీయంగా చైతన్యవంతులైన కార్యకర్తలు, కార్మికులు "ఎల్లోయూనియను"లలో చేరాలి. 2) ముఖ్యంగా "ఎల్లో యూనియను"లకు కార్మికుల బలం పుష్కలంగా వున్నప్పుడు వారి సామీప్యానికి చేరి అభిమానాన్ని పొందాలి, అందుకు ఆ యూనియనులలో చేరాలి. అది వొక ఫ్యాక్టరీ యూనియనుగాని, అనేక ఫ్యాక్టరీల ఐక్యయూనియనుగాని, "ఎల్లో యూనియను" ఫెడరేషనుగాని యేదైనాకాని చేరాలి. 3) విప్లవప్రతిపక్షం "ఎల్లో యూనియను" లో మెజారిటిని సంపాందించితే, ఆయూనియను, రెడ్ ట్రేడు యూనియనుగా యేర్పాటు చేయాలి. 4) రాజకీయాలలో చైతన్యవంతులైనవారు "ఎల్లో యూనియనులలో చేరివారితో కలసి పనిచేస్తూ, వారి అభిమానాన్ని చూరగొనుట తేలికయని తీర్మానం తెలియచేస్తున్నది. బయట నుండి యీ కార్యం నెరవేర్చుట కష్టం. 5) ప్రతిపక్ష ట్రేడు యూనియను నాయకత్వం క్రిందికి వచ్చిన మెజారిటి ఒక యూనియనులోనే వుండి మిగతా ఫ్యాక్టరీలలో కార్మికులలో మైనారిటి అయితే, విప్లవ ప్రతిపక్షం చీలి బయటకు రారాదు. ఆ యూనియనులలోనే వుండి, మెజారిటి కార్మికుల అభిమానాన్ని చూరగొన ప్రయత్నించాలి. అనగా, ఎట్టి పరిస్థితులలోను చీలిపోయి పోటీసంఘం పెట్టరాదు.

చైతన్యవంతులైన కార్మికులు ప్రతిచోట 'ఎల్లో యూనియనులను, కొమింగుటాంగు నాయకులను వ్యతిరేకించుతున్నారు. యూనియనులలో బయటా యిది జరుగుతున్నది. కార్మిక ప్రజాసామాన్యంతో రెడ్ ట్రేడు యూనియనులు, విప్లవ ప్రతిపక్షం స్వతంత్రప్రచారాన్ని కార్యక్రమాన్ని విస్తృతపరచాలి, ఆవిధంగా కొమింగుటాంగు వ్యతిరేకంగా, యూనియనులనులను, ప్రజాసామాన్యాన్ని ముందుకు, నడిపించాలి, వారి ద్వంధవైఖరిని బట్టబయలు చేయాలి, "ఎల్లోయూనియను"లలో కొమింగుటాంగు యేజంట్లను, నాయకులను ఎండగట్టాలి, వారి నాయకత్వం తొలగించి, రెడ్ ట్రేడు యూనియనులను రూపొందించాలి. నేడు యీ ఎత్తుగడలను మార్చవలసిన అవసరంలేదు.

---

*1. లీ.షాచీ (1984)* సెలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ లీషాచీ. బీజింగ్.ఎ.క్రిటిక్ ఆఫ్ ది టాక్టిక్స్ ఆఫ్ "క్విటింగ్" ది ఎల్లో యూనియన్స్. పే.

కొమింగుటాంగు "ఎల్లో కార్మికయూనియను"లలో ఆపార్టీలోని రెండు గ్రూపులు పనిచేస్తున్నవి. కమ్యూనిస్టులు "ఎల్లో యూనియనులలో" ఒక కొమింగుటాంగు గ్రూపును ఎత్తుగడగా బలపరచి రెండో గ్రూపును వోడించినా కొమింగుటాంగు ప్రభుత్వపు కార్మికశాఖపై ఎట్టి ప్రభావం వుండదు. కారణం, కార్మికవ్యతిరేక కొమింగుటాంగు విధానాలు అలాగే కొనసాగుటలో ఎట్టి ఆటంకాలు వుండవు. అట్టి విధానం మితవాద అవకాశవాదమేగాక, కొమింగుటాంగు విధానాలకు ఆకుపచ్చజెండా వూపుటయే అగుతుంది. విప్లవప్రతిపక్షాలు, గ్రూపులు "ఎల్లోయూనియనులను" వీడిపోవుట మితవాద అవకాశవాద తప్పిదమగుతుంది. ఆయూనియనులలోని ప్రతిపక్ష అభిమానులందరిని వదలివచ్చుటతో ఆయూనియను నాయకులు సభ్యులందరిని తేలికగా మోసబుచ్చుతారు. ఆవిధంగా "ఎల్లో యూనియను"లు ఎక్కువ కాలము మన గలుగుతవి.

అనేక ఫ్యాక్టరీల కార్మికులు యేర్పరచుకొన్నది. "ఎల్లోయూనియను" విప్లవ ప్రతిపక్షం మైనారిటి అయినా, కొన్నిఫ్యాక్టరీలో మెజారిటిగా వుండుట సహజం. ప్రాంత యూనియను నుండి చీలివచ్చి రెడ్ ట్రేడు యూనియనును యేర్పరచుకొని, తమ స్వతంత్ర ప్రతిపక్షపాత్రను బలపరచుకొనుట, "ఎల్లో యూనియను" ను నామరూపాలు లేకుండా చేయుట జరుగుతుందని ఊహాగానం కొందరు చేస్తున్నారు. వాస్తవానికి యీ ఎత్తుగడలలోనే బలహీనతలను కలిగివుండుట స్పష్టం. అవి 1) ఎల్లో యూనియను నుండికొన్ని కార్మిక శ్రేణులు బయటకు వెళ్ళిపోవుటతో యూనియను కొంత బలహీనపడుట సహజమే అయినా, ఆ యూనియనులో విప్లవవ్యతిరేకత బలపడుట కూడ జరుగుతుంది. 2) ఇది ఆ ఫ్యాక్టరీ కార్మికులకే గాక యితర ఫ్యాక్టరీ కార్మికులను దూరం చేస్తుంది. ఆ "ఎల్లో యూనియను" అనుబంధయూనియనుల కార్మికులను చేరుట కష్టమగుతుంది. ఫలితంగా కార్మిక ప్రధానోద్యమములోని "కార్మికులకు దూరమగుట అగుతుంది. 3) చీలివచ్చిన వారు వేరే విప్లవప్రతిపక్ష రెడ్ ట్రేడు యూనియనును యేర్పాటు చేసినా, కార్మికవర్గ ప్రయోజనాల కాపాడజాలదు. కారణం, కార్మికవర్గంలో అనైక్యత గూడు కట్టుకుంటుంది. 4) ఒక ఫ్యాక్టరీలోని ట్రేడు యూనియనును చీల్చుట, స్వతంత్రయూనియనును ఏర్పరచుట, స్పష్టంగా విచ్ఛిన్నకర, వేర్పాటు వాదాన్ని చేబట్టుటయే అగుతుంది. వాస్తవానికి, చీలిక, వేర్పాటు వాదం కార్మికవర్గ ప్రయోజనాలను యేమాత్రం కాపాడజాలదు.

ఇది సి.పి.సి. 6వ, పార్టీ కాంగ్రెసు తీర్మానాలను, వివరణలను, మార్గదర్శికత్వాన్ని విడనాడి, ఫలితాలను ఆలోచించకుండా స్వతంత్ర ట్రేడు యూనియనులను యేర్పాటు చేయుట కార్మికవర్గానికి నష్టదాయకమైనదగుతున్నది. అంతేగాక, కాంగ్రెసు తీర్మానం, కార్మికులు "ఎల్లోయూనియనులను విడిచి వచ్చుటకును స్పష్టంగా వ్యతిరేకించుటయేగాక, రాజకీయ చైతన్యవంతులైన అందరు "ఎల్లో యూనియనులలో చేరమని కోరింది." అందులో విప్లవ ప్రతిపక్షాన్ని, యేర్పాటు చేయుట ద్వారా కార్మికులకు చేరువగుతామని, అదేకాలంలో వారి ద్వంద నైజాన్ని బట్టబయలుచేసి కార్మికుల చైతన్యాని పెంపొందించగలమని తీర్మానం విశదం చేసింది. ఆవిధంగానే కార్మికుల ప్రయోజనాలను కాపాడి వారి అభిమానానికి, మన్ననలకు పాత్రులము కాగల మంటున్నది. ఈవైఖరే ఐక్యసంఘటనా కార్యక్రమాలను పెంపొందించి, 'ఎల్లో యూనియనులను కార్మికుల నుండి

దూరంచేసి, నామరూపాలు లేకుండా చేయగలగుతామనే అవగాహనలో వుంది. ఇది వాస్తవంకాదు, ఊహాగానం.

"మేము యూనియనులను బలహీనపరస్తున్నామని ఎల్లో యూనియనులనాయకులు దుష్ప్రచారం సాగిస్తే, వారు అతివాద అవకాశవాదముసుగులోవారు యూనియనుల కార్యకలాపాలలో చురుకుగా పాల్గొనకుండా నీరుగార్చివేస్తున్నారని, ఎండగట్టాలి. ఆవిధంగా, వెనుకబడిన కార్మికవర్గంలో రాజకీయ చైతన్యాన్ని కలిగించుటకు కృషి చేయాలి. మెజారిటి కార్మికవర్గంలో రాజకీయ చైతన్యం కలుగునంతవరకు "వేచి, చూస్తుండేవిధాన" మనే విమర్శరాగా, ఎల్లో యూనియనులలో రాజకీయ చైతన్యంగల కార్మికులందరు చేరి, పనిచేయమని కోరుటగా వివరించబడింది. ఆ యూనియనులలో విప్లవ ప్రతిపక్షంగా పనిచేస్తూ, ప్రజాభిమానాన్ని, వారి విశ్వాసాన్ని పొందుతు, వారిని సమీకరించాలి. కార్మిక ప్రజాసామాన్యమంతా వొక్క చోట "యాజమాన్యపు ఎల్లో యూనియనులో చేరియున్నందున, అతివాదులు యిక్కడే అద్భుతాలు సృష్టించగలగాలి, అనే వివరణ యిచ్చారు.[1]

కొందరు "ఎల్లో యూనియనుల" నుండి బయటకు వచ్చి స్వతంత్ర రెడ్ ట్రేడు యూనియనులను స్థాపించి, బహిరంగా పనిచేయాలనే అవగాహనలో వున్నారు. వాస్తవానికి బహిరంగంగా పనిచేయుటకు అది సహాయకారి కాదు. పైగా అది మనం రహస్యమార్గాలలో పనిచేయుటకు దారి తీస్తుంది. ప్రజాసామాన్యం ఎల్లో యూనియనులలో అధికంగా వుంటే వారికి చేరువగుటకు, మనస్వతంత్ర ప్రచారాన్ని విస్తృత పరచగల అవకాశాలుంటే తప్పనిసరిగా చేరి పని చేయాలి. మన తీర్మానాలలో ఎక్కడా ఫ్యాక్టరీలలోని ఎల్లో యూనియనుల క్రింది శాఖలలోనే పనిచేయరాదని పేర్కొన బడలేదు. కాన అన్ని శాఖలలో పనిచేయాలి.[2]

చైనాలోకమ్యూనిస్టుపార్టీ 1927 విప్లవానంతరం, ప్రభుత్వసైన్యాలు వెంబడించగా, 40వేల ఎర్రసైన్యంతో యూనాన్ పర్వతప్రాంతాలలో మావోనాయకత్వంలో "రెడ్ ప్రభుత్వాన్ని" వివిధ రాజకీయపార్టీలతో యేర్పరచిన "ఐక్యసంఘటనా" ప్రభుత్వాన్ని ఆయా పార్టీల ప్రతినిధులతో 3-3-3 దామాషాలలో ప్రాతినిధ్యం ఇచ్చి ఏర్పాటు చేశారు. మంత్రివర్గంలో వివిధ పాలనా యంత్రాంగాలలో మూడోవంతు కమ్యూనిస్టులు, వొకవంతు జాతీయవాదులు మరో మూడోవంతు ప్రజాస్వామ్యవాదులు తదితరులు ప్రజారాజకీయ సలహా సంఘాలలో అన్నిటిలో ప్రాతినిధ్యమిచ్చి, యీవిధంగా సన్‌యట్‌సేన్ మూడు సూత్రాలను అమలు చేసారు. ఇది మననం చేసుకొన్నప్పుడు ఐక్యసంఘటనలు, ఐక్యసంఘటనా ప్రభుత్వాలు, ప్రజాసలహాసంఘాలలో మూడోవంతు మాత్రమే వుంటూ, ఇతర జాతీయవాదులు, ప్రజాస్వామ్యవాదుల మిగిలిన రెండువంతుల ప్రాతినిధ్యాన్ని అన్ని సలహాసంఘాలు, పాలనా, యంత్రాంగంలో కలుగజేస్తూ భిన్న అభిప్రాయాలకు తావిస్తూ, వాటిని గౌరవిస్తూ ప్రజాసామ్యావిధానాలను అనుసరించుతూ వారిని రాజకీయంగా తమ

1. *లీ షౌచీ (1984) సెలెక్టెడ్ వర్క్సు ఆఫ్ లీషౌచీ. పెకింగు. ఎ క్రిటిక్ ఆఫ్ ది టాక్టిక్స్ ఆఫ్ క్విటింగు ది "ఎల్లో యూనియన్స్. పే. 28.*
2. అదే .పే. 29.

వారిగా మార్చుకొనుటలో వున్న విశ్వాసం, వారి విజయాలకు కారణముగా కన్పడుతున్నది.

## భారత కమ్యూనిస్టు ఉద్యమగత చరిత్ర నేర్పే పాఠాలు

ఎ.ఐ.టి.యు.సిలో చీలికలను ఎవరు, ఎందుకు తీసుకొని వచ్చారు? క్లుప్తంగా తెలుసుకొందాము. ఎ.ఐ.టి.యు.సి. కమ్యూనిస్టుల నాయకత్వంలో ఉన్న మెజారిటీని కలిగియున్నా, రెండవ ప్రపంచయుద్ధకాలంలో యుద్ధం-భారతదేశ స్వాతంత్ర్యం సమస్యపై ఎట్టి తీర్మానాన్ని ఆమోదింపజేసి, తమ అవగాహనలను ప్రజాసంఘంపై రుద్దలేదు. అయినా ఎ.ఐ.టి.యు.సి.ని విద్రోహచర్యలకు వాడిగట్టిందని దుష్ప్రచారానికి గురిచేసారు. కమ్యూనిస్టుపార్టీ ఎన్నికలలో ఎ.ఐ.టి.యు.సి, దాని శాఖలన్నిటిని ఆపార్టీ అభ్యర్ధులకు, మద్దతును సమీకరించుట వినియోగించుటకు ఎప్పుడూ ప్రయత్నించలేదు.

అయినా, కాంగ్రెసు, సోషలిస్టులు కమ్యూనిస్టులు సోవియట్ యూనియన్, చైనా రాజకీయ సిద్ధాంతాలకు అనుకూలంగా చేయుటకు, ఎ.ఐ.టి.యు.సి.ని చీల్చాలని దుష్ప్రచారాన్ని, అసత్యాన్ని, నిందలను ప్రచారం చేసారు. ఇది, వాస్తవాలను విరుద్ధంగాను, తాము చేసిన కార్మికవర్గ ఐక్యతావిచ్ఛిన్న చర్యలను కప్పిపెట్టుకొనుటకు చేయసాగారు.

ఎ.ఐ.టి.యు.సి.లోని యన్.యం.జోషి, గిరీలు గ్రూపు, అంతర్జాతీయంగా ఆంగ్లో-అమెరికనుల నాయకత్వంలోని ఐ.యఫ్.టి.యు.కు ఎ.ఐ.టి.యు.సిని అనుబంధసంస్థగా చేయాలనే సమస్యను 1928లో లేవనెత్తారు. ఎ.ఐ.టి.యు.సిలోని కమ్యూనిస్టులకు రెడ్ ఇంటర్నేషనల్ ఆఫ్ లేబరు యూనియనుకు అనుబంధించబడాలని బలమైన అభిప్రాయంవున్నా కార్మికవర్గ ఐక్యతకు ప్రాధాన్యతనిచ్చి, తమ ప్రతిపాదను ఉపసంహరించుకొన్నారు. ఆంగ్లో-అమెరికనుల నాయకత్వంలోని ఐ.యఫ్.టి.యు వలసదేశాలలోని స్వాతంత్రోద్యమాలను వ్యతిరేకించుట, రెడ్ ఇంటర్నేషనల్ ఆఫ్ లేబరు యూనియను వలసల స్వాతంత్ర్య పోరాటాలను బలపరుస్తున్నది. ఆకారణంగానే చైనా కార్మికోద్యమం ఐ.యఫ్.టి.యు. నుండి విడిపోయి రెడ్ ఇంటర్నేషనల్ ఆఫ్ లేబరు యూనియకు అనుబంధించబడింది. ఈ సమస్యపై జోషి, గిరీల గ్రూపు కార్మికులనుండి, క్రమేణా దూరమైంది.

బ్రిటిష్ ప్రభుత్వం సైమన్‌కమిషన్‌కు వ్యతిరేకంగా జాతీయ బహిష్కరణోద్యమ ప్రజావెల్లువను ఎదుర్కొనవలసిన వచ్చిన అనుభవంతో "విట్లీ" లేబరు కమిషను యేర్పాటు చేస్తూ యన్.యం.జోషీ, దివాన్ చమన్‌లాల్‌లను సభ్యులుగా నియమించింది. వీరిరువురూ ఎ.ఐ.టి.యు.సి నాయకులై వుండి, దానితో సంప్రదించకుండా "విట్లీ" లేబరు కమిషన్‌తో సహకరించుటకు, సభ్యత్వాన్ని ఆమోదించారు. ఈసమస్యను 1929లో నెహ్రూ అధ్యక్షతన నాగపూరులో జరిగిన ఎ.ఐ.టి.యు.సి మహాసభ అత్యధిక మెజారిటి "విట్లీ" కమిషనను బహిష్కరించాలని మీరటు కమ్యూనిస్టు కుట్రకేసు ముద్దాయిలను విడుదల చేయాలని, ఎ.ఐ.టి.యు.సి ని ప్రపంచసామ్రాజ్యవాద వ్యతిరేక సంస్థలో అనుబంధసంస్థగా చేయాలని తీర్మానాలు ఆమోదించబడినవి. మితవాదులు జోషీనాయకత్వంలో మెజారిటి ఆమోదించిన విధానాన్ని "విట్లీ" కమీషను బహిష్కరణను, తీర్మానాలను వ్యతిరేకించి, నిరసనను తెలియజేస్తూ ఎ.ఐ.టి.యు.సి నుండి బయటకు పోయి, పోటీ ట్రేడు యూనియనును

సంస్థను యేర్పాటు చేసారు. ఈవిధంగా భారతకార్మికోద్యమంలో మొట్టమొదటి చీలిక రాజకీయ సైద్ధాంతిక ప్రాతిపథికలపై యేర్పడింది.

స్వాతంత్ర్యం అవతరణకు ముందు ఫిబ్రవరి 1947లో ఎ.ఐ.టి.యు.సి మహాసభలో సర్దార్ పటేల్‌ప్రోత్సాహంతో నాయకత్వాని చేజిక్కించుకొనే ప్రయత్నాన్ని కాంగ్రెసు, కాంగ్రెసు సోషలిస్టులు కలసి చేసి, విఫలులై కార్మికసంస్థను చీల్చి, పోటీ సంస్థ ఐ.యన్.టి.యు.సి.ని కేంద్ర జాతీయ ప్రభుత్వం అందదండలతో యేర్పాటు చేసారు. కార్మికవర్గ ఐక్యతను విచ్ఛిన్నం చేసారు.

కార్మిక ప్రజాసంస్థ, ఐ.యన్.టి.యు.సి. తన యూనియన్ శాఖలను ఎన్నికలలో కాంగ్రెసును బలపరచవలసినదిగా బహిరంగంగా కోరింది. ఫలితంగా పశ్చిమబెంగాలులో ఐ.యన్.టి.యు.సి కేంద్రం నుండి చీలిపోయింది.

సోషలిస్టుల నాయకత్వంలో హెచ్.యం.యస్. యూనియనులు, పూర్తిగా భుజాన వేసుకొని బ్రిటను నమూనాలో ట్రేడు యూనియనులు నేరుగా అనుబంధ సంస్థలుగా చేయబడినవిధంగా, అనుబంధసంస్థలుగా చేర్చబడి సోషలిస్టు పార్టీకి "లెవీ"ని కూడ చెల్లించుచున్నవి, ఆవిధంగా పార్టీ నిధికి విధిగా సమర్పించుకొంటున్నవి.

కమ్యూనిస్టులు మాత్రమే యూనియనులు, కమ్యూనిస్టుపార్టీ యేశాఖలకు అనుబంధ నిర్మాణాలుగ చేయరాదని నిర్ణయించేసి, అక్షరాల ఆచరణలో పెట్టింది. పార్టీ వెనుక కార్మికయూనియనులన్నీ నిలబడాలని కమ్యూనిస్టులు కోరుటలేదు.

అత్యధిక కార్మిక యూనియనులు అనేక పార్టీలు కలసియేర్పాటు చేసిన సంయుక్త ప్రజాస్వామ్య సంఘటనలో చేరాలని తీర్మానించుకొనిన వారి కోర్కెను ఆమోదం తెల్పుతున్నది. ఎట్టి ఖండన మండన చేబట్టలేదు. వాటికి ఆస్వాతంత్ర్యం, స్వేచ్ఛావున్నది.

బూర్జువా వర్గ రాజకీయపార్టీ, వాటి ప్రభావంలో సోషలిస్టు, తదితర రాజకీయ పార్టీలు రాజకీయ, సైద్ధాంతిక అభిప్రాయభేదాలు తీవ్రమైనపుడు, వాటివర్గప్రయోజనాల నిమిత్తం కార్మికవర్గ సంస్థలను చీల్చి, పోటీ కార్మిక సంస్థలను పెట్టి, కార్మికవర్గ ఐక్యతను చిన్నాభిన్నం చేయుట వాటి సాంప్రదాయమైంది. అట్టి చీలికలతో నష్టపోయేది కార్మికవర్గ ప్రయోజనాలు, నెరవేరేవి బూర్జువావర్గ ప్రయోజనాలు మొత్తంగా జరుగుట సర్వసాధారణమైంది.

భారత కమ్యూనిస్టు ఉద్యమం 1964-65 చీలి రెండు పార్టీలుగ యేర్పడిన తరువాత, అతివాద మార్క్సిస్టు కమ్యూనిస్టుపార్టీగ యేర్పడిన తరువాత తమ అంతర్గత సైద్ధాంతిక పోరాటాన్ని తమతమ పార్టీల ప్రయోజనాలకై ప్రజాసంఘాలైన అఖిల భారత ట్రేడు యూనియను కాంగ్రెసుతో సైద్ధాంతిక భేదాభియాల కారణంగా సి.పి.ఐ; సి.పి.ఐ(యం) లు సమాన భాధ్యులై చీలికను కొని తెచ్చారు. సి.పి.ఐ(యం) కార్మికనాయకులు 10 ఏప్రిల్ 1970లో గోవాలో కన్వెన్షనును, తదుపరి 29-30 మే 1970లో కలకత్తాలోని రంజీస్టేడియంలో నిర్మించిన "లెనిన్‌నగర్"లో కాన్ఫరెన్సులో "సి.టు"ను యేర్పాటు చేసారు.

విజయవాడ మార్చి 1944లో అఖిల భారత కిసాన్‌సభ మహాసభ అనంతరం, డిశెంబరు 1944 కేంద్ర కిసాన్ కౌన్సిల్ సమావేశానంతరం యుద్ధంపై కిసాన్ సభ

వైఖరిని కాంగ్రెసు విమర్శించుటతో, సమాధానంగా కిసాన్‌సభ కమ్యూనిస్టుల నాయకత్వంలో, ఆధీనంలో వున్నదని ఖండించుతు, కిసాన్ సభను, కాంగ్రెసుకు అనుబంధసంస్థగా, చేయాలనే మౌలికాంశంపై. అది దీర్ఘకాల ప్రయోజనాలకు నష్టం, పైగా కాంగ్రెసు రాజకీయాలు నచ్చనివారు పోటీ కిసాన్ సభను యేర్పాటు చేయుటకు అవకాశాన్నీ, ప్రోత్సాహం కలుగజేసిన వారమగుతామని ప్రకటనలో విజ్ఞప్తి చేసారు.

"అన్ని భయాలను తొలగించుటకు, యే రాజకీయపార్టీ తమ అభిప్రాయాలను ఎవరిపైనా రుద్దకుండా, నాలుగింట మూడు వంతులు మెజారిటీ వుంటేనే యే తీర్మానమైన ఆమోదించబడుతుందని", గ్రామ, తాలూకా, జిల్లా కిసాన్ సభలు రాష్ట్ర కిసాన్ సభకు అనుబంధసంస్థలుగా చేరకుండానే, నేరుగా అఖిలభారత కిసాన్ సభలో ప్రాతినిధ్యం కలుగచేయు సవరణలు చేయగలమన్నారు.

కిసాన్ సభ అధ్యక్షుడుగా స్వామీ సహజనంద సరస్వతి, కిసాన్‌సభ తటస్థత విధానాన్ని విడనాడి, బెంగాల్‌లోని కుల్నా, ఢక్కాజిల్లా కిసాన్ సభ కమిటీలు పాకిస్థాన్ అనుకూల ప్రచారం చేస్తున్నవని, ప్రకటించారు. అంతేగాక, అఖిలభారత కిసాన్ సభ శెక్రటరీ బంకింముఖర్జీని, ఆఫీసు శెక్రటరీ రసూల్‌ని సస్పెండు చేసి, కిసాన్‌సభ వుత్తర ప్రత్యుత్తరాలన్నీ తన పాట్నా అడ్రసుకు పంపాలనికోరారు. అన్ని భాధ్యతలు తానే స్వీకరించుతున్నానని ప్రకటించారు. కాంగ్రెసుకు చేరువయ్యారు. కేంద్రకిసాన్ కౌన్సిలుకే కార్యదర్శులను సస్పెండు చేయు అదికారంకలదని.అధ్యక్షుని అట్టి అధికారం లేదని స్పష్టం చేసారు. స్వామీజీని సంతృప్తిపరచుటకు అగ్రనాయకులందరూ నేత్రకోనలో తదుపరి కిసాన్‌మహాసభ జరిగింది,కార్యానందశర్మ శెక్రటరీగా ఎన్నుకొనబడ్డారు. స్వామీ సహజానంద బీహారులో పోటీ కిసాన్ సభ యేర్పాటు చేసారు. అది బీహారు వరకే పరిమితమైంది.

అఖిలభారత కిసాన్ సభ నాయకత్వం తీవ్రనిర్బంధానికి గురైజైళ్ళలో డిటెన్యూలుగనో లేక రహస్యజీతం గడుపుటయో 1948-52 మధ్యకాలంలో జరిగింది. కిసాన్‌సభ ఆఫీసులన్నీ పోలీసుల చేతిలో ధ్వంసమయ్యాయి. బీహారులోని యదునందన శర్మ విశ్వాసపాత్రుమైన అతని అనుచరులు కమ్యూనిస్టు వ్యతిరేకులతో కలసి అఖిలభారత ఐక్యకిసాన్ సభ అనే పోటీ సంస్థను యేర్పాటుగావించారు.

కమ్యూనిస్టుపార్టీ రెండుగా చీలిన తరువాత కిసాన్ సభ నాయకత్వం సి.పి.ఐ(యం) నాయకత్వంలో వుండుటతో, రాజకీయ సైద్ధాంతిక భేదాభిప్రాయాలు తీవ్రతరమగుటతో జనవరి 1968లో మహారాష్ట్రలోని అమరావతిలో సి.పి.ఐ. నాయకత్వంలో పోటీ కిసాన్‌సభను యేర్పరచారు.

ఈ కార్మికులు ట్రేడు యూనియను కాంగ్రెసు, రైతుల కిసాన్‌సభలు సి.పి.ఐ ; సి.పి.ఐ(యం)ల నాయకత్వంలో వున్నవి. సి.పి.ఐ;సి.పి.ఐ(యం)ల మధ్య సైద్ధాంతిక పోరాటం తీవ్రతరమై, కొన్ని ప్రాంతాలలో సాయుధసంఘర్షణలు కూడ జరుగుటతో, కమ్యూనిస్టుల అంతర్గతసైద్ధాంతిక పోరాటాలకు కార్మికవర్గ ఐక్యత, రైతాంగ ఐక్యత

బలియైపోయింది, ప్రజాసంఘాలు చీలిపోయి నిర్వీర్యమైనాయి. కార్మిక,కర్షక పోరాట పటిమనీరుదారి పోయింది.

**ట్రేడు యూనియనుల అనైక్యత చీలికలకు కారణాలు, ఐక్యత-పునరైక్యతలకు తోడ్పడే అంశాలు.**

ప్రజాసంఘాలు, ముఖ్యంగా కార్మికవర్గంలో చీలికలను అధిగమించి, ఐక్యతను పెంపొందించుట లేక పునరుద్ధరించుటకై కమ్యూనిస్టులు జరిపే పోరాటంలో విజయం పొందాలంటే, వర్గ ప్రజాసంఘాలలో చీలికలకు గల కారణాలను సమీక్షించుకొనుట, అందుండి గుణపాఠాలు నేర్చుకొనుట అత్యవసరంగా కనిపించుచున్నది. ఇది వొక భారత జాతీయ సమస్యేగాక అంతర్జాతీయ సమస్యగా వున్నందున ఆవిధంగానే అధ్యయనం చేయవలసిన అవసరం వుంది.

కార్మికవర్గంలో, కార్మిక ప్రజాసంఘాలలో చీలికలు యాధృచ్ఛికంగా తాత్కాలిక పరిస్థితుల ప్రభావంవలన వచ్చే అవకాశాలు చాలాతక్కువ. పెట్టుబడిదారి విధానంలో కార్మికోధ్యమం అభివృద్ధి చెందవలసిన వాస్తవ పరిస్థితులలో ప్రత్యేకంగా పెట్టుబడిదారి ప్రపంచ ప్రభావంలో వివిధ రాజకీయపార్టీలు, వివిధవర్గశక్తులు కార్మిక ప్రజాసామాన్యంలో పనిచేస్తున్న భౌతిక పరిస్థితులలో చీలికలు పైనుండి రుద్దబడుతున్నవి.

కార్మికవర్గం ప్రధానంగా మాజీవలసలు, నూతనంగా స్వాతంత్ర్యం పొందిన భారతదేశంలాంటి ఉపఖండంలో అనేక మతాలు, జాతులు, ఆదిమసమాజం నుండి ఆధునిక పారిశ్రామిక సమాజం వరకు వివిధ దశలలో నుండి వచ్చిన ప్రజాసామాన్యం నుండి కార్మికవర్గం యేర్పడివున్నందున దాని కూర్పు పాలలోనీరుగా కాక, నీటిలో నూనె లాగ వుంది. తనవర్గ ప్రయోజనాలకై తానుగా పోరాడగలిగిన వొక వర్గంగా పూర్తిగా రూపొందలేదు. ఈ వర్గంలో గల భిన్నత్వాల నుండి దృఢమైన ఏకత్వం, వర్గయేకత్వం-ఐక్యత యేర్పడుటలో కాలాతీతమగుటకు, దాని పుట్టుక, కూర్పు, నిర్మాణాలలో "బాల్యారిష్టాలను కలిగియున్నది. ఈవిషయంలో పశ్చిమదేశాలలోని కార్మికవర్గం కంటె భిన్నత్వాన్ని సహజంగా కలిగియున్నది. ఈ సహజ భిన్నత్వంతోపాటు వివిధ వృత్తిపత్తులవారు, నైపుణ్యంలో తేడాలు, జీవితవిధానాలు, సాంప్రదాయాలలో తేడాలు కార్మికవర్గంలో తేలికగా, చీలికలు యేర్పడుటకు వాస్తవాంశాలు అగుతున్నవి. వీటికి తోడు వివిధ రాజకీయ పార్టీలు, ప్రాంతీయ, కులమతపార్టీల భేదాభిప్రాయాలు "నాటుటకు" సారవంతమైన క్షేత్రంగా వుంది.

కార్మికోధ్యమం, కార్మికుల సంఖ్యాబలం పెరుగుటతో బహుళంగా విస్తరించిన ఫలితంగాను, రెండవప్రపంచయుద్ధానంతరం భారతదేశంలో అన్ని దేశాలలోవలెనే కొంత పారిశ్రామికీకరణ జరుగుటతో కార్మికుల సంఖ్య పెరగసాగింది, అదేవేగంలోవారు వొకవర్గంగా యేర్పడుట, వర్గచైతన్యం పెంపొందించబడుట జరుగలేదు. భారత సామాజిక ప్రత్యేక పరిస్థితులు వలన కార్మికులలో వివిధ ధోరణులు, దృక్పథాలు, బూర్జువా వర్గ ప్రభావాలు వారి చైతన్యం కంటే వేగంగా పెంపొందాయి. ఒకవిధంగాయిది వామపక్షాలవైఫల్యం ఫలితము.

కార్మికవర్గంలో చీలికలు పెటీ బూర్జువావర్గాల సిద్ధాంతాలు, రాజకీయవిధానాల ఫలితంగా యేర్పడతాయి. పెటీ బూర్జువా యజమానులు, రైతాంగం అనేకమంది ప్రధానంగా దివాళా తీస్తున్నారు, కార్మికవర్గంగా మారి పోతున్నారు, వారు పెటీ బూర్జువా అభిప్రాయాలను కలిగియున్నారు. కార్మికవర్గంలో ఆ అభిప్రాయాలనే పెంపొందిస్తున్నారు, అవకాశవాదంకు నీరుపోసి పెంచుతున్నారు.

ఇండియా, పాకిస్థాన్, ఐర్లండు వంటి అనేక దేశాలలో కార్మికవర్గంలో మతప్రాతిపదికపై భేదాభిప్రాయాలు బలంగా యేర్పడినవి. ఇస్లాం, రోమన్ కాథోలిక్కులు అత్యధికులుగా వున్నదేశాలలో మత విశ్వాసాలపై ఆధారపడి తీవ్రసమస్యలు తలెత్తాయి. అవన్నీ కలసి కార్మికవర్గంలో లోతు, బలమైన చీలికలను తెచ్చాయి. మరోవైపున హిందూమత తత్వవాదులు అభిప్రాయభేదాలకు ఆజ్యంపోసి చీలికలను అఘాతాలుగ మార్చారు.

కార్మికవర్గ ఐక్యతకు గుత్తపెట్టుబడిదారి బూర్జువావర్గాలు ప్రధాన శత్రువులు, కార్మికవర్గఐక్యత బూర్జువా వర్గానికి యెంత ప్రమాదకరమో బాగా తెలుసు, అందుకే కార్మికులలో ఐక్యత యేర్పడకుండుటకు, ఐక్యత వుంటే దానిని విచ్ఛిన్నం చేయుటకు చేయగలిగినదంతా చేస్తారు. చివరకు తమ అనుకూలవర్గాలు లేక యేజంట్లద్వారా చీలికలు తెచ్చి, పోటీ సంఘాల యేర్పాటు ప్రోత్సహించుతారు. అంతేగాక, కార్మికవర్గంలోని కొన్ని భాగాలకు ఎక్కువ జీతం, యితర సౌకర్యాల కలుగజేస్తూ, వారిలో చీలికలు కలుగజేయుట బూర్జువావర్గం యొక్క విధానంగా వుంది. ఆవిధంగా విప్లవకార్మికవర్గ పోరాటాల పటిమను, శక్తిని నిర్వీర్యం చేయుటకు సదా బూర్జువావర్గం ప్రయత్నాలు చేస్తుంది. భారతదేశంలో బడాబూర్జువావర్గం యిలాగే చేస్తున్నది.

కార్మికసంఘాల నాయకులలో సంస్కరణవాదులు, సోషలు డెమోక్రాట్లు, సోషలిస్టులు, కేరీరిస్టులు, యాజమాన్య ప్రభావంలో వున్న వారిని చేరదీసి, వారికి జీతాలు ఎక్కువ, తేలిక పనిని, ఇతర సౌకర్యాలను కలుగజేస్తూ కొంతమందిని యేజంట్లుగా తయారు చేసుకొని వారి ద్వారా ముఠాలు, గ్రూపులు సృష్టించి వారి సమిష్టి పోరాటాలను నీరుగార్చి వైఫల్యమగునట్లు చేయుట, చివరకు చీలికలను తెచ్చుట పోటీ సంఘాలు యేర్పరచుట, యాజమాన్య ప్రభావంలో నడుపుట లాంటి కార్మికుల ఐక్యతావిచ్ఛిన్నకర కార్యకలాపలను కూడ సాగిస్తున్నారు. అదేకాలంలో కొన్ని రాయితీలను యిస్తూ, సంస్కరణలు పెట్టి కార్మికుల కళ్ళనీళ్ళు తుడుస్తూ చీలికలను తెచ్చి వారి ఐక్యతను విచ్ఛిన్నం చేస్తున్నారు.

కమ్యూనిస్టుపార్టీ వ్యతిరేకతను రెచ్చగొట్టుతు, కొంతమందిని డబ్బుకు, వ్యవసనాలకు బానిసలను చేస్తూ, వారి ద్వారా కార్మికులలో తగాదాలు కొట్లాటలు తెచ్చి పోరాటాలలో, యూనియనులలో చీలికలు తెచ్చి, పోటీ సంఘాలు పెట్టి, కార్మికులలో ఐక్యతను విచ్ఛిన్నం చేస్తు కార్మికవర్గానికి ద్రోహం చేస్తున్నారు.

పారిశ్రామికీకరణ చాలా తక్కువగా వున్నప్రాంతాలు, దేశాలలో పెటీ బూర్జువాపార్టీల ప్రాబల్యం యెక్కువగా వుండి, ప్రజాసామాన్యంలో పెటీ బూర్జువాలు అత్యధికులుగా వుండి పెటీ బూర్జువారాజకీయపార్టీలు రాజకీయ జీవితంలో ప్రధాన పాత్ర వహించునపుడు, ప్రభుత్వయంత్రాంగాన్ని వినియోగించి విప్లవ కార్మికోద్యమం అభివృద్ధి చెందకుండా స్వతంత్ర

కార్మిక సంఘాలు యేర్పడకుండా, వాటిని గుర్తించకుండా, అనేక కుంటిసాకులతో కార్మికులపై, వారి నాయకుల హింసా, దౌర్జన్యాలు, దొంగకేసులతో పోలీసు హింసలకు గురిచేస్తూ, కార్మికులలో వారి సంఘాలలో చీలికలు తెస్తూ, పోటీ సంఘాలు యేర్పాటుచేస్తూ కార్మికవర్గ ఐక్యతను విచ్ఛిన్నం చేస్తున్నారు. కార్మికులు కార్మికవర్గంగా యేర్పడకుండుట, వారిలో వర్గ చైతన్యం శూన్యమగుట, సంఘ విచ్ఛిన్నకుల పని తేలిక అగుట, పరోక్షంగా జరుగుతున్నది. అదే కాలంలో కార్మికవర్గంలోనే గల "మితవాద", "అతివాద" అవకాశవాదులు కార్యాచరణలు కార్మికవర్గ ఐక్యతకు ప్రమాదకరంగా పరిణమించుట, వీటిని యాజమాన్యం, ప్రభుత్వం వినియోగించుకొని "చీలికల"ను పరోక్షంగా ప్రోత్సహించుతు కార్మికవర్గ ఐక్యతను విచ్ఛిన్నం చేస్తున్నారు, ప్రయోజనం పొందుతున్నారు. మితవాద సోషలిస్టు వర్గాలేగాక, కమ్యూనిస్టులలోని "మితవాద" "అతివాద" అవకాశవాద వర్గాలు పరస్పరం కార్మికుల ఐక్యతను విచ్ఛిన్నం చేస్తున్నారని బహిరంగంగా నిందించుకొనుట, చివరకు "కొట్లాటలకు" అదనపు కారణమగుట కార్మికవర్గంలో ఐక్యతా విచ్ఛిన్నానికి పరోక్షంగా బలమైన కారణమయ్యాయి. దీనినే అవకాశంగా తీసుకొని మితవాద సోషలిస్టు అవకాశవాదులు, బూర్జువా రాజకీయపార్టీలు కమ్యూనిస్టులు తమ వర్గరాజకీయాలతో, సైద్ధాంతిక భేదాభిప్రాయాలనే పేరుతో కార్మిక సంఘాలను చీల్చుటమేగాక, నిరవధికంగా కార్మికవర్గ అనైక్యతకు కారణమనే ప్రచారాన్ని ముమ్మరంగా సాగించారు. కమ్యూనిస్టుల కార్మికవర్గ ఐక్యతా ప్రచారం వొక ఐక్యతా సూత్రంగా కాక ఆచరణలో ఎత్తుగడగా ప్రాబల్యాన్ని పెంచుకొనుటకు చేస్తూ, ఆచరణలో అనైక్యతకే దోహదపడుతున్నారనే బూర్జువావర్గాల ప్రచారానికి బలాన్ని చేకూర్చుతున్నారు.

ఈవిధంగా మితవాద అవకాశవాద సోషలిస్టుల కమ్యూనిస్టు వ్యతిరేకత, అదే కాలంలో "మితవాద" "అతివాద" అవకాశవాద కమ్యూనిస్టుల పరస్పర వ్యతిరేకతతో సమిష్టి పోరాటాలలో సైతం సహకరించుకొన జాలక పోవుటనేడు కార్మికవర్గ ఐక్యతకు ప్రధాన ప్రమాదమైంది. అంచేతనే యేవొక్క అఖిల భారత కార్మిక వర్గ పోరాటం విజయవంతంగా జరుపలేక పోవుట వామపక్షాల, కార్మికసంఘాల బలహీనత, అనైక్యత స్పష్టంగా అందరికి వ్యక్తమగుతున్నది.

## కార్మికవర్గ ఐక్యతకు తోడ్పడు అంశాలు.

కార్మికవర్గ అనైక్యతకు కమ్యూనిస్టుల ఆచరణాంశాలు యెలాకారణాలు అగుతున్నవో, ఐక్యతకు తోడ్పడే అంశాలుకూడా పెట్టుబడిదారీ విధాన ఆర్థికాభివృద్ధి వాస్తవ పరిస్థితులనుండి ప్రధానంగా దానిలోని వైరుధ్యాలవర్గ సంఘర్షణ, బూర్జువావర్గ దేశ, విదేశాంగ విధానాల సంక్షోభం, ప్రజాస్వామ్య, విప్లవశక్తుల పోరాటాల నుండి యేర్పడుతున్నవి.

కార్మికుల ప్రయోజనాలకై అవసరమైన సంయుక్త పోరాటాలే కార్మిక ఐక్యతా పిలుపులకు, ఆచరణ, ప్రోత్సాహాలకు సుముఖ అంశాలు అగుతున్నవి. బూర్జువావర్గం సంక్షోభం నుండి బయటపడుటకు ఆ బరువుభారాన్నంతా వారిపై మోపుతూ వేతనకోతలు, పనిభారాన్ని పెంచుతు, లోగడ కలుగజేసిన సామాజిక సౌకర్యాలను వుపసంహరించుతు, కార్మికుల ప్రతిఘటనను యెదుర్కొనుటకు "సమ్మెహక్కును, పౌరహక్కులను" హరించే చట్టాలతో

ట్రేడు యూనియనులపై దాడివిధానాన్ని చేబట్టింది. ఇవన్నీ వర్గపోరాటాన్ని తీవ్రతరంచేయుట కార్మిక ఐక్యతకు సహజంగానే దారితీయుటకు తోడ్పడుతున్నవి. అదేకాలంలో హిందూ,ముస్లిం, క్రిష్టియన్ మతసంస్థలు, ఫాశిస్టుశక్తులు పోటీ ట్రేడు యూనియనులను యేర్పాటు చేయుట, కొన్ని ప్రాంతీయపార్టీలు కూడ అదే పనిని చేయుటతో కార్మికవర్గ ఐక్యతకు ప్రమాద యేర్పడుతున్నది.

రాజకీయ ప్రజాస్వామ్య రక్షణతోపాటు, ఆర్థిక ప్రజాస్వామ్యాన్ని పారిశ్రామిక పెట్టుబడిదారుల, యాజమాన్యాల హక్కులపై పరిమితులు పెట్టి, ప్రజాస్వామ్యాన్ని విస్తరించుటకు ట్రేడు యూనియనులకు మరిన్ని హక్కులు, కార్మికులపాత్రను పెంచుటకు భాగస్వాములనే పోరాటాలు, సంస్కరణలకే పరిమితమైనా కార్మికులను సమీకరించుటకు, కార్మికవర్గ ఐక్యతను, ఐక్యకార్యాచరణ పెంపొందుటకు చోదక అంశాలు అగుతవి.

అభివృద్ధి చెందుతున్న దేశాల ఆర్థిక, రాజకీయ విధానాలపై సామ్రాజ్యవాద శక్తుల ప్రభావాలవారి విదేశపెట్టుబడుల వ్యతిరేకపోరాటాలు దేశ ఆర్థిక, రాజకీయ స్వాతంత్రాలను విస్తరించేవి కాన, వివిధ రాజకీయ విశ్వాసం కల వారందరూ ఐక్యమగుటకు ప్రధానపునాది అంశమగుతుంది. కార్మికవర్గ ఐక్యతకు దోహదపడుతుంది. అత్యంతవర్గ చైతన్యం కలిగిన, విప్లవపోరాట శక్తి కార్మికవర్గమైనందున పెట్టుబడిదారి దేశాలలో సామ్రాజ్యవాదం నుండి పూర్తి ఆర్థిక, రాజకీయ స్వాతంత్ర్యానికై జరిగే పోరాటంలో నాయకత్వం వహించాలి. అందుకు సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో అగ్రగామిదళ పాత్ర వహించుటకు కార్మికవర్గ ఐక్యత వొక్కటే అట్టి సామార్ధ్యాన్ని కలుగజేస్తుంది.

కార్మికవర్గ ఐక్యతకై కమ్యూనిస్టులు చేసే పోరాటం తాత్కాలికము, మార్పుచెందే నేటి రాజకీయ, వర్గ శక్తుల లేక కార్మికోద్యమాల సహకార, కూటముల కొరకు కాదు. వివిధ చారిత్రిక దశలలో కమ్యూనిస్టుపార్టీల ఉనికి ఉన్న ప్రతిచోట విప్లవోద్యమాలు ఆరోహణ, అవరోహణ అన్నిదశలలో అవి తమ విధానాలను, కర్తవ్యాలను, వ్యూహసూత్రాలను అనుసరించే ఎల్లప్పుడూ నిర్ణయించుకొన్నవి. కార్మికవర్గ ఐక్యతకై పోరాడునపుడు కమ్యూనిస్టులు అనుసరించిన మౌలిక సూత్రాలు లెనిన్ చేతనే రూపొందించబడినవి. లక్ష్యసాధనకై కార్మికవర్గ ఐక్యసంఘటన రూపొందించు ప్రతిపాదన చేసారు. "మేము ఐక్యసంఘటనా ఎత్తుగడలను ఆమోదించాము వాటిని చివరి వరకు అనుసరించుతాము" అని లెనిన్ అన్నారు. ఈ సూత్రాలు కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌చే అభివృద్ధి చేయబడినవి. ఆవిధంగా "ఐక్య కార్మిక సంఘటన" అనే సిద్ధాంతం కొమింటర్న్ కార్యనిర్వాహకవర్గం 1921 డిశెంబరులో ఆమోదించి, ఐక్యసంఘటనా విధానం పరిణామం చెందేకాలమంతా ఆచరణ యోగ్యమైనదిగా నిర్ధారణచేసింది.

లెనిన్ మరణానంతరం కమ్యూనిస్టులు, తదితర కార్మికవర్గపార్టీలు, సెక్టేరియన్ వర్గాలచే అతని సిద్ధాంత అవగాహన వక్రీకరణలకు గురయ్యాయి. సెక్టేరియను వక్రీకరణలు 7వ అంతర్జాతీయ కమ్యూనిస్టు కాంగ్రెసు-1935లో ఖండించబడినవి. ఏడవ కాంగ్రెసు లెనిన్ సిద్ధాంత అవగాహనలను మరింతగా అభివృద్ధిచేసి, కార్మికవర్గ ఐక్యతను నొక్కి చెప్పింది.

కార్మికవర్గ ఐక్యత యెడల కమ్యూనిస్టుల పంథా అంతర్జాతీయ కమ్యూనిస్టు అండ్

వర్కర్స్ పార్టీల 1957, 1960, 1969 సమావేశాలలో ఆమోదించబడిన నిర్ణయాలలో రూపొందించబడింది.

బూర్జువావర్గాలు, అభివృద్ధి నిరోధకులు, "అతివాద", "మితవాద" అవకాశవాదులు కార్మికవర్గ ఐక్యతకు ప్రధాన శతృవులు. అంచేతనే శాస్త్రీయ మార్క్సిస్టు లెనినిస్టులు తమ ప్రధాన దాడిని మొట్టమొదటగా బూర్జువావర్గం, తదితర అభివృద్ధి నిరోధకశక్తులపై ఎక్కుపెట్టారు. కార్మికవర్గ ఐక్యతా విచ్ఛిన్నకులు, ఆవర్గంలోనేవున్న అంతర్గత "మితవాద" "అతివాద" అవకావవాదులు పరోక్షంగా సిద్ధాంతాల పేరిట వివిధ కార్మికవర్గ పార్టీల మధ్య సహకారం, ఐక్యపోరాటాలు, కార్యాచరణకు విఘ్నాలు కల్పించేవారికి, ఐక్యతా అవకాశాలను వ్యతిరేకించే వారిపై జరుపవలసిన పోరాటం యెడల తాత్సారం చేయుట జరిగింది. కమ్యూనిస్టుపార్టీలు ధృఢతర, నిరవధిక అత్యవసరమైన కార్మికవర్గ ఐక్యతకు, యేకైక బలమైన కార్మిక, కర్షక ప్రజాసంఘాల నిర్మాణ ప్రయత్నాలు చేయుటకు మారుగ, సైద్ధాంతిక అభిప్రాయ భేధాలను తమస్వీయ మానసిక దౌర్జన్యాలతో, ప్రలోభాలతో చీలికలకు కారణభూతులైన తమలో వున్న అంతర్గత శతృవులపై ప్రధాన దాడిని ఎక్కుబెట్టుటలో విఫలులై మొత్తం కార్మికవర్గ ఐక్యతకుఅంతర్గత శతృవులుగ పరిణమించారు.

## కార్మికవర్గ ఐక్యతా పోరాటమౌలిక సూత్రాలు.

కమ్యూనిస్టుపార్టీలు కార్మికవర్గ ఐక్యతకై జరిపే పోరాటంలో అనేక సజీవసూత్రాలను సోషలిస్టు తదితర కార్మికవర్గపార్టీలతో సహకారాన్ని పెంపొందించుటకు అనుసరించుతారు. ఈసూత్రాలు ఆచరణానుభవాలనుండి రూపుదిద్దు కొన్నవి. ఈసూత్రాలసారాంశం కమ్యూనిస్టులు ఐక్యకార్యాచరణలో కార్మికవర్గ ఐక్యతా దృక్పధంలోని సూత్రాల పంధాయే అగుతుంది.

1. కార్మికవర్గ యితర పార్టీలతో కమ్యూనిస్టుపార్టీలు సహకారానికి, ఐక్యకార్యాచరణకు పూనుకొన్నపుడు మరేయితర ప్రయోజనాలు కాని, కార్మికవర్గ లక్ష్యాలకు భిన్నమైన స్వప్రయోజనాలకు ప్రయత్నించరు. సహకారం, ఐక్యకార్యాచరణ ప్రాముఖ్యత వొక్కటే చూస్తారు, యితర పార్టీల ప్రయోజనాలను దెబ్బతీయరు. తమ యేకైక నాయకత్వాన్ని ప్రతిష్టించప్రయత్నించరు. సోషలుడెమోక్రటిక్, యితర బూర్జువా పార్టీలు కమ్యూనిస్టులపై మోపేనిందలను వాస్తవం చేయరు. తమ స్థానాలనే బలపరచుకొనరు. మొత్తం కార్మికవర్గపు పోరాటపటిమ, శక్తిని పెంపొందించుటకే ప్రయత్నించుతారు. కార్మికవర్గ విజయం వొక్కటే ప్రధానలక్ష్యంగా నెంచుతారు. తక్షణ కోర్కెల విజయానికే గాక కార్మికవర్గం అధికారాన్ని చేబట్టి, సోషలిజం మార్గంలో పయనించుటకు దోహదపడతారు, కాని సోషలిజాన్ని ఆమోదించాలనే షరతు మాత్రం పెట్టరు.

2. కమ్యూనిస్టులు కార్మికులు వారు సోషలిస్టులైనా, క్రిష్టియన్ డెమోక్రాట్లు అయినా సోషలిస్టు రివల్యూషనరీలు, ఫార్వర్డు బ్లాకు, తదితర యేపార్టీలకు చెందిన వారైనా "తమవర్గసోదరులు" గానే యెంచుతారు, వారితో అవగాహనకు వచ్చుటకు అన్ని ప్రయత్నాలు చేస్తారు. అంచేతనే కమ్యూనిస్టులు అందరి సమిష్టి ప్రయోజనాలనే ముందుకు తెస్తారు, సమిష్టి పోరాటానికై అందరిని ఐక్యపరచే ప్రయత్నం చేస్తారు.

3. ఐక్యకార్యాచరణ, ఐక్యపోరాటాలను ముందుకు తెచ్చేందుకు యిప్పుడు కమ్యూనిస్టులు వామపక్షాలన్నీ వివిధ కమ్యూనిస్టులు, సోషలిస్టులు అందరుకలసి వొకేవొక కార్మికవర్గ ఐక్య పార్టీగ యేర్పడాలని కోరుటలేదు. ఏపార్టీయైనా మార్క్సిస్టు-లెనినిస్టు సూత్రాలపై పనిచేస్తే కార్మికుల ప్రయోజనాలు కాపాడబడుతవి. పార్టీలు కలసిపోయే పరిస్థితులు యేర్పడనప్పుడు మార్క్సిజం-లెనినిజం విశ్వాసం గల వారందరూ ఒకేవొక పార్టీగా యేర్పడాలని తలచుట, వాస్తవ పరిస్థితులకు దూరమైన అతివాదం అగుతుంది. పార్టీలు విడిగానే స్వతంత్రపార్టీలుగ వుండి సమిష్టి ప్రయోజనాలకై ఐక్యకార్యాచరణ, ఐక్యపోరాటాలలో పాల్గొనుట ద్వారా ఐక్యవేదిక రూపొందుతుంది. సమిష్టి పోరాటాలకై యీదశలో వామపక్షాలన్నీ ముందుకు వస్తే పాక్షిక విజయం లభించినట్టే అగుతుంది. ఐక్యపోరాటంలో సహకరించుటతో ప్రజోద్యమాలు పోరాటమార్గంలో ఎంతోపురోగమిస్తాయి.

4. ఐక్యకార్యాచరణ, పోరాటాలలో కమ్యూనిస్టుపార్టీలు వామపక్షాలు, సోషలిస్టుపార్టీలు, యితర సోషలుడెమోక్రటిక్ పార్టీలు, రివల్యూషనరీ సోషలిస్టుపార్టీ, పార్వర్డు బ్లాకు వగైరాలు త్వరలోనే కూలిపోతాయని, లేనిచో పెట్టుబడిదారి విధానంలో దీర్ఘకాలంలో మనగలుగుట, సోషలిస్టు విప్లవ విజయానంతరం కూడ కొన్ని దేశాలలో దీర్ఘకాలం మనగలుగవచ్చును. కమ్యూనిస్టులు యితర వామపక్షాల సహకారంతో వారిలో రాజకీయ విశ్వాసాలలో మార్పుతేగలమని, ధృడమైన అలయెన్సును నిర్మించగలమనే అవగాహనతో వున్నారు.

5. ప్రజాసామాన్యంలో ప్రణాళికాబద్ధంగా పనిచేసి, ఐక్యతా విధానానికి సమీకరించవచ్చని, ఆవిధంగా కమ్యూనిస్టులు యితర వామపక్షాల మధ్య సహకారాన్ని కార్మికుల ప్రయోజనాలకై ఐక్యకార్యాచరణను పెంపొందించవచ్చని, యీవిధంగా. కమ్యూనిస్టులు యితర వామవక్షాలమధ్య క్రింది స్థాయిలో కూడ సహకారాన్ని, ఐక్యపోరాటాలపై సుహృద్భావాన్ని పెంపొందించుటయేగాక, కమ్యూనిస్టు వ్యతిరేకతను సరళీకృతం చేయుటకు అవకాశాలు యేర్పడుతవి. పరస్పరం అపనమ్మకాలు, వొకరికొకరి మధ్యగల దూరాలు సమసిపోతాయే దారి యేర్పడుతుంది. సంయుక్త కార్యాచరణ పురోగమించుతుంది.

6. ఐక్య కార్యాచరణ, ఐక్యపోరాటాలను పెంపొందించుటకై కమ్యూనిస్టుల పోరాటం విజయవంతమగుటకు అవసరమైన నాయకత్వాల సహకారం, క్రిందివర్గాలతోపాటు అవసరము. ప్రపంచకార్మికోద్యమ అనుభవం, దీర్ఘకాల సహకారం కమ్యూనిస్టులు-సోషలిస్టులు-యితర వామపక్షాల మధ్య ధృఢమైనగా వుండాలంటే ఆయా పార్టీల క్రింది వర్గాలలో సహకారం,ఐక్యతాభావం అభివృద్ధి చెందుటతోపాటు ఆయాపార్టీల నాయకుల మధ్య సహకారం, స్నృహృద్భావం, ఐక్యతాభావంచోటుచేసుకుంటే ధృడమైన ఐక్యపోరాటాలకు బలాన్ని చేకూర్చుతుంది.

7. ఒకప్పుడు గతంలో కమ్యూనిస్టుపార్టీలు సోషలు డెమోక్రటిక్ పార్టీల నాయకులతో సహకారాన్ని, ఐక్యకార్యాచరణలు నెరపుట సూత్రప్రాయంగా తప్పని, కార్మికోద్యమంలో సోషల్ డెమోకటిక్ నాయకులను వదలివేసి, కార్మిక ప్రజాసామాన్యంలో పనిచేయాలని నిర్ణయించుకొన్నారు. ఈవిధానం తన్నుతానే సమర్థించుకొనజాలదు, అది ధృఢమైన అలయెన్సుకు తోడ్పడదు. అంచేత, క్రిందిస్థాయిలో సహకార పంథా అమలు అవసరం.

8. ఐక్యతా మార్గం సంయుక్తపోరాటాలు, సంయుక్తకార్యాచరణ, కార్మికుల కోర్కెలను విజయవంతంచేయుట, సైద్ధాంతిక చర్చలు, కమ్యూనిస్టులు, సోషలిస్టులు, తదితరుల మధ్యకొంత ప్రయోజనం వొనగూడినా, నేడు అభిప్రాయభేధాలు సైద్ధాంతిక పరిధులను, కార్మికవర్గ ప్రయోజనాలను దాటిపోయి, పార్టీల గ్రూపుల ప్రయోజనాల ప్రాధాన్యత వహించుట జరిగినందున, అట్టి సమస్యలపై చర్చలు ఐక్యకార్యాచరణలను పెంపొందించజాలవు, వాటిని చిక్కులలోనే పడవేస్తవి. సమిష్టి ప్రయోజనాలు, లక్ష్యసాధనకై సంయుక్త పోరాటమే ఆచరణలో అవసరమైన ఐక్యతను సమకూర్చుతుంది. అంచేత అందరి ఆమోదం పొందిన కోర్కెలపై అందరి సహకారం లభించి ఐక్యకార్యాచరణ విజయంపొందే అవకాశాలు యెక్కువగా వున్నవి. కమ్యూనిస్టు వ్యతిరేకులు సైతం, తమ ద్వేషభావాన్ని త్రోసివేసి, తమ ఎత్తుగడలను మార్చుకొని, ప్రధానంగా ప్రజలకు దూరమగుతామనే భయంతో ఐక్యకార్యాచరణలో కలసివచ్చే అవకాశాలు నేడు యెక్కువగానే వున్నవి. దీనర్థం కమ్యూనిస్టులు సాధారణంగా సైద్ధాంతిక సమస్యలను వదలి వేస్తారని కాదు. సైద్ధాంతిక ప్రశ్నలు, సమస్యలు వారి దృష్టిలో ఎప్పుడూ అత్యంత ప్రధానమైనవే. అయితే అవేదికే వేరు. ఐక్యకార్యాచరణకై పోరాడునపుడు, యిద్దరు లేక పలువురి మధ్య జరిగే వొప్పందమే ప్రాధాన్యత వహించుతుంది. చర్చలు, చర్చించబడే సైద్ధాంతిక సమస్యలు ద్వితీయస్థానంలో వుండి, వివిధ దృక్పధాలనుండి రూపొందిన సమిష్టి అవగాహన కార్యాచరణలో కార్మికవర్గ పార్టీలను సమిష్టి పోరాటంలో దగ్గరకు చేర్చుతుంది. అయితే, యిది అంత తేలికయైనది కాదని, కష్టసాధ్యమే అయినా సాధించజాలునిదికాదని తెలుసుకొనవలసివుంది. అందుకు సోషలిస్టులు, వివిధ కమ్యూనిస్టులు తమ మధ్యలో పేరుకుపోయిన పరస్పర అపనమ్మకాలు,అపోహలు, దురభిప్రాయాలు, విరోధ-శతృభావాలను తొలగించుకొంటూ, పరస్పరవిశ్వాసాన్ని పెంచుకొనే ప్రయత్నాలు చేయాలి. ఏ పరిస్థితులలో వాటిని, పెంచి, పోషించే దుష్కర్మలు చేబట్టరాదు. అందుకు ప్రాదమిక చర్యలుగ యిచ్చి పుచ్చుకొనే సరళీకృతవిధానాలు చేబట్టి, "తాబట్టిన కుందేలుకు మూడే కాళ్ళనే" మొండితనాన్ని విడనాడాలి. ఇట్టి అవగాహనలతో నిజాయితీతో ప్రయత్నించిన 'సమిష్టి అవగాహనకు, కార్యాచరణకు రాలేపోవుటకు "దాటరాని విధ్యపర్వతాలు లేవు-అగస్త్య మహర్షి అవసరము వుండదు.

9. సంయుక్త కార్యాచరణ విజయవంతమవ్వాలంటే ప్రధాన లక్ష్యాలు,కోర్కెలు తప్పనిసరిగా భాగస్వామ్యపార్టీలు అన్నీ కలసినసమిష్టిగా రూపొందించబడాలి. పెద్దన్నయ్యతత్వం హానికరము. నిరవధికంగా, ధృడతరంగా అమలు చేయబడాలి. అటువంటి సమిష్టి కార్యక్రమాల విస్తరణ, వివరణ, సమస్యలు ప్రోగుబడుట అన్ని భాగస్వామ్యపార్టీల పూర్తి సహకారంతోనే విజయం చేకూరుతుంది. ఐక్యకార్యాచరణ కార్యక్రమం సంయుక్త పత్రం, అదియే వొక్క పార్టీ పత్రం కాదు, అది భాగస్వామ్యపార్టీల నిర్ధిష్ట రాజీలతో రూపొందుతుంది. ఈ పత్రంలోని రాజీలను, రాయితీలను సూత్రప్రాయంగా వ్యతిరేకించే దోరణి, కొన్ని అంశాలను కోర్కెలను సూత్రప్రాయంగానైనా బహిరంగంగా వ్యతిరేకించుట అంటే, సహకారాన్ని, ఐక్యకార్యాచరణను నిరాకరించుటయే అగుతుంది. కమ్యూనిస్టు ఉద్యమం ప్రాథమిక దశలోనే కొన్ని అంశాలను సూత్రప్రాయంగా వ్యతిరేకించుటను తీవ్రంగా ఖండించాడు.

10. ఐక్యతా పోరాటం విజయవంతం, అగుటకు, ఐక్యకార్యాచరణ కార్యక్రమంతోపాటు వొక ఐక్యనిర్మాణం యేదోవొక రూపంలో వుండాలి. ఈవిధంగా ఐక్యకార్యాచరణ, నిర్మాణ ఐక్యతారూపంలో ఆమోదం పొందాలి. సమిష్టి ఆమోదం పొందిన విధానం నుండి, తాత్కాలిక ప్రయోజనాలకు వైదొలగి, భాధ్యతల నుండి తప్పుకొనుట లేక అలసత్యంలో పాల్గొనకుండుట, భాగస్వాముల విశ్వాసాన్ని దెబ్బతీస్తుంది. ప్రధాన వ్యూహ కర్తవ్యనిర్వహణ, కార్మికోద్యమ ఐక్యతకు విఘ్నకారి అగుతుంది.

11. ఐక్యకార్యాచరణ, ఐక్యపోరాటాలలో భాగస్వామ్యపార్టీలు సాగించే బహిరంగసైద్ధాంతిక పోరాటం కార్మికవర్గంలో ఐక్యత మరింతబలపరచిన యెడల మాత్రమే ఆపోరాటం విజయవంతమగుటను తెలియజేస్తుంది. అట్లుగాక ఆసైద్ధాంతిక పోరాటం ఉన్న ఐక్యకార్యాచరణను, ఐక్యప్రజాసంఘాలను చీల్చి, పోటీసంఘాలు యేర్పాటుకు దారి తీసి, ఐక్యతా విచ్ఛిన్నమైతే, అట్టి ఆచరణను మార్క్సిజం–లెనినిజం సమర్థించజాలదు.

మార్క్సిజం–లెనినిజం విమర్శనా భాధ్యత సైద్ధాంతిక, రాజకీయవిధానాలను ప్రధానంగా "మితవాద" "అతివాద" అవకాశవాదాన్ని అనుసరించే వివిధ కమ్యూనిస్టు శ్రేణులలో యేమైనా, తీవ్రవిమర్శకుగురిచేయుట, అదీ పడికట్టురాళ్ళు చేయుట శాస్త్రీయవిధానంకాదు, ఒక్క మన వర్తమాన ఆర్థిక, సామాజిక పరిస్థితుల శాస్త్రీయ మార్క్సిస్టు–లెనినిస్టు మౌలిక సూత్రాలను అనువర్తించుట, ప్రధానలక్ష్యంగా తగిన కార్యాచరణ చేబట్టాలి, అది సైద్ధాంతిక ఆచరణ రెండింటికి సంబంధించినదిగా వుండాలి. సైద్ధాంతిక ఆచరణ శూన్యత పైచేయి కారాదు. వాస్తవానికి సైద్ధాంతిక, ఆచరణల వాడి,వేడి కలది కావాలి.

12. వివిధ కమ్యూనిస్టు శ్రేణుల యెడల శాస్త్రీయ కమ్యూనిస్టులు భిన్నదృక్పధాలు చేబట్టి, గ్రూపులయెడల విచక్షణా శాస్త్రీయ విధానాన్ని అనుసరించాలి. శాస్త్రీయ కమ్యూనిస్టులు అందరి యెడల వొకేవిధంగా వ్యవహరించుటసరికాదు. "మితవాద" "అతివాద" అవకాశవాదుల యెడల భిన్నవైఖరులు అవలంభించుట శాస్త్రీయపద్ధతియే అగుతుంది.

# 7

# రెండు దృక్పథాల సంఘర్షణ

కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల మధ్యవుండవలసిన సంబంధాలు, 1972 ఎన్నికల తదనంతరం ప్రధాన సమస్యలుగా ముందుకొచ్చాయి. అనేక రాష్ట్రాలలో కాంగ్రెసేతర ప్రభుత్వాలు యేర్పడుట, కేంద్రంలో సర్వాధికారాలుగల కాంగ్రెసు పాలన, రాష్ట్రాలలో ప్రతిపక్షపార్టీలు ప్రభుత్వాలను యేర్పాటు చేసాయి. సహజంగానే యీ రాజకీయపార్టీల లక్ష్యాలు, అవగాహనలు భిన్నమైనవి అయినందున సంఘర్షణలకు అవకాశాలు యేర్పడి, యీ సమస్యలు ప్రాధాన్యత వహించాయి. కేంద్రంలో, రాష్ట్రాలలో వొకే రాజకీయపార్టీ అధికారంలో వుండే పరిస్థితి మారిపోయింది.

సమకాలిన రాజకీయ పరిణామాలలో ఉత్పన్నమైన సమస్యలపై కాంగ్రెసు, తదితర బూర్జువా రాజకీయపార్టీలు చేబడుతున్న వైఖరులను, ఆచరణను ఎప్పటికప్పుడు సి.పి.ఐ(యం), సి.పి.ఐలు విమర్శనాదాడికి గురి చేస్తూనేవున్నవి. అయినా కాంగ్రెసు, తదితర అభివృద్ధి నిరోధక రాజకీయపార్టీలపై ప్రజలకుగల భ్రమలు, అభిమానం పూర్తిగా తొలగిపోలేదు. ప్రధానంగా, జాతీయ ఐక్యతా పరిరక్షణకు ఆపార్టీలు ముందుకు వచ్చినపుడు ప్రజలలో బలపడుటకూడ జరుగుతూనేవుంది. అకాలీదళ్, ద్రవిడమున్నేట్రకజగం అన్నా ద్రవిడ మున్నేట్రకజగం, తదితర ప్రాంతీయ పార్టీలు, గ్రూపులు రాష్ట్రాల స్వపరిపాలనాధికారాలను, వివిధ ఉపజాతుల హక్కులను తామొక్కరమే సాహసించి, పరిరక్షించగలవారమనే ప్రచారంతో ఆపార్టీలు తమ బలాన్ని పెంపొందించుకొనే అవకాశాలు పెరిగాయి. కాశ్మీర్, నాగా, మిజోరం, అధికార భాషా సమస్య అన్నీ వివాదాంశాలుగ అభివృద్ధి చెందాయి. కార్మిక, కర్షక, ప్రజాసామాన్య ఐక్యపోరాటాలలో రాష్ట్రాల స్వపరిపరిపాలన, హక్కులు పరిరక్షింపబడగలవని, ఆపోరాటాల క్రమంలోనే సోషలిజంలోనికి పురోగమన మార్గమేర్పడుతుందని వామపక్షాలు, ముఖ్యంగా కమ్యూనిస్టుల విశ్వాసం.

కేరళ, పశ్చిమబెంగాల్‌లలోని వామపక్ష, ప్రజాస్వామ్య పక్షాలు వాటి ప్రభుత్వాలతోపాటు, కాంగ్రెసేతర ప్రతిపక్షపార్టీల రాష్ట్ర ప్రభుత్వాలు, ఆయాపార్టీలు యీ సమస్యలపై చొరవను ప్రదర్శించి, పోరాడవలసిన ఆవశ్యకతవుంది. ఈలక్ష్యసాధనకై పోరాడుటలో కార్మిక, కర్షక, ప్రజాస్వామ్యపార్టీల సంఘటనల ఐక్యత బలోపేతమగుతుంది. ప్రజాసమీకరణ, పోరాట ఐక్యత, శక్తి పెంపొందుతవి. ఇదే వామపక్షాల కేంద్రరాజకీయ ఐక్యకార్యాచరణ కావాలి, యిదే అన్ని శక్తులను కదలించగల కేంద్రనినాదమగుతుంది. ప్రజలు తమ నినాదంగా చేబట్టగలుగుతారు. నేటి అన్ని తక్షణ సమస్యలపై విజయవంతమైన పోరాటాలకు ప్రజలను, సమీకరించేందుకు యీ కేంద్రనినాదం ఎంతో తోడ్పడుతుంది.

## కమ్యూనిస్టుపార్టీకి ప్రధమ శతృవు మరో కమ్యూనిస్టుపార్టీ?

జార్జి డిమిట్రావ్ "ఇప్పుడు ఇండియాలో ఎన్నికమ్యూనిస్టుపార్టీలు వున్నవని" 1946లో అడుగగా, "కామ్రేడ్ డిమిట్రావ్ వొకే వొక కమ్యూనిస్టుపార్టీ వుందని" తాను సమాధానం చెప్పానని, "వెన్ కమ్యూనిస్ట్ డిఫర్" అన్నరచనలో యస్.ఎ.డాంగే వ్రాసారు. ఇండియాలో 1930లలో కమ్యూనిస్టులు గ్రూపులుగ పనిచేయుట, ఎ.ఐ.టి.యు.సి.ని చీల్చి "రెడ్ ట్రేడు యూనియన్ సెంటర్"ను యేర్పాటు చేయుట. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ జనరల్ సెక్రటరీగా భారతదేశంలో కమ్యూనిస్టుల ఐక్యతకై కృషి చేసిన నేపధ్యజ్ఞాపకాలను గుర్తుచేసారని వ్రాసారు. రెండు దశాబ్ధాల తరువాత మార్చి 1968 బుడాపెస్ట్ కాన్ఫరెన్సులో ప్రతినిధులు "మీదేశంలో యిప్పుడు ఎన్నికమ్యూనిస్టుపార్టీలు వున్నవని అడిగినపుడు ఒకే వొక కమ్యూనిస్టుపార్టీ ఆఫ్ ఇండియా వున్నదని, అది 1964లో చీలినదని సమాధానమిచ్చానని, దానికి వారు "అవును మాకు తెలుసు. అది కూడ చీలిపోయిందని తెలుసు. కాబట్టి మీకు మూడు కమ్యూనిస్టుపార్టీలు వున్నవి కదా?" అన్నారు. సంభాషణలలో ఎవరో "ప్రపంచ సమావేశానికి మిగతా వాళ్ళను ఆహ్వానించితే ఐక్యతకు తోడ్పడుతుందా?" అని కూడ ప్రశ్నించారు. "నేను తిరిగి, ఒకదేశంలో మీరు ఎన్ని కమ్యూనిస్టుపార్టీలకు గుర్తింపునిస్తారు? ఒకదేశంలో ఎక్కువ కమ్యూనిస్టుపార్టీలను గుర్తించుటకు ప్రపంచ సమావేశాన్ని జరుపుటకు అందరిని ఆహ్వానించుదామా?" అని ఎదురు ప్రశ్నించానని వ్రాసారు. ఎవ్వరూ సమాధానమివ్వలేదని, ఒకదేశం వొక కమ్యూనిస్టుపార్టీ కంటె ఎక్కువ కలిగి వుండవచ్చునా? అనేది అలాగే వుండి పోయిందని వ్రాసారు.[1]

ఒక దేశంలో సమాజ ఆర్థిక, రాజకీయ, సామాజిక శాస్త్రీయ విశ్లేషణ ద్వారా రూపొందించబడిన శాస్త్ర రాజకీయ సిద్ధాంతం, వ్యూహం, ఎత్తుగడలు ఒకే వొక విధంగా వుంటవని, రెండు సిద్ధాంతాలు, వ్యూహం, ఎత్తుగడలు ఆచరణ వుండదని, కాన రెండు కమ్యూనిస్టు పార్టీలలో ఏదోఒకటి అశాస్త్రీయమైనది కాన అది కమ్యూనిస్టుపార్టీ కాదని, అంచేత దేశంలో వొకే వొక కమ్యూనిస్టుపార్టీ వుంటుందని, ఆవొక్కదానినే కొమింటర్‌ను గుర్తించాలనేది వారివాదన, అయితే రెండింటిలో యేది శాస్త్రీయంగా సరియైన కమ్యూనిస్టుపార్టీయో నిర్ణయం చేయుట మూడోపక్షానికి అంతతేలిక విషయంకాదు. పైగా, 1960దశకంలో అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం, "మితవాద" "అతివాద" వర్గాలుగా చీలిపోయినపుడు, యిది జరుగని పని, ఆవిధంగా మనదేశంలో కమ్యూనిస్టు ఉద్యమం 1964లో రెండుగా, సి.పి.ఐ; సి.పి.ఐ(యం), సి.పి.ఐ(యం.యల్) లుగా మూడున్నర దశాబ్ధాలుగా పనిచేస్తుండుట, చారిత్రిక వాస్తవము. ఇది యే సామాజిక రాజకీయ శాస్త్రము త్రోసివేయజాలనిది. పైగా మూడుస్రవంతులు ఆయాకాలాలలో కొద్దిపాటి విజయాలు సాధించినా, మొత్తంగా అపజయాలనే బహుళంగా ఎదుర్కొన్నాయి. పురోగమించజాలక పోయాయి. భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమ మూడుస్రవంతులు తమతమ రాజకీయసిద్ధాంత ప్రాతిపదికలపై, వ్యూహ, ఎత్తుగడల రచనలు కావించి, వొక మహాసామాజిక రాజకీయ ప్రయోగాన్ని చేస్తున్నాయి, పురోగమనం, విజయం

---

*1. డాంగే యస్.ఎ. (1970) వెన్ కమ్యూనిస్ట్స్ డిఫర్. పే. 1-2.*

కనుచూపుమేరలో కానవచ్చుటలేదు. కాని మూడు స్రవంతులు ఉనికిలో వున్నవి. మూడున్నర దశాబ్ధాలుగ అవి రాజకీయ రంగంలో వుండుట చారిత్రిక వాస్తవం. ఈప్రాథమిక చారిత్రిక వాస్తవాన్ని గుర్తించుటలో విఫలమైనందుననే హిమాలయమంతటి చారిత్రిక పొరపాట్లు జరిగినవి. కాన, ప్రతి కమ్యూనిస్టుపార్టీ యితర కమ్యూనిస్టుపార్టీలను గుర్తించినపుడు, వాస్తవశాస్త్రీయ రాజకీయవిధానాలను రూపొందించుకొని, ఆచరణానుభవాలతో సరిచేసుకొనే క్రమంలో, ప్రజాపోరాటాల క్రమంలో శాస్త్రీయ భారత విప్లవ పంధా రూపొందగలదు, ఆక్రమంలోనే కమ్యూనిస్టుపార్టీల ఐక్యత యేర్పడి. యేక ఐక్య కమ్యూనిస్టుపార్టీ నిర్మాణం జరుగుతుంది. విజయాలు పురోగమనం అప్పుడే జరుగుతుంది. కాని జరిగినది పూర్తిగా వ్యతిరేకంగా జరిగింది. భారత కమ్యూనిస్టు ఉద్యమ ప్రతి స్రవంతి లేక శకలం తానొక్కటే శాస్త్రీయ కమ్యూనిస్టుపార్టీయని మిగిలిన కమ్యూనిస్టు స్రవంతులను నామరూపాలు లేకుండా చేయుటయే తమ ప్రధమలక్ష్యంగా, తమ వ్యూహ. ఎత్తుగడలను రూపొందించుకొంటూ ఆచరణ కొనసాగించుట మూడున్నర దశాబ్దాలు కమ్యూనిస్టు ఉద్యమాన్ని సంక్షోభపు చీకటిలో ముంచివేసారు. ఈ మహత్తర చారిత్రిపాఠాన్ని భారతప్రజలందరి ముందుంచిన నేపధ్యకథనాన్ని తెలుసుకొందాము.

భారత కమ్యూనిస్టు ఉద్యమ స్రవంతులు సి.పి.ఐ; సి.పి.ఐ(యం)లు సైద్ధాంతిక పోరాటం పేరుతో సాగించిన ట్రేడు యూనియను. కిసాన్ సభలలో అఖిలభారతస్థాయిలో చీలికలు యేర్పడి కార్మిక ఉధ్యమము ఎ.ఐ.యు.టి.సి., సి.టి.యు.లుగ. కిసాన్ ఉద్యమం చీలి రెండు కిసాను సభలు యేర్పడిన ఫలితంగా కార్మిక, కర్షక వర్గాలలో అనైక్యత యేర్పడి, అఖిలభారతస్థాయిలో కార్మిక. కర్షక వర్గాలు ఐక్యపోరాటాలను జరుపజాలని, స్థితి యేర్పడుట అధ్యయనం చేసియున్నాము. ఇప్పుడు రాజకీయరంగంలో యేర్పడిన దుష్పరిమాణాలను అధ్యయనము చేద్దాము.

పాలకవర్గ రాజకీయపార్టీయైన కాంగ్రెను నాల్గవజనరలు ఎన్నికలలో ఘోరపరాజయంతో ఎనిమిది రాష్ట్రాలలో అధికారాన్ని కోల్పోయి. గుత్తకేంద్ర అధికారాన్ని కూడ కోల్పోయింది. రాజకీయ ప్రధాన పోరాటాలు కాంగ్రెసు-ప్రభుత్వం వొకవైపు కాంగ్రెసు వ్యతిరేకవామపక్ష, ప్రజాస్వామ్య శక్తులు మరోవైపు నేరుగా పోరాడుటయే భారతదేశరాజకీయాలలో నూతనాంశంగా రూపొంది, అభివృద్ధి చెందినది. దీనికి ప్రతిగా కాంగ్రెసు వామపక్షాలపై ప్రధానంగా దాడిని ఎక్కుపెట్టుట అనే రాజకీయ వ్యూహాన్ని అనుసరించి, బెంగాల్,కేరళ రాష్ట్రాలలోని వామపక్ష ఐక్యసంఘటనా ప్రభుత్వాలను కూలద్రోయుటకు అన్ని కుటిల విధానాలను అనుసరించింది. ఈవిధంగా కేరళ ఐక్యసంఘటనా ప్రభుత్వం కాంగ్రెసు, కేంద్ర ప్రభుత్వం దాడులకు గురికావలసివచ్చింది. జాతీయ కాంగ్రెసు. అందుండి చీలిన క్రిష్టియను మతవాదుల కేరళ కాంగ్రెసులు నాలుగవ సార్వత్రిక ఎన్నికలలో వారి అన్ని ఎత్తుగడలు విఫలమగుటతో ప్రజాస్వామ్యవ్యతిరేక, కుటిల, నీచవిధానాలను అనుసరించవలసి వచ్చింది. సహజంగానే కేరళ ఎప్పుడూ ఆహారపదార్థాల తరుగు రాష్ట్రమైనందున. ఎప్పుడూ చేసే ఆహారపదార్థాలు పంపే సమాయాన్ని రాజకీయం చేసి, మానవతను కోల్పోయి కృత్రిమ కరువుకాటకాన్ని సృష్టించి, ప్రజలలో అలజడిని కలుగజేసి, రాజకీయ ప్రయోజనాలను పొందే నీచ ఎత్తుగడలను

అవలంభించి ప్రజలను కష్టాలకు గురిచేసింది. కేంద్రం దశాబ్ధాలుగ గతంలో 50శాతం సబ్సిడీమీద ఆహారపదార్ధాలను సప్లయిచేసే సాంప్రదాయవిధానంలో ఆటంకాలు కలుగజేస్తూ, ఆహారపదార్ధాల ధరలను పెంచుతు, సప్లయిలను సకాలంలో అందించక, కరువు పరిస్థితులను సృష్టించుతు, రాష్ట్రంలో యిచ్చే రేషనులో తప్పనిసరిగా రాష్ట్రప్రభుత్వం కోత విధించవలసిన పరిస్థితులను కలుగజేసింది. ప్రజలలో అసంతృప్తిని పెంచి, రాజకీయ ప్రయోజనాన్ని పొందచూచుట కాంగ్రెసు కేంద్రప్రభుత్వం అనుసరించుట, అది ఎంతగా దిగజారిపోయాయో తెలియజేస్తుంది.

అదే సమయంలో ప్రభుత్వం, కాంగ్రెసు దాని పరోక్షమిత్రులు "మితవాద" కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన్ని వినియోగించుకొనే ప్రయత్నాన్ని మరోవైపున కొనసాగించారు. ఈపని సులభతరమగుటకు రాష్ట ప్రభుత్వం కమ్యూనిస్టువర్గాలపై దుష్ప్రచారాన్ని తీవ్రతరం చేసింది. ఈవిధంగా వామపక్ష, ప్రజాస్వామ్యపక్షాల ఐక్యసంఘటనా ప్రభుత్వాన్ని పడగొట్టుట ప్రధానలక్ష్యం, కార్యక్రమంగా పెట్టుకొన్నారు. ఈ పరిస్థితులలో కూడ సి.పి.ఐ(యం), సి.పి.ఐ.లు పరస్పరం "బురద చల్లుకొనుట" యధా పూర్వకంగా సిద్ధాంతపోరాటమనే పేరుతో నిరవధికంగా సాగుతూనే వుంది. సహజీవన సిద్ధాంతంలో పూర్తి నమ్మకంగల సి.పి.ఐ.,యేమాత్రం నమ్మకం లేని సి.పి.ఐ(యం)లు "మితవాద" "అతివాద" పోకడలలో విచ్ఛిన్నకర ఫలితాలనిచ్చే చర్యలనే కొనసాగించాయి. రెండుపార్టీలు వామపక్ష, ప్రజాస్వామ్యశక్తుల ఐక్యసంఘటనా" వ్యూహంలో పూర్తివిశ్వాసాన్ని తీర్మానాలలో ప్రకటించుతు, అందుకు పునాదియైన వామపక్ష ఐక్యతాభివృద్ధికి తోడ్పడని చర్యలనే చేబట్టుతున్నారు. ఈ చర్యలకు "ఒక దేశంలో వొకేవొక కమ్యూనిస్టుపార్టీ వుండాలి. రెండవదానిని నామరూపాలు లేకుండా చేసే వొంటెత్తు ఎత్తుగడలను స్వపక్ష ప్రయోజనాలకు ప్రాధాన్యతనిస్తూ, ఐక్యసంఘటనలో మరో వామపక్షం బలపడకుండా, బలిపశువును చేసే తప్పుడు ఐక్యసంఘటనా ఎత్తుగడలను అనుసరించారు. రాజకీయాలోల ప్రజాప్రయోజనాలు, వాపక్షమొత్తపు ప్రయోజనాలు, వాస్తవికతా పరిశీలన వారి ఆలోచనావిధానాలలో చోటు చేసుకొనజాలని, మార్క్సిస్టు-లెనినిస్టు శాస్త్రవ్యతిరేకవిధానాలను అనుసరించి, చారిత్రిక తప్పిదాలను చేసారు.

పరస్పరం ఎలా బురదచల్లుకొన్నారో యీ క్రింది ఘటనలు స్పష్టం చేస్తాయి. "ఈవిద్రోహచదరంగంలో భాగంగానే "మితవాద" కమ్యూనిస్టులు ప్రజలకు ఆహారపదార్ధాలను సప్లయి చేయుటలోని వైఫల్యాలకు సి.పి.ఐ(యం)పై నిందా, ప్రచారదాడిని సాగించారు. ప్రధాన దోషియైన కేంద్ర ప్రభుత్వంపై ప్రజాపోరాటాన్ని సిగ్గులేకుండా వ్యతిరేకించుటయేగాక, ఫ్రంటులోని వూగిసలాడే కొన్ని వర్గాలు తమ విధానాన్నే అనుసరించునట్లు చేయ ప్రయత్నించారు."[1] అనే తీవ్రదాడిని సి.పి.ఐ.పై సి.పి.ఐ(యం) సాగించి, వారిని వామపక్ష ప్రజాస్వామ్య శక్తుల నుండి వేరు చేసే ఎత్తుగడలను అవలంభించింది. సరిగా అదే రకమైన ఎత్తుగడలను అదే లక్ష్యంతో సి.పి.ఐ అనుసరించుటనూ చూడగలము.

---

*1.పొలిటికల్-ఆర్గనైజేషనల్ రిపోర్టు (1969) సి.పి.ఐ(యం) రిన, కాంగ్రెసు (ఆంగ్లంలో) సి.పి.ఐ(యం) పబ్లికేషన్ పే.158.*

కేరళలో ఐక్యసంఘటనా ప్రభుత్వం అధికారంలోనికి వచ్చిన తరువాత క్రమేణా కేంద్ర ప్రభుత్వపు ఆహారధాన్యాల సప్లయి కొన్నిమాసాలలో 20వేల టన్నులకు తగ్గిపోయింది. ఈవిధంగా 1967అంతటా, 1968లో మొదటిభాగంలో జరుగుటతో సహజంగానే ప్రజలలో అసంతృప్తిపెరిగిపోయింది. నైతిక, చట్టసమ్మతమైన ఆచరణలోని సప్లయి విధానాలను కేంద్ర ప్రభుత్వం, రాష్ట్రపాలన ప్రతిపక్షాల అధ్వర్యంలో అనే వివక్షతను వ్యతిరేకంగా ప్రజావుద్యమాన్ని నడుపుట వొక్కటే ముందున్నమార్గము. ఐక్యసంఘటనలోని వివిధపార్టీలలో యీ విషయమై ఎట్టి భిన్నాభిప్రాయంలేదు. అందుకే ఐక్యసంఘటన అనేక ఐక్యపోరాటాలను సంయుక్త సమావేశాలను, ప్రదర్శనలను, ప్రచారదళాలను, కేంద్రప్రభుత్వ ఆఫీసుల సత్యాగ్రహాలు, ఢిల్లీలోని ప్రధాని యింటిముందు ధర్నాలను జరిపింది. వీటన్నిటి శిఖరాగ్రంగా 11 సెప్టెంబరు 1967న రాష్ట్ర వ్యాప్తంగా బందు నిర్వహించింది. ఐక్యసంఘటనలోని భాగస్వామ్యపార్టీలన్నీ హృదయపూర్వకంగా తమశక్తి కొలది పాల్గొన్నవి. అయినా సి.పి.ఐ(యం) యితరపార్టీలను ముఖ్యంగా సి.పి.ఐని ఖండించుతు, తీవ్రదాడిసాగించింది. ముఖ్యంగా సెప్టెంబరు 11 బంద్‌ను విఘ్నంచేయ ప్రయత్నించారని నిందించింది. వాస్తవానికి కేరళీయులు జాతీయపండుగ ఓనం 14 సెప్టెంబరున జరుపుకొంటారు. సాధారణంగా కార్మికులకు పండుగముందు బోనసు యిస్తుంటారు. అనేక పోరాటాల తరువాత పండుగకుముందు 11నుండి బందుజరుపుటను నిర్ణయించుట, తగిన సమయంకాదని అందరకు తెలుసు. "అయినా ఒకటి రెండు చోట్ల తప్ప బందు బ్రహ్మాండంగా జరిగింది. అందుకు ఐక్యసంఘటనను అభినందించవలసివుంది. కాని అదే కాలంలో సి.పి.ఐ(యం) తన విచ్ఛిన్నకర చర్యలు కొనసాగించింది. వారినిందా, ఆరోపణలకు తీవ్ర విమర్శనాదాడులను అదిచూపెట్టిన కారణం, ఆల్వే ప్రాంతంలోని వొక కార్మిక యూనియను, యే అఖిలభారత ట్రేడు యూనియనుకు అనుబంధం చేయబడని స్వతంత్ర యూనియను బందులో పాల్గొనలేదని సి.పి.ఐ పైదాడి సాగించింది. ఆల్వే ప్రాంతంలోని కార్మికవర్గం రాజకీయంగా తటస్థత వహించివుంది. అంచేత బందు ఆప్రాంతంలో పాక్షిక విజయాన్నే పొందింది. ఇందుకు ఆయూనియనుకు అధ్యక్షుడుగా వున్న కా॥మీనన్ సి.పి.ఐ.కు చెందియున్నందున ఆయనపై సి.పి.ఐ(యం) ఆనిందను మోపింది. ఆయూనియను మెజారిటి తటస్థంగా వుండుటకు నిర్ణయించింది. రాష్ట్రమంతటా బందు విజయానికి రాత్రింబగళ్ళు కృషి చేసిన సి.పి.ఐ విద్రోహులు విచ్ఛిన్నకారులని నిందించుట, బహిరంగంగా తూలనాడుటను"[1] ఎవరూ సమర్థించజాలరు పెళ్ళికి, చావుకు ఒకే మంత్రం వల్లించుటవంటిది.

## కేరళ ప్రజల ఆహార సమస్య జీవన్మరణ సమస్య.

కేరళలో 1967 ఆహారోత్పత్తి 11 లేక 12 లక్షలటన్నులుగాను, అందుండి 20శాతం అనగా 2.4లక్షల టన్నులు బియ్యం సేకరించబడగలదని అంచెనా వేయబడింది. మార్కెట్టుకు వచ్చే మిగులులో 50శాతం సేకరించితే, 1.20వేల టన్నులు బియ్యం అగుతుంది. ప్రభుత్వధాన్యసేకరణ ఎప్పుడూ 80వేలటన్నులకు మించి జరుగలేదు. ప్రభుత్వం

*1. అచ్చుతమీనన్ సి. (1969) వాట్‌హాపెండు ఇన్ కేరళ. 30 మాసాల నంబూద్రిపాద్ మంత్రి వర్గపాలన సమీక్ష సి.పి.ఐ.పబ్లికేషన్ పే.7–8.*

ధాన్యసేకరణ ముమ్మరం చేయకుండా, కేంద్రం తగినన్ని ఆహారధాన్యాదులు సప్లయిచేయుటలేదనే డిమాండులో నైతికత అంతగా లేకపోగా, భాద్యతనుండి తప్పించుకొనే ప్రయత్నంగా విమర్శించేవర్గాలు లేకపోలేదు.

"సి.పి.ఐ ధాన్యసేకరణలో 2 యకరాల రైతులను వదలి, ఆపైగల రైతుల నుండి వృద్ధి క్రమానుగతంగా పెంచుతు, 10యకరములకు మించిన రైతులనుండి మిగులు ధాన్యాన్నంతటిని, క్వింటాలుకు రు 6ాలు అదనంగా యిచ్చిసేకరించాలని, నిత్యావసరాల పంపకంలో ప్రవేటు యేజంట్లను రద్దుచేసి ప్రజాకమిటిల ద్వారా, దిగుమతులు ఫుడ్ కార్పొరేషను ద్వారా జరగాలని నిర్మాణాత్మక ప్రతిపాదనలు చేసింది. ధాన్యసేకరణ వేగోధృతిని పెంచాలని కోరింది. ఈ ప్రతిపాదనలన్నిటిని సి.పి.ఐ(యం) ఆహారమంత్రిణి శ్రీమతి గౌరిత్రోసిబుచ్చింది. పైగా ఐక్యసంఘటనలోని సి.పి.ఐ యితరపార్టీలు పెట్టుబడిదారులు, భూస్వామ్యవర్గాలతో సహకారాన్ని నెరపుతున్నారని, వారి తొత్తులయ్యారని అసత్య, నిందా ప్రచారాన్ని సి.పి.ఐ(యం) సాగించింది.[1]

సి.పి.ఐ ప్రతిపాదనలను వామపక్ష ఐక్యసంఘటన సమన్వయ కమిటి తరువాత యేకగ్రీవంగా ఆమోదించింది. ఈకాలంలో సి.పి.ఐ(యం) జనరల్ శెక్రటరీ 28జులై 1967 విలేఖరుల సమావేశంలో పార్టీ వొక విప్లవాత్మక ప్రతిపాదన, భూస్వాముల నుండి పూర్తి మిగులు ధాన్యసేకరణ ప్రతిపాదించిందిని దురదృష్టకరంగా ఐక్యసంఘటనలోని యితర పార్టీలు ముఖ్యంగా సి.పి.ఐ అంగీకరించలేదని అసత్యప్రచారం చేసారు. ఈ ప్రకటనలోని "నిజాయితీ" విద్యావంతులైన కేరళ ప్రజలందరికి స్పష్టంగా తెలుసు. పత్రికావిలేఖరులకు మరింత బాగా తెలుసు. ఈప్రకటనల చెడు ప్రభావాన్ని తట్టుకొనుటకు, కేరళ పార్టీ నాయకత్వం జనరల్ శెక్రటరీ తప్పుడు ప్రకటన చేసారని వొప్పుకొన్నారు.

కేరళ ఆహారసమస్య రాష్ట్ర ప్రభుత్వకార్యదర్శి, అప్పటి ముఖ్యమంత్రి నంబూద్రిపాద్ కేంద్రప్రభుత్వపూర్తి సహకారంతో తప్పితే "యేరాష్ట్ర ప్రభుత్వంచే పరిష్కరించబడజాలదని" వారిద్దరూ సంతకాలు చేసిన ప్రకటనలో నాలుగవ సార్వత్రిక ఎన్నికల అనంతరం ప్రకటించారు. ఇంకా, "రాష్ట్ర ఆహార పదార్థాల కొరత రాష్ట్రమైనా దేశానికి ఎంతో అవసరమైన విదేశమారకద్రవ్యాన్ని సంపాదించి పెడుతున్నది. అంచేత ప్రజలు కరువు వాతను పడకుండా కాపాడవలసిన భాధ్యత, ఆహారపదార్థాలు సప్లయి చేయవలసిన భాధ్యత కేంద్రప్రభుత్వానిదై వుందని"[2] నంబూద్రిపాద్ స్పష్టం చేసారు.

" కేంద్రం ఆహారధాన్యాలు సప్లయి చేయవలసిన భాధ్యత విషయమై అంతగా సి.పి.ఐ పట్టించుకొనుటలేదని", పైగా "ఆహారశాఖమంత్రి, ఆమెపార్టీ ఆహార సమస్యపై యేర్పడిన క్లిష్టపరిస్థితికి భాధ్యత వహించవలసివుంటుందని, సి.పి.ఐ(యం) పైనిందా ప్రచారం చేస్తున్నారని తీవ్రవిమర్శకు గురి చేసారు. "మితవాద" కమ్యూనిస్టుల "మౌలిక విద్రోహం

1. అచ్చుతమీనన్ సి. *(1969) వాట్‌హాపెండు ఇన్ కేరళ. 30 మాసాల నంబూద్రిపాద్ మంత్రి వర్గపాలన సమీక్ష సి.పి.ఐ.పబ్లికేషన్ పే. 8-9.*

2. నంబూద్రిపాద్. ఇ.యం.యస్. *(1970) యాంటి కమ్యూనిస్టు గ్యాంగ్ ఇన్ కేరళ (ఆంగ్లంలో) సి.పి.ఐ(యం) పబ్లికేషన్. పే. 9-10*

11 సెప్టెంబరు 1967న కేరళ బందుకు పిలుపు నిచ్చినపుడు స్పష్టమైంది. ఆహారసప్లయిలను కొనసాగించుతామని చేసిన వాగ్దానాలను కేంద్ర ప్రభుత్వం నెరవేర్చుటలోని వైఫల్యానికి వ్యతిరేకంగా, ముఖ్యంగా, "ఓనం" పండుగకు ముందు తలవొక్కింటికి 3 ఔన్సులు సప్లయి చేయుటకు వ్యతిరేకంగా జరిగిన బందులోనూ స్పష్టమైంది. ఆపండుగ రోజున "మితవాద" కమ్యూనిస్టుల పత్రిక "జనయుగం" సంపాదకీయంలో" ఆహారమంత్రి ఆమె భాద్యతలను నిర్వహించుటలోని వైఫల్యం కారణంగానే, కేరళ ప్రజలు చాలినంత ఆహారం లేకుండా పండుగ రోజున కష్టాలుపడవలసి వచ్చిందని, కేంద్రప్రభుత్వాన్ని ఖండించుటకు బదులుగా వ్రాసిందని విమర్శించారు. ఇందుకు వారికి కాంగ్రెసు, కేరళ కాంగ్రెసుల నుండి పూర్తిసహకారం లభించింది. అంతేగాక, బూర్జువా వార్తా పత్రికలు కూడ, మార్క్సిస్టులపై "నిర్థిష్ట, నిర్మొఖమాట విమర్శన" యని పేర్కొన్నవని నంబూద్రిపాద్ వ్రాసారు.[1]

కేంద్రప్రభుత్వానికి రాష్ట్ర ప్రభుత్వ ఆహారశాఖ మంత్రికి మధ్యనడచిన "సుదీర్ఘ ఉత్తర ప్రత్యుత్తరాలనన్నిటిని" ఐక్యసంఘటన సమన్వయ కమిటీ ముందుంచినపుడు అధ్యయనం చేసినవారికి "ఆహారశాఖమంత్రి, ఆశాఖ చేసిన ప్రయత్నాలలో వైఫల్యంలేదని, కేంద్రం అనుసరించిన విధానమే, ధాన్యాన్ని మిల్లు చేయటం, బియ్యం వ్యాపారవిధానాలను అమలు చేయుటకు ఆటంకమయ్యాయని స్పష్టమైంది." కాని మితవాద కమ్యూనిస్టులు ప్రజాస్వామ్యవిధానాలను అమలు చేయుటలో కేంద్రం అడ్డుగాలేదని ప్రజలలో ప్రచారం చేశారు. పరిస్థితిని మెరుగుపర్చుటకు రాష్ట్రాలకుగల అధికారాలను సద్వినియోగం చేయగలిగితే ప్రజల కెంతో సహాయపడి, ప్రజల దుస్థితి నివారణకు కొంతైనా తోడ్పడ వచ్చని సి.పి.ఐ. చెప్పసాగింది, సి.పి.ఐ(యం) విమర్శించింది.

ఆహారసమస్యపై సి.పి.ఐ; సి.పి.ఐ(యం) రెండు కమ్యూనిస్టుపార్టీల వైఖరులను అధ్యయనం చేస్తే, రెండు పార్టీలు విషయం, వాస్తవికత యేమైనా " ఒకరిపై వొకరు, రాళ్ళు రువ్వు కొనే ఎత్తుగడలను, ఆవిధంగా ఆయాపార్టీలను ప్రజలకు, వారి శ్రేణులకు దూరం చేయగలమని, ఆవిధంగా తామబలపడగలమనే స్వీయమానసిక పెడధోరణులతో యాచర్యలకు వొడిగట్టారని, రాజకీయ వివరణ చెప్పుకొనవలసి వుంటుంది. ఫలితంగా కమ్యూనిస్టుపార్టీలు రెండూ బలపడకపోగా, బూర్జువా పార్టీలైనా కాంగ్రెసు, కేరళ కాంగ్రెసు, తదితరులు బలపడుట జరిగింది. ప్రజలకు అందులో మిగతా రాష్ట్రాలతో పోల్చిన మళయాలీలలో విధ్య, రాజకీయ చైతన్యం అత్యధికంగా వుండి, పోరాటాల అనుభవాలు కలిగిన ప్రజాసామాన్యాన్ని తక్కువగా అంచెనా వేయరాదనుట స్పష్టం. కమ్యూనిస్టులు ఆచరణ, కమ్యూనిస్టుపార్టీల యెడల గల విశ్వాసంలో సంక్షోభాన్ని లెచ్చి, పెట్టిందనుటను, తదనంతర కేరళ చరిత్రయే స్పష్టం చేస్తుంది.

సి.పి.ఐ(యం) పార్లమెంటరీ విధానంలో పాల్గొనుట, అధికారాన్ని స్వీకరించుట, వాటిని కేంద్రప్రభుత్వ ఆర్థిక, రాజకీయ విధానాలకు వ్యతిరేకంగా పోరాడుటకు సాధనాలు, ఆయుధాలుగ ఉపయోగగించుటకేనని వివిధ అధికారపత్రాలలో సిద్ధాంతీకరించారు. ఈ

---

1. *నంబూద్రిపాద్. ఇ.యం.యస్. (1970) యాంటి కమ్యూనిస్టు గ్యాంగ్ ఇన్ కేరళ (ఆంగ్లంలో) సి.పి.ఐ(యం) పబ్లికేషన్. పే.12-13.*

రాజ్యాంగ చట్ట పరిమితులలో కూడ ప్రజలకు కొన్ని సేవలు అందించగలమనే దానిలో యే మాత్రం విశ్వాసం లేకపోవుటవలన, ఆవిధానాన్ని వినియోగించుటలో అలసత్వం కొంత సహజం. ఈవిషయంలో తమమితవాద అవగాహనవలన సి.పి.ఐ కు అట్టి అవకాశాలను మించిన భ్రమలుండుట కూడ సహజం. ఈవిధంగా దృక్పధాలలో భేదమున్న కారణంగానే సి.పి.ఐ., సి.పి.ఐ(యం)లు దైనందిన సమస్యలలో సిద్ధాంతపోరాటాన్ని ఆచరణలో చేయగలిగినంతగా చేయలేకపోతున్నారు. అందువలననే సహృదయంతో సమస్యల లోతుపాతులను బట్టి విశ్వసించిన విధంగా విమర్శించినా సైద్ధాంతిక సమస్యల లోతులలోనికి వెళ్ళక, పరస్పరం శతృభావంతోనే అర్ధం చేసుకొని, నౌకరి నౌకరు "విద్రోహులుగా బహిరంగంగా చిత్రించుకొని ప్రజల, శ్రేణుల విశ్వాసాన్ని క్రమేణా కోల్పోయి దూరమయ్యారు.

## బంజరు భూముల పంపక సమస్య

ఐక్యసంఘటన సంయుక్త ఎన్నికల ప్రణాళికలో వ్యవసాయానికి లాయకీ అయిన బంజరు భూములను, భూములులేని వ్యవసాయకూలీలకు, సాగుచేయుచున్న అటవీ భూములను ఆ సాగుదారులకేయివ్వాలని స్పష్టంగావుంది. దీనిని అమలు చేయుటకు ఎట్టి నూతన చట్టాలు చేయనవసరంలేదు, ఆటంకాలు లేవు. పైగా రెవెన్యూమంత్రిగా సి.పి.ఐ.(యం) నాయకులేవున్నారు. ప్రణాళికలోని యీ అంశాన్ని వెంటనే అమలు చేయాలని కోరుతు సి.పి.ఐ ఆందోళన ప్రారంభించి, అఖిలపక్ష కమిటీలను యేర్పరచి, యీ కర్తవ్యాన్ని నిర్వహించాలని కోరింది. రెవెన్యూమంత్రి ఎట్టి శ్రద్ధచూపలేదు. సి.పి.ఐ(యం) బంజరు భూముల ఆక్రమణ వుద్యమాన్ని చేబట్టి, ఆక్రమణదారులకు ఆభూములు యివ్వవలసిందిగా కోరసాగారు. ఇది అందుబాటులోని అటవీ భూముల ఆక్రమణ ఉద్యమంగా సాగింది. ఈసమస్యను చివరకు ఐక్యసంఘటన సమన్వయకమిటీ చేబట్టి, తీవ్రవాదోపవాదాల తరువాత మార్చి 1968లో సి.పి.ఐ ప్రారంభంలో ప్రతిపాదించిన, అఖిలపక్ష కమిటీలను యేర్పరచి బంజరు భూములు పంపకం చేయాలని నిర్ణయించారు. అంతేగాక, బంజరుభూములలో 20 శాతం హరిజనులకు పంచాలని కూడ నిర్ణయించారు.[1] ఈ కమిటీల నిర్మాణం, వారిపేర్లు గెజట్‌లో ప్రకటించబడినా, ఐక్యసంఘటనా సమన్వయ కమిటీ నిర్ణయం జరిగినావొక్క యకరం కూడ పేదలకు పంచబడలేదు. అదే కాలంలో రెవెన్యూమంత్రి ఆభూములను ఆపార్టీవారికి, సానుభూతిపరులకు, వారి అనుయాయులకు, వారి బంధువులకు ఆభూములు కేటాయించుట జరిగింది.

## వ్యవసాయ భూసంస్కరణల బిల్లు.

ఐక్యసంఘటన ఎన్నికల ప్రణాళికలలో నేడు అమలులోవున్న 1964 భూసంస్కరణల బిల్లులో సమగ్రసంస్కరణల బిల్లు తీసుకొని రాగలమని వాగ్దానం చేసారు. కమ్యూనిస్టుల మంత్రివర్గం 1957-58 లో అభివృద్ధినిరోధశక్తులు "విముక్తి పోరాటాన్ని" మతతత్వశక్తులతో కలసి కాంగ్రెసు జెండా క్రింద సాగించినా, వ్యవసాయసంబంధాల బిల్లును తీసుకొని వచ్చి, అసెంబ్లీలో ఆమోదింపజేసి, ప్రెసిడెంటు ఆమోదముద్రకు

1. *నంబూద్రిపాద్. ఇ.యం.యస్. (1970) యాంటి కమ్యూనిస్టు గ్యాంగ్ ఇన్ కేరళ (ఆంగ్లంలో) సి.పి.ఐ(యం) పబ్లికేషన్. పే.9.*

తానుపాలనలో వున్న 28 మాసాలలోనే పంపగలిగింది. ఆప్రభుత్వాన్ని కూలద్రోసిన తరువాత యేర్పడిన ప్రభుత్వం భూసంస్కరణల బిల్లుకు చిన్న రైతుల హక్కుల రక్షణ, సమర్ధవంతమైన వ్యవసాయాన్ని ప్రోత్సహించుట అనే ముసుగు క్రింద తీవ్రసవరణలతో దానిని నీరుగార్చేపనిచేసింది. ఈప్రభుత్వం కాగ్రెసేతర ఐక్యసంఘటనా బూర్జువా పార్టీల ప్రభుత్వం, ముస్లింలీగు కూడ ముఖ్యపాత్ర వహించింది, చర్చలతోనే కాలక్షేపం చేసింది, 1959లో కొన్ని ప్రయత్నాలు చేసింది. ఐక్యసంఘటనా ప్రభుత్వం 1967 లో యేర్పడిన రెండు మాసములకు ఆర్డినెన్సుతేబడి, కౌలుదారు నిర్వచనాన్ని విస్తృతార్ధంలో వివరించింది, దానితో వ్యవసాయసంస్కరణ, బిల్లు గతంలో వదలివేసిన హక్కులను పునరుద్ధరించింది. కౌలుదారులను తొలగించుటను నిషేధించింది. రైతుల పోలాలలోని పాకలు, యిండ్లలలో నివసిస్తున్న వారి నుండి అద్దెలు, బాకీలవసూలు నిషేదించింది.

ఐక్యసంఘటనా భాగస్వామ్యపార్టీలతో మేజువాణి చర్చల తరువాత రాజకీయపార్టీల కమిటీని, మరింత లోతుగా సమస్యను పరిశీలించుటకు నవంబరు 1967లో యేర్పరచారు. దాని సూచనల ప్రాతిపదికగా బిల్లు 1968కి తయారైంది. అసెంబ్లీ ఆమోదం పొందిన తరువాత, కేంద్ర ప్రభుత్వం ఆమోదం కొరకు 14 ఆగస్టు 1968న పంపబడింది. కేంద్రప్రభుత్వం 10 ఏప్రిల్ 1969న అనుమతినిస్తూ, కొన్ని సవరణలను కూడ ప్రతిపాదించింది. అవి బిల్లు ప్రధాన ఉద్దేశ్యానికి, ఆశించేదానికి విరుద్ధంగావున్నవి. కేంద్రం నూతన బిల్లులో సూచించిన తగిన కౌలును అంగీకరించక పాత కౌలునే సూచించే ఆర్టికల్స్‌నే కొనసాగించకోరింది. ప్లాంటేషన్సులో పడావు భూములను సీలింగు పరిమితి లేకుండా మిరియాలు, వక్కలతోటలను మినహాయించింది. వ్యవసాయ భూములపైనివసిస్తున్న వారికి పట్టాలు యిచ్చి, హక్కులు కల్పించరాదన్నది. కేంద్రప్రభుత్వ తీసుకొన్న వైఖరిని మంత్రివర్గానికి, ఐక్యసంఘటన సమన్వయ కమిటి, సెలెక్ట్ కమిటిలన్నిటికి తెలియజేయబడింది.[1]

కేంద్ర ప్రభుత్వ అనుమతి రాకముందే అసెంబ్లీ బిల్లును చర్చించింది. సెలెక్ట్ కమిటి, నివేదికను సమర్పించింది. ఆగస్టు 7న సలహా సంఘం దానిపై చర్చ, ఆగస్టు 11న తీసుకొనబడునని నిర్ణయించింది. కాంగ్రెసు, మినీ సంఘటన పార్టీలన్నీ బిల్లు చర్చకు రాకుండా అడ్డుపడినవి. ఆగస్టు 1969లో సి.పి.ఐ(యం) ఐక్యసంఘటనలోని పార్టీలన్నిటికి భూసంస్కరణల బిల్లు సవరణలతో ఏజెండాలో ప్రధమ స్థానమివ్వాలని, అది ముఖ్యమైనదని ప్రతిపాదించింది. ముస్లింలీగు తన మినిష్టరు ప్రవేశపెట్టిన పంచాయత్‌రాజ్ బిల్లు మొదట అసెంబ్లీలో చర్చకు రావాలని పట్టుబట్టింది. మిగతావారందరూ "మితవాద" కమ్యూనిస్టులతో సహా అందరూ ముస్లింలీగును బలపరచారు. సిగ్గులేకుండా, బిల్లు ఆలస్యమగుటకు సి.పి.ఐ(యం)ను నిందించుచున్నారు.

దీనిని మరోవైపు నుండి కూడ చూడాలి. ఆగస్టు 19, 1968న బిల్లు ప్రవేశపెట్టబడింది. రెవెన్యూమంత్రి అధ్వర్యంలో నత్తనడకసాగింది. ఆగస్టు 1969లో సెలెక్టర్‌కమిటి రిపోర్టుతోపాటు తిరిగి అసెంబ్లీలో ప్రవేశపెట్టబడింది. అంటే సెలెక్ట్ కమిటీకి చేరిన

1. నంబూద్రిపాద్, ఇ.యం.యస్. (1970) యాంటీ కమ్యూనిస్టు గ్యాంగ్ ఆఫ్ ది కేరళ. బిట్రేయల్స్ ఆఫ్ యునైటెడ్ ఫ్రంట్ సెట్‌అప్ యాంటీ పీపిల్సు గవర్నమెంటు పే. 57-8.

సంవత్సరపూర్తికాలానికి గాని వెలుగు చూడలేదు. శ్రీమతి గౌరి గతంలో 1957-8లో బిల్లును ప్రతిపాదించి, సమర్థవంతంగా అతిత్వరగా అసెంబ్లీచే ఆమోదింపచేయగలిగిన ఆమెయే, సంవత్సరకాలం సెలెక్ట్ కమిటీ వద్దపడవేసి వుంచి, అసెంబ్లీ సమావేశాలలో చివరిరోజులులో యేది ముందు ఆమోదించబడాలో అని ముస్లింలీగు మంత్రి ప్రవేశపెట్టిన పంచాయతి బిల్లుతో పోటీ పెట్టి, సి.పి.ఐతో సహా మిగతా వారందరూ ముస్లింలీగును బలపరచినందున తన ప్రతిపాదన వీగిపోయిందని, అందుకు ప్రధానంగా సి.పి.ఐ.ని నిందించింది. సంవత్సరకాలం సెలెక్ట్ కమిటి వద్ద బిల్లు విశ్రాంతి తీసుకొంటూవుంటే తత్సంబంధమంత్రి, ఆపార్టీ చేసిన కాలక్షేపాన్ని అసెంబ్లీ గమనించకుండా అసెంబ్లీ సభ్యులు, ప్రజలు ఎలావుండగలరు. అసెంబ్లీ సమావేశాలను 22తో ముగించకుండా, పొడిగించాలని, బిల్లు ఆమోదించబడునట్లు చేయాలని సి.పి.ఐ ఆందోళన సాగించినా, మిన్నకుండి, ఆలస్యానికి, ఆసమావేశంలో ఆమోదించబడకుండుటకు సి.పి.ఐ(యం) వాస్తవంగా కారణమైనా నిందను సి.పి.ఐపై మోపుట వొక్క సి.పి.ఐ(యం) కే చెల్లింది. సత్యాన్ని యెల్లకాలం కప్పిపెట్టివుంచజాలమనే విమర్శవుంది.

సి.పి.ఐ(యం) పొలిట్ బ్యూరో 24 అక్టోబరు 1969న పత్రికాప్రకటనచేస్తూ "వ్యవసాయ సంబందాల బిల్లు మార్క్సిస్టు రెవెన్యూ మినిష్టరు ప్రవేశపెట్టగా అసెంబ్లీ ఆమోదించిందని, సి.పి.ఐ(యం) చొరవ ప్రజావుద్యమం బలం కారణమని చెప్పింది. అభివృద్ధిచెందుతున్న ప్రజావుద్యమం బలం కారణమని చెప్పింది. అభివృద్ధి చెందుతున్న ప్రజావుద్యమం, వర్గపోరాట పటిమతీవ్రమగుటతో "మినీఫ్రంటు" నాయకులు భయపడిపోతున్నారు." ఇది యం.యన్. గోవిందన్ నాయర్ వ్యవసాయ కార్మికోద్యమం యెడల ప్రదర్శించుతున్న కోపోద్రేకాలను చెప్పక చెప్పుతున్నవని, "పరిపాలన-పోరాటం రెండూ కలసి పురోగమించవని" ప్రకటించారు. "పరిమితికి మించిన వ్యవసాయ భూములను రైతాంగం ఆక్రమించుట రౌడీయిజం" అని అచ్చుత్ మీనన్ ఖండించారు. "భారత రాజ్యాంగాన్ని సరిచేయాలని నంబూద్రిపాద్, గోపాలన్‌లు కోరుటను ఖండించుతున్నారని "మితవాద కమ్యూనిస్టుపార్టీపై దాడి ప్రారంభించారు. "మినీఫ్రంటు" మంత్రులు కేంద్ర ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాటం సాగించుటకు వ్యతిరేకులని," ముస్లింలీగు నాయకులు ప్రకటించుటతో వేరే సాక్ష్యం అవసరంలేదన్నది.[1]

కేరళ అసెంబ్లీలో ఐక్యసంఘటనా ప్రభుత్వంలో తనకు గల ప్రాధాన్యత, నాయకత్వపాత్రలపై సి.పి.ఐ(యం) పశ్చిమబెంగాల్ పరిస్థితితో పోల్చి, "కేరళ అసెంబ్లీలో మనకు పశ్చిమబెంగాలుతో పోల్చితే పెద్దబలం కలిగి, ముఖ్యమంత్రి, రెవెన్యూమంత్రి పదవులను మనపార్టీ కలిగివుంది." బెంగాల్‌లో ఆరెండు పదవులను బంగ్లా కాంగ్రెసు చేబట్టింది. రెండవ అంశం కేరళ ఐక్యసంఘటనా ప్రభుత్వం యేర్పడుట యిది రెండవసారి, బెంగాలులోమొదటిసారిగా యేర్పడింది. కేరళకు 1957 అనుభవం వుంది. అది పెట్టనికోట. మరో ముఖ్య అంశం, ఆహారపదార్థాల తరుగు ఎప్పుడూ కలిగియున్న రాష్ట్రం కేరళ. కేంద్రంపై 50 శాతం ఆహారపదార్థాలవరకు ఆధారపడి వుంటుంది.

---

*1. రైట్ కమ్యూనిస్టు బిట్రేయల్ ఆఫ్ కేరళ యునైటెడ్ ఫ్రంట్ అండ్ గవర్నమెంటు, ఎ కలెక్షన్ ఆఫ్ డాక్యుమెంట్సు (1969) సి.పి.ఐ(యం) పబ్లికేషన్. పే. 1-2.*

చివరి అంశంగా పశ్చిమబెంగాల్ లాగా పారిశ్రామికంగా అభివృద్ధిచెందిన అనుభవం కలిగిన కార్మికవర్గం కేరళకు లేనందున, ప్రభుత్వం ప్రజలపై త్రోసివేసే అధిక భారాలను శక్తివంతంగా ప్రతిఘటించే కార్మికవర్గం, మధ్యతరగతి బలమైన శక్తులు, ఉద్యమాలు లేవు. ఈ అంశాలను కేరళ ఐక్యసంఘటన మంత్రివర్గపనిని, రాజకీయపార్టీల పాత్రను పరిశీలించునపుడు పరిగణలోనికి తప్పనిసరిగా తీసుకొనవలసి వుంటుంది.

## 1. సి.పి.ఐ సంస్కరణవాద విధానాల వైఫల్యాలపై సి.పి.ఐ(యం) 8వ, పార్టీ కాంగ్రెసు విమర్శన.

సి.పి.ఐ బాంబే 7వ, పార్టీ కాంగ్రెసు ఆమోదించిన కార్యక్రమం 8వ భాగంలో ప్రభుత్వం, రాజ్యాంగంపై చేసిన వర్గపొందిక విశ్లేషణ, 75వ పేరాలో యిలా వుంది. "నేటి ప్రభుత్వం జాతీయ బూర్జువావర్గానికి ప్రాతినిధ్యం వహిస్తున్నది. పెట్టుబడిదారి పంథాలో స్వతంత్రజాతీయ ఆర్థికవిధానాన్ని నిర్మించుతున్నది. పెట్టుబడిదారేతర పంథాలో యీ కార్యక్రమాన్ని అమలు చేయు శక్తి దానికిలేదు." మరింత స్పష్టంగా, కాంగ్రెసు ప్రభుత్వం "స్వతంత్ర ఆర్థిక విధానాన్ని నిర్మించుచున్నదని" సి.పి.ఐ అవగాహన. అదేకాలంలో "జాతీయ ప్రజాస్వామ్య కార్యక్రమాన్ని అమలు చేయగలశక్తి కాంగ్రెసుకు లేదని చెప్పుతు సమతూకాన్ని వ్రాతలలో కొనసాగిస్తున్నారు.

సి.పి.ఐ పాట్నా 8వ, పార్టీ కాంగ్రెసులో "జాతీయ బూర్జువాపాలన,అనుసరించే పెట్టుబడిదారి పంథా అంతంకానిదే జాతీయప్రజాస్వామ్యాన్ని అమలు చేయుట అసాధ్యం." అని సవరణ చేసారు. దీని అర్థాన్ని లేక ఆంతర్యాన్ని యిలా వివరించింది.[1]

"ప్రప్రథమంగా వారు (సి.పి.ఐ) చదీచప్పుడు కాకుండా బూర్జువావర్గము "స్వతంత్ర జాతీయ ఆర్థిక విధాన పంథాలో నిర్మాణాన్ని కొనసాగిస్తున్నారనే" వ్యాఖ్యభాగాన్ని తీసివేశారు. సంవత్సరాల కొలదిగా ఆవిధానాన్ని ఆకాశానికెత్తి పొగిడారు. ఈవిషయాన్ని ఎందుకు తీసివేసారో శ్రేణులు, ప్రజలకు వివరించనక్కరలేదా? బాంబే కార్యక్రమంలో చేర్చాలనుకొని దానిని చేర్చారుకదా?

"రెండవ అంశం, ముఖ్యంగా తలపెట్టిన కార్యక్రమసవరణ, విప్లవాత్మకమైనది. జాతీయ ప్రజాస్వామ్య కార్యక్రమాన్ని పూర్తిచేయుటకు విప్లవ కార్యక్రమాన్ని చేబట్టుతున్నాము. ఈ కార్యక్రమాన్ని విజయవంతంగా అమలుచేయుటకువారు (సి.పి.ఐ) బూర్జువావర్గపు మొత్తపు రాజ్యాధికారాన్ని త్రోసివేయాలని, కారణం " అట్టి కార్యక్రమము జాతీయ బూర్జువావర్గపు పాలనను అంతంచేయనిదే అమలు చేయుట అసాధ్యము" అని స్పష్టం చేశారు.

ప్రభుత్వం, రాజ్యం యొక్క వర్గ విశ్లేషణ సి.పి.ఐ చేస్తూ పిడివాదంగా, "అది బూర్జువా, భూస్వామ్యవర్గాల ప్రభుత్వాధికారంకాదని, బడాబూర్జువా, భూస్వామ్యవర్గాలకు రాజ్యాధికారంలో భాగం యేమాత్రంలేదని, బడాబూర్జువావర్గానికి నాయకత్వపాత్ర కూడ లేదని, స్పష్టంచేసింది. అంతేగాక, " జాతీయ బూర్జువావర్గ యీ ప్రభుత్వపాలనను అంతం చేయాలని" స్పష్టం చేసారు.

1. *పొలిటికల్ - ఆర్గనైజేషనల్ రిపోర్టు 8వ, కాంగ్రెసు ఆఫ్ సి.పి.ఐ(యం) 1969. సి.పి.ఐ (యం) పబ్లికేషన్ (ఆంగ్లంలో) పే. 144-5.*

"మా (సి.పి.ఐ) పార్టీ కార్యక్రమంలో యెక్కడా కాంగ్రెసు పాలనను అంతంచేయాలని, దాని స్థానంలో సామ్రాజ్యవాద, ఫ్యూడలు, గుత్తపెట్టుబడిదారి వ్యతిరేక శక్తుల ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని యేర్పరచాలని చెప్పలేదు. ఈసవరణ, అధికారం నుండి కాంగ్రెసును తొలగించాలనే అసలు సూత్రీకరణ ఆంతర్యాన్ని స్పష్టం చేస్తున్నది. బాంబే కార్యక్రమం రెండు దశాబ్దాలు నిరవధికంగా రాజ్యాధికారాన్ని చెలాయించిన కాంగ్రెసుపాలనను అంతం చేయాలని నిర్దిష్టంగా పేర్కొనలేదు. కాని దానిలో ఇమిడివుందని, దానిని యిప్పుడు స్పష్టం చేస్తున్నామని వివరణ యిచ్చారు. ఇది ఎంత ఘోరమని నివేదిక ప్రశ్నించింది.

" ఈ కాలమంతా కాంగ్రెసు పార్టీతో ఐక్యసంఘటనా ఎత్తుగడను చెప్తూతూ వచ్చారనేది వాస్తవం అభివృద్ధి నిరోధకశక్తుల ప్రమాదం అనే అపఖ్యాతి పాలైన సిద్ధాంతాన్ని ప్రచారం చేసారు. ఆశక్తులకు వ్యతిరేకంగా ఐక్యసంఘటన నిర్మించాలని, ప్రభుత్వాధికారం పూర్తిగ బూర్జువావర్గ నాయకత్వంలోకాని, కార్మికవర్గనాయకత్వంలోగాని వుండదనేవాదనను సి.పి.ఐ తెచ్చింది. అదే కాలంలో ప్రభుత్వాధికారంతో మైత్రి, సహకారం నెరపుతూ వచ్చింది. బాంబే కార్యక్రమంలో యీ ఎత్తుగడల పంథాపై వొక ప్రకరణను కేటాయించారు. రాజకీయ పరిణామాలక్రమంలో సి.పి.ఐ ఎత్తుగడలపంథా కూలిపోవుటతో పాట్నా కాంగ్రెసులో ఆప్రకరణను మొత్తంగా ఎత్తివేసారు.

సి.పి.ఐ(యం) 8వ, పార్టీ కాంగ్రెసు నివేదిక "నేటి మన ప్రజాస్వామ్య శక్తులలోని ముఖ్య చీలిక, కాంగ్రెసును అనుసరించే ప్రజాసామాన్యం, ప్రతిపక్ష ప్రజాస్వామ్యశక్తులను అనుసరించే ప్రజాసామాన్యం మధ్యన వున్నదనే అవకాశవాద సిద్ధాంతాన్ని దానితోపాటు కాంగ్రెసుతో ఐక్యసంఘటన అన్ని దానిని సి.పి.ఐ వదలివేసిందని స్పష్టంచేసింది. దాని స్థానంలో కాంగ్రెసు వ్యతిరేక ప్రజాస్వామ్యసంఘటన, వామపక్ష సంఘటన" అనే నినాదం ముందుకు తీసుకొని రాబడిందని. నివేదిక వివరించింది.

సి.పి.ఐ స్వతంత్రపార్టీ "గుత్తపెట్టుబడి, ఫ్యూడలువర్గాల బహిరంగపార్టీగ, సామ్రాజ్యవాద అనుకూల కుట్రలకేంద్రంగా" "కాంగ్రెసులోని అభ్యుదయకర అంశాలకు వ్యతిరేకంగా" అందరినీ ఐక్యపరచే ప్రయత్నం చేస్తున్నదనే విశ్లేషణ నివేదిక చేసింది. ఆచరణలో ఉత్తరప్రదేశ్‌లో కరుడుగట్టిన అభివృద్ధి నిరోధకులతో, అదే స్వతంత్రపార్టీలోని కొన్ని వర్గాలతో చేతులు కలుపుటకు సి.పి.ఐ వెనుకాడలేదు, స్వతంత్రపార్టీ అనే బోర్డులేని అట్టి శక్తులతోనే బీహారు ఐక్యసంఘటన మంత్రివర్గంతో సహకరించుటకు, భావనగర్ మునిసిపాలిటీలో చైర్మెన్ పదవిని మితవాద కమ్యూనిస్టులకు యిస్తామనుటతో వారితో సహకరించుటకు రాజకీయ అవగాహన అడ్డు కాలేదు.[1]

జనసంఘం, రాష్ట్రీయ స్వయంసేవక సంఘాల యెడల చేబట్టే వైఖరిని సి.పి.ఐ బాంబే కార్యక్రమం విశ్లేషణ చేసి యిలాపేర్కొన్నది. "వీరిని మతతత్వ శక్తులుగానే కాక మతదురహంకార సంస్థలుగా, హిందూ పునరుద్ధరణ, సామాజిక మైనారిటివర్గాల యెడల విచక్షణ వారిపై హింసాదౌర్జన్యాలను రెచ్చగొట్టి, మతకల్లోలాను, కొట్టాటలను రెచ్చగొట్టే

*1. పొలిటికల్ - ఆర్గనైజేషనల్ రిపోర్టు 8వ, కాంగ్రెసు ఆఫ్ సి.పి.ఐ(యం) 1969. సి.పి.ఐ (యం) పబ్లికేషన్ (ఆంగ్లంలో) పే. 147.*

వారి చర్యలను, స్వయంసేవకసంఘీయులు ప్రోత్సహించుట, ప్రత్యేకపాత్ర వహించుట, సైనిక శిక్షణ పొందిన ఫాశిస్టు సిద్ధాంత విశ్వాసపాత్రులుగ విశ్లేషణ చేసింది. అయితే, సి.పి.ఐ చారిత్రాత్మక పాట్నా పార్టీ కాంగ్రెసు దీనిని కూడ తొలగించింది. బహుశా జనసంఘంలో కూడవారు రాజకీయ "అటుపోటు"లను కనుగొని వుండవచ్చు. రాష్ట్రీయ స్వయంసేవకసంఘపు కవాతుదళాల రాజకీయరూపంగా జనసంఘాన్ని చేసిన విశ్లేషణ మరచుటగాక అవకాశవాదపు ప్రభావమో కాలమే నిర్ణయించింది.

సి.పి.ఐ సంస్కరణవాదులు యు.పి, బీహారు, పంజాబులలో జనసంఘంతో రాజకీయమైత్రి, సహకారాన్ని నెరపుతూ కాంగ్రెసేతర ప్రభుత్వాలలో, బొంబే పార్టీకాంగ్రెసు జనసంఘంపై చేసిన విశ్లేషణ, చేబట్టినవైఖరిలను సవరణలు చేయకముందే, అవకాశవాదానికిలోనై మంత్రివర్గాలలో చేరారు, కార్యక్రమవిధానాలను త్రోసిబుచ్చారు. ఇది అంత గౌరప్రదమైనచర్య, వైఖరికాదని స్పష్టమైన వెంటనే వెనుతిరుగారు. వారి అంతర్జాతీయ రాజకీయ మిత్రులు, తోటిసంస్కరణవాదులు విమర్శించుట, వారి జనరల్ శెక్రటరీ జనసంఘంతో సహకరించుటకు మేము బలవంతంచేయబడ్డాము, పొరపాటు అయిందని బహిరంగంగా వెలిబుచ్చారు. సంయుక్తపార్టీ వొత్తిడికి లోనయ్యామన్నారు. ఏసూత్రాన్ని, పార్టీ విధానాన్ని అనుసరించక అవకాశవాదాన్ని చేబట్టి సి.పి.ఐ పంజాబు శాఖ తరచు జనసంఘం ప్రభావానికి గురి అగుతునేవుంది.

ముస్లింలీగు, అకాలీ పార్టీలపై సి.పి.ఐ చేసిన వర్గవిశ్లేషణ, వాటి యెడల చేబట్టిన వైఖరి, అదేవిధంగా తమిళనాడులో డి.యం.కె. యెడల చేబట్టే వైఖరి తరచు అవకాశవాదానికి గురి అగుతూనేవున్నాయి. ఆపార్టీల విధానాల రాజకీయవర్గ విశ్లేషణ దానిని అనుసరించే వైఖరి అయితే పొరపాటులను తేలికగానే సరిదిద్దుకొనవచ్చును. అవగాహనలే అవకాశవాదంతో మసకబారితే రాజకీయ పొరపాటు అగుతుంది. ఈ మూడు పార్టీల వేర్పాటువాదాన్ని పరిగణించి, రాజకీయంగా సమగ్రంగా వర్గ దృక్పదంలో అధ్యయనం చేసామనుకొనుట, తప్పుదు రాజకీయ వైఖరులు చేబట్టుటకుదారి తీస్తుంది. వారు ప్రాతినిధ్యం వహించే అశేష ప్రజాసామాన్యం అనుసరించే రాజకీయవిధానాలను, వివిధ పార్టీల యెడల తీసుకొనవలసిన వైఖరులను అధ్యయనం చేసి, నిర్ణయాలు గైకొనవలసివుంటుంది.

ఈ పార్టీలపై చేసిన రాజకీయవిశ్లేషణలో, విమర్శన కానరాదు. కాంగ్రెసు వ్యతిరేక బూర్జువావేర్పాటువాద, అవకాశవాద శక్తులతో రాజకీయస్నేహ, మైత్రీ, సహకారాలను నెరపుట కత్తిమీద సాములాంటిది. అవకాశవాద ప్రభావాలకు తాత్కాలిక ప్రయోజనాలను ఆశించి, దీర్ఘకాల రాజకీయ ప్రయోజనాలతో రాజీపడరాదు. అవి పార్టీని ప్రజల నుండి వేరుచేయటకు, రాజకీయ ప్రతిష్టను కోల్పోవుటకు, విచ్ఛిన్నానికి దారి తీసే ప్రమాదముంది.

**ఐక్యసంఘటనల వ్యాప్తికి అతివాదపు ముప్పు.**

ఇటీవలకాలంలో వామపక్షశక్తులు తమ ప్రజాపునాదులను విస్తృతపరచుకొనుటకు ఎన్నోగొప్ప సదవకాశాలు లభించాయి. కాని అవకాశవాదం, సెక్టేరియనిజంలు చెలియలికట్టలై తరచు పురోగతిని పరోక్షంగా అరికట్టాయి. సంయుక్త సోషలిస్టుపార్టీ

అగ్రనాయకత్వప్రభావంలో కొన్ని కమ్యూనిస్టు శ్రేణులు మితవాద అవకాశవాదంవైపు పయనించాయి. కాంగ్రెసేతర తత్వం పేరుతో సంయుక్త సోషలిస్టుపార్టీ బీహారులో ప్రజాస్వామ్య ఉద్యమ వ్యతిరేకులు, విచ్ఛిన్నకారులు, మితవాద, ప్రజావ్యతిరేక కాంగ్రెసు వాదులతో చేతులు కలుపుట, యు.పి. మరికొన్ని ఇతర రాష్ట్రాలలో జరిగింది. కేరళ, బెంగాల్‌లలోని ఐక్యసంఘటనలలో సి.పి.ఐ(యం) బలమైన శక్తిగా నాయకత్వం వహించుతున్నా సెక్టేరియన్ సైద్ధాంతిక, రాజకీయపంథానుసరించుటతో పరోక్షంగా విచ్ఛిన్నకరపాత్ర వహించుతున్నది. దేశంలోని వామపక్ష వుద్యమ అనైక్యతావిషాదాంత పరిణామాలకు కమ్యూనిస్టుపార్టీలు రెండూ ప్రధాన భాధ్యతవహించవలసి వుంటుంది.

మధ్యంతర 1969లో జరిగిన ఎన్నికలు తదనంతరం ప్రజలలో, ప్రజాస్వామ్యశక్తులలో ఐక్యసంఘటన యెడల సదభిప్రాయం, అభిమానం ఎంతో పెరిగింది. అంచేత అందరూ మరింత ఆకర్షితులయ్యారు. ఐక్యసంఘటన ప్రభుత్వాలు అభ్యుదయకర కార్యక్రమాలు చేపట్టి, అమలుచేయుటతో వామపక్షాలవైపు ప్రజాసామాన్య మొగ్గు చూపసాగింది.

కాని, ఐక్యసంఘటనలను బలోపేతం చేసి, ప్రజాసమస్యలపై మరింతగా ప్రజాసామాన్యాన్ని సమీకరించి, వామపక్ష ఐక్యతను మరింతగా పెంపొందించవలసిన కాలంలో కేరళ, బెంగాలులలో పెద్ద పార్టీగా నాయకత్వం వహించుతున్న సి.పి.ఐ(యం) సంకీర్ణప్రభుత్వంలో తన బల, ప్రభావాలను సంకుచిత స్వపక్ష ప్రయోజనాలకు, భాగస్వామ్య పక్షాలను బలహీనపరచే ఎత్తుగడలను అవలంభించుటతో అభిప్రాయభేదాలు తలెత్తసాగాయి, ఉన్నవి బలపడనవి ప్రభుత్వంలో హోం, పోలీసు శాఖలు సి.పి.ఐ(యం) నాయకుల అధ్వర్యంలో వున్నందున దైనందిన పార్టీ కార్యక్రమాలు సాగించుటలో తమకు అనుకూలంగా, ప్రత్యర్ధులకు, ఇతర భాగస్వామ్య పక్షాలకు వ్యతిరేకంగా యధేచ్ఛగా గతంలో కాంగ్రెసు వలెనె వినియోగించింది. అంతేగాక సి.పి.ఐ (యం) ప్రయోజనాలు, పక్షపాతం, బంధుప్రీతి, యితర ప్రలోభాలకులోనగుట ఐక్యసంఘటనలలో కలతలు పొడచూపుటకు కారణాలయ్యాయి. ఐక్యసంఘటనను అందులోని భాగస్వామ్య పక్షాలను లెక్కచేయకుండా నిరంకుశంగా, హింసా, దౌర్జన్యాలదాడులను ముఖ్యంగా సి.పి.ఐ, తదితర భాగస్వామ్య పక్షాలపై వినియోగించారు. ఇది ముఖ్యంగా బెంగాలులో జరిగింది.[1]

ఈ పరిస్థితి ఐక్యసంఘటన భాగస్వామ్య పార్టీలు, సి.పి.ఐ(యం) కు తలవొగ్గని పార్టీలు సంఘటనలో కొనసాగలేని పరిస్థితులు రూపొందసాగాయి. సి.పి.ఐ.(యం) రాజకీయ పంథా, ఎత్తుగడలు, ఐక్యసంఘటనా విధానానికి విరుద్ధంగా తయారగుతు పనిచేయుటయేగాక, కొనసాగుటకు, ఉనికికి ప్రమాదకారి కాసాగింది. ఐక్యసంఘటనా ధ్యేయానికి, లక్ష్యానికి అత్యంతవిఘ్నకారి అయింది. సి.పి.ఐ(యం) నాయకులే ఐక్యసంఘటనను తెగనాడుట ప్రారంభించి, "సంఘటన పార్టీల ప్రాతిపదికపైగాక వర్గప్రాతిపదిక" పై యేర్పడాలనే నూతన సిద్ధాంతాన్ని ముందుకు తెచ్చారు. సి.పి.ఐ(యం) యీ సిద్ధాంత సమస్యను తన సెక్టేరియనిజాన్ని, తత్ఫలితంగా జరుగుతున్న విచ్ఛిన్నాన్ని కప్పిపెట్టుకొనేందుకు, ప్రచారంలో పెట్టారు. ఐక్యసంఘటనలు అంటేనే ప్రజాస్వామ్యపక్షాల,

*1. పొలిటికల్ రిపోర్టు అండ్ పొలిటికల్ రిజల్యూషన్స్ అడాప్టెడ్ బై 9వ కాంగ్రెసు ఆఫ్ ది సి.పి.ఐ కొచ్చిన్. అక్టోబర్ 1971 సి.పి.ఐ పబ్లికేషన్. పే. 54.*

పార్టీల, వర్గాల, గ్రూపుల కార్మిక, కర్షక, పెటీ బూర్జువావర్గాల, జాతీయ బూర్జువావర్గంలోని ప్రజాస్వామ్యవర్గాలు అన్నికలసి యేర్పరచుకొన్ని సమిష్టి సంస్థ ఐక్యసంఘటనపై సి.పి.ఐ(యం) తనయేకైక నాయకత్వాన్ని హెజమోనీని బలవంతాన రుద్దేప్రయత్నాన్ని సమిష్టి నాయకత్వానికి బదులుగా కార్మికవర్గనాయకత్వానికై జరిగే పోరాటంగా చిత్రించుతూ సి.పి.ఐ(యం) నియంతృత్వాన్ని నిర్మించతలపెట్టుచున్నందున వైఫల్యాలను యెదుర్కొనవలసివస్తున్నది.

ఐక్యసంఘటనలో సి.పి.ఐ(యం) తన ఏకైక నాయకత్వాన్ని నెలకొల్పుటకు భాగస్వామ్యపార్టీలపై గూడ భౌతికదాడులు, ఐక్యప్రజాసంఘాలను ముఖ్యంగా ట్రేడుయూనియను కాంగ్రెసును చీల్చుట, బెంగాలులో రాజకీయహత్యలు పెరుగుటకు కూడ పరోక్షంగా. ఐక్యసంఘటనా ప్రభుత్వానికి నాయకత్వం వహిస్తున్నప్పటికి కారణమైంది. వర్గపోరాటం పేరుతో కార్మికులకు వ్యతిరేకంగా కార్మికులు, రైతులకు వ్యతిరేకంగా రైతులు, యువకులు, విద్యార్థులు అంతర్యుద్ధం లాంటి పరిస్థితులతో మునిగిపోయారు. అదేకాలంలో నక్సలైట్లు, "శతృవర్గాన్నిఖతం చేయు కార్యక్రమం" చారు మజుందార్ నాయకత్వంలో చేబట్టుటతో రాజకీయ కొట్లాటలు, హత్యలు, పెరిగిపోయాయి. ప్రభుత్వపోలీసు యంత్రాంగం కూడ తనే మీ తక్కువకాకుండా తనవంతు పాత్రకుమించే నిర్వహించింది.

ఐక్యసంఘటనల సమిష్టి కార్యక్రమాలలో యేమాత్రం శ్రద్ధవహించకపోవుటయేగాక, కొన్ని చోట్ల భగ్నం చేయుటకు కూడ వెనుకాడలేదు. సి.పి.ఐ(యం) ప్రభుత్వంలో చేరుట, నాయకత్వం వహించుట, దానిని వొక ఆయుధంగా చేసుకొని భారతరాజ్యాంగాన్ని, ప్రభుత్వాన్ని బ్రద్దలు చేయుటకేగాని, ప్రజలకు సేవలందించులకు, సంస్కరించుటకు కాదని వివిధ పత్రాలలో 1970 దశకంలోనే స్పష్టంచేసియుండుటను గమనించియుండినప్పుడు సి.పి.ఐ(యం) రాజకీయవిధానం, వ్యూహం, ఎత్తుగడలు వాటిదైనందిన ఆచరణలను పూర్తిగ అర్థం చేసుకొనగలము. పశ్చిమబెంగాలులో ప్రభుత్వంలో తనస్థానబలాన్ని వినియోగించుకొని బిర్లాలతో వొక అవగాహనకు వచ్చి బిర్లా పారిశ్రామిక సంస్థలలో కార్మికపోరాటాలను నీరుగార్చసాగింది. బి.యం. బిర్లా బహిరంగంగా జ్యోతిబసు, సి.పి.ఐ(యం) లను పొగిడారు. కమ్యూనిస్టులలో యీ గౌరవాన్ని యింతకుముందు ఎవ్వరూ పొందియుండలేదు.

**వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతా నినాదాన్ని సి.పి.ఐ చేబట్టుట.**

పశ్చిమబెంగాల్‌లో విచ్ఛిన్నకర హింసా దౌర్జన్యకాండలు, భౌతికదాడులు కొనసాగుతున్నప్పటికి ఐక్యసంఘటనను, దాని ప్రభుత్వాన్ని సి.పి.ఐ కేరళలో వలెనే కాపాడుతు, దాని కొనసాగింపునకు విశ్వప్రయత్నాలను చేసింది.

కేరళలో సి.పి.ఐ ఆచరణాత్మకసలహాలు, ప్రతిపాదనలను ఇ.యం.యస్. నంబూద్రిపాద్, తదితర సి.పి.ఐ(యం) నాయకులు త్రోసిబుచ్చారు. సమన్వయ కమిటీని కూడ ప్రక్కకు నెట్టివేసి, ఏకపక్ష నిర్ణయాలతోపాలన సాగించారు. ఐక్యసంఘటనలో సి.పి.ఐ(యం) పూర్తిగ వేరుపడిపోవుట, సంఘటన భాగస్వాములు సి.పి.ఐ(యం) ఆజ్ఞలకు లొంగిపోవుటకు నిరాకరించుటతో ముఖ్యమంత్రి నంబూద్రిపాద్ వేగంగా రాజ్‌భవన్‌కు వెళ్ళి, రాజీనామా పత్రాన్నిచ్చి, యేకపక్షంగా మంత్రివర్గాన్ని రద్దు చేసారు. ఆవిధంగా తాను మరో నూతన

మంత్రి వర్గాన్ని యేర్పాటు చేయగలనని పొరపాటు అంచెనా వేసారు. ఐక్యసంఘటనా ప్రభుత్వంలో ఏకపక్ష ఆజ్ఞాపాలనా విధానాలను, ఏకపార్టీ పాలనా పద్ధతులను కార్మికవర్గ నాయకత్వం అనేపేరుతో సి.పి.ఐ(యం) నియంతృత్వాన్ని అమలు చేయ ప్రయత్నించిన ఫలితంగా మంత్రివర్గ సంక్షోభం స్వయంకృతాపరాధ ఫలితము, తొందరపాటు చర్య ఫలితమూ అయివుండవచ్చు. కాని, కొద్దిరోజులలోనే సి. అచ్చుత్‌మీనన్ నాయకత్వంలో నూతన ఐక్యసంఘటనా ప్రభుత్వ యేర్పడుటతో సి.పి.ఐ(యం) ఆశలు అడియాసలయ్యాయి. ఈ నూతన ఐక్యసంఘటనా ప్రభుత్వవొక్క వామపక్షాల బలంపైనే గాక, కాంగ్రెసు మద్దతును పొందుట వొకవైపున దాని బలహీనతనేగాక, దాని బలాన్ని తెలియజేస్తుంది. వామపక్ష ఐక్యత ప్రధాన భూమికగా సి.పి.ఐ(యం) దాని వామపక్షమిత్రులు నూతన ఐక్యసంఘటనలో లేనందున దాని బలహీనత సుస్పష్టం. ఇక దాని బలం వామపక్ష ప్రజాస్వామ్యశక్తులతో వారి మద్దతుతో యేర్పడినందున సైద్ధాంతికంగా విస్తృతి కల దైనందున భారత విప్లవ నేటి దశలో బలమైనది కాగల అవకాశాలు, భవిష్యత్కాలానికి మార్గదర్శికం కాగలదిగానూ చెప్పవచ్చు. బూర్జువావర్గ పార్టీయైన జాతీయ కాంగ్రెసు మద్దతుపై ఆధారపడినందునన దాని బలహీనత సుస్పష్టం. సి.పి.ఐ 9వ పార్టీ కాంగ్రెసు 1971లో వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యసంఘటన, వామపక్ష, ప్రజాస్వామ్య ఐక్యసంఘటనా ప్రభుత్వం అనే నూతన నినాదాలపై యిచ్చిన వివరణలు, యీ ఆచరణ సిద్ధాంత విస్తృతిని వివరించాయి.

ఐక్యసంఘటనలోని భాగస్వాములందరూ అచ్చుత్‌మీనన్, సి.పి.ఐ. లతో పూర్తిగ సహకరించగలమని వొత్తిడి చేసినందుననే నూతన ఐక్యసంఘటనా ప్రభుత్వం యేర్పడింది. ప్రభుత్వం ఐక్యసంఘటన సమిష్టి కార్యక్రమాన్ని అమలు చేయసమకట్టినందున ప్రజల విస్తృత మద్దతు లభించింది. భూసంస్కరణల చట్టాన్ని, తదితర అభ్యుదయకర సంస్కరణలను మొదటి ఐక్యసంఘటన తలపెట్టినవాటిని అమలుకు చర్యలు చేపట్టారు. ఐక్యసంఘటనా ప్రభుత్వానికి యీ విషయంలో కాంగ్రెసు (ఆర్) మద్దతు కూడ లభించింది. ఆమోదించిన ప్రజాస్వామ్య విధానాలపై ఐక్యసంఘటన సూత్రబద్ధ అవగాహనకు కాంగ్రెసు (ఆర్) వచ్చింది. ఇదే ఐక్యసంఘటన, కాంగ్రెసు (ఆర్) ల మధ్య ఎన్నికల అవగాహనకు మార్గమేర్పరచింది, అదే ఎన్నికల ప్రణాళికలో ప్రతిబింబించింది.

సి.పి.ఐ(యం) సెక్టేరియన్, స్వపక్షపాత వైఖరులను విడనాడి నూతన ఐక్యసంఘటనా ప్రభుత్వ కార్యాక్రమాన్ని అమలు చేయుటకు ప్రయత్నించుటయేగాక, కేరళ పరిస్థితులలో దేశం మొత్తంగాకోరుతున్న వామపక్ష ప్రజాస్వామ్యశక్తుల ఐక్యతా నిర్మాణాన్ని చేబట్టింది. ఐక్యసంఘటనా ప్రభుత్వకార్యాచరణ, దాని పాత్ర, ఐక్యసంఘటన స్వరూప చిత్రాన్ని పునరుద్ధరించుటకు బాగా తోడ్పడుటతో ప్రజాసామాన్యంలోని నూతన వర్గాలు ఆకర్షితులయ్యారు. సి.పి.ఐ(యం) ఐక్యసంఘటనా మంత్రివర్గంపై పోరాటం ప్రకటించి, మితవాద అభివృద్ధి నిరోధక శక్తులతో చేతులు కలిపింది. ఈ సందర్భంలోనే నంబూద్రిపాద్ "దెయ్యాలతో సహకారం నెరపుతాం" అన్న నినాదమిచ్చి, సి.పి.ఐపై సి.పి.ఐ(యం)కు గల శతృభావవైఖరిని స్పష్టం చేసారు. కమ్యూనిస్టుపార్టీకి మరో కమ్యూనిస్టుపార్టీయే శతృవు అన్నదానికి అద్దం పట్టారు.[1]

*1. పొలిటికల్ రిపోర్టు అండ్ పొలిటికల్ రిజల్యూషన్ అడాప్టెడ్ బై 9వ. కాంగ్రెసు ఆఫ్ ది సి.పి.ఐ కొచ్చిన్, అక్టోబర్ 1971 సి.పి.ఐ పబ్లికేషన్. పే. 54.*

సి.పి.ఐ ఐక్యసంఘటనలోని భాగస్వామ్య పక్షాలతో కలసి "నూతనంగా ప్రజాభిప్రాయం అసెంబ్లీలో ప్రతిబింబించుటకు, సి.పి.ఐ(యం) విచ్ఛిన్నకర పోకడలకు, అభివృద్ధి నిరోధక "మితవాద గ్రాండ్ అలయెన్సు"పై ప్రజాభిప్రాయ సేకరణకు ఎన్నికలు జరపాలని నిర్ణయించింది. అభివృద్ధి నిరోధక మితవాద శక్తులు సి.పి.ఐ(యం)పై చాలావరకు ఆధారపడుట, సెప్టెంబరు 1970 మధ్యంతర ఎన్నికలలోవారు పరస్పరం అవగాహనకు వచ్చుట జరిగింది.[1]

కేరళలో సి.పి.ఐ అనుసరించిన పంథా, కాంగ్రెసులో వచ్చిన నూతన చీలికల ఫలితంగా యువజన వర్గాలలో కలిగిన సంచలనం, ఐక్యసంఘటన, కాంగ్రెసు (ఆర్) ల మధ్య అభివృద్ధి చెందిన ఎన్నికల అవగాహనలు శక్తివంతమైన సంయుక్త ప్రచారోద్యమానికి సహాయకారులై ప్రోద్బలమిచ్చాయి. సి.పి.ఐ(యం), అభివృద్ధి నిరోధక మితవాద వర్గాలు రెండూ కేరళలో తీవ్రవోటమి పొందాయి. ఇది వామపక్ష వుద్యమ వ్యాప్తికి నూతన మార్గాలను తెరచింది. సి.పి.ఐ(యం) ఐక్యసంఘటనా ప్రభుత్వంలో చేరకుండా బయటనుండి బలపరచుట, ప్రజాస్వామ్యశక్తులు మరింత బలపడుటకు తోడ్పడింది. ఐక్యసంఘటన ప్రభుత్వంలోపల బయటవున్న వామపక్ష, ప్రజాస్వామ్యశక్తులు కాంగ్రెసు (ఆర్) బలాన్ని స్వీకరించకుండానే రాజకీయాలను వామవక్ష దిశకు మళ్ళించుటకు, ప్రజల ప్రయోజనాలకొరకు కలసి ఎలావని చేయగలరో అన్న దానికియిది ఉదాహరణగా నిలుస్తుంది. పార్టీ సరియైన ఐక్యసంఘటనా ఎత్తుగడలను అనుసరించుటతో సెక్టేరియనిజాన్ని, విచ్ఛిన్నతను త్రిప్పికొట్టుటయేగాక, కాంగ్రెసును బలపరచే విస్తృత ప్రజాసామాన్యాన్ని వామపక్షాలవైపు ఆకర్షించుట, యితర వామపక్షాలు కూడ సమిష్టి ప్రజాస్వామ్య దృక్పథం చేబట్టుట జాతీయ రాజకీయాలలో సుముఖ పరిణామంగా నెంచాలి.

## కమ్యూనిస్టుల ఐక్యతా ప్రయత్నాలు

సి.పి.ఐ. 8వ, పార్టీ కాంగ్రెసు కమ్యూనిస్టు శ్రేణులలోగల శతృభావాన్ని అధిగమించి, ఐక్యకార్యాచరణ కమ్యూనిస్టులలో ప్రజాసంఘాలలో రూపొందించుట అత్యవసరంగా పేర్కొంది. అన్ని స్థాయిలలో ఐక్యకార్యాచరణను సాధించుటకు సి.పి.ఐ ప్రయత్నించింది. మే 1969లో సి.పి.ఐ (యం) పొలిట్‌బ్యూరోతో సి.పి.ఐ కేంద్ర కార్యదర్శివర్గం ద్వైపాక్షిక సంప్రదింపులు జరిపి, కనీసం ప్రజాసమస్యలపై కార్యాచరణలోనైనా రెండు పార్టీల మధ్యగల సంబంధాలను మెరుగుపరచుటకై నిర్దిష్ట ప్రతిపాదనలను చేసింది.

రెండు పార్టీలు ప్రతినిధుల మధ్య ఎ.ఐ.టి.యు.సి లోని ఐక్యతను రక్షించి, కొనసాగించుటకు రెండు అఖిల భారత కిసాన్ సభల మధ్య సంయుక్తకార్యాచరణ, సహకారం పెంపొందుటకు సంప్రదింపులు జరిగిన తరువాత ఆమోదించబడిన వొప్పందవు అంశాలపై వొక సంయుక్త ప్రకటనను చేసారు. సి.పి.ఐ(యం) నాయకత్వం కనీసం ఐక్యకార్యాచరణకు కూడ వొప్పుకొననందున ఐక్యతా ప్రయత్నాలు విఫలమయ్యాయి. నిజానికి సి.పి.ఐ(యం) నాయకత్వం కిసాన్ సభ స్థాయిలో జరిగిన వొప్పందాన్ని కూడ

1. *డాక్యుమెంట్సు ఆఫ్ ది 9వ కాంగ్రెస్ ఆఫ్ ది కమ్యూనిస్టుపార్టీ ఆఫ్ ఇండియా పొలిటికల్ రిపోర్టు సి.పి.ఐ పబ్లికేషన్ (1971) పే. 57.*

తిరస్కరించింది. నిజాయితీ, ఓర్పు లేకపోవుట పరస్పరవ్యతిరేకత కారణంగానే ఐక్యతా ప్రయత్నాలు విఫలమయ్యాయి.

"పశ్చిమ బెంగాల్, కేరళ సి.పి.ఐలను అప్పుడు, తరువాత ప్రధాన శత్రువులుగ సి.పి.ఐ(యం) నిర్ధారణ చేసి, తమ శ్రేణులలో సి.పి.ఐపై వ్యతిరేకత, ద్వేష విషాన్ని ఎక్కించారు. పశ్చిమ బెంగాల్‌లో మరింతగా సి.పి.ఐ సభ్యులు సానుభూతిపరులు, నాయకులు సి.పి.ఐ(యం) శ్రేణుల భౌతిక దాడులకు గురయ్యారు. ఈదాడులకు రాష్ట్ర కమిటి, కౌన్సిలుల సభ్యులు, సెక్రటేరియట్ సభ్యులు అండమాను జైళ్ళలో బ్రిటిష్ ప్రభుత్వహింసలకు గురైన విప్లవ కమ్యూనిస్టులు గురయ్యారు. అట్టి దాడులలో 40 సంవత్సరాలు విప్లవజీవితం గల, అండమాన్ విప్లవ కమ్యూనిస్టు కిశోరం మొకటి నేలకొరుగుట శోచనీయము." కమ్యూనిస్టులకు, కమ్యూనిస్టుపార్టీకి ప్రధాన శత్రువులు దారి తప్పిన మరో కమ్యూనిస్టు, మరో కమ్యూనిస్టుపార్టీయని భారత కమ్యూనిస్టు ఉద్యమ వర్తమాన చరిత్ర చెప్పే సత్యం.

" మా పార్టీ యెడల సి.పి.ఐ(యం) గల శత్రువైఖరి మార్క్సిజం, లెనినిజంలకు దూరమగుతున్న వారి రాజకీయసైద్ధాంతిక పంథా నుండి ఉద్భవించింది. బర్ద్వాన్‌ప్లీనం ఆమోదించిన సైద్ధాంతిక పత్రం, దానినే ఆమోదించిన వారి 1968 ఎర్నాకులం పార్టీ కాంగ్రెసు దీనినే సూచిస్తున్నాయి. సి.పి.ఐ(యం) యొక్క నక్సలైట్ల వ్యతిరేకత దాని అవకాశవాదం నుండి వచ్చింది. కాని, అది మార్క్సిజం-లెనినిజం అవగాహనలకు అంటి పెట్టుకొని వుండుట వలన వచ్చిందికాదు. బెంగాలులో సి.పి.ఐ(యం) వామపక్ష సాంప్రదాయాన్ని విడిచి, పోలీసు, సి.ఆర్.పి.లతో నక్సలైట్లను వేటాడుటకు సహకరిస్తున్నది. సి.పి.ఐ(యం) పార్లమెంటులో, బయటా నిరవధికంగా పోలీసు నక్సలైట్లు యెడల తీవ్రంగా, నిర్ధాక్ష్యంణ్యంగా వ్యవహరించుటలేదని ఫిర్యాదులు చేస్తున్నది. సి.పి.ఐ(యం) విప్లవోద్యమము కంటె ఎన్నికలు, సీట్లు, మంత్రివర్గంలో స్థానాలు, శాఖలు యెడల అత్యంత శ్రద్ధవహిస్తున్నది.[1]

మధ్యంతర కేరళ ఎన్నికలలో మితవాద అభివృద్ధినిరోధక శక్తులతో చేతులు కలిపింది. కొన్ని సీట్లు, సీట్లలో విజయం కొరకు కాదు, సి.పి.ఐ వ్యతిరేకతతో దానిని నామరూపాలు లేకుండా చేయతలపెట్టిన పంథా ఫలితంగా జరిగింది. వామపక్ష, ప్రజాస్వామ్య ఐక్యత అనే ప్రధాన లక్ష్యం, దృక్పథాలకు వ్యతిరేకంగా సి.పి.ఐ(యం) మొత్తం రాజకీయ, ఎత్తుగడల విధానం ఎక్కుపెట్టబడింది. కార్మికవర్గ నాయకత్వంపై నుండి క్రిందికి ఆజ్ఞాపాలనగా యేర్పడుతుందని తలచుచున్నది.

ఏకపక్ష రాజకీయ, నిర్మాణ ఆజ్ఞాపాలన అనుకొంటున్నది. తానుబలంగావున్న పశ్చిమ బెంగాలులో సి.పి.ఐ(యం) హింసా, దాడి రాజకీయాలను ప్రవేశపెట్టింది.

"పశ్చిమ బెంగాలులో 1971 మధ్యంతర ఎన్నికలలో కమ్యూనిస్టులు చేయనంతటి హింసా, భయోత్పాదాలను సి.పి.ఐ(యం) చేబట్టింది. నిర్మొఖమాటంగా నిజం చెప్పాలంటే

---

*1. డాక్యుమెంట్సు ఆఫ్ ది 9వ కాంగ్రెస్ ఆఫ్ ది కమ్యూనిస్టుపార్టీ ఆఫ్ ధి సి.పి.ఐ పొలిటికల్ రిపోర్టు సి.పి.ఐ పబ్లికేషన్ (1971) పే. 65.*

ఎన్నికలలో గెలుచుటకు ఫాశిస్టు విధానాలన్నిటిని అవలంభించింది. హింసా, భయోత్పాదం సి.పి.ఐ(యం) సైద్ధాంతిక, నిర్మాణ రూపాలలో భాగమైంది. రాజకీయ పంధాగా పార్టీ బలంగా వున్న ప్రాంతాలలో అనుసరించబడింది. పశ్చిమబెంగాలులో సమాజ శతృవులు, విద్రోహులందరి విస్తృతమద్దతు సమకూర్చుకొని వినియోగించుకొనగలది అయింది.

"మార్క్సిజం-లెనినిజంలపై విశ్వాసాన్ని ప్రకటించినప్పటికి సి.పి.ఐ(యం) కమ్యూనిస్టుపార్టీ నైజాన్ని, ప్రాణప్రదమైన కొన్ని అంశాలను కోల్పోయింది. అది మరింతగా పెటీ బూర్జువా అతివాద పార్టీల లక్షణాలను కొన్నింటిని సంతరించుకొంటూ ట్రాట్స్కీయిజం వైపు పయనం ప్రారంభించింది. ఈసైద్ధాంతిక, రాజకీయ, ఎత్తుగడల పంధా కారణంగానే సి.పి.ఐ(యం) నాయకత్వం సి.పి.ఐ-సి.పి.ఐ(యం)ల మధ్యగల శతృ,ద్వేష. భావాలను అధిగమించలేక పోతున్నది. కనీసం కార్మిక, కర్షక, బడుగువర్గాల ప్రజల సమస్యలపై వామపక్ష కార్యాచరణసాధ్యంకాకుండా పోతున్నది.[1]

"వామపక్ష, కమ్యూనిస్టు ఐక్యతా దృక్పధంతోనే సి.పి.ఐ సైద్ధాంతిక, రాజకీయ పోరాటాన్ని సి.పి.ఐ(యం) పై సాగించింది. లేనిచో వామపక్ష, కమ్యూనిస్టు ఉద్యమం, వామపక్ష శక్తులనుండి కేరళ, పశ్చిమ బెంగాలులతోపాటు దేశంలో యింతగా దూరమయ్యేది కాదు. జాతీయ స్థాయిలో నేడు సి.పి.ఐ(యం) పంధా దేశంలోని అన్ని వామపక్ష శక్తుల వ్యతిరేకతను మాత్రమే పొందగలిగింది. వామపక్ష, ప్రజాస్వామ్యశక్తుల ఐక్యతా నిర్మాణ పోరాటాలలో భాగంగానే సిద్దాంతపోరాటాన్ని సాగించుట ద్వారానే, కమ్యూనిస్టుల ఐక్యతా లక్ష్యాన్ని చేరగలము.[2]

మనదేశంలో ప్రధానంగా వామపక్ష, ప్రజాస్వామ్య ఐక్యతా వ్యతిరేక సి.పి.ఐ(యం) నగ్న వొంటెత్తు సెక్టేరియన్ విధానాన్ని సైద్ధాంతిక, రాజకీయ పోరాటంలో వోడించుట ద్వారానే మనదేశంలో కమ్యూనిస్టు ఐక్యత సమస్య విజయవంతంగా పరిష్కారమవుతుంది. కమ్యూనిస్టు ఐక్యత యేర్పడుతుంది.

**సి.పి.ఐ(యం) కార్యక్రమంపై సి.పి.ఐ విమర్శ.**

మొదటి సి.పి.ఐ(యం) 7వ, కాంగ్రెసు వొక కార్యక్రమాన్ని రూపొందించింది. భారత విప్లవదశను జనతా ప్రజాస్వామ్య విప్లవంగా నిర్వచించి, సాధనంగా జనతా ప్రజాస్వామ్య సంఘటన నిర్మాణ ప్రతిపాదన చేసింది. సి.పి.ఐ చీలిక అనంతరం 7వ, కాంగ్రెసు మరో కార్యక్రమాన్ని ఆమోదించింది. అది భారతవిప్లవదశను జాతీయ ప్రజాస్వామ్య విప్లవంగా నిర్వచించి, సాధనంగా జాతీయ ప్రజాస్వామ్య సంఘటన నిర్మాణాన్ని ప్రతిపాదించింది. ఈ రెండు సైద్ధాంతిక దృక్పధాలు, అవగాహనలు, ఆచరణలపై వివేచన 1950 దశకంలోనే ప్రారంభమైనా, చీలికకు దారి తీసినా, 1970-80లలో తీవ్రసైద్ధాంతిక బహిరంగ పోరాటాలు కొనసాగినవి.

---

1. *డాక్యుమెంట్సు ఆఫ్ ది 9త్ కాంగ్రెస్ ఆఫ్ ది కమ్యూనిస్టుపార్టీ ఆఫ్ ది సి.పి.ఐ పొలిటికల్ రిపోర్టు సి.పి.ఐ పబ్లికేషన్ (1971) పే. 66.*
2. *డాక్యుమెంట్సు ఆఫ్ ది 9త్ కాంగ్రెస్ ఆఫ్ ది కమ్యూనిస్టుపార్టీ ఆఫ్ ది సి.పి.ఐ పొలిటికల్ రిపోర్టు సి.పి.ఐ పబ్లికేషన్ (1971) పే. 67.*

ఈ రెండు కార్యక్రమాల భేదాలను, భిన్నాంశాలను అర్థం చేసుకొనుటకు, మొదట వాటి సారూప్యాంశాలను అవగాహనచేసుకొంటే తేలిక అగుతుంది. భారతవిప్లవ నేటి దశ ప్రధానంగా సోషలిస్టు విప్లవదశ కాదని రెండు దృక్పధాలు అంగీకరిస్తు, దాని ముందుదశ అంటున్నాయి.భారత సమాజం పెట్టుబడిదారి విధాన పూర్వదశను "కప్పదాటు"గా దాటజాలదని కూడ అంగీకరిస్తున్నవి.

విప్లవ విజయానికి కార్మిక, కర్షక ఐక్యత ప్రధానశక్తియని, అవసరమని వొకే నిర్ధారణకు రెండు దృక్పధాలు వచ్చాయి. సి.పి.ఐ చెప్పే జాతీయ ప్రజాస్వామ్య సంఘటన పోరాట క్రమంలో ఉన్నత దశయైన జనతా ప్రజాస్వామ్య సంఘటనగా పరిణామమొంది ప్రజాస్వామ్య విప్లవకర్తవ్యాలను పరిపూర్తి చేస్తుందనే అవగాహన "సంఘటన" సృష్టించిన గందరగోళము పోయి, స్పష్టత చేకూరుతుంది. వాటి భిన్నత్వంలోని ఏకత్వం అర్ధమౌతుంది.

నేటి విప్లవదశలో భారతగుత్తపెట్టుబడిదారేతర జాతీయ బూర్జువా వర్గానికి జనతా ప్రజాస్వామ్య సంఘటనలో స్థానముంటుందని సి.పి.ఐ(యం) కార్యక్రమం స్పష్టం చేసింది. సి.పి.ఐ కార్యక్రమము భారత బూర్జువావర్గంలోని యీ శక్తులకు జాతీయ ప్రజాస్వామ్య సంఘటనలో భాగస్వామ్యావకాశాలున్నవని స్పష్టం చేసింది.[1] విప్లవ పోరాటాలు సామ్రాజ్యవాదం, భారతగుత్తపెట్టుబడిదారి వర్గాలు, శేష ఫ్యూడలు భూస్వామ్య శక్తులు మూడు ప్రధాన శతృవులు కాన వారిపై కేంద్రీకరించాలనే అంశంపైనా రెండు దృక్పధాలలో భిన్నాభిప్రాయంలేదు.

కార్యక్రమాలలోని సారూప్యతాంశాలు యిక్కడ ముగుస్తాయి. మిగతా అన్నిమౌలిక అవగాహనలు భిన్నంగావున్నవి. సి.పి.ఐ(యం) కార్యక్రమము జనతా ప్రజాస్వామ్యసంఘటన తప్పనిసరిగా, కార్మికవర్గ నాయకత్వంలో, మరోమాటలలో సి.పి.ఐ(యం) నాయకత్వం ఆమోదించుట ఐక్యతను పెంపొందిస్తుందని స్పష్టం చేసింది. జనతా ప్రజాస్వామ్య విప్లవానికి సాధనమైన జనతా ప్రజాస్వామ్య సంఘటనలోని వర్గాలపొందిక సహజంగా కార్మికవర్గనాయకత్వం లేక సి.పి.ఐ(యం) నాయకత్వానికి తోడ్పడదు. "భారతదేశంలో నిర్ధిష్ట పరిస్థితి కార్మికవర్గనాయకత్వనినాదాన్ని సమర్ధిస్తుందా?" అని భవానిసేన్ ప్రశ్నించి, యిలా వివరించారు.

"సి.పి.ఐ. కార్యక్రమం ప్రకారం జాతీయప్రజాస్వామ్య సంఘటన పూర్తిగా బూర్జువావర్గ నాయకత్వంలో వుండదు. అదేవిధంగా కార్మికవర్గం వొక్కటే నాయకుడుగానూ వుండదు. దానికి "ధృఢమైన సామ్రాజ్యవాదవ్యతిరేక, ఫ్యూడలు వ్యతిరేక, గుత్తపెట్టుబడిదారి వ్యతిరేకశక్తులు" నాయకత్వము వహించుతవి. అంటే జాతీయ ప్రజాస్వామిక సంఘటన ప్రధమంలో కార్మికవర్గం, కార్మికవర్గేతర కొన్నివర్గాల సంయుక్త నాయకత్వంలో వుంటుంది, క్రమేణా విప్లవపోరాటాల క్రమంలో అనుభవాలద్వారా కార్మికవర్గనాయకత్వంగా రూపొందుతుంది. ఈ అవగాహననే సి.పి.ఐ(యం) సంస్కరణవాదంగా నిందా ప్రచారం చేస్తున్నది.

---

1. *భవానిసేన్ (1971) ది ట్రూత్ ఎబౌట్ సి.పి.యం.ఎ క్రిటిక్ ఆఫ్ ది ఐడియలాజికల్ పొలిటికల్ లైన్ ఆఫ్ ది సి.పి.ఐ(యం). సి.పి.ఐ పబ్లికేషన్. పే.5.*

జాతీయ ప్రజాస్వామ్య లేక జనతా ప్రజాస్వామ్య లేక ఏ ఐక్యసంఘటన అయినా గుత్తపెట్టుబడిదారేతర జాతీయబూర్జువావర్గానికి స్థానమున్న యేసంఘటనలోనైనా కార్మికవర్గానికి మాత్రమే నాయకత్వముండాలని ప్రారంభంలోనే షరతువిధించి త్రోసిబుచ్చజాలము. దృఢతర సామ్రాజ్యవాద, బడాబూర్జువా, భూస్వామ్యవ్యతిరేక నాయకత్వంలో ప్రజాస్వామ్య సంఘటన సరియైన వాస్తవశాస్త్రీయపంధా, వివిధమత, ప్రాంతీయ భాషాప్రాంతాల బూర్జువావర్గాలు అభివృద్ధి చెందుతున్న, భారత సమాజాన్ని ప్రతిబింబిస్తుంది. అంతేగాక, వాస్తవంగా కార్మికవర్గంలోని కొంతభాగం బడాబూర్జువా ప్రభావంలోని నాయకత్వాల క్రింది యూనియనులలో, మరికొంత భాగం పరిశ్రమాధికారుల యాజమాన్యాలలోని సంఘాలలో సమీకృతులైవుంది. మిగిలిన కార్మికవర్గమే వివిధ వామపక్షపార్టీల నాయకత్వాలలో సమీకరించబడివున్నారు. కార్మికవర్గ అనైక్యత ప్రబలంగా వుంది. ఇదీ కార్మికవర్గ వాస్తవిక చిత్రం. అంచేత, ప్రధమంగా వర్తమాన భారతదేశ పరిస్థితులలో సామ్రాజ్యవాద, గుత్తపెట్టుబడిదారీ, ఫ్యూడలు వ్యతిరేకశక్తులన్నిటిని ఐక్యపరచవలసిననేటి చారిత్రికదశలోని వర్గశక్తుల బలాబలాల తూకములో, వాస్తవికావసరాలన్నిటికి ప్రజాస్వామ్యసంఘటన తగినవిధంగావుంది. ద్వితీయంగా పోరాటాలక్రమంలోనే కార్మికవర్గనాయకత్వం రూపొంది, రాజకీయ నాయకత్వంగా అభివృద్ధి చెందుతుంది. విప్లవపోరాటాల అనుభవాల ద్వారానే వర్గ చైతన్యం పొంది, తనకొరకు తాను వర్గంగా నాయకత్వపాత్రను చేరుకొనగలుగుతుంది. అంతేగాని రూళ్ళకర్రసూత్రంగా కార్మికవర్గపార్టీ షరతుగా విధించుటవలన కాదు. అట్టి షరతు ఐక్యసంఘటన విచ్ఛిన్నానికే దారితీస్తుంది. భారతకమ్యూనిస్టు ఉద్యమానికి యిట్టి అనుభవాల కొరతలేదు. పాఠాలు నేర్చుకొనే కొరతే బాగావుంది.

సి.పి.ఐ(యం) చెప్పే కార్మికవర్గం ఏకైకనాయకత్వంలోని జనతా ప్రజాస్వామ్యసంఘటన బూర్జువావర్గాల మొత్తానికి వ్యతిరేకంగా కార్మిక, కర్షకవర్గాల ప్రజాస్వామ్య విప్లవదశ-సోషలిస్టు విప్లవదశల సంలీనంగా, 1947లోని సిద్ధాంతీకరణకు చేరువగా వుండుట, నాటి అతివాద వక్రీకరణలనుండి పూర్తిగా బయటపడలేకపోవుటకు ప్రతిబింబంగావుంది. కాని బూర్జువావర్గంలోని గుత్తేతర బూర్జువా వర్గాలకు జనతా ప్రజాస్వామ్య సంఘటనలో స్థానముంటుందని స్పష్టంచేయుట, సమగ్రంగా, పరిశీలించిన అతివాద అవకాశవాదం, అతివాద వక్రీకరణల ప్రభావాలపాత్ర, ఒకేనాణెపు ద్వైపార్శ్వాలుగా కన్పడుటలో వింతలేదు.

కాని సి.పి.ఐ(యం) దీనిని సోషలిస్టు విప్లవదశ అనుటలేదు. సోషలిస్టు విప్లవ పూర్వదశ ప్రజాస్వామ్య విప్లవమని అంటూనే జనతా ప్రజాస్వామ్య లేక నూతన ప్రజాస్వామ్య విప్లవదశయని, జనతా ప్రజాస్వామ్య సంఘటన ద్వారానే సాధ్యమంటున్నది. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానుభవాలనుండి చేసిన నిర్ధారణలు, వాస్తవంగా జనతా ప్రజాస్వామ్య విప్లవాల ఫలితంగా యేర్పడిన ప్రభుత్వాలు, జనతా ప్రజాస్వామ్యం కార్మికవర్గనియంతృత్వపు వొకరూపమని తెలుపుతున్నది. నవంబరు 1971లో సి.పి.ఐ(యం) కేంద్రకమిటి ప్రభుత్వరాజ్యాంగాన్ని చక్కని బూర్జువా ప్రజాస్వామ్యనైజాన్ని కలిగివుందని చెప్తూతూ, పెట్టుబడిదారేతరపంధాను త్రోసి బుచ్చింది. అదే కాలంలో కార్మికవర్గనాయకత్వాన్ని నొక్కిచెప్తూతుండుటతో "గందరగోళపు" పరిస్థితికి కారణభూతమగుతున్నది.

## జాతీయ కాంగ్రెసులో చీలికలు.

సి.పి.ఐ(యం) నాయకత్వానికి భారతవిప్లవదశలో గల అస్పష్ట అవగాహనలే జాతీయ పాలకవర్గ పార్టీలు, కాంగ్రెసులో వచ్చిన చీలికల ఫలితంగా రాజకీయ పరిణామాలపై వాటి ప్రభావాల అంచెనాలలోనూ కొనసాగాయి. భారత జాతీయపాలక పార్టీయైన కాంగ్రెసు చీలిపోయినా సి.పి.ఐ(యం) కార్యక్రమంలో ప్రభావం చూపలేదు. భారత ప్రభుత్వం, రాజ్యం, బూర్జువా, భూస్వామ్యప్రభుత్వంగా, బడాబూర్జువా నాయకత్వంలో వున్న దాని గానే చెప్పారు. ఈ నిర్వచనం బూర్జువావర్గం మొత్తంగా జనతా ప్రజాస్వామిక విప్లవానికి వ్యతిరేకిగా వ్యాఖానించే అవకాశం వుంది. బూర్జువావర్గంలో ఏవిధమైన వైరుధ్యాన్ని నిర్వచనం ప్రతిబింబించుటలేదు. మొత్తం బూర్జువావర్గంతో, ఫ్యూడలు భూస్వాములతో బడాబూర్జువా నాయకత్వ కూటమి నేర్పరచుట, వారు సామ్రాజ్యవాదంతో మిలాఖత్ అగుట జాతీయ బూర్జువావర్గంలో సహజంగా గల సామ్రాజ్యవాదంతో పోరాటం రాజీల ద్వదరాజకీయం, వైరుధ్యమై చీలికలకు దారి తీయదా? కాంగ్రెసులో యేర్పడిన చీలికకు వర్గవిశ్లేషణ యిచ్చేవివరణ యేమిటి?

స్వాతంత్ర్యానంతర పరిణామాలు సి.పి.ఐ(యం) కార్యక్రమంలోని అవగాహనలను సమర్థించుటలేదు. ఫ్యూడలు భూస్వాములతో బూర్జువావర్గం మొత్తంగా కూటమిలో వున్న రాజ్యం లేక ప్రభుత్వం బూర్జువా భూస్వామ్య ప్రభుత్వం అయిన సంస్థానాలను, జమిందారీలను, జాగిర్దారీలను, ఫ్యూడలిజాన్ని రద్దుచేసి భారత రిపబ్లిక్‌లో ఎందుకు కలిపింది? ఫ్యూడలిజాన్ని రద్దు చేయుటకు చట్టరీత్యా గరిష్ట భూపరిమితులను నిర్ణయించి భూస్వాములపై ఎలా దాడిచేసింది? పెట్టుబడిదారి ధనిక రైతాంగాన్ని రూపొందించి, పాలకవర్గాల భూమికను విస్తృతం చేసి బలపరచుకొనుటకు చేసినా, ఫ్యూడలిజంపై హృదయపూర్వకంగా చేసిన, చేయకపోయినా దాడి కాకపోదు. బూర్జువా ప్రభుత్వం విప్లవాత్మక భూసంస్కరణలను ఫ్యూడలిజాన్ని రద్దు చేయుట చేస్తుందని ఆశించలేము. అదేవిధంగాపారిశ్రామిక రంగంలో భారతబడా పెట్టుబడిదారి వర్గాలు అత్యధిక పెట్టుబడి పెట్టినా భారీ పరిశ్రమలలో పూర్తి ఉత్పత్తిస్థాయిని చేరుటకు ఎక్కువకాలం పట్టుట, అత్యధికలాభాలు వుండని కారణంగా పవరు, స్టీలు, ఎరువులు, భారీయంత్ర పరిశ్రమలు, రవాణా, రైల్వే, నావికా, విమాన సర్వీసులను వారికోరిక మేరకే ప్రభుత్వ, పబ్లిక్ రంగాలలో నెలకొల్పుటజరిగింది. ఆపరిశ్రమలే మరోవైపున గుత్తపెట్టుబడిదారి వర్గాల అదుపులేని పెరుగుదలను పరిమితులలో ఉంచుటకు తోడ్పడినవి.

సి.పి.ఐ(యం) కార్యక్రమంలో వైరుధ్య అంశాలను సమన్వయం చేయుటలో విఫలమై 106 శెక్షన్ ఆచరణలో నామమాత్రం చేసింది. నిజానికి ఆచరణలో తన ఎత్తుగడలను శెక్షన్ 16కే ప్రాధాన్యతనిచ్చి అమలు చేస్తున్నది. అయితే, బూర్జువా, భూస్వామ్యవర్గాలలోని వొక శెక్షను మితవాద అభివృద్ధి నిరోధకులు ప్రభుత్వం నుండి తొలగించబడ్డారు. అధికారమంతా జాతీయబూర్జువావర్గంలోని వొక శెక్షన్ చేతిలోనికి తీసుకొన్నది. బడాబూర్జువావర్గం రాజ్యాధికారాన్ని సంపూర్తిగా జాతీయ బూర్జువావర్గంలోని వొకశెక్షన్ చేతులలోనే వుంచుకొంటుందని, మరోశెక్షను ప్రతిపక్షంగా వుంటుందన్న అవగాహనకు

విరుద్ధంగా జరిగింది. వాస్తవజీవితంలో సి.పి.ఐ.(యం) అవగాహనకు విరుద్ధంగా జరిగింది. అయినా తన కార్యక్రమంలో ప్రభుత్వం బడాబూర్జువావర్గనాయకత్వంలోని బూర్జువా, భూస్వామ్యప్రభుత్వంగానే కొనసాగుతున్నదనే చెప్పుతున్నది.

కాంగ్రెసులో వచ్చిన చీలికను, వాస్తవపరిస్థితిని సి.పి.ఐ(యం) అంచెనావేయుటలో విఫలమైంది. ఫిబ్రవరి 1970లో సి.పి.ఐ(యం) ఆమోదించిన రాజకీయ తీర్మానం, పెట్టుబడిదారి విధానంలోని సంక్షోభం ఫలితంగా ఈ చీలిక ఏర్పడిందని చెప్పింది. పెట్టుబడిదారీ విధాన సంక్షోభాన్ని, కాంగ్రెసులో వచ్చిన చీలికకు సంక్షోభానికి గల వాస్తవ సంబంధాని అధ్యయనం చేయసాహసించలేక పోయింది. జాతీయ బూర్జువావర్గం-భూస్వామ్యవర్గాలమధ్యగల సఖ్యతోబీటలుపడ్డాయా? బడాబూర్జువా నాయకత్వానికి ప్రమాదమేర్పడిందా? సి.పి.ఐ(యం) బీటలూ, ప్రమాదం యేదీ యేర్పడలేదని అంటున్నది. జాతీయబూర్జువా వర్గంలోని చీలికలకు కాంగ్రెసులోని చీలికలు ప్రతిబించాలని సి.పి.ఐ చెప్పుటను సి.పి.ఐ(యం) ఫిబ్రవరి 1970 తీర్మానం తీవ్రంగా విమర్శించింది. జాతీయ బూర్జువావర్గ ఐక్యత అలాగే వుందిని, కాంగ్రెసులోని రెండు వర్గాలు రెండు ఎత్తుగడల పంధాలకు ప్రాతినిధ్యం వహించి, విప్లవశక్తుల నెదుర్కొనుటకు ఉద్దేశించబడినవిగా వివరించింది.

పాలకవర్గాలలోని "సిండికేటు కాంగ్రెసు" ప్రజాసామాన్యంపై నేరుగా దాడి చేయాలని అంటున్నది. "ఇండికేటు కాంగ్రెసు" ప్రజలను తిరిగి బూర్జువా-భూస్వామ్య పక్షంవైపు ఆకర్షించాలని, అందుకు ప్రజలకు రాయితీలను యిస్తున్నది. కాని ప్రభుత్వం "బడా బూర్జువా నాయకత్వంలోని బూర్జువా భూస్వామ్య ప్రభుత్వంగానే వుంది." అదే వర్గం ఐక్యతతో రెండు పరస్పర విరుద్ధ ఎత్తుగడల పంధాలను రెండు ప్రత్యేక పార్టీలద్వారా అంటే సిండికేటు కాంగ్రెసు, అధికార "ఇండికేటు కాంగ్రెసుల ద్వారా అమలు చేస్తున్నది. ఈవిధమైన తాత్వికకసరత్తులో కూడ తన కార్యక్రమంలోని 106 శెక్షన్‌ను అభివృద్ధి చెందుతున్న రాజకీయ పరిణామాలను ఎలా వివరించుతుందో చెప్పజాలకపోతున్నది. ఏవిధంగా జాతీయబూర్జువావర్గంలోని హెకశెక్షన్‌ను బడాబూర్జువా నాయకత్వాన్నుండి కార్మికవర్గ యేకైక నాయకత్వం క్రిందికి, అందులో పెట్టుబడిదారి వర్గ తీవ్ర సంక్షోభంలో బడాబూర్జువా యేకైక నాయకత్వంలో కలసికట్టుగా వుండునపుడు, కార్మికవర్గ యేకైక నాయకత్వం క్రిందికి ఎలా వచ్చేది. సి.పి.ఐ(యం) వివరించలేకపోతున్నది.[1]

సి.పి.ఐ(యం) ఫిబ్రవరి 1970లో ఆమోదించిన రాజకీయ తీర్మానం కాంగ్రెసులో చీలిక అనంతరం, పాలకవర్గ కాంగ్రెసు రాజభరణాలను రద్దు చేస్తూ, 14బ్యాంకులను జాతీయం చేస్తూ, పెద్ద ఆస్తులకు రక్షణ కల్పించుతున్న రాజ్యాంగ చట్టానికి, సవరణ బిల్లులను ఆమోదింపచేసిందని పేర్కొన్నది. అంటే సి.పి.ఐ(యం) కేంద్రకమిటి 1967 ఏప్రిల్‌లో ఆమోదించిన రాజకీయ తీర్మానం కాంగ్రెసులోని వైరుధ్యాలను తక్కువగా అంచనా చేసిందని 1970 ఫిబ్రవరిలో ఆమోదించిన తీర్మానం అంగీకరించింది. అయినా, తప్పును సరిచేసుకొని సరియైన నిర్ధారణ చేయసాహసించలేదు. జాతీయ బూర్జువావర్గం అదేవిధంగా

1. *భవానిసేన్ (1971) ది ట్రూత్ ఎబౌట్ సి.పి.యం.ఎ క్రిటిక్ ఆఫ్ ది ఐడియలాజికల్ పొలిటికల్ లైన్ ఆఫ్ ది సి.పి.ఐ(యం), సి.పి.ఐ పబ్లికేషన్. పే. 5.*

ఏకశిలగా వుందని, ప్రభుత్వం బూర్జువా-భూస్వామ్యవర్గాల కూటమి ప్రభుత్వంగా వుందని, బడాబూర్జువా నాయకత్వంలోవుందనే అవగాహన కొనసాగిస్తున్నది. అంటే రాజ్యాంగ సవరణలు, బ్యాంకుల జాతీయం చేయుట, నవాబులు, రాజులభరణాలు రద్దు, ఇండో-సోవియట్ సంధి యేవీ పరిగణలోనికి తీసుకొనవలసిన ఆర్థిక, రాజకీయాంశాలుగ సి.పి.ఐ(యం) దృష్టిలోనికి రాలేదు.

సి.పి.ఐ(యం) కార్మికులు, పేదరైతాంగాన్ని, గ్రామీణ, నగర బడుగువర్గాలను మొత్తం బూర్జువావర్గానికి వ్యతిరేకంగా కార్మికవర్గ నాయకత్వం క్రింద ఐక్యపరచేవర్గ సహకార కూటమిలో ధనికరైతును కూడ మినహాయించిన కారణం వారు జాతీయ బూర్జువా వర్గంలోని వారైనందున జరిగింది. అంటే అర్థం జాతీయ బూర్జువావర్గంలోని వారి సామ్రాజ్యవాద వ్యతిరేక పాత్రను త్రోసిబుచ్చుట యేగుతుంది. భారతదేశంలోని చారిత్రిక, నిర్దిష్ట, వాస్తవిక పరిస్థితిని పరిగణలోనికి తీసుకొనకుండా సోషలిస్టు విప్లవవ్యూహం అగుతుంది. ఇది అతివాద వక్రీకరణ పరాకాష్ట తప్ప మరొకటి కాదు.

ఈ పంథా మౌలికంగా సి.పి.ఐ రాజకీయ పంథాకు, ఎత్తుగడల ఆచరణకు, ప్రపంచంలోని అత్యధిక కమ్యూనిస్టుపార్టీల రాజకీయ అవగాహనలకు, ఎత్తుగడల పంథాకు భిన్నమైనదే కాక వ్యతిరేకమైనది.

“ ఇదే సి.పి.ఐ(యం) పంథా అయినట్లయితే నక్సలైట్లు, ట్రాట్క్స్టల్లకు వీరికి గల రాజకీయభేదాభిప్రాయాలను యేవిధంగా వివరించగలదు. ప్రజాస్వామ్యవిప్లవంలో శ్రమజీవులు మాత్రమేగల “టాయిలర్స్ ఫ్రంటు” వ్యూహం ట్రాట్స్కీవాదులు దృక్పథం, దానినే నక్సలైట్లు అరువు తెచ్చుకొన్నారు. నక్సలైట్లుతో సి.పి.ఐ(యం) కు గల భిన్నాభిప్రాయాలు వొక్క పోరాట రూపాలలో మాత్రమేకాని, రాజకీయ సైద్ధాంతిక ప్రాతిపదికలేమీ లేవు. వాస్తవానికి వామపక్ష ఉద్యమంలోనికి వ్యక్తిగత హింసావాదాన్ని స్మగులు చేసింది, ఆచరణలో దానిని పోరాటరూపంగా చేసిందీ సి.పి.ఐ(యం), అయితే నక్సలైట్లు దానిని హైజాక్ చేసి, వారి తల తన్ని వారిని మించి పోయారనేది వేరే విషయము. అంతేగాక,వారు కార్యక్రమాలు, తీర్మానాలలో ఆమోదించిన దానికి, ఆచరణలో పెట్టిన దానికి “హస్తిమసి కాంతర” తేడా వుంది.[1] సి.పి.ఐ(యం) ఘటనల ప్రవాహాన్ని అనుసరించుతున్నది. దాని లక్ష్యం కాంగ్రెసును అధికారాన్నుండి తొలగించుట, అది కలుగజేసే భ్రమలను తొలగించుట, అందుకు అన్ని పోరాట రూపాలను చేబట్టింది.

## సి.పి.ఐ(యం) పెక్టేరియనిజం విచ్ఛిన్నతా మార్గం.

సి.పి.ఐ(యం) కార్యక్రమము జనతా ప్రజాస్వామ్య విప్లవాన్ని” అతివాద దృక్కోణంలో అర్థం చేసుకొని రూపొందించబడినందున, దాని నుండే విచ్ఛిన్నకర ఫలితాలు, చర్యలనుండి వద్భవించాయి. కమ్యూనిస్టుపార్టీని చీల్చిన తరువాత, దేశంలోని అన్ని ప్రజాసంఘాలు చీల్చబడినవి. ఈచీలికలకు సి.పి.ఐ కూడ సమాన భాధ్యతే వహించవలసివుంటుంది. అఖిలభారత ట్రేడు యూనియన్ కాంగ్రెసు, అఖిలభారతకిసాన్ సభలు యీవిచ్ఛిన్న చర్యలకు

---

*1. భవానిసేన్ (1971) ది ట్రూత్ ఎబౌట్ సి.పి. యం.ఎ క్రిటిక్ ఆఫ్ ది ఐడియలాజికల్ పొలిటికల్ లైన్ ఆఫ్ ది సి.పి.ఐ(యం), సి.పి.ఐ పబ్లికేషన్. పే. 12.*

ఘోరంగా బలయ్యాయి. ఇవే గాక యువజన, విద్యార్థి, మహిళ, ఉపాధ్యాయ తదితర ప్రజాసంఘాలు చీల్చబడి అనైక్యతకు నిలయాలయ్యాయి.

ఇంతకు ముందెన్నడు లేని అనుకూలపరిస్థితులు 1970లో కార్మికవర్గానికి యేర్పడినవి. కమ్యూనిస్టుపార్టీ వొకవైపున చీలికలు యేర్పడి కార్మికవర్గంలో ఐక్యత చిన్నాభిన్నమై, ఐక్యప్రచారోద్యమాన్ని యేర్పచినా, సి.పి.ఐ(యం) మరో కార్మికసంస్థ "సిటు"ను యేర్పరచుటకు తోడ్పడిందే కాని కార్మికవర్గం ఐక్యతను మరింతగా కోల్పోయింది. ట్రేడు యూనియన్ కాంగ్రెసు చీలికకు ముందే, అఖిలభారతకిసాన్ సభలో చీలిక వచ్చింది.

సి.పి.ఐ(యం) అనుసరించిన విధానాలు, ఎత్తుగడలు, కార్యాచరణ ఐక్యసంఘటనలను, ఐక్యసంఘటన ప్రభుత్వాలను కూలదోయబడు పరిస్థితులను రూపొందుటయేగాక, మంత్రివర్గాలు పడిపోవుట, ప్రజాస్వామ్య వుద్యమ హృదయాలనుండి దూరమగుట జరిగింది. మంత్రివర్గాలలో కీలకమైన స్థానాలలో వున్న అవకాశాన్ని, ప్రభుత్వపాలనా యంత్రాంగాన్ని వినియోగించుకొని ఐక్యసంఘటనలోని యితర పార్టీలను ముఖ్యస్థానాల నుండి తొలగించునట్లు చేస్తూ, సి.పి.ఐ(యం) ప్రయోజనాల నిమిత్తం సంకుచిత దృష్టితో, యితర పార్టీల నాయకత్వంలోని ప్రజాసంబంధాలను, బలాన్ని వుపయోగించి, ఆక్రమించే ప్రయత్నాలను ముమ్మరంగా చేసింది. ఈ ప్రయత్నాలలో హింసా, దౌర్జన్యపద్ధతులను పార్టీ, ప్రభుత్వయంత్రాంగం పరోక్ష సహాయంతో కూడ నిర్వహించింది.[1]

సి.పి.ఐ(యం) విచ్ఛిన్నకర విధానం, దాని ఏకపక్ష నియంతృత్వం అనగా హెజిమొనీని, అంటే వామపక్ష ఐక్యతావసరాలను, పెట్టుబడిదారి, భూస్వామ్యవ్యతిరేకపోరాట అవసరాలను పరిగణలోనికి తీసుకొనకుండా, ఇతర పార్టీలపై పెత్తనం చెలాయించే విధానాన్ని ఆచరణలో పెట్టుట జరిగింది.

# 8

# కేరళ ఐక్యసంఘటనలో కమ్యూనిస్టుల సైద్ధాంతిక పోరాటం

కా॥ సుందరయ్య సి.పి.ఐ(యం) జనరల్‌శెక్రటరీ 1969లో సెలెక్టెడ్ డాక్యుమెంట్సును ప్రకటించుతు ఉపోద్ఘాతంలో "జనతా ప్రజాస్వామ్య సంఘటన కార్మికవర్గ నాయకత్వంలో యేర్పడినపుడు మాత్రమే తన కర్తవ్యాలను నెరవేర్చగలుగుతుంది. వ్యూహాత్మక జనతా ప్రజాస్వామ్యసంఘటన చివరకు సమర్థవంతమైన స్వరూపంలో యేర్పడేముందు వివిధ వర్గాలు, పార్టీలు, గ్రూపులు కాలక్రమంలో ఐక్యసంఘటను వివిధ రూపాలలో కలుస్తూ సరియైన మార్గాన్నుండి కుడి, ఎడమలకు వైదొలగుతూ, పరిస్థితుల ప్రభావంలో వొత్తిడిలకు లోనై తిరిగి సంఘటనలోనికి వస్తూ వుంటారు. కారణం యీదోపిడి ప్రభుత్వాన్ని తొలగించి, జనతా ప్రజాస్వామ్య సంఘటనా ప్రభుత్వాన్ని కార్మికవర్గనాయకత్వంలో ఐక్యప్రజాపోరాటాలద్వారా మాత్రమే యేర్పాటు చేయుట సాధ్యమన్నారు.

"కేరళలో ఐక్యసంఘటనా ప్రభుత్వం కూటిపోవుటకు మితవాద కమ్యూనిస్టులు చేసిన ద్రోహం ప్రజలందరకు తెలియగలందులకు'' డాక్యుమెంట్సును 130 పేజిల వివిధ పత్రాలను ప్రకటించుతున్నామన్నారు.

భారత సోషలిస్టుపార్టీ ప్రతినిధిగా మంత్రివర్గంలో వున్న శ్రీకున్నూపై అతని సహచరుడు శ్రీవిల్సన్ చేసిన ఆరోపణలలో అంశాలు విచారించవలసినదిగా వున్నవిగా తలచి ముఖ్యమంత్రి నంబూద్రిపాద్ కేసును న్యాయవ్యవస్థ పరిశీలన, విచారణలకు ఆజ్ఞలు జారిచేసినప్పటినుండి, "గత రెండు సంవత్సరాలుగ మితవాద కమ్యూనిస్టులు క్రమేణా ఐక్యసంఘటన ప్రభుత్వానికి ద్రోహం చేసి పడగొట్టారు"[1]

"శ్రీవెల్లింగ్టన్ లంచగొండితనాన్ని కప్పిపెట్టుకొనుటకై సోషలిస్టులైన శ్రీకున్నూ కురుప్‌లపై, సి.పి.ఐ మంత్రులైన శ్రీథామస్, గోవిందనాయర్‌లపై తప్పుడు కేసులు బనాయించామని, నంబూద్రిపాద్, సి.పి.ఐ(యం)లపై ప్రచారం చేసారు. ఇందుకు బూర్జువా పత్రికలు వారికి సహజంగానే తోడ్పడినవి. సాక్ష్యాధారాలను పరిశీలించి ప్రిమాఫేస్ కేసు వుందనే శ్రీ కున్నూ కేసును విచారణకు న్యాయస్థానానికి పంపబడిందని ఉపోద్ఘాతంలోనే సమర్థించుకొన్నారు.

సోషలిస్టుపార్టీతో కూటమిగావున్న సి.పి.ఐ నంబూద్రిపాద్‌కు వ్యతిరేకంగా ప్రచారం ప్రారంభించారు. " భవిష్యత్తులో వెల్లిగ్టన్‌పైగాని, మరెవ్వరిపైనగాని వచ్చే ఫిర్యాదులు ఐక్యసంఘటన సబ్‌కమిటి ప్రాథమిక పరిశీలన పిదప హైకోర్టు స్థాయి జడ్జిచే పరిశీలన

---

*1. రైట్ కమ్యూనిస్టు బిట్రేయల్ ఆఫ్ కేరళ యు.యఫ్. అండ్ గవర్నమెంటు. ఎ. కలెక్షన్ ఆఫ్ డాక్యుమెంట్సు (1969), సి.పి.ఐ(యం) పబ్లికేషన్. పే.(I) - (II)*

తరువాత న్యాయవిచారణకు పంపబడుతుందనే ప్రతిపాదనను సి.పి.ఐ తిరస్కరించింది.

"అంచేతనే మేము తప్పనిసరిగా ఐక్యసంఘటన సబ్‌కమిటీచే ప్రాథమిక పరిశీలన జరిపించాలని, తరువాతే బహిరంగ న్యాయవిచారణ జరగాలని కోరామని" ఉపోద్ఘాతంలో పేర్కొన్నారు. మేము ఐక్యసంఘటన సమన్వయ కమిటి సమావేశాన్ని జరుపలేదని, అంచేతనే మరో మార్గంలేక జూన్ 1969లో అసెంబ్లీలో లంచగొండి తనముపై ఎన్‌క్వైరీని లేవనెత్తవలసివచ్చిందని సి.పి.ఐ చెప్పసాగింది. అసెంబ్లీలో కాంగ్రెసు, కేరళ కాంగ్రెసుల మద్దతుపైనెగ్గారు. అభిప్రాయభేదాలను, వివాదాంశాలను ఐక్యసంఘటన సమన్వయ కమిటీలో చర్చించకుండా ప్రజలవద్దకు వాటిని తీసుకువెళ్లరాదనుటకు సి.పి.ఐ తదితరులు సిద్ధంగాలేరు. పైగా సంఘటనలోని కొందరు "మినిసంఘటన"గా యేర్పడి, యీ విషయమై సంప్రదింపులు, కాంగ్రెసు, కేరళకాంగ్రెసులతో చర్చలు జరిపారు. ఇదంతా అనారోగ్యకారణంగా జర్మన్ డెమోక్రటిక్ రిపబ్లిక్‌లో నంబూద్రిపాద్ చికిత్స పొందుచున్నప్పుడు జరుగుట అందరకు గుర్తుండేవుంటుంది.

కేరళలో 1967 జనరలు ఎన్నికలలో దేశానికంతటికి మార్గదర్శికమగురీతిలో అత్యంత విశాలప్రాతిపదికపై వామపక్ష, ప్రజాస్వామ్య పార్టీలు, తదితర పక్షాలు, పార్టీలు, గ్రూపులు ఆమోదించిన సాధారణ కనీస కార్యక్రమంపై ఆధారపడిన ఐక్యసంఘటనను రూపొందించుకొన్నాయి. ఇది భారతదేశమంతటా కాంగ్రెసేతర పార్టీల ఐక్యతా తత్వం వెల్లువగా సాగినపుడు, వామపక్ష ప్రజాస్వామ్యపక్షాల ఐక్యసంఘటన నూతన వెలుగునే ప్రసరించింది, గొప్పవిజయాలు కేరళలో లభించాయి. అసెంబ్లీలోని 132 స్థానాలలో 117 స్థానాలను, లోకసభలోని 18 స్థానాలను 17 స్థానాలను గెలుపొంది ఐక్యసంఘటన మార్గదర్శికమైంది. జాతీయ కాంగ్రెసు నామమాత్రంగా లోకసభలో 1స్థానాన్ని, అసెంబ్లీలో 9స్థానాలలో గెలుపొందిన దేశపాలకపార్టీ నేలకరించింది. ఇది యేవొక్కపార్టీ విజయంకాదు, కేరళ ప్రజలవిజయం,వామపక్షాల ఐక్యతావిజయం.

ఐక్యసంఘటనా అసెంబ్లీ పక్షనాయకుడుగా ఇ.యం.యస్. నంబూద్రిపాద్ యేకగ్రీవంగా ఎన్నుకొనబడ్డారు. 13 మంది మంత్రులతో మంత్రివర్గాన్ని యేర్పాటు చేసారు. ముఖ్యమంత్రితో కలసి 4గురు సి.పి.ఐ(యం) కు సి.పి.ఐ; యస్.యస్.పి ముస్లింలీగులవారు తలా ఇద్దరు; ఆర్.యస్.పి. కె.టి.పి.కె.యస్.పి పార్టీలకు చెందినవారు ఒక్కొక్కరు, ప్రతిపార్టీనుండి మంత్రివర్గంలోనికి తీసుకొనబడ్డారు. ఈమంత్రివర్గం పొందిక యేవొక్క రాజకీయపార్టీయైనా తన విధానాన్ని బలవంతంగా రుద్ద ప్రయత్నించితే కూలిపోయే ప్రమాదముంది. అయితే, సంఘటనకు అన్ని పక్షాల ఆమోదంపొందిన కనీసకార్యక్రమం సుముఖ అంశంగావుంది. ఆకార్యక్రమానికి కట్టుబడి, పరస్పరం అభిప్రాయాలను యిచ్చి పుచ్చుకొనే ధోరణిలో సమిష్టి నిర్ణయాలు, ఆచరణవొక్కటే మార్గంగా వుండాలనుట అందరికి స్పష్టమే. కాలచక్రం 30 మాసాలు తిరిగేటప్పటికి మంత్రులు అభిప్రాయాలను సరిచేసుకొనలేక లంచాల అపవాదులతో బహిరంగంగా దూషించుకొంటూ బజారున

పడ్డారు. సమిష్టి కనీస కార్యక్రమాన్ని అమలు చేయకుండా, స్వప్రయోజనపరులకు, భూస్వాములకు, దొంగవ్యాపారులకు రాయితీలను, సారాకాంట్రాక్టులను యిస్తున్నారనే పరస్పరం దుష్ప్రచారంతోపాటు, లంచాల సమస్యపై రాద్ధాంతం జరిగింది.

ఎన్నికల పోరాటాన్ని కాంగ్రెసు, కేరళ కాంగ్రెసులకు వ్యతిరేకంగా 1967లో అందరు కలసిపోరాడారు. కాని 1969లో సి.పి.ఐ(యం) కు వ్యతిరేకంగా నూతన కలయికలతో నూతన ఫ్రంటు యేర్పడింది. దీనిలో కాంగ్రెసు (ఆర్), కేరళ కాంగ్రెసు, సి.పి.ఐ, వెల్లిగ్టన్-వడక్కన్-కె.టి.పిలు గల కాథలిక్కుల గ్రూపులోని వొకవర్గం, సంయుక్త సోషలిస్టుపార్టీలోని వొకవర్గం నూతన ఫ్రంటులో చేరినవి. సి.పి.ఐ(యం) నాయకత్వంలోని ఫ్రంటులో కేరళ సోషలిస్టుపార్టీ, సోషలిస్టుపార్టీలోని వొకవర్గం ఉన్నవి. సి.పి.ఐ కాంగ్రెసుతో చేతులు కలిపే రాజీవిధానాన్ని సి.పి.ఐ(యం) వ్యతిరేక పూర్వసంఘటనను పునరుద్ధరించారు. వాస్తవంగా సి.పి.ఐ నాయకత్వంలోని నూతన ఫ్రంటులో చేరింది. కాంగ్రెసుకాదు, ఇందిరా కాంగ్రెసు నుండి చీలిన గ్రూపు, కాంగ్రెసు (ఆర్) కాని సి.పి.ఐ(యం) తన ప్రచారంలో సి.పి.ఐ కాంగ్రెసుతో చేతులు కలుపుతున్నదనే ముమ్మరంగా చేసారు. వాస్తవానికి సి.పి.ఐ(యం) నాయకత్వంలోని ఫ్రంటు సి.పి.ఐ నాయకత్వంలోని ఫ్రంటు, జాతీయ కాంగ్రెసు 1969 ఎన్నికలలో పోటీ చేసాయి. ఇది వామపక్షాలకు దురదృష్టకరమైనది, కారణం అవి చీలి రెండు సంఘటనలుగా, జాతీయపాలక బూర్జువావర్గ పార్టీయైన కాంగ్రెసుతో పోటీ చేయుట నాడు కేరళ ప్రత్యేక పరిస్థితులలో జరిగినా, జాతీయస్థాయిలో యీవిధమైన ఎన్నికల పోరాటాలేవొక నమూనా దశాబ్దాలు కొనసాగాయి. కమ్యూనిస్టుల వైఫల్యం ప్రధానంగా వామపక్షపోరాటాల ఐక్యతను నిర్మించజాలకపోవుటలోననేది స్పష్టం. దేశరాజకీయాలను వామపక్ష దిశగా మళ్ళించుటకు పునాది వామపక్ష ఐక్యత.

సి.పి.ఐ. నాయకత్వంలో యేర్పడిన "మినీఫ్రంటు" కేరళ కాంగ్రెసు, కాంగ్రెసుల మద్దతుతో "మెగా ఫ్రంటుగా" నంబూద్రిపాద్ నాయకత్వంలోని ఐక్యసంఘటనా ప్రభుత్వాన్ని అక్టోబరు 1969లో వోడించుటతో అది పడిపోయింది. ఈపరిణామాలు భారత ప్రజాస్వామ్య శక్తులకు తీవ్ర అసంతృప్తిని, నిరాశాహతులను చేసాయి. సి.పి.ఐ(యం) సి.పి.ఐల మధ్య సైద్ధాంతికపోరాటం "సైద్ధాంతిక సంక్షోభం"లోనికి దిగజారింది.

## మౌలిక దృక్పథాలలో విభేదాలు

ఐక్యసంఘటన సమన్వయ కమిటీలో ప్రభుత్వంలో ప్రధాన భాగస్వామ్యపార్టీలైన సి.పి.ఐ(యం) సి.పి.ఐ లతోపాటు తదితర పార్టీలు ప్రధానంగా చేబట్టే పనివిధానం, నిర్ణయాలు, ఆచరణల నుండే మార్గాలు వేరయ్యేవైఖరులు ఉద్భవించుటలో రెండు మౌలికాంశాలు ప్రాధాన్యత వహించుతాయి. 1) రాష్ట్రంలోని ఐక్యసంఘటనా ప్రభుత్వం ఇతర రాష్ట్రాలలో, కేంద్రంలో కాంగ్రెసు గుత్తాధికారాన్ని బ్రద్దలు చేయుటకు ఐక్యప్రజోద్యమాలను ప్రోత్సహించుతు, ఐక్యసంఘటనల యేర్పాటు, ప్రభుత్వాల యేర్పాటుకు

దోహదపడుతూ, వాటి రాజకీయ మద్దతును పొందే ప్రయత్నం, సంబంధాలను పెంపొందించాలి. 2) ద్వితీయంగా ఐక్యసంఘటనా భాగస్వామ్యపార్టీలు. గ్రూపులు, వ్యక్తుల మధ్య పరస్పరవిశ్వాసాన్ని పెంపొందించే సత్సంబంధాలను పెంపొందించేదిగా, పనివిధానం ప్రధానంగా వుండాలి. పని విధానంలో సెక్టేరియనిజం చోటు చేసుకొనరాదు. ఐక్యసంఘటన గౌరవాన్ని యినుమడింపజేసి, కాంగ్రెసుకు ప్రత్యామ్నాయంగా అభివృద్ధి చేయాలి.

కలకత్తాలో 30 ఏప్రిల్ 1969న జరిగిన సి.పి.ఐ జాతీయ కౌన్సిలు కాంగ్రెసుకు ప్రత్యామ్నాయాన్ని ఆమోదించిన తీర్మానంలో యిలా వివరించింది. "రాష్ట్రాలలోని ఐక్యసంఘటనలు ఆచరణలో అపఖ్యాతి పాలైన కాంగ్రెసు పాలనకు వాస్తవ ప్రత్యామ్నాయంగా స్వచ్ఛమైన పాలన, ప్రజల కోర్కెలకు, అవసరాలను, తీర్చేవిగా, సమర్థవంతం, సత్వరమే ప్రజల కష్టాలకు స్పందించి, సహాయాన్ని అందించేవిగా, ఉన్నవనరులతో పరిమితులకు లోనైన కోర్కెలను తీర్చే ప్రయత్నం చేసేవిగా, ప్రజాప్రతినిధులు మాటలు స్పందించేవిగా, వొక్కమాటలో కాంగ్రెసుకు నిజమైన ప్రత్యామ్నాయంగా ప్రజావిశ్వాసాన్ని పొందాలి. కేంద్ర రాజ్యాంగ చట్టాలలో రాష్ట్ర ప్రభుత్వాధికారాలు పరిమితులలోనైవున్నా, చేయగలిగినన్ని ప్రజాసంక్షేమ కార్యక్రమాలు అమలుచేయాలి, చేయలేని వాటిపై భ్రమలు కల్పించరాదు. రాజ్యాంగ పరిమితులలోనే చేయగలిగినన్ని అభివృద్ధి కార్యక్రమాలను చేయాలి, యిది సాధ్యం. ఈవిధంగా కాంగ్రెసుకంటె మెరుగైన పాలన యిచ్చి, అన్ని వామపక్ష ప్రజాస్వాశక్తులను సమీకరించి, ఐక్యసంఘటన ప్రభుత్వం శక్తివంతమైన, కాంగ్రెసుపాలనకు వ్యతిరేకమైన పోరాట శక్తిగా, సాధనంగా అభివృద్ధిచెంది కాంగ్రెసుకు ప్రత్యామ్నాయంగా రూపొందుతుంది. వామపక్షాల మంత్రివర్యుల లక్ష్యం, ధ్యేయం సమిష్టి ఆమోదం పొందిన కనీస కార్యక్రమాన్ని అమలు చేయుట కావాలి, అందుకే తమ శక్తి, సామర్థ్యాలన్నిటిని వినియోగించాలి. అదేవిధంగా ఐక్యసంఘటన భాగస్వామ్యపార్టీలు చేయుటలోనే పోటీపడాలి. ఆవిధంగానే భాగస్వామ్యపార్టీలన్నీ, బలపడాలికాని, వొకరు బలహీనపడినందున మరొకరు బలపడుటకాదు. ఇట్టి దృక్పథం ఆచరణయే మొత్తంగా వామపక్ష, ప్రజాస్వామ్యశక్తుల ఐక్యత, బలంపెంపొంది ఆశించిన లక్ష్యానికి చేరుకొనగలము. అందుకు అవసరమైన చైతన్యవంతమైన ప్రజల మద్దతు ఐక్యపోరాటాలద్వారా లభించిన అనుభవాల నుండి లభించుతుంది.

కాంగ్రెసేతర ప్రజాప్రభుత్వాల విజయాలు ప్రజలతో వామపక్ష ప్రజాస్వామ్యపక్షాల శక్తుల సంబంధాలను మరింత బలపరచగలవు. జాతీయ జీవనంలో ప్రజల సహకారాన్ని, ఉత్సాహాన్ని, పోరాట శక్తిని, ఐక్యతను పెంపొందించగలవు.

ఈవిధమైన అవగాహన సి.పి.ఐ(యం) కు లేకపోగా, యీ రాజ్యాంగంలో ప్రజలకు చెప్పుకొనతగినదేమీ చేయలేమనే ధృఢమైన విశ్వాసాన్ని, అవగాహనను కలిగివుంది. అంచేత, తమతో ఏకీభవించని వారి సంస్కరణ వాదులని తెగనాడుతున్నది. పరిపాలనా

యంత్రాంగాన్ని మెరుగుపరచేగట్టి ప్రయత్నం చేయుటకు సుముఖులుకారు. ఐక్యసంఘటనా ప్రభుత్వాన్ని పోరాట సాధనంగా చేయాలనే నినాదమైతే యిస్తారు కాని దానిని ప్రజలకు సేవలను సమర్ధవంతంగా, నీతివంతంగా చేయు పోరాటాల క్రమంలోనే పోరాటసాధనంగా చేయగలమనే అవగాహనలేకపోగా దానిని సంస్కరణవాదం క్రింది త్రోసి పారవేస్తున్నారు. ప్రజల అసంతృప్తిని తీవ్రతరం చేయుట, ఆవిధంగా ప్రజలు యాదృచ్ఛికంగా ప్రభుత్వంపై తిరుగుబాటు చేస్తారని వారి దృక్పధంగాకన్పడుతున్నది.

ఇటీవల లండన్‌లో వారి సైద్ధాంతిక నాయకుడు, పొలిట్‌బ్యూరో సభ్యుడైన బి.టి.రణదివె బహిరంగసభలో "కేరళ, పశ్చిమ బెంగాలుల ఐక్యసంఘటనా ప్రభుత్వాల కర్తవ్యం, ప్రజల అసంతృప్తిని వెల్లువగా చేయాలి. వారికి కొంత సహాయాన్ని అందించుటకాదు. మార్క్సిస్టు మంత్రులు యీ ఎత్తుగడలననుసరించి, కేంద్రం 'వీటో' చేసే చట్టాలను, బిల్లులను చేసి వాటి అమోదానికి కేంద్రంపై ప్రజాపోరాటాలు నిర్మిస్తూ, ప్రజా అసంతృప్తిని వెల్లువగా పెంపొందించుట, కోర్టులు వ్యతిరేక తీర్పునిస్తే ప్రజోద్యమాల వొత్తిడిని యెక్కువచేయుటగా వివరించారు. ఈవిధమైన పోరాట ఎత్తుగడలతో ప్రజలకు నేటి రాజ్యాంగ చట్టపరిధులలో మౌలిక సంస్కరణ చట్టాలుచేయుట అసాధ్యమని ప్రజలు ఆచరణలో అనుభవాలను స్పృతదించునట్లు చేయుట ఎత్తుగడల సారాంశంగా ఉంది. ఐక్యసంఘటనా ప్రభుత్వం కూలిపోకుండా ఎత్తుగడల మౌలికాంశాలను సడలించకుండా, విడవకుండా ప్రభుత్వంలో కొనసాగనెంచుతున్నారు''.[1] ఇది యిప్పుడు విద్యాలయాలలో మాత్రమే చర్చనీయాంశంగాలేదు. కేరళ, పశ్చిమ బెంగాలులలో వామపక్ష, ప్రజాస్వామ్య శక్తుల దైనందిన సమస్యలలో ఎదుర్కొంటున మౌలిక సైద్ధాంతిక, తక్షణ ఆచరణ సమస్యగా వుంది.

## కేరళలో సి.పి.ఐ(యం) మితవాద అభివృద్ధి నిరోధక పార్టీలతో నూతన ఐక్యసంఘటనను యేర్పాటు చేయుట.

కేరళలో అచ్యుతమీనన్ నాయకత్వంలో వామపక్ష, ప్రజాస్వామ్యపక్షాలు, కాంగ్రెసుతో సహా ఐక్యసంఘటనా సంకీర్ణ ప్రభుత్వం అక్టోబరు 1969లో ఏర్పడింది. కాంగ్రెసు కూడ మంత్రివర్గంలో చేరింది. అభ్యుదయకర వ్యవసాయభూముల సంస్కరణల చట్టం తరువాత, "దున్నేవానికే భూమి" అనే నినాదంతో కౌలుదారుల చట్టాన్ని చేసి గ్రామాలస్థాయిలో వివాదాంశాలను పరిష్కరించుటకు "ప్రజాకమిటీలు" యేర్పాటుచేసి, వాటికి అధికారాలు, రక్షణ కల్పించి అమలు చేసింది. కొన్ని చోట్ల దేశరక్షణ చట్టాన్ని కూడ తమ అదనపు భూములను ప్రకటించని వారిపై వినియోగించింది. కుట్టినాడ అతిపెద్ద భూస్వామి నుండి అదనపు భూమిని స్వాధీనం చేసుకొని వ్యవసాయశాఖ పర్యవేక్షణలో ప్రభుత్వ వ్యవసాయక్షేత్రంగా, వ్యవసాయయాభివృద్ధి కార్యక్రమాలకు వినియోగించసాగింది.

సి.పి.ఐ(యం) పొలిట్‌బ్యూరో అక్టోబరు 1969లో వామపక్ష ప్రజాస్వామ్య

1. ఇండియన్ ఎక్స్‌ప్రెస్. విదేశీవిలేఖరి కధనం. *22 జూన్ 1969*

ఐక్యసంఘటనను, ప్రభుత్వాన్ని విచ్ఛిన్నం చేయనిర్ణయించి, కరుడుగట్టిన మితవాద బూర్జువావర్గాలతో సత్సంబంధాలు నిర్మించే ప్రయత్నాలు ప్రారంభించింది. పాలక బూర్జువాపార్టీ (కాంగ్రెసు) అత్యంత మితవాద అభివృద్ధి నిరోధకవర్గాలకు నాయకత్వం వహించుతున్నదనే తప్పుడు సిద్ధాంత మార్గదర్శికత్వంలో, పైగా ప్రతిదేశంలో ప్రజాస్వామ్య విప్లవ అన్ని దశలలో యిదే జరిగిందని సిద్ధాంతీకరించింది. ఈ సిద్ధాంతం ప్రకారం జనసంఘం, కాంగ్రెసు (ఒ), స్వతంత్రపార్టీ ప్రభుత్వాన్ని వ్యతిరేకించే పార్టీలన్నీ కేంద్రంలో, కేరళలో తరతమ భేదాలతో అన్నీ అభ్యుదయకరమైనవి. కేరళలో మితవాద పార్టీలన్నీ స్వార్థపరవర్గాలకు ప్రాతినిధ్యం వహించుతు అభ్యుదయకర చర్యలు చేపట్టుతున్న అచ్యుతమీనన్ ప్రభుత్వంపై దాడి చేయుచున్నవి. సి.పి.ఐ(యం) తన పార్టీ శ్రేణులకు కనీసం అభ్యుదకరచర్యలకు మద్దతు యివ్వవలసిందిగా సలహాయివ్వగలదా?

"కేరళలో అత్యంత అభివృద్ధి నిరోధక మితవాద శక్తులు బజారు ప్రదర్శనలలోనికి వచ్చారు. నంబూద్రిపాద్, గోపాలన్‌ల నాయకత్వంలో ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ నినాదాలనిస్తున్నారు. భారతదేశంలో ప్రతి ప్రజాస్వామ్యవాది కర్తవ్యం యీ నియోఫాశిస్టు శక్తుల ముసుగును తొలగించుట తక్షణం చేబట్టవలసిన కర్తవ్యంకాదా? సి.పి.ఐ(యం) యీ చర్యలకు వారి శ్రేణుల నుండి కొంత వ్యతిరేకత వచ్చుటయేగాక, జనవరి, ఫిబ్రవరి బందులలో కార్మిక సంఘాలలో వున్న కార్మికవర్గం బలపరచపోవుట, వారి విధానాలవైఫల్యాలను కొంత వరకు చాటి చెప్పుతున్నది.[1]

అచ్యుతమీనను నాయకత్వంలోని ఐక్యసంఘటనా ప్రభుత్వాన్ని కూలద్రోయు యేకైక లక్ష్యంలో అతివాద అవకాశవాద సి.పి.ఐ.(యం) నాయకత్వంలో మితవాద అభివృద్ధి నిరోధక జనసంఘం, కాంగ్రెసు (ఒ) తదితర పార్టీలతో నూతన ఐక్యసంఘటనను ఏర్పరచింది. పచ్చిమితవాద ఫాశిస్టుపార్టీ జనసంఘం చురుకైన పాత్రధారి. సి.పి.ఐ.(యం) కేరళలో ప్రతిపక్షపార్టీలన్నిటిని యీ సంఘటనలో సమీకరించుటకు చొరవ ప్రదర్శించిందని ప్రకటించింది, బలపరచింది, పొలిట్‌బ్యూరో పార్టీకి అభినందనలు, దీవెనలు అందించింది.[2]

కేరళలో 1959లో కమ్యూనిస్టు వ్యతిరేక ఉద్యమానికి నాయకత్వం వహించిన ఫాదర్ వడక్కన్ డిశెంబరు 1972 లో సి.పి.ఐ.(యం) నాయకత్వంలో ప్రారంభమైన "వ్యవసాయ భూముల ఆక్రమణ" ఉద్యమంలో ప్రముఖ పాత్రవహించాడు. వాస్తవానికి అచ్యుతమీనన్ చేబట్టిన ప్రజా ప్రయోజనాల చర్యలు స్వార్థపరవర్గాల ప్రయోజనాలను దెబ్బతీయుటతో వారు అచ్యుత మీనను ప్రభుత్వాన్ని కూలద్రోయాలనే నినాదాన్నిచాలా కాలం క్రిందటనేయిచ్చారు. సి.పి.ఐ.(యం) వారి నుండి అరువుదెచ్చుకొన్న నినాదమే, కాని కొత్తదికాదు.

---

*1, నంబియార్, పి.ఆర్. (1973) కేరళ సి.పి.యం.యస్. ఓపెన్ అలయెన్స్ విత్ ది పార్టీస్ ఆఫ్ రైట్ రియాక్షన్ పార్టీ లైఫ్ (1973) వాల్యూ 9,నం.9. పే.25-26.*

*2. పీపుల్స్ డెమోక్రసీ, 11 ఫిబ్రవరి 1973.*

కేరళలో, కేంద్ర ప్రభుత్వం, కాంగ్రెసు భూసంస్కరణల విధానాలకు వ్యతిరేకంగా ప్రజలలో చెలరేగిన అసంతృప్తి. గరిష్ట పరిమితికి మించిన భూముల ఆక్రమణ ఉద్యమంగా రైతాంగాన్నంతటిని చైతన్య వంతులను చేసింది. అయితే ఇందిరాగాంధి నూతన విధానంగాని, అచ్యుత మీనను నాయకత్వంలోని పాలక వర్గాల సంకీర్ణ ప్రభుత్వంగాని, వ్యవసాయసంస్కరణల చట్టాన్ని ధృఢచిత్తంతో అమలుచేస్తామని చేసిన వాగ్ధానాలు నెరవేరక పోవుటను సి.పి.ఐ.(యం) తీవ్రంగా విమర్శించింది.[1] భూస్వాములు గరిష్ట పరిమితికి మించిన భూముల వివరాలను పంపించుటకు చట్టంలో స్పష్టంగా సూచించబడినా, రెండున్నర సంవత్సరాలు దాటినా రిటర్నులు పంపించలేదు. ప్రభుత్వంవారిపై ఎట్టి చర్య తీసుకొనలేదు. నామ మాత్రంగా కొద్దిమంది పంపించారు.

ఈ పరిస్థితులలో గరిష్ట పరిమితికి మించిన భూములను పేదరైతులు, వ్యవసాయ కూలీలకు పంచాలనే ఐక్యసంఘటన పోరాట సమితి వివరాలను ప్రభుత్వ దృష్టికి తెచ్చింది. చట్టప్రకారం మిగులు భూములు ప్రభుత్వ భూములక్రిందికి వస్తాయి. వ్యవసాయ కూలీలకు, పేదరైతులకు పట్టాలు యిచ్చేపనిని ప్రభుత్వం నిర్వహించాలి. కేరళలో సి.పి.ఐ.(యం) నాయకత్వంలో మొదటి ఐక్యసంఘటనా ప్రభుత్వంకాని, తదుపరి సి.పి.ఐ. నాయకత్వంలో ఏర్పడిన అచ్యుతమీనన్ ప్రభుత్వం భూసంస్కరణలకు సంబంధించిన పరిణామాలు అత్యంత తీవ్రపరిణామాలు, అభివృద్ధికరమైనవిగా గుర్తించారు. ప్రెసిడెంటు ఆమోదం వ్యవసాయసంస్కరణ చట్టాలకు లభించకపోతే ప్రజాపోరాటాలను, ఉద్యమాలను ఆహ్వానించుటయే అగుతుందని గుర్తించారు.[2] ఆమోదంలభించినా వాటి అమలుకై ప్రజోద్యమాల అవసరంయెంతో వుంది. ముఖ్యమంత్రి అసెంబ్లీ సభ్యుడు కానందున జరిగిన బైఎలక్షను తరువాత, అచ్యుతమీనను మంత్రివర్గంలో కాంగ్రెస్ నాయకుడు హోంమంత్రిగా చేరుట, కాంగ్రెసు మద్దతుపైనే మంత్రివర్గ ఆస్తికత ఆధారపడియుండుటతోక్రమేణా కాంగ్రెసు నాయకత్వంలో సి.పి.ఐ.జూనియర్ నాయకత్వపు మంత్రి వర్గంగా రూపొందిందని నంబూద్రిపాద్ విశ్లేషణగావించారు.[3] ఈ విధంగా వామపక్ష, ప్రజాస్వామ్య ఐక్యసంఘటనా సిద్ధాంతం ఆచరణలో కాంగ్రెస్‌తో ఐక్యసంఘటనగా రూపొందినదని నంబూద్రిపాద్ తీవ్రంగా విమర్శించారు.

అచ్యుతమీనను నాయకత్వంలోని ఐక్యసంఘటనను కూలద్రోయాలనే లక్ష్యంలో భాగంగానే సి.పి.ఐ.(యం) నాన్‌గెజెటెడ్ ఉద్యోగులు, ఉపాధ్యాయుల సమ్మెపోరాటాలను బలపరచింది. సి.పి.ఐ.(యం) నాయకత్వంలో కొన్నియూనియన్‌లు, కొంతమంది నాయకులు బలపరచారు. సి.పి.ఐ.(యం) పోలిట్‌బ్యూరో సమ్మెను బలపరస్తూ ప్రత్యేక శుభాకాంక్షలను పంపింది. పీపుల్స్ డెమెక్రసీ 11 ఫిబ్రవరీ 1973 సంచికలో కేరళలో సి.పి.ఐ.(యం) చొరవ తీసుకొని ప్రతిపక్షాలన్నిటితో సమ్మెచేస్తున్న ఉపాధ్యాయులు,

---

1. *తీర్మానాలు 9వ, సి.పి.ఐ.(యం) మధురైపార్టీ కాంగ్రెసు, 1972 (ఆంగ్లంలో) పే. 25.*
2. *నంబూద్రిపాద్, ఇ.యం.యస్. (1994) ది కమ్యూనిస్టుపార్టీ ఇన్ కేరళ. పే. 238.*
3. *అదే పే. 237-9.*

ఉద్యోగులను బలపరస్తూ ప్రకటన చేసింది. వాస్తవానికి, సి.పి.ఐ.(యం) నాయకత్వంలో మితవాద అభివృద్ధి నిరోధక ముస్లింలీగు, కేరళ కాంగ్రెసులతో ఏర్పరచిన నూతన ఐక్యసంఘటన ఉద్యోగుల, ఉపాధ్యాయుల సమ్మెను బలపరస్తూనే తమకార్యకలాపాలను ప్రారంభించింది. సమ్మెదారులు ఫిబ్రవరి మొదటి వారంలోనే ప్రభుత్వంలో ఒప్పందానికి వచ్చారు. సి.పి.ఐ.(యం)ను అనుసరించే కొన్ని శెక్షనులు మాత్రమే సమ్మెను కొనసాగించాయి. లక్ష్యం ప్రభుత్వవ్యతిరేక పార్టీలను, గ్రూపును, వ్యక్తులను సమీకరించుటగా ఉంది. ఫలితంగా ఉద్యోగులు, ఉపాధ్యాయులకు దూరమయ్యారు. ప్రభుత్వోద్యోగుల జీతాలను మూడవ పేకమిషన్ నివేదికను ప్రకటించిన వెంటనే పెంచుటను వాగ్దానం చేసింది, కేంద్రం యిచ్చిన ఇంటరింరిలీఫ్‌ను ఉద్యోగులందరికి యిచ్చివేసింది. ఉద్యోగుల "సర్వీసెస్ రూల్సు"కు సవరణలు చేయుటలో ఉద్యోగుల సంఘాల సూచనలను పరిగణలోనికి తీసుకొంటుందని వాగ్దానం చేసింది.

సి.పి.ఐ.(యం) కేరళ ప్రభుత్వాన్ని "ఫాశిస్టు ప్రభుత్వం" గాను, శ్రీగోపాలన్ "కేరళను ఒక కాన్‌సెంట్రేషన్‌కాంపు"గా మార్చి వేసారనే నిందా ప్రచారంతో విప్లవ ప్రతీఘాతక ఐక్యసంఘటనను ఏర్పాటుచేయు ఎత్తుగడను చేబట్టింది. సి.పి.ఐ.(యం) ఇండియాలో నియోఫాశిస్టుశక్తులు తలెత్తాయని గ్రుడ్డిగా విశ్వసించుతున్నది. వాస్తవానికి సి.పి.ఐ.(యం) ఫాశిస్టు శక్తులు "గ్రాండ్ అలయెన్సు" రూపంలో తలెత్తినపుడు వాటినిన ఎదుర్కొనకపోగా, అది ఏర్పడుటకు సహాయాన్నిచ్చి, బలపరచింది. ఇప్పుడు భూస్వాములకు, స్వార్థపరవర్గాలకు ప్రజాస్వామ్య హక్కులంటూ పెద్దగా ప్రచారం సాగించుట ప్రజల ఆలోచనా, విజ్ఞతలను తక్కువగా అంచెనా వేయుట అగుతుంది.

కేరళలో ప్రజాస్వామ్య హక్కులకై పోరాటం అనే పేరుతో సి.పి.ఐ.(యం) అచ్యుత మీనన్ నాయకత్వంలోని ఐక్య సంఘటనా ప్రభుత్వాన్ని కూలద్రోయుటకు, 1959 నుండి పచ్చికమ్యూనిస్టు వ్యతిరేకి ఫాదర్ వడక్కన్, మతతత్వకేరళ కాంగ్రెసులతో కలసి పోరాడుటను ప్రజాస్వామ్య శక్తులు ప్రతిఘటించుటలో సందేహంలేదు. ఇది విచ్ఛిన్నకర, విద్రోహ చర్య కాబట్టి తమశ్రేణుల నుండే ప్రతిఘటన చవిచూచింది. అయినా, సి.పి.ఐ.(యం) ఇటీవల కాలంలో తమదాడిని సి.పి.ఐ., కాంగ్రెసులపై కేంద్రీకరించి, సామ్రాజ్యవాద, ఫ్యూడలు, కాపిటలిస్టు అనుకూలపార్టీలు, శక్తులు అయిన జనసంఘం, స్వతంత్ర, సిండికేటు కాంగ్రెసు, బిజూపట్నాయక్, ఉత్కళ కాంగ్రెసులతో కలసి, వారి విద్రోహ ప్రణాళికయైన "గ్రాండు అలయెన్సు" ఏర్పాటు చేయుటలో ప్రముఖ పాత్ర వహించింది. సి.పి.ఐ.(యం) తన సహచర వామపక్షాలైన సి.ఐ., రివల్యూషనరీ సోషలిస్టు పార్టీలను, ఫాశిస్టు జనసంఘం, స్వతంత్ర పార్టీల కంటే ఎక్కువగా ద్వేషించుట ఏగాక, ఆచరణలో ప్రథమ శత్రువులుగా నెంచుతున్నది.

కేరళలో సి.పి.ఐ.(యం) కా॥అచ్యుతమీనన్ నాయకత్వంలోని ఐక్యసంఘటనామంత్రి వర్గాన్ని కూలద్రోనేయత్నాలు చేసింది. ఈ లక్ష్యంతో క్రిష్టియన్ మతతత్వకేరళ కాంగ్రెసు,

తదితర మిత, మతవాదశక్తుల "పోరాటకార్యక్రమంతో తనపోరాటకార్యక్రమాన్ని సమన్వయం, మిళితం చేసింది. తాను ఒక్కటే సాగించిన "భూముల ఆక్రమణ" ఉద్యమం విఫలమగుటతో దీనిపై ఆశలు పెంచుకొన్నది. ఇదీ ఘోరంగా విఫలమైన ఫలితంగా మరే రాష్ట్రంలో యిట్టి సాహసానికి వొడిగట్టలేదు.

పాలక కాంగ్రెసు పార్టీలో వూగిసలాట, బలహీనతలువున్నా కేంద్రంలో, రాష్ట్రాలలో అవిప్రతిబింబించుతున్నా, అనుభవాలు మిత, మతవాద విప్లవ ప్రతీఘాతక శక్తులను వోడించి భారతరాజకీయాలను వామపక్షమార్గం పట్టించుటలో ప్రధాన మిత్రులు కాంగ్రెసులోని అభ్యుదయకర వర్గాలని, చెప్పుతున్నవి. కాంగ్రెసును అనుసరించే అభ్యుదయకర శక్తుల సహకారాన్ని, మిత్రత్వాన్ని ఏమేరకు వామపక్షాలు పొందగలవో ఆచరణలో ఆ మేరకు వామపక్ష ప్రజాస్వామ్య, ఐక్యసంఘటన విజయం సాధించగలదు. అదే మేరకు సి.పి.ఐ.(యం) మిత, మత, అభివృద్ధి నిరోధక శక్తులతో ఏర్పరచుకున్న బంధనాలు తెగిపోయి వామపక్షఐక్యతకు, వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యసంఘటనకు చేరువగుతుంది. అదే కాలంలో సి.పి.ఐ. మితవాద సంస్కరణవాధ ధోరణుల నుండి బయటపడవలసి ఉంటుందని వేరుగ చెప్పవలసిన అవసరంలేదు.

జాతీయ ప్రజాస్వామిక విప్లవ విజయానికి సాధనమైన వామపక్ష ప్రజాస్వామిక సంఘటనా నిర్మాణానికై సాగించే పోరాటాల క్రమంలోనే కార్మిక వర్గనాయకత్వం ఏర్పడుతుందిని సి.పి.ఐ. విశ్వశిస్తున్నది కాని, సి.పి.ఐ.(యం) నిందించుచున్నట్లు కార్మికవర్గ నాయకత్వానికై పోరాటడుట లేదనుట పచ్చిఅసత్యము.

సి.పి.ఐ.(యం) ఐక్యసంఘటనా భాగస్వామ్యపార్టీలను సైద్ధాంతిక పోరాటమన్నపేరుతో వివిధరకములు దాడులకు, భౌతిక దాడులతో సహాగురి చేసి బలహీన పరచిన తన నాయకత్వాన్ని ఆమోదించుతారనే అనాగరిక సిద్ధాంతాన్ని ఆచరణను కొనసాగించారు. బలహీనులైన సంఘటన భాగస్వామ్యపార్టీలే తమ నాయకత్వాన్ని ఆమోదించుతారనే భ్రమలోవుంది. ఈ అవగాహన ప్రాతిపదికపైనే పశ్చిమ బెంగాల్, కేరళలలో భాగస్వామ్య పార్టీలపై మారణాయుధాలతో హింసాదాడులు జరిగాయి. ఈ చర్యలు ఐక్యసంఘటనను విచ్ఛిన్న చేయుటయేగాక పోరాటశక్తుల నుండి సి.పి.ఐ.(యం) వేరగుట జరిగింది.

## ఈ కాలంలో సి.పి.ఐ. ఎత్తుగడల ప్రధానాంశాలు

రాజకీయ పరిణామాల సమగ్రక్రమాన్ని అనుసరించే వర్తమాన, భవిష్యత్తు కాలంలోని సి.పి.ఐ.ఎత్తుగడల పంథా ప్రధానంగా నిర్ణయించబడింది.

సామ్రాజ్యవాద, గుత్తపెట్టుబడిదారి, భూస్వాములు వ్యతిరేక పోరాటాలలో నిర్మించబడే వామపక్ష, ప్రజాస్వామ్య శక్తుల ఐక్యతా ప్రధానమైన ఎత్తుగడల పంథా ఆచరించబడింది. ఈ ఐక్యత కాంగ్రెస్సేతర తత్వంలోగాని అధికార కాంగ్రెసులోని అభ్యుదయకర వర్గాలకు యేవిధమైన "లొంగుబాటు తనాన్ని" ఆమోదించేదికాని, వొంటెత్తు రాజకీయ దృక్పథాన్ని అనుసరించేదిగాని, కాంగ్రెసు ప్రజాసామాన్యపుతోకగా అగుటవలనగాని నిర్మించబడదు.

మాజీ "కాంగ్రెసు వ్యతిరేకతత్వం" కాలక్రమంలో ఫలితశూన్యంకాన, అభివృద్ధి నిరోధకరమైనదిగా రుజువైంది. అంతేగాక "కాంగ్రెసేతర ప్రజాస్వామ్యపక్షాల పాలన" మనదేశ రాజకీయ పరిణామాల వేగంలో దాని పరిమితులు స్పష్టమయ్యాయి. అంచేత నేటి పరిస్థితులలో "కాంగ్రెసేతర పక్షాల" పాలన ప్రత్యామ్నాయంగా ప్రచారం చేయలేము.

కాంగ్రెసేతర వామపక్ష ప్రజాస్వామ్యశక్తులే, అధికారానికై మితవాద అభివృద్ధినిరోధక శక్తులన్నీ కలసి చేసే ప్రయత్నాలను ఎదుర్కొని విజయాన్ని సాధించజాలవని, గతకాలపు అనుభవం స్పష్టం చేస్తున్నది. వాస్తవానికి మితవాదశక్తులు అధికారాన్ని హస్తగతం చేసుకొను ప్రయత్నం, కాంగ్రెసు లోపల బయటవున్న ప్రజాస్వామ్యశక్తుల, వామపక్షశక్తుల "సమిష్టిశక్తుల" బలంతోనే వోడించబడింది. సాంప్రదాయక వామపక్షశక్తులు కొన్ని మితవాద అభివృద్ధి నిరోధక పక్షంలో "కాంగ్రెసేతరతత్వం" పేరుతో చేరినప్పటికి యీ విజయం లభించింది.

ఈ నూతన పరిస్థితులలో వామపక్ష ప్రజాస్వామ్యశక్తులు లక్ష్యం, విస్తృత ప్రజాశక్తుల, పాలక కాంగ్రెసులోని అభ్యుదయకరశక్తులతో సహా సంయుక్త ప్రజోద్యమాలలో సామ్రాజ్యవాద, గుత్తపెట్టుబడిదారి, ఫ్యూడలు వ్యతిరేక విప్లవ ప్రజాస్వామ్య పోరాటాలలో రాజ్యాంగయంత్రంలో మౌలిక సంస్కరణల కొరకు ఐక్యత నిర్మించుట. ఇది వామపక్ష, ప్రజాస్వామ్యశక్తుల ఐక్యతను నిర్మించుటయేగాక, పాలక కాంగ్రెసులోని ప్రజాస్వామ్య శక్తులతో ఐక్యకార్యాచరణను పెంపొందించుటకు తగువేదికను సమిష్టిగా రూపొందించవలసిన అవసరముంది. అట్టి సమిష్టి కార్యాచరణలో కొన్ని ఘట్టాలలో కాంగ్రెసు నిర్మాణంతో మొత్తంగా, ముఖ్యంగా సామ్రాజ్యవాద వ్యతిరేకత, శాంతి, సెక్యులరిజం, సోషలిజం, ఇండో-సోవియట్‌సంధి సమస్యలపై సమిష్టి కార్యాచరణలు సాధ్యమగుతవి.[1]

అనేకసార్లు సి.పి.ఐ. తన లక్ష్యం జాతీయప్రజాస్వామ్య సంఘటన నిర్మాణమేగాని, కాంగ్రెసు వ్యతిరేక ఐక్యసంఘటన కాదని, అభ్యుదయకర ప్రజాస్వామ్యశక్తులు కాంగ్రెసులో, బయట ఎక్కడ ఉన్నా ఐక్యసంఘటనలో స్థానముంటుందని స్పష్టం చేసింది. అన్నివామపక్ష, ప్రజాస్వామ్య, దేశభక్త, సామాజికాభివృద్ధిని కోరేశక్తులు జాతీయ ప్రజాస్వామ్య సంఘటనలో ఉంటాయి. అవి కాంగ్రెసులో ఉన్నా బయటవున్నా జాతీయ ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలను పరిపూర్తి చేయుటకు పోరాడేవిగా, తప్పనిసరిగావుండాలి. ఇది జాతీయప్రజాస్వామ్య శక్తులు, వామపక్ష తదితర ప్రజాస్వామ్యలలో నేడుగల అనైక్యతా అఘాతాన్ని, చీలికలను అధిగమించగలిగినపుడే అదిశక్తివంతమై ఆశించిన ఫలితాలను యివ్వగలదు. అంచేతనే సి.పి.ఐ. "కాంగ్రెసేతర" లేక "కాంగ్రెసువ్యతిరేక ఫ్రంటు"లను వ్యతిరేకిస్తున్నది.

దీనర్థం సి.పి.ఐ. ప్రజావ్యతిరేక కాంగ్రెసు విధానాలను ప్రతిఘటించి, పోరాడదని అర్థం కాదు. అదే విధంగా సామ్రాజ్యవాద,ఫ్యూడలు, గుత్తపెట్టుబడిదారి వర్గాలతో

---

1. *పొలిటికల్ రిపోర్టు అండ్ రిజల్యూషన్సు (1971) సి.పి.ఐ. 9వ. కొచ్చిన్ పార్టీ కాంగ్రెసు అక్టోబరు 1971. పే. 139-140.*

రాజీవిధానాలను అనుసరించే కాంగ్రెసును వ్యతిరేకించి పోరాడదని అర్థం కాదు. కాంగ్రెసు యెడల సి.పి.ఐ వొక సమగ్ర "ఐక్యత-పోరాటం[1]" అనే విధానాన్ని అనుసరించుతుందని తీర్మానం స్పష్టం చేసింది.

ఈ దృక్పధంలోనే వామపక్ష ఐక్యత నిర్మించుటలో దానిని, దాని పాత్రను తక్కువగా అంచెనా వేయరాదు. వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనకు అది పునాది. అతివాద సెక్టేరియనిజానికి వ్యతిరేకంగా పోరాడకుండా, సి.పి.ఐ(యం) సోషలిస్టుపార్టీ విధానాలను వోడించకుండా వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతను నిర్మించలేము.

వామపక్ష వుద్యమంలో విచ్ఛిన్నకర, చీలికవాద ప్రమాదం నేడు కొత్తగా యేర్పడిన సోషలిస్టుపార్టీ, సి.పి.ఐ(యం)ల నుండి యేర్పడుతున్నది. అభివృద్ధి నిరోధకులకు సి.పి.ఐ(యం) వామపక్ష సంఘటనను విచ్ఛిన్నం చేయుట ద్వారా. యస్.యస్.పి; పి.యస్.పీల సంలీనం ద్వారా యేర్పడిన నూతన సోషలిస్టుపార్టీ మితవాదుల అనేక నినాదాలను పునశ్చరణ చేయుట ద్వారా నేరుగా మితవాద అభివృద్ధి నిరోధకులకు సేవలందించుచున్నది.[2] "గ్రాండు అలయెన్సు" నుండి బయటకు వచ్చామని ప్రకటించినా ఆచరణ అదే అయినందున విశ్వాసం యేర్పడదు.

నేడు కాంగ్రెసులో అభ్యుదయకరశక్తులు గతంలో ఎన్నడూలేనంత బలంగా వున్నవి. పాలక కాంగ్రెసును మెరుగుపరచుటలో విధ్యార్థి, యువజన వర్గాలు గణనీయమైన పాత్రను నిర్వహించాయి. వారే కొన్ని కొన్ని రాష్ట్రాలలో సామ్రాజ్యవాద, ఫ్యూడలు, గుత్తపెట్టుబడిదారి శక్తులు వ్యతిరేకచర్యలపై వొత్తిడి చేస్తున్నారు. ఇది కాంగ్రెసు యువజనవర్గాలతో సన్నిహితసంబంధాల పెంపొందించవలసిన అవసరాన్ని తెల్పుతుంది.[3]

వామపక్ష ప్రజాస్వామ్యపార్టీల, శక్తుల ఐక్యతను, కాంగ్రెసులోని అట్టి శక్తులతో ఐక్యతను నిర్మించుట, సి.పి.ఐ మౌలికపంధా. ఎన్నికలలో, ప్రజాపోరాటాలలో " ఐక్యత-పోరాటం" పందా వ్యూహానికి లోబడిన ఎత్తుగడలు అవసరమైన స్వయం నిర్ణయాధికారం, మొత్తం వ్యూహకాలానికంతటికి సంబంధించివుంటుంది.

"ఎత్తుగడల మార్పుల అవకాశం అటువుంచి, పార్టీ కాంగ్రెసుకు కాంగ్రెసుకు మధ్య వుండవలసిన సంబంధాలకు కొన్ని మౌలిక మార్గదర్శక సూత్రాలను 8వ, పార్టీ కాంగ్రెసు ఆమోదించింది. అవి 1) సి.పి.ఐ కి ప్రజాపునాది, స్వతంత్ర పంధా వుండవలసిన అవసరం. సి.పి.ఐ స్వతంత్రపంధాను వెలుగులోనికి తెచ్చుటను, స్వంతపునాదిని విస్తరింపజేయుటను మరచిపోదు. అదేవిధంగా వామపక్ష ప్రజాస్వామ్య పార్టీల, శక్తుల ఐక్యతా నిర్మాణాన్ని మరచిపోరాదు. అదేవిధంగా కాంగ్రెసుతో ఐక్యతా-పోరాటం రెండూ యేక కాలంలోనే

---

*1. పొలిటికల్ రిపోర్టు అండ్ రిజల్యూషన్సు (1971) సి.పి.ఐ. 9వ, కొచ్చిన్ పార్టీ కాంగ్రెసు అక్టోబరు 1971. పే. 139-140.*

*2. రిపోర్టు అండ్ రివల్యూషన్స్, సి.పి.ఐ 9వ కాంగ్రెసు కొచ్చిన్. అక్టోబరు 1971. పే. 142.*

*3. రిపోర్టు అండ్ రివల్యూషన్స్, సి.పి.ఐ 9వ కాంగ్రెసు కొచ్చిన్. అక్టోబరు 1971. పే. 144.*

సాగిస్తుంది. 2) వామపక్ష, ప్రజాస్వామ్య శక్తుల శతృవులు, అత్యధిక మిత్రులు కాంగ్రెసులోనేవున్నారు. అంచేతనే పోరాటాన్ని ఐక్యతనూ రెండింటిని చేబట్టింది. దీనినే సి.పి.ఐ జాతీయ సమితి ఏప్రిల్ 1973లో వివరించింది.

"సి.పి.ఐ. కాంగ్రెసులో వున్న వామపక్ష ప్రజాస్వామ్యశక్తులను దానిని విడిచి రమ్మనమని చెప్పదు. కాంగ్రెసువాదులుగ కాంగ్రెసులోనేవున్న మితవాదులతో పోరాడి, తమ వూగినలాటలను అధిగమించి, తాము ప్రకటించిన విధానాలను ఆచరణలో పెట్టమనికోరుతున్నది.

కొచ్చిన్ సి.పి.ఐ కాంగ్రెసు రూపొందించిన ఎత్తుగడల పంధాను మార్పుచేయవలసి వుందా అని పార్టీ లైఫ్ పాఠకుడు ప్రశ్నించగా, యన్.కె. క్రిష్ణన్ సమాధాన మిస్తూ కొచ్చిన్ ఎత్తుగడల పంధాను యిలా వివరించారు.[1]

కొచ్చిన్ కాంగ్రెసు ప్రజలలో చైతన్యం, ప్రజలలో పోరాట శక్తిని విశ్లేషణ చేసి ప్రజాసామాన్యం పెద్దగా వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతవైపు పయనిస్తున్నారని, అదేవిధంగా కాంగ్రెసును అనుసరించే ప్రజాసామాన్యంలోనూ సుముఖ మార్పు వచ్చిందని, యిది 1969 సంవత్సరానంతర లక్షణంగా పేర్కొంది. భారతబూర్జువావర్గంలో కూడ వివిధ వర్గాలుగ ఆర్థిక అంతరాలు యేర్పడుట సాగుతున్నందున కాంగ్రెసు పెట్టుబడిదారి విధానాన్ని అనుసరించుతున్నందున ఆ వర్గంలో తప్పనిసరిగా జనించే వైరుధ్యాల ప్రభావం కాంగ్రెసులో ప్రతిబింబిస్తుందని, చీలికలకు కారణమగుతున్నదని తెలిపింది.

కొచ్చిన్ పార్టీ కాంగ్రెసు అట్టి విశ్లేషణపై ఆధారపడి భవిష్యత్కాలానికి ఎత్తుగడల పంధాను రూపొందించింది.

" ఎత్తుగడల పంధా సామ్రాజ్యవాద, గుత్తపెట్టుబడిదారి, భూస్వాములు వర్గాల వ్యతిరేక పోరాటంలోనే వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతకు ఏకైక మార్గం రూపొందుతుందని సిద్ధాంతీకరించింది.

ఇటీవల మితవాద అభివృద్ధి నిరోధక ఫాశిస్టు శక్తులు బీహారులో "సంపూర్ణ విప్లవం" అనే నినాదంతో ఎర్రకోట నదిరోహించుటకు చేసిన ప్రయత్నాలు వామపక్ష ప్రజాస్వామ్యశక్తుల, ప్రజోద్యమాల వలన మాత్రమే నిరోధించబడగలవని అనుభవం నేర్పింది. అంతేగాక వామపక్ష ప్రజాస్వామ్యశక్తులు కాంగ్రెసులోని ప్రజాస్వామ్యశక్తుల సమిష్టి బలంతోనే యీ విజయం సాధ్యమైందని కూడ స్పష్టమైంది.

"వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతా లక్ష్యం, కాంగ్రెసులోని ప్రజాస్వామ్యశక్తులతో ఐక్యకార్యాచరణను పెంపొందించి, సామ్రాజ్యవాద, గుత్తపెట్టుబడిదారి, భూస్వాములు వ్యతిరేక విప్లవ ప్రజాస్వామ్యాన్ని రూపొందించి, రాజ్యాంగంలో మౌలిక సంస్కరణల ద్వారా ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలను పూర్తి చేయుట, మౌలిక కర్తవ్యం.

---

*1. కృష్ణన్, యన్.కె. (1973) పార్టీ లైఫ్ వా. 9 పే.నం. 28.*

జాతీయ ప్రజాస్వామ్యం ప్రజాస్వామ్యశక్తులలోని అనైక్యతను ప్రధానంగా సి.పి.ఐ, కాంగ్రెసులను అనుసరించే ప్రజాసామాన్యంలో యేర్పడిన అనైక్యతాగండిని అధిగమించుట పోరాటక్రమంలోనే జరుగుతుంది. అంచేతనే సి.పి.ఐ "కాంగెసేతర," "కాంగ్రెసువ్యతిరేక" ఐక్యసంఘటనల నిర్మాణాన్ని వ్యతిరేకించుట జరుగుతున్నది. దీని అర్థం సి.పి.ఐ ప్రజావ్యతిరేక కాంగ్రెసు విధానాలపై పోరాటం సాగించదనికాదు.

ఈ ఎత్తుగడలను అమలు చేయుటలో సి.పి.ఐ పట్టువిడుపులతో వ్యవహరించుతుంది. వామపక్ష ఐక్యతపాత్ర, వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యసంఘటనా నిర్మాణంలో అత్యంత ప్రధానమైంది, కాన అపోహలకు తావు లేదు. కాంగ్రెసు యెడల సి.పి.ఐ సమగ్ర ఎత్తుగడలవిధానం "ఐక్యతా-పోరాటం" రెండూ ఏకకాలంలో అమలు చేయుటగా వుంది[1].

## సి.పి.ఐ (యం) ఎత్తుగడల ప్రధానాంశాలు.

కార్మికవర్గ పార్టీయైన సి.పి.ఐ(యం) పశ్చిమ బెంగాలులో రూపొందుతున్న బూర్జువా, భూస్వామ్యవిధానాలపై అశ్రద్ధవహించితే ఆత్మహత్యా సదృశ్యమే అగుతుంది. పాలకవర్గాలను ఎదుర్కొని పోరాడుతున్న ప్రజలు అనేక కష్టాలకు గురి కావలసివస్తున్నది. బెంగాలు పరిణామాలు దేశంలోని విప్లవోద్యమాల దృక్పధంలో గణనీయమైనవి. పరిస్థితులు పాలకవర్గాలకు వ్యతిరేకంగా పరిణమించినపుడు యువజన, విద్యార్థి సంఘాల సామాజిక దుష్టశక్తులను చేర్చుకొని. అనధికార సైనికులుగా పాలకవర్గాల రక్షకులుగా వ్యతిరేకశక్తులపై దాడులకు ఉపయోగించబడతారని స్పష్టమైంది. ఈ కాలంలోనే నక్సలైట్లు వర్గశతృవుల ఖతం" కార్యక్రమం చేబట్టుటతో వారి ముసుగులో వీరు తమవ్యతిరేకపార్టీలపై, వ్యక్తులపై, వారి ఆఫీసులపై దాడులకు ఉపయోగించుట జరిగింది. ఇక్కడ ఒక్క విషయం ప్రధానంగా గుర్తుపెట్టుకొనవలసివుంది. నక్సలైట్లు, సి.పి.ఐ.(యం), సి.పి.ఐ., తదితరులు ఎవరు దాడి చేసినా, చేయబడిన వారు వామపక్షపార్టీలో, వారి ఆఫీసులో, కార్యకర్తలో, నాయకులలో అయ్యారు కాని, కాంగ్రెసు, మితవాద పార్టీలకు చెందినవారు కాదు. కొన్ని యితరులపై జరిగినా అవి వారిపై వ్యక్తిగత దాడులేకాని రాజకీయ దాడులు కావు. రాజకీయ దాడులు ప్రధానంగా వామపక్షాల వారు పరస్పరం చేసుకొన్నవే ఎక్కువగా ఉన్నవి.

"మాపార్టీ (సి.పి.ఐ.యం) ఐక్యసంఘటనను వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతను రెచ్చగొట్టే ప్రయత్నాలు ఎన్నిజరిగినా, ముఖ్యంగా నిన్నటిమా సహచర మిత్రులే చేసినా, సడలించని దీక్షతో సంఘటన రక్షణకే ప్రయత్నించు మాపార్టీ ఎడతెగకుండా ఐక్యసంఘటనా ప్రభుత్వాన్ని, కార్యక్రమాలకు బలమైన మద్దతునూ, ఉద్యమాలకు ప్రజాసమీకరణ చేసేకర్తవ్యాన్ని మాత్రం ఎప్పుడూ కుదవపెట్టలేదు. తక్షణ సహాయాలను అందించుటలో కూడా పార్టీ ఎంతోకృషి చేసింది. అదేకాలంలో రాజ్యాంగ చట్టం పరిమితులను విమర్శించి, బహిరంగ పరచుట, ఉద్యమం నిర్మించే ప్రయత్నం చేసింది. అంచేతనే మేము బహిరంగం గానే

*1. కృష్ణన్, యన్.కె.(1973) వా. 9 నం. 8. పే. 29.*

ప్రజాపోరాటాలకు మద్దతునిస్తూ, మంత్రి వర్గంలో ఉన్నపుడు వాటికి పూర్తిరక్షణ కల్పించాము [1].

“కేంద్రప్రభుత్వపు కుతంత్రాలకు వ్యతిరేకంగా పోరాడుతూనే, కాంగ్రెసు పార్టీలోని చీలికలను ప్రప్రథంగామేము పరిగణలోనికి తీసుకొని వామపక్షాలలో మేమొక్కరమే సరియైన వర్గ దృక్పదాన్ని రెండు కాంగ్రెసు పక్షాలయెడల చేబట్టాము. సంస్కరణ వాదులు (సి.పి.ఐ) ఇందిరాగాంధి బూర్జువావర్గంలోని గుత్తపెట్టుబడి దారివ్యతిరేక అభ్యుదయకర వర్గానికి ప్రాతినిధ్యం వహించుతుందని తమ అవగాహనకు ప్రాతిపదికగా చేసుకొని, కాంగ్రెసుయెడల, ఇందిరాగాంధి యెడల తమవిధానాన్ని నిర్ణయించుకొన్నారు. అవకాశవాద కారణాలను చెప్పి మరికొన్ని వామపక్షపార్టీలు “సిండికేటు”తో చేతులు కలుపుటను, సి.పి.ఐ.(యం) తిరస్కరించింది.

పశ్చిమ బెంగాలులో 1971 ఎన్నికలలో సి.పి.ఐ.(యం) పై నిందాప్రచారం ఒక వైపు, పార్టీని ప్రజల నుండి దూరం చేసే ప్రయత్నాలు మరోవైపు జరుగుతున్నా సి.పి.ఐ.(యం) ఐక్యసంఘటనకు కొన్ని వామపక్షాలతో కలసి ఏర్పాటు చేసింది. సి.పి.ఐ. మరికొన్నివామపక్షాలు కలసి మరో ఐక్యసంఘటనను ఏర్పాటు చేసాయి. అసెంబ్లీ, పార్లమెంటు ఎన్నికల ఫలితాలు, రాష్ట్రంలో బంగ్లాకాంగ్రెసు, సి.పి.ఐ.ల వోటమి; ప్రజలు సి.పి.ఐ.(యం) విధానాలను ఎంతగాహర్షించుచున్నది తెలియజేస్తున్నదని, అదే కాలంలో విద్రోహుల ఆటలు కట్టుట తెలియజేస్తున్నదని, రాజకీయతీర్మానం తెల్పుచున్నది.

“అంతేగాక, 1971 ఎన్నికల అనంతరం సి.పి.ఐ.(యం) ఫాశిస్టు, హింసా-దౌర్జన్యాల మధ్య తన పోరాటాన్ని ప్రజాస్వామ్య ఐక్యతకై కొనసాగించింది. ప్రతిగా బంగ్లా కాంగ్రెసు గతంలోని మనమిత్రులను వారి ఐక్యసంఘటనలోనికి మిత్రులుగా చేర్చుకొని సి.పి.ఐ.(యం) నాయకత్వంలోని ఐక్యసంఘటనపై పోరాటాలు సాగించింది. ఈ పార్టీలన్ని కాంగ్రెసు గుండాలు, వామపక్ష ప్రజాస్వామ్యశక్తులు, పార్టీలపై జరిపిన హత్యలన్నిటికి తెరవేయప్రయత్నిస్తున్నది [2].

వామపక్ష ప్రజాస్వామ్య శక్తుల త్యాగాలు, పరిణామాల ఫలితంగా 1972లో జరిగిన ఎన్నికలలో సి.పి.ఐ.మినహా అన్నివామపక్ష, ప్రజాసామాన్య పార్టీలు కలసి కాంగ్రెసుకు వ్యతిరేకంగా పోటీచేసి, కాంగ్రెసు కుట్రలను, హింసాదౌర్జన్యాలను బట్ట బయలు చేసి, రిగ్గింగు రుజువు చేసారు. వామపక్షపార్టీలు అన్నీ యేకంగా అసెంబ్లీని బాయ్‌కాట్ చేసారు. రిగ్గింగుతో జరిగిన ఎన్నికలను గుర్తించనిరాకరించారు. ఇదే విధమైన ప్రజా పోరాటం కేరళలోనూ జరిగింది.

## కేరళ, ఐక్యసంఘటన మంత్రి వర్గం కూల ద్రోయబడుట

కేరళ ఐక్యసంఘటనా ప్రభుత్వం 31 మాసాల పాలన తరువాత అక్టోబరు 1969

---

1. *రాజకీయ తీర్మానం (1972) సి.పి.ఐ.(యం) 9వ. కాంగ్రెసు ఆమోదించినది. పే.46-7.*
2. *అదే పే.47.*

లో కూలద్రోయబడింది. సి.పి.ఐ.(యం) కేంద్రకమిటి అక్టోబరు 1969 తీర్మానం కేరళ ఐక్యసంఘటన మంత్రి వర్గాన్ని కూలద్రోయుటపై కాంగ్రెసు విధానాన్ని తీవ్రంగా విమర్శించుట యేగాక సి.పి.ఐ. విద్రోహాన్ని, కొన్నివామపక్షపార్టీలు తోడ్పడుటను కూడ తీవ్రంగా విమర్శించింది.

కేరళ ప్రజలు ఐక్యసంఘటనా ప్రభుత్వం ఎట్టిసేవలు తమకందించుచున్నదో బూర్జువా భూస్వామ్యరాజ్యాంగ చట్ట పరిమితులలో కేంద్ర కాంగ్రెసు ప్రభుత్వం పెట్టే ఆటంకాలను అధిగమించుటకు ప్రజోద్యమాల నిర్మాణం, పోరాటం ఎంత అవసరమో విదితమైంది. ఐక్యసంఘటనా ప్రభుత్వం సామాన్య ప్రజల వాణిగా, కేంద్ర ప్రభుత్వానికి తమకోర్కెలను శక్తివంతంగా తెలియజేసే ప్రజల ఆయుధంగా, వాణిగా, రాష్ట్రంలో స్వార్ధపరశక్తులకు వ్యతిరేకంగా ఎలాపని చేసింది ప్రజల అనుభవంలోనికి వచ్చింది. ఈ లక్ష్యంతోనే పోలీసు పాలనా యంత్రాంగానికి నూతన దృక్పధం, కార్మికులు న్యాయమైన కోర్కెలకై జరిపే పోరాటంలో కలుగుజేసుకొనరాదని గట్టిసూచనలు యివ్వబడినవి. ఈ చర్య స్వార్ధపర వర్గాలకు, కాంగ్రెసు, కేరళ కాంగ్రెసు, ప్రతిపక్షవర్గాలకు ఐక్యసంఘటనా ప్రభుత్వంపై రాగద్వేషాలను, వ్యతిరేకతను ఇనుమడింప జేసింది. అదేకాలంలో శ్రామిక, నగర, గ్రామిణ బడుగు వర్గాలలో వారిని దోచే వర్గాలకు వ్యతిరేకంగా నిర్మాణయుతమైన ప్రతిఘటన చేయుటకు ప్రోత్సాహాన్నియిచ్చింది. ఈ నిర్ణయం కేంద్ర ప్రభుత్వ ఆర్డినెన్స్ క్రింద సమ్మె చేస్తున్న కేంద్ర ప్రభుత్యోద్యోగులను అరెస్టు చేయమని కేంద్రం ఆజ్ఞలు జారీ చేసినపుడు, రాష్ట్ర మంత్రివర్గం ఛీఫ్‌మినిష్టరు నంబూద్రిపాద్ నాయకత్వంలో అరెస్టు చేయుట తిరస్కరించి చరిత్ర సృష్టించింది[1].

ఈ నేపధ్యంలో కార్మిక, కర్షక, వ్యవసాయ కూలీ, మధ్యతరగతి ప్రభుత్యోద్యోగులు, ఉపాధ్యాయులు తమ న్యాయమైన కోర్కెలకై బ్రహ్మాండమైన ప్రజాపోరాట ఉద్యమాలను నిర్మించారు. ప్రత్యేకంగా టీ, కాఫీ తదితర తోటల కార్మికులు, వ్యవసాయ కూలీలు తీవ్రపోరాటాలు సాగించారు. ఈ విధమైన ప్రజాస్వామ్యకార్మిక విధానంతో పాటు, అభ్యుదయకర వ్యవసాయ విధానాన్ని ప్రభుత్వం చేబట్టుటతో తమ తక్షణ కోర్కెలలో 25 శాతం వేతన పెరుగుదలను సంపాదించారు. వ్యవసాయ కార్మికుల రోజుకూలి 4 నుండి 6 రూపాయలకు పెరిగింది. ప్రభుత్యోద్యోగులు, ఉపాధ్యాయులు సంవత్సరానికి 18.5 కోట్లు రూపాయలు అదనంగా పొందారు. వ్యవసాయ సంస్కరణల బిల్లు కుటుంబానికిగల భూగరిష్టపరిమితిని 12 యకరాలకు తగ్గించివేసింది. పొలాలలోని పాకలలో నివసిస్తున్నవారికి కొద్దిపాటి అద్దెపై ఆస్తిహక్కుకల్పించింది. కౌలుదారులైన రైతాంగానికి పండిన పంటలో నాలుగవవంతు కౌలుగా నిర్ణయించింది. ఈ నూతన చట్టాలను అమలు చేయుట అంత్యంత వేగంగా తగుచర్యలు పాలనా పద్ధతులలో ప్రజలకు పూర్తి ప్రయోజనాలు కలుగునట్లు చేసింది.

---

1. వర్క్ రిపోర్టు (పొలిటికల్) ఆఫ్ ది సి.సి.టు. ది. 9వ కాంగ్రెసు (సి.పి.ఐ.యం) మధురై. జూన్–జులై 1972. పే. 10–11.

కేరళలో వ్యవసాయ సంస్కరణ బిల్లు అమలు చేయుట కొన్ని బలహీనతలు బయల్పడినా, పోరాటాలద్వారా సాధించిన విజయాలే గణనీయంగా ఉన్నవి. ప్రజాప్రయోజనాల విధానాన్ని రూపొందించి అమలు చేస్తే, శ్రామిక ప్రజాసామాన్యానికి ప్రజాస్వామ్య శక్తుల మధ్యఐక్యత మరింతగా బలపడి కేంద్రలో ప్రజాస్వామ్య ప్రభుత్వం యేర్పడితే మరెన్నో ప్రజాప్రయోజన సేవాకార్యక్రమాలు జరుగగలవనే విశ్వాసం ప్రజాసామాన్యంలో కలిగింది[1]. అంటే, ప్రస్తుత రాజ్యాంగ చట్టపు పరిధులలోనే ప్రజలకు మరింతగా సేవా, సౌకర్యాలను అందించవచ్చునే సి.పి.ఐ. ఆలోచనా విధానానికి ప్రజలు వచ్చినట్లు కన్పడుతున్నది. సి.పి.ఐ.(యం) శ్రేణులలో గూడ ఆలోచననురేకెత్తించి ఉండవచ్చు అనుటలో సందేహంలేదు.

కేరళలో ఐక్యసంఘటనా ప్రభుత్వం అధికారాన్ని కోల్పోవుటతో సి.పి.ఐ.(యం) ప్రజల నుండి వేరుపడి పోతుందని, తిరిగి అధికారంలోనికి కాంగ్రెసు రాగలదనే ఆశలు పాలకవర్గాలలో పెరిగాయి. అయితే కేరళలో 1970లో జరిగిన ఎన్నికలు, సి.పి.ఐ.(యం ప్రజలలో బాగావ్రేళ్ళూని విస్తరించిందని, ప్రజలు వారినే అత్యధికంగా బలపరస్తున్నారని స్పష్టమైంది. గణాంకాలు సి.పి.ఐ.(యం) 1965, 1967లలో 23 శాతం వోట్లకంటే ఎక్కువగా పొందకపోగా, 1970లో ఎన్నికలలో ఏకాకిగా నిలబడి, మిత్రులతో కలసి 30 లక్షలు వోట్లు పోలు చేయగా, కాంగ్రెసు 40 లక్షలు వోట్లు పోలుచేసుకొనగలిగింది. ఇక సి.పి.ఐ. నాయకత్వలో ఐక్యసంఘటన 30 శాతం సంపాదించింది. సి.పి.ఐ.(యం) పోలైన వోట్లకు తగినన్ని సీట్లు సంపాదించలేక పోయింది. కాంగ్రెసు మిత్రులలో సి.పి.ఐ., ముస్లిం లీగులు ఉన్నవి[2].

కేరళలో సి.పి.ఐ. నాయకత్వంలోని ఐక్యసంఘటన, సి.పి.ఐ.(యం) మంత్రివర్గాని కూలద్రోసి, సి.పి.ఐ.(యం) దాని మిత్రులను ప్రజలనుండి దూరం చేయుప్రయత్నం విఫలమైంది. ఇట్టి ప్రయత్నమే పశ్చిమ బెంగాల్‌లో విజయం పొందింది.

నిజానికి కేరళలో పాలక కాంగ్రెసు, "మినిఫ్రంటు" సహాయంతో తదనంతరం మంత్రివర్గంలో చేరి, స్వతంత్ర పాత్రనిర్వహించి, బలపడింది. కాని పచ్చిమబెంగాలులో వామపక్షాలు అట్టి అవకాశం లేకుండా చేసాయి.

కేరళలో సి.పి.ఐ.(యం) సి.పి.ఐ. నాయకత్వంలో ఐక్యసంఘటనను కాంగ్రెసు మద్దతు కలదానిని, పోలైన వోట్లలో 40 శాతం సంపాదించినా అసెంబ్లీ తక్కువ సీట్లనే పొందింది.

## అభివృద్ధి నిరోధకులకు సి.పి.ఐ.(యం) మద్ధతు

కమ్యూనిస్టులు "నియంతృత్వం", "సెమిఫాశిజం", "ఫాశిజం" అనే పదాలను తేలికగా, విశ్లేషణ, విచక్షణా రహితంగా వాడుట, పెదధోరణిలో గాలివాటంలో పయనించుటకుదారి తీస్తుంది. పశ్చిమ బెంగాలులో నక్సలైట్లు, సి.పి.ఐ.(యం), సి.పి.ఐ., తదితర వామపక్ష

1. వర్కురిపోర్టు (పొలిటికల్) సి.సి.ఆఫ్ సి.పి.ఐ.(యం) 9వ, కాంగ్రెసు, 1972. పే.11
2. అదే పే.12

శక్తులన్నీ తర తమ భేదాలతో "రాజకీయ భయోత్పాదహింసాయుత చర్యల" తోపాటు. పోలీసుల "ప్రభుత్వహింసా, దౌర్జన్యభయోత్పాదచర్యల"కు దిగినంత మాత్రాన, ఆర్థిక, రాజకీయ సైద్ధాంతిక. సామాజిక అంశాలను అధ్యయనం, అంచెనా లేకుండా తేలికగా రాజకీయ పదాజాలాన్ని వాడుట అనర్థాలకు, తప్పుడు నిర్ణయాలకు దారితీస్తుంది. "సెమిఫాశిజం", "ఫాశిజం" "నియంతృత్వం" ఆర్థిక భూమిక లేకుండా ఏర్పడవు. మన దేశ పరిస్థితులుపై సామాజిక వ్యవస్థలు ఏర్పడుటకు, విజయం పొందుటకు తోడ్పడవు.

సి.పి.ఐ.(యం) కాంగ్రెసు 1972 తీర్మానం "సాంప్రదాయక అభివృద్ధినిరోధక వర్గాలు తీవ్రవోటమిని ఎదుర్కొనుటయేగాక. వామపక్ష ప్రజాస్వామ్య శక్తులు ఐక్యతను కోల్పోయి, విచ్ఛిన్నమయ్యాయి. బెంగాల్ ఐక్యసంఘటన విచ్ఛిన్నతకు, అభివృద్ధి నిరోధకుల "గ్రాండు అలయెన్సు" వైపుకు సంయుక్త పార్టీని, సోషలిస్టు పార్టిని విచ్ఛిన్నం చేసి తీసుకొని వెళ్ళుటలో సి.పి.ఐ.(యం) సోషలిస్టు పార్టీనాయకుడు రాజ్ నారాయణల పాత్ర అందరకు తెలిసినదే. కాంగ్రెసులో చీలికను అభివృద్ధి నిరోధకులు రెండు పరస్పరవ్యతిరేక, అభివృద్ధి నిరోధక పక్షాలుగా చీలుట మాత్రంగానే సి.పి.ఐ.(యం) పరిగణించింది. కాంగ్రెసును దాని పునాదులు కదిలించివేసిన చీలికగా తలచలేదు. ఎట్టివర్గ విశ్లేషణ చేయలేదు.

కేరళ మధ్యంతర ఎన్నికలలో సి.పి.ఐ.(యం) "సిండికేటు" అభ్యర్థులను సెప్టెంబరు 1970లో, తదితర అభ్యర్థులను ముఖ్యంగా అభివృద్ధినిరోధకులను బలపరచుటకు వెనుకాడలేదు. అపవిత్ర సర్దుబాటులను చేసుకొన్నది. వారి చిత్తుతీర్మానం, మితవాద అభివృద్ధి నిరోధకులతో సీట్లు సర్దుబాటు ఒప్పందాలను సమర్థించింది.

మొరార్జీదేశాయ్‌ని ప్రధాన మంత్రి పదవి నుండి తొలగించి, సంజీవరెడ్డిని ప్రెసిడెంటుగా ఎన్నిక చేసి, అధికారాన్ని "సిండికేటు" స్వాధీనం చేసుకొనాలనే ప్రయత్నవైఫల్యం, కాంగ్రెసులో చీలిక, 1971లో మితవాద అభివృద్ధి నిరోధకుల అపజయంతో తుడిచి పెట్టుకొని పోవుట అన్నీ సి.పి.ఐ.(యం) దృష్టిలో రాజకీయాలలో పేర్కొన దగిన అంశాలేకావు. వామపక్షప్రజాస్వామ్య శక్తులు, కాంగ్రెసు వ్యతిరేకతను గుడ్డిగా అనుసిరంచుట, సి.పి.ఐ.(యం) ఏకైక నాయకత్వాన్ని ఆమోదించితేనేవారి దృష్టిలో వామపక్షప్రజా స్వామ్యశక్తులు కాగలవు[1].

ఈ విధమైన అవగాహనలతోనే "ఇండికేటు" ఇందిరాగాంధి నాయకత్వంలోని కాంగ్రెసు, "సిండికేటు" నిజలింగప్ప నాయకత్వంలోని మితవాద అభివృద్ధి నిరోధక కాంగ్రెసులపై పోరాటం చేసింది. అదేవిధంగా మార్చి ఎన్నికల అనంతరం వ్యవసాయ భూముల గరిష్ట పరిమితిని తగ్గించుట, నగర ఆస్తులపై ముఖ్యంగా ఇండ్ల స్థలాలపై గరిష్ట పరిమితులు విధించు చట్టాలు చేయుట, తూర్పుజర్మనీ, వియత్నాంలను గుర్తించుట, వాటికి మద్దతు ప్రకటించుట పరిగణలోనికి తీసుకొన వలసిన అంశాలుగా, రాజకీయ ప్రాముఖ్యత కలవిగా సి.పి.ఐ.(యం) దృష్టిలో లేవు.

---

*1. భూపేష్‌గుప్త (1972) మాస్టర్ పీస్ ఆఫ్ లెఫ్ట్ ఆపర్చ్యునిజం, సి.పి.ఐ. పబ్లికేషన్, పే. 19–20.*

కేరళ ఐక్యసంఘటనా ప్రభుత్వం, బూర్జువా – భూస్వామ్య రాజ్యాంగ చట్టపరి మితులలో ప్రజలకు సేవలందించ ప్రారంభించింది. ఇంతవరకు కేంద్ర ప్రభుత్వానికి ఏజన్సీలుగా రాష్ట్ర ప్రభుత్వాలు పని చేస్తూ వచ్చాయి. ఇప్పుడు పరిస్థితి మారి కేంద్రంలో పాలక పార్టీకి ప్రతిపక్షాలుగ ఉన్నవి రాష్ట్రాలలో పాలనా బాధ్యతలు స్వీకరించుట ప్రారంభమైంది. రాష్ట్రాలలో ప్రభుత్వాలు రాష్ట్ర పాలక వర్గాల ప్రయోజనాలను, కేంద్ర పాలక వర్గాలు దేశ ప్రయోజనాలను కాపాడే ప్రయత్నాలు తీవ్రంగా చేస్తే వాటి మధ్య వైరుధ్యాలు లేక అభిప్రాయ బేధాలు అభివృద్ధి చెందే అవకాశాలు ఎక్కువయ్యాయి. ఈ లక్ష్యంతోనే కేరళ ప్రభుత్వం పోలీసు శాఖ, తదితర కొన్ని శాఖలలో మార్పులు తెచ్చే ప్రయత్నాలు చేసింది. అందులో భాగంగానే శ్రామిక ప్రజల పోరాటాలలో జోక్యం చేసుకొనరాదని గట్టి సూచనలు యిచ్చింది. ఇది సహజంగానే స్వార్ధపరవర్గాలు, కాంగ్రెసు, కేరళ కాంగ్రెసు వర్గాలలో కోపోద్రేకాలను కారణమైంది. అది ఐక్యసంఘటనా ప్రభుత్వాన్ని కూలద్రోయాలనే వైఖరి ధృడంగా అమలు చేయుటకు దారి తీసింది.

## సి.పి.ఐ. నాయకత్వంలోని ఐక్యసంఘటన ప్రభుత్వాలపై సి.పి.ఐ.(యం) విమర్శన :

కేరళలో కేంద్రప్రభుత్వం కాంగ్రెసు భూసంస్కరణ విధానాలను వ్యతిరేకంగా ప్రజలలో చెలరేగిన అసంతృప్తే, గరిష్టపరిమితికి మించిన భూముల ఆక్రమణ ఉద్యమంగా రైతాంగాన్నంతటిని చైతన్యవంతులను చేసి, ప్రజలలో ఇందిరాగాంధీ నూతన విధాన చర్యలను చరిత్రలిఖిస్తుందని ఆశించిన వారి ఆశలు అడియాశలయ్యాయి. అదే విధంగా, అచ్యుత మీనన్ నాయకత్వంలోని పాలకవర్గాల సంకీర్ణ ప్రభుత్వం, వ్యవ సాయసంస్కరణల చట్టాన్ని ధృడ చిత్తంలో అమలు చేస్తామని చేసిన వాగ్దానాలు నెరవేరక పోవుట ప్రజలకు స్పష్టమైందని సి.పి.ఐ.(యం) తీవ్రవిమర్శ చేసింది[1]. భూస్వాములు గరిష్ట పరిమితికి మించిన భూముల వివరాలను పంపించుటకు చట్టంలో స్పష్టంగా సూచించబడినా, రెండున్నర సంవత్సరాలైనా రిటర్నులు పంపించలేదు, ప్రభుత్వం వారిపై ఏచర్యా తీసుకొనలేదు. నామమాత్రంగా కొద్ది మంది భూస్వాములే ఆ వివరాలు పంపిచారు.

మే 1972లో ప్రతిజిల్లాలో ప్రారంభంగా ఒకగ్రామంలోని గరిష్ట పరిమితికి మించిన భూముల వివరాలు "పోరాట సమితి" వలంటీర్లు, 50 భూస్వాముల వద్ద 30 వేల యకరాలు అదనపు భూములు ప్రభుత్వభూములని, రైతులకు, వ్యవసాయకూలీల పంచాలని ప్రకటించారు. అదే కొద్ది మంది మధ్య తరగతులరైతులు మాత్రం వివరాలు యిచ్చారు. ప్రభుత్వం చట్ట ప్రకారం యీ భూములను వ్యవసాయ కూలీలకు, పేదరైతాంగానికి పంచి, పట్టాలు యిచ్చింది.

కేరళలో సి.పి.ఐ.(యం) ప్రభుత్వపతనానంతరం సి.పి.ఐ.నాయకత్వంలోని

1. *తీర్మానాలు 9వ సి.పి.ఐ(యం) పార్టీ కాంగ్రెసు, మధురై, 1972 (ఆంగ్లంలో) సి.పి.ఐ.(యం) పబ్లికేషన్ పే. 25.*

ఐక్యసంఘటనాయకుడు అచ్యుత మీనను ముఖ్యమంత్రిగా ఏర్పడిన ప్రభుత్వం కాంగ్రెసేతర ఐక్యసంఘటనా ప్రభుత్వమని చెప్పుకొన్నా, నంబూద్రిపాద్ వ్యాఖ్యానించినట్లు వాస్తవానికి "కాంగ్రెసు మద్దతుపై ఆధారపడిన ప్రభుత్వం"[1], కొద్ది మాసాలలోని కాంగ్రెసు నాయకుడు హోంమంత్రిగా బాధ్యతలు స్వీకరించుట దానినే తెలియజేస్తున్నది.

ముఖ్యమంత్రి పదవిని స్వీకరిస్తూ సి.పి.ఐ. నాయకుడు అచ్యుత మీనన్ బహిరంగంగా, ప్రభుత్వం కాంగ్రెసు మద్దతు లేకుండా పరిపాలన సాగించలేని మరుక్షణం రాజీనామా చేస్తుందని ప్రకటించారు. సంఘటనలోని రివల్యూషనరీ పార్టీ అభ్యర్థిని మంత్రివర్గంలో చేరమని కోరగా, కాంగ్రెసు మద్దతైపై ఆధారపడకూడా ఉండుటకు వేచి, చూచి చేరతానన్నారు. అసెంబ్లీలో మొట్టమొదటి విశ్వాస తీర్మానం రోజునే, పరోక్షంగానైనా కాంగ్రెసుమద్దతు లేనిదే ప్రభుత్వం మనజాలదని తెలిపోయింది.

కేంద్రకాంగ్రెసు ప్రభుత్వం, సి.పి.ఐ. నాయకత్వంలో కేరళ రాష్ట్ర ప్రభుత్వం భూసంస్కరణలు అత్యంత అభివృద్ధికర తీవ్రపరిణామాలని గుర్తించారు. వ్యవసాయ సంస్కరణలకు ప్రెసిడెంటు ఆమోదం లభించక పోతే ప్రజోద్యమాలను, ప్రజా పోరాటాలను ఆహ్వానించుటయే అగుతుందని గుర్తించారు[2]. ఆమోదించినా దాని అమలుకై ప్రజోద్యమాలు తప్పని సరిగా విజృంభిస్తాయి.

ప్రజోధ్యమాలు బలంగావున్న ప్రాంతాలలోనే సి.పి.ఐ(యం) చెప్పినట్లు పాలనాయంత్రాంగం గరిష్టపరిమితి చట్టాన్ని అమలు చేయుట జరిగిందనుట వాస్తమేగాక సహాజంగా అంతే జరుగుతుంది. వ్యవసాయకూలీలు, రైతాంగం చొరవతో భూఆక్రమణోద్యమంగా ప్రారంభంకాగా పోలీసులు చట్టానికి అనుకూలంగా వినియోగించ బడింది కాని, భూస్వాములు, ఆక్రమణదారులు ఎవరికి అనుకూలంగా వినియోగించబడలేదు. ఈ విషయంలో ఎట్టి విమర్శకుతావు లేక పోయినా, ఆక్రమణదారులకు వ్యతిరేకంగా వినియోగించారనే సి.పి.ఐ.(యం) విమర్శ సహేతుకమనలేము. కేరళ ముఖ్యమంత్రి ఎం.ఎల్.ఎ. కానందున అతను బై ఎలక్షన్లో నిలబడినపుడు మొట్టమొదటిసారిగా సి.పి.ఐ., కాంగ్రెసులు సహకారాన్ని నెరపినవి. ప్రభుత్వబలం తగ్గిపోతున్నందున జనరలు అసెంబ్లీఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికలలో సి.పి.ఐ.(యం) వ్యతిరేక "మినిఫ్రంటు" కలసి పని చేసింది. ఎన్నికల తరువాత ఏర్పడిన ప్రభుత్వంలో మొదట కాంగ్రెసు దూరంగా ఉన్నా, కొన్ని వారాల తరువాత "మినిఫ్రంటు" ప్రభుత్వంలో భాగస్వామిగా కాంగ్రెనాయకుడు హోంమంత్రిగా చేరుటతో, సి.పి.ఐ. నాయకత్వంలోని మంత్రి వర్గం, క్రమేణా కాంగ్రెసు నాయకత్వంలో సి.పి.ఐ. జూనియరు భాగస్వామ్య మంత్రి వర్గంగా మారిందని నంబూద్రిపాద్ విశ్లేషణ గావించారు.

వాస్తవంలో సి.పి.ఐ. వ్యూహవిధానమైన జాతీయ ప్రజాస్వామ్య సంఘటన,

---

1. నంబూద్రిపాద్. ఇ.యం.యస్ *(1994)* ది కమ్యూనిస్టు పార్టీ ఇన్ కేరళ. పే. *237.*
2. అదే పే. *238-9.*

సి.పి.ఐ.(యం) వ్యూహమైన జనతాప్రజాస్వామ్యసంఘటనల రాజకీయ సిద్ధాంతాలు సంఘర్షణగా దీనిని విశ్లేషణ చేయవలసి యున్నది.

**కేరళలో సి.పి.ఐ. భూసమస్య పంథా ఆచరణపై సి.పి.ఐ.(యం) విమర్శన :**

కేరళ, బెంగాల్‌లలో 1969-70లలో సి.పి.ఐ.(యం) ప్రభుత్వంపై చైనామద్దతుగల నక్సలైట్లు - "తీవ్ర అతివాదులు", సి.పి.యస్.యు. సిద్ధాంతాల ననుసరించే "మితవాద" కమ్యూనిస్టులు దాడి చేసారు. సి.పి.ఐ.(యం) నాయకత్వంలోని కేరళ, బెంగాల్ రాష్ట్ర ప్రభుత్వాలను కూలద్రోయుటలో కాంగ్రెసుతో సి.పి.ఐ.కలసిందని సి.పి.ఐ.(యం) తీవ్రంగా విమర్శించింది.

సి.పి.ఐ.(యం) దాని మిత్రులు వ్యవసాయ భూసంస్కరణల బిల్లు ప్రెసిడెంటు ఆమోదం పొందినా పొందక పోయినా చట్టమైనదిగానెంచి, బిల్లు ప్రసాదించే హక్కులను వాస్తవం చేయుటకు అలెప్పీలో అఖిల కేరళ సమావేశాన్ని జరిపి అమలు చేయుటకు ప్రజావొత్తిడిని సమీకరించారు. కాలుదారులు 1970 నూతన సంవత్సర దినోత్సవంనుండి భూస్వాములకు కౌలు యివ్వనిరాకరించే ఉద్యమాన్ని చేబట్టారు. భూగరిష్ట పరిమితి చట్టాలు అదే రోజు నుండి అమలుకు వచ్చినట్లుగా నెంచుతారు. మిగులు భూముల ఆక్రమణోద్యమాన్ని సాగించుతారు. సి.పి.ఐ.(యం) దానిననుసరించే మిత్ర పార్టీలు, ప్రజాసంఘాలు, నమోదు చేయబడిన స్వచ్ఛంధ సేవాదళం యీ ఉద్యమాన్ని కొనసాగించుటకు ఏర్పాట్లు జరిగినవి.[1]

భూసంస్కరణలపై, తత్సంబంధ ప్రజాకార్యాచరణ, ప్రభుత్వ పాలనా చర్యలపై సి.పి.ఐ.(యం)గల సైద్ధాంతిక అవగాహనపై ఆధారపడి ఉంది. ప్రభుత్వచర్యలకు తగిన ప్రాధాన్యతలనిస్తూనే ప్రజాపోరాటాలు మద్దతు నివ్వాలి. అభ్యుదయకర చట్టాలకు సైతం కార్యాచరణ మద్దతు లభించనిచో అభివృద్ధి నిరోధక, బురాక్రటిక్ శక్తులు కుట్రలతో నిజాయితీ ఆచరణనుకుంటు పరుస్తారు.

పోరాడే గ్రామీణ పేదలు, సి.పి.ఐ.(యం), వారి రాజకీయ మిత్రులు చట్టాలను నిజాయితితో అమలుచేయగలరని తలచుటలేదు. అందులో ముఖ్యంగా ప్రజావుద్యమాలు, ప్రజాపోరాటాలు సాగించనిదే అమలు జరుగదని గట్టి విశ్వాసంతోవున్నారు. కిసాన్‌సభ, వ్యవసాయకూలి సంఘాలు ప్రతిగ్రామంలో చట్టాలను ప్రజాస్వామ్యపంథాలో, పోరాటాలలో సాధించ ప్రయత్నించుతారు. సి.పి.ఐ. నాయకత్వంలోని ఐక్యసంఘటనా ప్రభుత్వం ప్రెసిడెంటు ఆమోదంకొరకు చేసిన ప్రతిపాదనలు ఆమోదించబడినవి. అధికారవర్గాలు కౌలుదారులను నమోదు చేసి, గరిష్ట పరిమితిని అమలు చేస్తూ అదనపు భూమిని గుర్తించి పేదరైతులకు, వ్యవసాయ కూలీలకు పట్టాలు యివ్వవలసి వుంది. భూపోరాటాలలో వ్యవసాయ కూలీలు, పేదరైతాంగం గరిష్ట పరిమితికి మించిన భూములను ఆక్రమించి సాగుచేస్తున్న పరిస్థితి మరోవైపున ఏర్పడింది. ఇట్టి పరిస్థితి ఏర్పడి చట్టాల అమలుకు నూతనాంశాలు, క్లిష్టపరిస్థితులు ఏర్పడక ముందే సకాలంలో ప్రభుత్వమే పట్టాలు యివ్వాలి.

1. నంబూద్రిపాద్. ఇ.యం.యస్ *(1994)* ది కమ్యూనిస్టు పార్టీ ఇన్ కేరళ. పె. *237.*

ప్రజావుద్యమం బలంగా వున్నప్రాంతాలలోనే గరిష్ట భూపరిమితులచట్టం బాగా అమలు జరిగిందని ప్రభుత్వలెక్కలే తెల్పుతున్నవి. అదేకాలంలో ప్రభుత్వం, పోలీసు భూస్వాములకు మద్దతునిచ్చారని సి.పి.ఐ.(యం) తీవ్రంగా విమర్శించింది. ప్రారంభంలో కాంగ్రెసు, సి.పి.ఐ.(యం) నాయకత్వంలోని ఐక్యసంఘటన ప్రభుత్వంలో లేకపోయినా, క్రమేణా కాంగ్రెసు నాయకత్వం ప్రభుత్వానికి చేరువై, తదుపరి ప్రభుత్వంలో చేరుటతో సి.పి.ఐ. ఐక్యసంఘట సైద్ధాంతిక అవగాహన, ఆచరణలో కాంగ్రెసుతో ఐక్యసంఘటనగా రూపొందింది. అసెంబ్లీలో ప్రభుత్వబలం, అస్థిరత్వంలో పడుటతో తదుపరి జరిగిన అసెంబ్లీ జనరలు ఎన్నికలలో ఐక్యసంఘటన మొత్తంగా, సి.పి.ఐ.(యం) వ్యతిరేక ఐక్యసంఘటనగా రూపొందుట, సి.పి.ఐ.ముఖ్యమంత్రి, రివల్యూషనరీ పార్టీ నాయకత్వం, ప్రభుత్వం కాంగ్రెసు మద్దతుపై ఆధారపడి లేదని చేసిన ప్రకటనలు అసత్యంగా వెల్లడయ్యాయి.

**కాంగ్రెసు (ఐ). "గ్రాండ్ సిండికేటు" కూటమిలపై సి.పి.ఐ.(యం); సి.పి.ఐ.ల అవగాహన, వైఖరి :**

సి.పి.ఐ.నాయకత్వం కాంగ్రెసు (ఐ) నాయకత్వంతో రాజకీయ సహకారం నెరపుటకు చెప్పేవాదనలు యిలా ఉన్నావి. కాంగ్రెసు (ఐ) వర్గపొందికలో వివిధ వర్గాల సంకీర్ణసంస్థ, అందులో సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తులు, సామ్రాజ్యవాదాన్ని బలపరచే అభ్యుదయ నిరోధకశక్తులు ఉన్నవి. కాంగ్రెసులోని మితవాద అభివృద్ధి నిరోధకశక్తులు 1969లో చీలిపోయి, కాంగ్రెసు (ఒ) ఏర్పడినపుడు, అభ్యుదయకర శక్తులు కాంగ్రెసు (ఐ)లో ఉన్నవని, కమ్యూనిస్టులు, తదితర వామపక్షశక్తులు, వారిని బలపరస్తూ, అభివృద్ధి నిరోధక శక్తులతో పోరాడాలని సి.పి.ఐ. వర్గాలు నిర్ణయించాయి. ఈవాదనలో కొంత వాస్తవికత, సత్యం వున్నప్పటికి, ఆచరణలో అవగాహన కొట్టుకు పోయిందని సి.పి.ఐ.(యం) విమర్శించింది. అంటే అవగాహన మౌలికంగా, సైద్ధాంతికంగా, వర్గవిశ్లేషణరీత్యా సరియైనదా, అన్నదానిని స్పష్టం చేయలేదు. వ్యూహరీత్యా కాకపోయినా తాత్కాలిక ఎత్తుగడలరీత్యా సరియైనదిగా చెప్పుకొనవచ్చును.

అన్ని బూర్జువా పార్టీలలో వలెనె కాంగ్రెసులో కూడవివిధ దృక్పథాలు, వైఖరులు గలవారుండుట సహజం. ఆకారణం చేతనే కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ 1930 దశకంలో భారతకమ్యూనిస్టులు జాతీయ కాంగ్రెసులో పనిచేస్తూ, నిజమైన అన్నిసామ్రాజ్యవాద వ్యతిరేకశక్తులతో ఐక్యసంఘటనను ఏర్పాటు చేయాలనే పంథాని సూచింది. ప్రధాన మంత్రి ఇందిరాగాంధి 1960 దశకంలో కొన్ని ఆర్థిక, సామాజిక సమస్యలపై విభేదించి, వేరుపడి ప్రధాన ప్రవేటు బ్యాంకులను జాతీయం చేయుట, రాజుల, యువరాజుల భరణాలు, ప్రీవీపర్సులు రద్దు చేయుటకు సి.పి.ఐ.(యం) పరిమిత, షరతులతోకూడిన మద్దతు నిచ్చింది. ముఖ్యంగా సమస్యల పాత్రిపధిక ననుసరించి చేసింది. ప్రవేటు బ్యాంకులను కాంగ్రెసు (ఒ) బలపరచినపుడు సి.పి.ఐ.(యం) ఇందిరా కాంగ్రెసును బలపరచింది. నవాబులు, రాజుల భరణాలు సమస్యలపై అట్టివైఖరినే అవలంభించింది. సి.పి.ఐ.(యం), సి.పి.ఐ., ఇతర వామపక్షపార్టీల మద్దతుతోనే కాంగ్రెసు (ఐ) అభ్యర్థి వి.వి.గిరి భారత

రిపబ్లిక్ అధ్యక్షుడుగా ఎన్నిక కాబడ్డారు. అంతేగాక, రిపబ్లిక్ అధ్యక్షుడుగా శ్రీ గిరి ఎన్నికల సందర్భంలో పెద్ద బ్యాంకులను జాతీయం చేయుట, రాజ భరణాలను రద్దు చేయుట రెండూ ప్రధాన ఎన్నికల రాజకీయ సమస్యలుగాపైకి వచ్చాయి. ఈ సమస్యలపైనే "సిండికేటు కాంగ్రెసు (ఒ) ఎన్నికలలో కేంద్రీకరించింది. అత్యధిక మెజారిటి పాలకపార్టీ కాంగ్రెసు (ఐ)ను బలపరచుటలో వ్యూహాత్మకమైన అంశం కూడ యిబడి వుంది. కొన్ని ప్రత్యేక సమస్యలపై కాంగ్రెసు (ఐ)ను బలపరచుట అది ఆసమస్యలపై సరయైన నిర్ణయాలు తీసుకొన్నందున వాటికి స్వాగతం చెప్పి, బలపరచుట జరిగిందని నంబూద్రిపాద్ వివరించారు[1]. అయినా కాంగ్రెసు (ఐ) ప్రభుత్వం కార్మిక వర్గంపైదాడి చేసినపుడు సి.పి.ఐ(యం) తీవ్రంగా ప్రతిఘటించింది. కొన్ని నిర్దిష్ట పరిస్థితుల, సమస్యలపై కాంగ్రెసు (ఐ) ప్రభుత్వాన్ని బలపరస్తున్నా అదేకాలంలో కాంగ్రెసు (ఐ)ని, ప్రభుత్వాన్నివ్యతిరేకించుటను కొనసాగించింది.

"కాంగ్రెసు (ఐ) కాంగ్రెసు (ఒ)ల మధ్యయేర్పడిన చీలిక అభివృద్ధినిరోధకులు – అభివృద్ధి కాముకుల మధ్య అనగా బూర్జువావర్గ రెండు శెక్షనుల మధ్య ఏర్పడిన వ్యూహాత్మక చీలికగా అంచెనావేసి, కాంగ్రెసు (ఐ)కు వ్యూహాత్మక మద్దతును సి.పి.ఐ. యివ్వసాగిందని" సి.పి.ఐ.(యం) తీవ్రంగా విమర్శించింది. ఈ విషయంలో సి.పి.ఐ.(యం) సి.పి.ఐ.తో తీవ్రంగా విభేదించి ఖండించింది. రెండు కమ్యూనిస్టు పార్టీల మధ్యగల యీ తీవ్రబేధాభిప్రాయాలను వినియోగించు కొని సి.పి.ఐ.(యం) నాయకత్వంలోని కేరళ, పశ్చిమ బెంగాలు రాష్ట్ర ప్రభుత్వాలను కూలద్రోయుటలో కేంద్రప్రభుత్వం తనవర్గకుటిల రాజనీతిని, నైపుణ్యాన్ని ప్రదర్శించింది. కమ్యూనిస్టు పార్టీలే వర్గచైతన్యంతో తమ భేదాభిప్రాయాలను తాత్కాలికంగానైనా ప్రక్కనపెట్టో, సమన్వయించేసుకొనో రెండు కమ్యూనిస్టు రాష్ట్ర ప్రభుత్వాలను అభ్యుదయ సంస్కరణలు, తక్షణ ప్రజాసేవాకార్యక్రమాల ద్వారా కమ్యూనిస్టు వుద్యమాన్ని విస్తరింపజేయగలిగిన, వామపక్ష ప్రజాస్వామ్యపక్షాలు ఐక్యసంఘటన, ప్రభుత్వం ఇతర రాష్ట్రాలలో, కేంద్రంలోనూ ప్రత్యామ్నాంగా అభివృద్ధి చేయు చారిత్రిక అవకాశం కోల్పోవుట జరిగింది. దీనికి మారుగసైద్ధాంతిక పోరాటాన్ని, వర్తమాన రాజకీయ పోరాటాలను ప్రక్కదారుల పట్టించి, స్వీయమానసిక ధోరణులలో సుందోప సుందులై పరస్పరం బలహీన నరచుకొంటూ,వొకరినొకరు ప్రజలకు దూరం చేసుకొంటూ, ప్రజల విశ్వాసాన్ని కోల్పోయారు. రిపబ్లిక్ 1971 జనరల్ ఎన్నికలలో ఇందిరాగాంధి నాయకత్వంలో కాంగ్రెసు (ఐ) పొందిన వూహించని గొప్ప విజయాలు, భారత మితవాద అభివృద్ధినిరోధకవర్గాల అపజయాన్నేకాక, వామపక్షాలు ముఖ్యంగా కమ్యూనిస్టులు విస్తరించలేకపోవుట, చెప్పు కొనదగినంతా ఎదగలేకపోవుటను స్పష్టం చేస్తుంది.

ఇంతేగాక, ఇందిరాగాంధి చేబట్టిన "గరీబీహటావో" నినాదం ప్రజల హృదయాలలోనికి

---

1. *నంబూద్రిపాద్. ఇ.యం.యస్. (1994) ది కమ్యూనిస్టు పార్టీ ఇన్ కేరళ. పే. 242.*

చొచ్చుకొనిపోయి విజయాన్ని సులభం చేసింది. ప్రధానబూర్జువా ప్రతి పక్షమైన కాంగ్రెసు (ఒ), జనసంఘం, స్వతంత్ర పార్టీలకూటమియైన "గ్రాండు అలయెన్సు" కప్పగా కూలిపోయింది.

ఇదే కాలంలో కేరళలో సి.పి.ఐ.అనుసరించిన పంధాను సి.పి.ఐ.(యం) తనకు వ్యతిరేకంగా ప్రతిపక్షాలను ఐక్యపరిచే విధానంగా నెంచింది. సి.పి.ఐ.(యం) విధానాలపై సి.పి.ఐ. విమర్శన క్రింది విధంగావుంది.

జాతీయ కాంగ్రెసు 1967 ఎన్నికలలో కోల్పోయిన బలాన్ని ఒక్క తమిళనాడులో తప్ప, అన్ని రాష్ట్రాలలో 1971లోకసభ, 1972లో అసెంబ్లీ ఎన్నికలలో తిరిగి పొందగలుగుటతో రాజకీయ వాతావరణం కాంగ్రెసు (ఐ)కు అనుకూలంగా మారింది. కాంగ్రెసు వ్యతిరేక 1967 నాటి విశాల ఐక్యసంఘటన చీలిపోయి సి.పి.ఐ.(యం) నాయకత్వంలోని కాంగ్రెసు వ్యతిరేక వామపక్ష ప్రతిపక్షం; కాంగ్రెసు (ఒ) జనసంఘం, స్వతంత్రపార్టీల కూటమి సోషలిస్టు పార్టీలోని కొన్ని వర్గాలతో కలసి రూపాంతరం పొంది "గ్రాండు అలయెన్సు"గా మితవాద అభివృద్ధి నిరోధక సంఘటన అయింది. కాంగ్రెసు (ఐ) "గ్రాండు అలయెన్సు"ల మధ్య జరిగిన రాజకీయ పోరాటంలో ఘోరపరాజయం పొందింది. సంవత్సరం తరువాత 1972లో అసెంబ్లీల ఎన్నికలలో మరోసారి పరాజం పొందింది. ఒంటరిగా సి.పి.ఐ.(యం) తనవిధానాన్ని మొండిగా కొనసాగించింది. కాంగ్రెసు (ఐ) వ్యతిరేకపోరాటంలో "గ్రాండు అలయెన్సు" కాంగ్రెసు (ఐ)కు ప్రతిద్వందిగా నిలబడలేక తమ పంధా మార్చుకొనవలసి వచ్చింది[1].

నాటిరాజకీయ పరిణామాలు వామపక్ష ప్రజాస్వామ్యశక్తులు నూతన ప్రజాపంధాను, రాడికల్ ప్రాతిపధికపై కార్యక్రమాన్నిరూపొందించు కొనుటకు తోడ్పడ్డాయి. కాంగ్రెసు (ఐ) కోల్పోయిన బలాన్ని సంపాదించుట, చరిత్ర గమనవేగోద్యమాలకు చేరుకున్నది. వామపక్ష, ప్రజాస్వామ్య శక్తుల పురోగమనం మందగించింది.

సి.పి.ఐ.(యం) 9వ, పార్టీ కాంగ్రెసు ఆమోదించిన "నిరంకుశ అధికారాన్ని వ్యతిరేకించుటకు అన్ని పార్టీలు ఐక్యమవ్వాలనే, ఎత్తుగడల పంధా బెంగాల్‌తోపాటు కేరళలో ఆచరణలో పెట్టారు. ఈ ఎత్తుగడ అర్థం కాంగ్రెసును వ్యతిరేకించే వామపక్షాలు, బూర్జువా ప్రజాస్వామ్యశక్తులు, కాంగ్రెసులోని ఏకవ్యక్తి అధికారం చెలాయించుట వ్యతిరేకించే ప్రజాస్వామ్యశక్తుల ఐక్యకార్యాచరణను, తద్వారా ఐక్యసంఘటనను, ప్రభుత్వాన్ని నిర్మించి, ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలను పూర్తి చేయుటయని సారాంశాన్ని చెప్పవచ్చును. కాంగ్రెసులో యీ విధానం ఏకగ్రీవంగా ఆమోదించబడినా, అగ్రనాయకత్వంలో మౌలిక అంశంపై పూర్తి ఐక్య అవగాహనరాలేదు. నిరంకుశశక్తుల వ్యతిరేక ఐక్యత అంటే బూర్జువా,

1. *నంబూద్రిపాద్. ఇ.యం.యస్. (1994)*ది కమ్యూనిస్టు పార్టీ ఇన్ కేరళ. పే. *243-4.*

భూస్వామ్యశక్తులతో రాజీపడుటయే అనే ఒక వైఖరి వుంది, యిది వ్యూహానికి భిన్నమైనది[1].

సి.పి.ఐ.(యం) నాయకత్వంలోని ఒక బలమైన సెక్షను పార్లమెంటులో రాష్ట్ర అసెంబ్లీలలో ముఖ్యస్థానాలలో బహిరంగంగా పని చేస్తూనే తప్పనిసరిగా పోరాడవలసి వచ్చే పార్లమెంటేతర పోరాటాలకు పార్టీ శ్రేణులను సన్నద్ధంచేసే ప్రధాన మౌలిక కర్తవ్యంపై శ్రద్ధ వహించ వలసి వుంటుందనే వైఖరి వుంది. ఈ అభిప్రాయంతో ఏకీభవించనివారు కూడ, ప్రజోద్యమాల అసమానాభివృద్ధిని పరిగణలోనికి తీసుకొని ఆయాప్రాంతాలకు ఎత్తుగడల నిర్దిష్టత రూపొందించబడాలనే, భిన్న అభిప్రాయమూ వుంది. ఈ కారణం చేతనే అప్పటి సమస్యల యెడల అవలంభించవలసిన ఎత్తుగడల విషయంలో ఏకీకృత అవగాహన అగ్రనాయకత్వంలోలేదు. ఈ వైఖరులు కాంగ్రెసులో వ్యక్తమైనా నివేదిక, ఎత్తుగడలు, తీర్మానాలు యేకగ్రీవంగానే ఆమోదించబడినవి. ఈ పంధాను ఆచరణలో పెట్టుటకు నిర్దిష్ట ఆచరణ ప్రణాళికను రూపొందించ జాలక పోయింది[2].

ఈ వైఫల్యఫలితాలు ప్రప్రధమంగా కేరళలో కన్పించాయి. సి.పి.ఐ.(యం) నాయకత్వంలోన రాష్ట్ర ఐక్యసంఘటనా ప్రభుత్వం కూలద్రోయబడుట, ప్రభుత్వదమనకాండ తీవ్రమగుట, పార్టీ, పార్టీ మిత్రులలో యీ నూతన పరిస్థితి ఎలాఎదుర్కొనాలని ప్రశ్నించారు. కేరళ పార్టీనాయకత్వంలోని ఒక సెక్షన్ సి.పి.ఐ.(యం) వ్యతిరేక కాంగ్రెసు (ఐ) సంఘటనలోని నిరంకుశతత్వ వ్యతిరేకశక్తులతో అనగా ముస్లింలీగు, కేరళకాంగ్రెసులతో, పాక్షికాంగ్రెసు ఆమోదించిన నిరంకుశ తత్వవ్యతిరేకపంధానుసరించి, ఆచరణ రాజకీయాలను చేబట్టి సంఘటన యేర్పరచాలనే వైఖరి చేబట్టారు.

కేరళ సి.పి.ఐ.(యం) పార్టీలోని మరోసెక్షన్ కాంగ్రెస్ కంటే కూడ కేరళ కాంగ్రెసు, ముస్లింలీగులు కొన్ని విషయాలలో అత్యంత తీవ్ర అభివృద్ధి నిరోధకులు, అంచేత వీరితో సంఘటనగాని, రాజకీయ అవగాహనకు వచ్చే ప్రశ్నయే లేదనేవైఖరితో ఉన్నారు. వామపక్ష, ప్రజాస్వామ్య సంఘటన ఒక్కటే మార్గమని, యిది ముస్లిం లీగు, కేరళ కాంగ్రెసు, కాంగ్రెసు (ఐ)ల వ్యతిరేక సంఘటన అన్నారు. ఈ సైద్ధాంతిక వివాదగ్రస్థచర్చ, 1970 దశకంలో కాంగ్రెసు (ఐ) నిరంకుశత్వానికి వ్యతిరేక పోరాటాలలో జనసంఘంపై జరిగిన చర్చలకు "నాందిచర్చలు" అయ్యాయి. పొలిట్‌బ్యూరో అంతా యీచర్చలలో మునిగిపోయింది. ఇందిరాగాంధి పాలనకు వ్యతిరేకంగా "జనతా ప్రజా వెల్లువను" సృష్టించటకై, పొలిట్ బ్యూరో ఆవెల్లువలో భాగస్వాములగుటకు రాజకీయ, సైద్ధాంతిక పోరాటాన్ని సాగించవలసి వచ్చింది.

కేరళలో తలెత్తిన భిన్న అభిప్రాయాలను పరిష్కరించుటకు పొలిట్‌బ్యూరో రాష్ట్ర కమిటీల సంయుక్త సమావేశంలో తీవ్రచర్చల అనంతరం రెండు ప్రధాన నిర్ణయాలు జరిగాయి. "మొదటిది కేరళ నిర్ధిష్ట పరిస్థితులలో ముస్లిం లీగు మెజారిటి గ్రూపుతోను, సి.పి.ఐ.,

---

1. అదే పే. *244*

2. అదే పే. *249.*

రివల్యూషనరీ సోషలిస్టుపార్టీతోను, కాంగ్రెసు (ఒ)తో సంఘటనకు (సంసిద్ధత వెలిబుచ్చింది) సి.పి.ఐ.(యం)పై తీవ్ర దమనకాండ సాగుతున్నపుడు కేరళ ముస్లిం లీగులోని హెకవర్గం, కేరళ కాంగ్రెసులు సి.పి.ఐ.(యం) లో దాని మిత్రులతో కలసి కాంగ్రెసు (ఐ) నాయకత్వంలో సి.పి.ఐ.(యం) వ్యతిరేక సంఘటనపై పోరాడటకు సంసిద్దత వెల్లడి చేసినపుడు తిరస్కరించుట పొరపాటు అగుతుంది. రెండవది : ఇదిఒక నిర్ధిపరిస్థితిని ఎదుర్కొనుటకు ఎత్తుగడల సమస్య .ముస్లిం లీగు, కేరళ కాంగ్రెసులు మత పార్టీలని పార్టీకి స్పష్టంగా తెలుసు, వ్యూహం కూడా అదే. రెండూ అభివృద్ధి నిరోధక మత పార్టీలని సి.పి.ఐ.(యం) దాని మిత్రులు వాటికి నిరవధింకంగా వ్యతిరేక పోరాటం సాగించాలనుటకూడ స్పష్టమే. ఈ మౌలిక అవగాహనతో యీ రెండు పార్టీలతో తాత్కాలిక ఒప్పందానికి వచ్చుటకు పొలిట్ బ్యూరోరాష్ట్ర కమిటీకి ఆ మోదాన్నిచ్చింది. కేరళలో సమస్యకు ఒక తాత్కాలిక పరిష్కారాన్ని పొలిట్‌బ్యూరో సూచించింది. ఈ ప్రాతిపధికపైనే ప్రతిపక్ష విస్తృత ఐక్యసంఘటన నిర్మించుటకు పార్టీ కృషి చేసింది.

అఖిల భారత స్థాయిలో కూడ యీ విధానాన్ని అనుసరించుట జరిగింది. జనతాపార్టీ ఏర్పడిన నాటినుండి, ఆపార్టీ పతనం వరకు యిదే విధానాన్ని సి.పి.ఐ.(యం) ఆపార్టీ యెడల అనుసరించింది. మొట్టమొదట యీ ఐక్యత అఖిల భారతస్థాయిలోనే విచ్ఛిన్నమగుట జరిగింది. చివరకు సి.పి.ఐ.(యం) జనతా పార్టీ వ్యతిరేకశక్తులతో కలసి జనతా పార్టీ పతనానికి తోడ్పడింది. తరువాత కేరళ రాష్ట కమిటి, అఖిల భారత ముస్లింలీగు, కేరళ కాంగ్రెసులతో తెగతెంపులు చేసుకొన్నది. సి.పి.ఐ.(యం) 9వ, పార్టీ కాంగ్రెసు ప్రతిపక్షాలలో ఐక్యతా నిర్మాణానికి పూతమిచ్చింది. సి.పి.ఐ.(యం) ఏ మాత్రం యింకా 1951 నాటి ఎత్తుగడల పంధాపరిమితులకులోబడి ఆచరణ కార్యక్రమాలు రూపొందించుట ఆగిపోయింది. విస్తృత ప్రతపక్షాల ఐక్యతానిర్మాణం ప్రధాన కర్తవ్యమైంది. ఇంకా పార్టీ 1951 ఎత్తుగడల దృక్పదానికి కట్టుబడి వుంటున్నామంటున్నది. నిరంకుశత్వానికి వ్యతిరేకంగా విస్తృత ప్రతిపక్షాల ఐక్యత 1951 ఎత్తుగడల దృక్పదాన్ని అనురించే వుంటుందని అంటున్నది.

## సి.పి.ఐ.(యం) అవగాహనలపై సి.పి.ఐ. విమర్శన

కేరళలో సి.పి.ఐ.(యం) నాయకత్వంలోని మంత్రివర్గం పడిపోవుట, పశ్చిమ బెంగాల్ ఎన్నికలలో సి.పి.ఐ.(యం) అపజయాన్ని ఎదుర్కొనుటతో దేశంలోని రాజకీయాలు సి.పి.ఐ.(యం) 8 పార్టీ కాంగ్రెసు "పెడమార్గం పట్టాయని" నిర్ధారించింది. అదే కాలంలో, యింతకు ముందెన్నడూ లేనన్నిసదవకాశాలు ప్రజాస్వామ్య ఉద్యమాభివృద్ధికి ఏర్పడినవి అనేది కాంగ్రెసు పత్రాల సారాంశము. దేశంలో రాజకీయాలు అంత్యంత వేగంగా మారుటతో ఏర్పడిన పరిస్థితి ఒక్క మాటలో "పెడమార్గం పట్టాయని" వ్యాఖ్యానించి; వాటిని యిలాపేర్కొన్నది. నూతన పరిస్థితి: 1) కాంగ్రెసు గుత్తాధికారం తిరిగి పునరుద్ధరించ బడుట, 2) ఏకపార్టీ నియంతృత్వ పాలనా ప్రమాదము 3) "సెమీఫాశిస్టు" భయోత్పాతం

4) వామపక్షశక్తుల విచ్ఛిన్నత మొదలైనవి ముఖ్యరాజకీయ పరిణామాల పరిస్థితిగా ఉదహరించింది.

వర్తమాన రాజకీయ పరిణామాలపై సి.పి.ఐ.(యం) 8వ పార్టీ కాంగ్రెసు అవగాహనుకు పూర్తిగా భిన్నమైన అభిప్రాయాలను లోకసభలో సి.పి.ఐ. పార్లమెంటరీ పార్టీనాయకుడు భూపేష్‌గుప్తా వెలిబుచ్చిన అభిప్రాయాలను చూద్దాము. నేటిభారతదేశ పరిస్థితులలో నియంతృత్వాన్ని స్థాపించాలనే ప్రయత్నం అంతతేలిగా విజయాన్ని సాధించలేదు. మార్క్సిస్టుల మని అనుకొనేవారు "సెమిఫాశిస్టు" "నియంతృత్వం" అనేపద జాలాన్ని అంత తేలికగా వాడరాదు. దేశంలోని రాజకీయ పరిణామాలు నియంతృత్వం, సెమిఫాశిజంల మార్గంలో పయనించుతున్నవని, పశ్చిమ బెంగాల్ సి.పి.ఐ.(యం) రాజకీయ దౌర్జన్యాలకు ప్రతిగా, వాటిని త్రిప్పి కొట్టబడినంత మాత్రం చేత తలచరాదని భూపేష్‌గుప్తా "మాష్టర్ పీస్ ఆఫ్ లెఫ్ట్ ఆపర్చ్యునిజం" అనే చిరుపుస్తకంలో వివరించారు[1]. సి.పి.ఐ.(యం) 8వ, పార్టీ కాంగ్రెసు చిత్తుతీర్మానం కరుదుగట్టిన అభివృద్ధి నిరోధకులు చిత్తుగా వోడించబడ్డారని పేర్కొన్నా, వామపక్ష ప్రజాస్వామ్యలు విచ్ఛిన్నం చేయబడినవని చెప్పింది. విచ్ఛిన్నంపాత్ర వహించింది, సంయుక్త సోషలిస్టు పార్టీ అయినా ప్రధాన పాత్ర ఇందిరాగాంధి నాయకత్వలోని కాంగ్రెసు అనే చెప్పుకోవాలి. సంయుక్త సోషలిస్టు పార్టీ, మిత, మతవాద అభివృద్ధి నిరోధక పార్టీలైన పోటీ కాంగ్రెసు (ఒ), జనసంఘం ప్రధాన శక్తులైన "గ్రాండు అలయెన్సు"లో సి.పి.ఐ. (యం) చేరింది. మరోవైపున సి.పి.ఐ., రివల్యూషనరీ సోషలిస్టు పార్టీలు తదితరులుగల ఐక్యసంఘటన బయటనుండి, పరోక్షంగా "గ్రాండు అలయెన్సు" ప్రధాన పెనుభూతం సెమీఫాశిజం, నియతృత్వాల ప్రమాదం అనే మిషతో ఇందిరా కాంగ్రెసును బలపరచసాగింది. సి.పి.ఐ.(యం) అతివాద అవకాశవాదాన్ని, సి.పి.ఐ. మితవాద సంస్కరణవాదాన్ని చేబట్టి ప్రజలకు దూరమయ్యాయి.

వామపక్ష ఐక్యతను విచ్ఛిన్నం చేసినకీర్తి ప్రధానంగా సంయుక్త సోషలిస్టు పార్టీకి, సి.పి.ఐ.(యం) లకే దక్కుతుంది. పశ్చిమ బెంగాలులో ఐక్యసంఘటనను భగ్నం చేసింది. సి.పి.ఐ.(యం) కాక మరెవ్వరని భూపేష్ గుప్తా ప్రశ్నించారు. సంయుక్త సోషలిస్టు పార్టీని చేజేతులా "గ్రాండు అలయెన్సు" అప్పజెప్పింది, రాజ్‌నారాయణ గ్రూపు చీలిపోవునట్లు చేసింద సి.పి.ఐ.(యం) కాక మర్వెరని కూడ ప్రశ్నించారు.

కాంగ్రెసులో ఏర్పడిన చీలికను సి.పి.ఐ.(యం) కాంగ్రెసులోని అభివృద్ధి నిరోధకులు రెండు ప్రత్యర్థి పక్షాలుగ చీలుట మాత్రంగానే విశ్లేషణచేసి, ఆ ప్రాతిపదికపైనే "ఇందిరా కాంగ్రెసు", "సిండికేటు" కాంగ్రెసు యిద్దరితో పోరాడాలని నిర్ణయించింది. అదేకాలంలో సి.పి.ఐ.పై గూడ ప్రత్యేక దాడిని చేసింది. కేరళ మధ్యంతర ఎన్నికలలో 1970లో సిండికేటు అభ్యర్థులను బలపరచుటయేగాక, అనేక రాష్ట్రాలలో మితవాద అభివృద్ధి నిరోధకులతో అపవిత్ర సర్దుబాటులు కూడ చేసుకుంది. మితవాద అభివృద్ధినిరోధకులు విజయంగా

1. భూపేష్‌గుప్తా (1972) మాస్టరు పీస్ ఆఫ్ ఆపర్చ్యునిజం. సి.పి.ఐ. పబ్లికేషన్. పే. 18.

విశ్లేషణగావించింది. అదే విధంగా, 1972లో అభివృద్ధి నిరోధకుల వోటమిని "ఏక పార్టీ నియంతృత్వపు" "సెమిఫాశిస్టు దౌర్జన్యాల" విజయంగాను "వామపక్ష ప్రజాస్వామ్యశక్తుల విచ్ఛిన్నతగ" విశ్లేషణ గావించింది. సి.పి.ఐ.(యం) నాయకత్వంలో గ్రుడ్డిగా కాంగ్రెసు వ్యతిరేకతను అనుసరించితేనే వామపక్ష, ప్రజాస్వామ్య శక్తులుగా వారిచే గుర్తింప బడుతవి. లేనిచో విద్రోహులుగ, అవకాశావాదులుగ, మిత వాదులుగ చక్రాంకితాలు వేయబడతవి.

మితవాద అభివృద్ధినిరోధక తత్వం వైపు పయనించే భారత రాజకీయాలు వెనుకకు గొట్టబడి, దారి మళ్ళించబడుట సి.పి.ఐ.(యం) దృష్టిలోనికి రాలేదు. బంగ్లాదేశ విముక్తి పోరాట విజయం, వారి దృష్టిలో పేర్కొనతగినది కాదు. అంతేగాక, వామపక్ష, ప్రజాస్వామ్యశక్తుల పురోగమనానికి భయపడి, "మితవాద కమ్యూనిస్టులు, ప్రజాస్వామ్యవామపక్ష నాయకులు అనేక మంది గందరగోళంలోపడి కాంగ్రెసులో చేరారు" అని సి.పి.ఐ.(యం) చిత్తుతీర్మానం విశ్లేషణగావించుట, ఎంతటి అశాస్త్రీయ, స్వీయమానసిక ధోరణియో తదనంతర కాలం రుజువుచేసింది. ఈ విధంగా సి.పి.ఐ.(యం) అభివృద్ధి నిరోధక మితమతవాద శక్తులతో సహకరించుట; మరోవైపున సి.పి.ఐ. నియంతృత్వం "ఫాశిజం" అరికట్టాలని, స్వతంత్ర పాత్రను విడనాడి, పరోక్షంగా కాంగ్రెసుకు తోడ్పడుటతో కార్మిక, కర్షక, పేదరైతు, వ్యవసాయకూలి వర్గాలు రెండు కమ్యూనిస్టు పార్టీలకు దూరమై, ఇందిరాకాంగ్రెసు వైపు తాత్కాలికంగానైనా చేరారు. ఒకదశాబ్దంపాటు ఆమెనే బలపరస్తున్నారు. వామపక్షపార్టీలు ప్రజాసామాన్యపు అనుభవ విజ్ఞానాన్ని తక్కువగా అంచెనావేసారు. బూర్జుపార్టీల ప్రభావంలోనికి త్రోసివేయబడిన ప్రజాసామాన్యం తిరిగి వెనుతిరుగుటకు మరింత కాలం పట్టవచ్చును. వామపక్షాలు ఆవిశ్వాసాన్ని కలిగించిననాడేవారి అభిమానాన్ని తిరిగి పొందగలవు. ఇది, వారి సమస్యలపై పోరాటాలు సాగించుట ద్వారానే సాధ్యపడుతుంది. అదే కాలంలో వారి రాజకీయ చైతన్యాని పెంపొందించాలి.

సి.పి.ఐ. తనపై సి.పి.ఐ(యం) చేసేనిందా పూర్వకదాడులను, యిలా విశ్లేషించింది. "సి.పి.ఐ. అంటే సి.పి.ఐ.(యం) శత్రువుగా చూస్తున్నది. కారణం సి.పి.ఐ.(యం) మాత్రమే భారతదేశంలో మార్క్సిజం – లెనినిజంల వెలుగులో మార్గదర్శికత్వం వహించు చున్నదనే అవాస్తవికతను, సి.పి.ఐ. బట్టబయలు చేయుటలో విఫలమైనందున కొనసాగించింది. ఈ విధమైన అవగాహన ప్రచారాల తోనే సి.పి.ఐ.ను చీల్చి సి.పి.ఐ.(యం) ను ఏర్పాటు చేసింది. అనేక రాష్ట్రాలలో నామమాత్రంగానే ఉంది. సి.పి.ఐ.(యం) సెక్టేరియన్, విచ్ఛిన్నకర పాత్ర వహించుచున్నందున సి.పి.ఐ. ద్వేషించుచున్నది. వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యత అనే సి.పి.ఐ. పంథాను "వర్గరాజీవిధానంగా", "కాంగ్రెసు యొక్క పంచమాంగ దళంగా" దూషించుతున్నది. ఇది "పాతచింత కాయపచ్చడియే" అయినా నిరవధికంగా గోబెల్స్‌వలె కొనసాగిస్తున్నది." అబద్ధాన్ని ఆపకుండా ప్రచారంచేస్తే నిజమనే భ్రమను" కలిగించవచ్చునేది

గోబెల్సు ప్రచారసిద్ధాంతగా ప్రసిద్ధికెక్కింది. కాంగ్రెసు వ్యతిరేక గ్రుడ్డి ద్వేషంతో అనుసరించే అతివాద అవకాశవాదంతో విస్తృత వామపక్ష, ప్రజాస్వామ్య శక్తులు, కాంగ్రెసులోని ప్రజాస్వామ్య శక్తులతో సహా అన్నిటి ఐక్యతకై కృషి చేసే అందరిని ద్వేషించుతు, వ్యతిరేకించే వైఖరిని అవలంభించిందని భూపేష్‌గుప్తా తీవ్రంగా విమర్శించారు[1].

"కాంగ్రెసు వ్యతిరేక మిత, మతవాద, అతివాద అన్ని పార్టీల ఐక్యత" అనే సి.పి.ఐ.(యం) మౌలిక పంథా ఎట్టి పురోగమనం సాధించలేక పోయిందనే నిర్ధారణను భూపేష్‌గుప్తాచేసారు.

----

*1. భూపేష్‌గుప్తా (1972) మాస్టరు పీస్ ఆఫ్ ఆపర్ద్యూనిజం. సి.పి.ఐ. పబ్లికేషన్. పే. 23.*

"కమ్యూనిస్టుల ఐక్యసంఘటన అన్వేషణ" పై

# అభిప్రాయాలు

"పరిశోధకులకు ఒక ఘనిగా", "పార్టీ సభ్యులకు గుణపాఠాలకు" తోడ్పడుతుంది.

**- వై.వి. కృష్ణారావు**

ఎ.ఐ.కె.ఎస్. గౌరవాధ్యక్షులు

"ఇది వినూత్న ప్రక్రియ - అందరూ చదవవలసినదే"

**- కీ॥ శే॥ నండూరి ప్రసాదరావు**

సి.పి.ఐ.(యం) కేంద్ర కమిటి సభ్యులు

"దశాబ్దంపైగా వందలాది పత్రాలను పరిశీలించి, విశ్లేషించిన రాజకీయ పరిశోధనా ప్రయత్నమిది"

**- సి.రాధాకృష్ణదాసు,**

ప్రధాన కార్యదర్శి, సర్వోదయ ట్రస్టు, విజయవాడ.

"పరిశీలన వామపక్షాల మార్క్సిస్టు సిద్ధాంత అవగాహనతో కూడినది"

**- ప్రొ॥ వి.వి. కృష్ణారావు.**

---

**రాజకీయ, సైద్ధాంతిక అవగాహనలను పెంపొందించుకొనే కార్యకర్తలు, రాజకీయ పాఠశాలలకు హాజరయ్యే విద్యార్థులు, ముఖ్యంగా కమ్యూనిస్టు శ్రేణులు తప్పక అధ్యయనం చేయవలసిన గ్రంథాలు.**

---

1. సంపుటి - 1 : ఆది, జాతీయ సంఘటన, విగ్రహ, పోరాట పర్వాలు.
2. సంపుటి - 2 : సాగర మధన, అమృత, భిన్న దృక్పధాల సంఘర్షణ, బృహద్వివాద పర్వాలు.
3. సంపుటి - 3ఎ : సరిహద్దు యుద్ధ పర్వం
4. ॥ 3బి : చీలికల పర్వం
5. ॥ 3సి : నక్సల్బరీ పర్వం
6. సంపుటి - 4ఎ : ఐక్య సంఘటనల పర్వం
7. సంపుటి - 5ఎ : సైద్ధాంతిక సంక్షోభ పర్వం

త్వరలో ఐక్యసంఘటనల పర్వం (జాతీయ అనుభవాలు)

సైద్ధాంతిక సంక్షోభ పర్వం (2వ భాగం)

అత్యవసరపరిస్థితి పర్వం

అడుగుజాడల పర్వం

**రచయిత : డి.వి సుబ్బారావు**